# కమ్మవారి చరిత్ర

## గోత్రములు

కొత్త భావయ్య చౌదరి

సంపాదకులు :

పత్తిపాటి లక్ష్మీరెడ్డి B.Sc., B.Ed, B.L.Sc.

కామేపల్లి రామూజీ M.A., B.J.,

కిరణ్ పబ్లికేషన్స్

నవభారత్ గెస్ట్ హౌస్ లైను, గుంటూరు-6

ప్రథమభాగము - 1939, ద్వితీయభాగము - 1940, తృతీయభాగము - 1941
మూడు భాగముల సంక్షిప్త చరిత్ర 1962.
Revised & Enlarged Edition 1989.

## చరిత్ర సూక్తులు

"వినదగు నెవ్వరు సెప్పిన/వినినంతనె వేగపడక వివరింపదగున్
గనికల్ల నిజము దెలిసిన/మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ॥

పీలని పూత మెఱుంగులు/వేలుంచిననేమి ఫలము వెలవెల బోవన్
మేలిమి చెడదెపుడటులే/కాలమున జరిత్రలన్నఁ గౌరవ మెసంగున్॥

"Guilt will disappear and the Solid gold will remain ever'
"All that glitters is not gold".

వెల : $ 10

మేలు ప్రతి : 60-00

సాలా ప్రతి : 40-00

**ప్రతులకు :**

1. పత్తిపాటి లక్ష్మి తులశమ్మ
   నవభారత్ గెస్టుహౌస్‌రోడ్ (రింగురోడ్)
   పట్టాభిపురం (P.O) గుంటూరు—6.
2. ఫ్రండ్స్ బుక్ డిపో
   పార్కు-రోడ్, మున్సిపల్ బిల్డింగ్స్, కర్నూలు.
3. వికాస్ బుక్ సెంటర్
   పబ్లిషర్స్ & బుక్‌సెల్లర్స్,
   చిలకలూరిపేట - 522 616.



శ్రీ కొత్త భావయ్య చౌదరి

గ్రంథకర్త

జననం : *2–6–1897*



# అంకితము

---

కమ్మవారి చరిత్రము మూడు భాగములు పూర్తియై ముద్రణము 1942 లో పూర్తిచేయబడినపుడు దానిని తిరుపతి శ్రీ వెంకటేశ్వరునికి సమర్పించితిని. ఈ పునర్ముద్రణ సంక్షిప్త చరిత్రగూడ శ్రీ వెంకటేశ్వరుని పాదారవిందములకే భక్తిపూర్వకముగా సమర్పించుచున్నాను.

ఇట్లు,

**కొత్త భావయ్య చౌదరి,**

గ్రంథకర్త.

# కమ్మవారి చరిత్ర

## పీఠిక.

1939-42 సం॥ల మధ్య నాచే రచింపఁబడి ప్రకటింపబడిన కమ్మవారి చరిత్ర మూడు భాగములను నేటివరకుగల విశేషములనుజేర్చి, క్లుప్తీకరణజేసి, సంస్కరించి, యీ రీతిని తణుకు జమీందారులును, సారస్వత సేవాపరాయణులు నగు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారి సహాయ ప్రోత్సాహములవల్ల ప్రచురింపఁబడు చున్నది. పరమ ప్రమాణములైన పూర్వశాసనములు, గ్రంథముల సహాయముతో నిది ముద్రింపఁబడినది. వానినక్కడక్కడ యుదాహరించితిని. ప్రకృతకాలపు ప్రముఖుల చరిత్రలనన్నింటినీ యిది చెప్పుచుండలేదు కాని కొంతవరకిది దిఙ్మాత్రముగ తెలిసినంతవరకు నుడువుచున్నది.

ఇందు కేవల రాజ్యపరిపాలన చరిత్రగాక సాంఘిక చరిత్రముగూడ కలిపి చెప్పబడినది.

దీనివల్ల కమ్మవారు ప్రాచీనకాలమునుండియు దేశరక్షణ, పాలనావ్యవహారములందు పాల్గొనుచు, దేవబ్రాహ్మణులను, విద్యలను పోషించుచు వచ్చినట్లు స్పష్టపడుచున్నది. కృషి, వాణిజ్యాదులందుగూడ పలువురు పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. గ్రంథము మిక్కిలి బాహుళ్యమైనందున పూర్వముద్రణములో నుండిన విషయములు కొన్ని యిందు తగ్గింపబడినను వివిధ రంగములలోను ప్రసిద్ధిపొందిన వారిని గురించి విస్తరింపబడినది. ఈ ముద్రణము కేవలము సంఘజులకేగాక, చరిత్రాభిజ్ఞులగు నాంధ్రులందరికి ఆహ్లాదము గూర్చునని తలంచెను.

ఈ చరిత్ర వ్రాయుటలో తోడ్పడిన గ్రంథములు రచించిన గ్రంథకర్తలందరికిని కృతజ్ఞుఁడను. ముఖ్యముగా ఆంధ్రదేశ చరిత్రారచయితలలో శ్రీ చి॥ వీరభద్రరావు, మ॥ సోమశేఖరశర్మ, బి॥ హనుమంతరావు, డా॥ యశోదా దేవి మున్నగువారికి నా ప్రత్యేకాభివందనములు.

ఇట్లు,

**కొత్త బావయ్య చౌదరి**

1962.

# పీఠిక

శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు ఆధునికాంధ్రచారిత్రక పరిశోధకులలో పేరుపొందిన వారలలో నొకరు. వీరిదివరకు ప్రకటించిన కమ్మవారి చరిత్రము-మూడు భాగముల గ్రంధమునకీ కృతి సంక్షిప్త చరిత్రము.

చరిత్ర పరిశోధనము సులభమైన పనికాదు. పురాణేతిహాసములు, ప్రాచీన శాసనములు సంస్కృతాంధ్ర కావ్యములు, ఆంధ్ర ఆంగ్ల చరిత్రకారులు వ్రాతలు, స్థానిక చరిత్రములు మొదలగునవి యెన్నియో పరిశోధించి, కావలసిన విషయ సామగ్రిని క్రోడీకరించి వివిధ సిద్ధాంతముల సమన్వయించి, సత్యమైన వృత్తాంతము సమకూర్చుట చాల కష్టము. అందును స్వీయకుల రాజకీయ సాంఘిక చరిత్రము వ్రాయగడంగుట కష్టతరము. శ్రీ భావయ్య చౌదరిగారు సుడాంబరముగ నిరంతర దీక్షతో, నిష్పక్షపాతముగ నీ కార్యమును నిర్వహించిరనుటలో నతిశయోక్తి లేదు. వీరి కృషి కమ్మకుల చరిత్రకు ఘంటాపథము.

కమ్మనాడాంధ్ర దేశములో నత్యంత ప్రాచీనమైన నాడీ విభాగములలో నొకటి. ప్రాచీన ప్రాకృతాంధ్ర శాసనములలో పేర్కొనబడినది. ఇది కమ్మకరట్టమని, కమ్మాంక రాష్ట్రమని, కర్మ రాష్ట్రమని, కమ్మనాడని వివిధ నామములతో వెలయుచుండెను. నేటి గుంటూరు మండలములోని నరసారావుపేట, సత్తెనపల్లి, బాపట్ల, ఒంగోలు తాలూకా; అద్దంకి ప్రాంతములోని గ్రామములు కమ్మనాటులోని వని శాసనములలో నుదాహరింప బడినది. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము ననుసరించి శ్రీశైలమునకు తూర్పు భాగమున పలనాటికవి, వెలనాటుకవి దక్షిణమున, గుండ్లకమ్మనది కుత్తరమున, తూర్పు సముద్రము నంటియున్న భూభాగమునకు కమ్మనాడు వర్తించును.

కన్నడ భాషలో పొన్న కవి శాంతి పురాణములో కమ్మనాటిసట్టుఫ వర్ణించెను.

ఉ॥ ఆధరణీవధూతిలక మాధరణీ లలనోముఖాబ్జమం
తాధరణీరమైక నవ యౌవన మాధరణీ ప్రియాకటా
క్షాదర విభ్రమ భ్రమణ మగ్గళ వగ్గదె కమ్మనాడు వి
ద్యాధర లోకమేనదట పోల్చెగ బర్కుమె పోలదిర్కుమే॥

ఆ పురాణములోనే తాను వేంగిదేశములోని కమ్మనాటి యందలి పుంగనూరు వాసినని చెప్పుకొనెను. పుంగనూరు చిత్తూరు మండలములోని పుంగనూరు గ్రామమేయై యుండునని యూహించుచున్నాను. ఈ కవి పదియవ శతాబ్దము వాడు. ఆ శతాబ్దమున కమ్మవారు దక్షిణమున చిత్తూరు మండలము వఱకు వ్యాపించి యుండవచ్చును. శాసన ప్రమాణాలు కనబడలేదు.

ఇట్టి కమ్మనాటిలోని కాపవరేణ్యులు సామంత మండలేశ్వరులై ప్రథమమున క్షత్రియులై ప్రభువులకు శౌర్యములందు సాయపడి, వారితో వియ్యమంది, రాను రాను క్షత్రియోచితులై చతుర్థాన్వయులనిపించుకొనిరి. కాపు పదమునకు కర్షకుడనియే యర్థము. కమ్మవారి చరిత్రము ప్రథమ భాగము పుట 156లో నుదహరింపబడిన ఆంధ్ర భారతములోని పద్యమునకు సంస్కృత భారతములోని మూలము గమనించిన యెడల కాపు పదము కర్షకునకు ఆంధ్రీకరణమని తెలియనగును —

సువృష్టేచ యథాదైవే సమ్యక్షేత్రేచ కర్షితే।
బీజం మహాగుణాం భూయాత్తథా సిద్ధిర్హిమానుషే॥
తీయోర్దైవం వినిశ్చిత్య స్వయంచైవ ప్రవర్తతే।
ప్రాజ్ఞా పురుషకారేతు వర్తతే దాక్ష్యమాశ్రితాః!

సౌప్తిక పర్వము, ద్వితీయాధ్యాయం
శ్లో. 7-8.

ఈ కమ్మసామంత మండలేశ్వరులు కాకతీయుల కాలములో విఖ్యాతులై వారితో సంబంధ బాంధవ్యముల నెరపి, తర్వాత, రెడ్డిప్రభువుల పరిపాలనములో

విగతులై మరల విజయనగర సామ్రాజ్యమునందలి తుళువ ఆరవీటి మహా రాజుల కాలమున వీర్య, వైభవోపేతులై విరాజిల్లిరి. తర్వాత బ్రిటిషు పరిపాలనము నందును, ప్రఖ్యాతిని గడించి, స్వరాజ్య సంపాదనమందు గాంధీమహాత్మునకు సహాయపడి, స్వార్థత్యాగులై సహాయ నిరాకరణోద్యమమునందు ఆంధ్రములోని నాల్గు వర్ణముల వారికిని దీసిపోక వాసికెక్కిరి. శ్రీ భావయ్య చౌదరి గారు ఆధునిక కమ్మకుల వరేణ్యుల సంగ్రహ జీవితముల సహితము గూర్చి, తమ కులము వారికేగాక, నితర కులము వారికిని వారి నాదర్శప్రాయులనుగా జేసిరి.

కాకినాడ
26—4—62 }

**కుందూరి ఈశ్వరదత్తు.**



# మా మాట

పుస్తక ప్రచురణ ఎంత కష్టసాధ్యమైనదో మీ కందరికి తెలుసు కేవలం ధనలాభార్జనే కాకుండా సమాజసేవకు కొంత అవకాశం వుండేలా పబ్లికేషన్ స్థాపించాలని సోదరి పత్తిపాటి తులశమ్మగారు నేను ఆలోచించాము. ముందరగా చరిత్రకు సంబంధించిన పుస్తకములు ప్రచురించుదాము అనుకొన్నాము. అందులో భాగంగానే ఈ పుస్తక ప్రచురణ. అడిగినదే తడవుగా ఈ పుస్తకము ప్రచురించుటకు హక్కుల నొసంగిన కీ.శే. కొత్త భావయ్య చౌదరి గారి వారసులు. శ్రీ కొత్త కృష్ణమూర్తిగారు శ్రీ కొత్త శివలింగ ప్రసాద్ గారులకు మా కృతజ్ఞతాంజలులు.

ఇదే వరవడిలో కీ.శే. భావయ్య చౌదరిగారి "దేవరహస్యాలు" "రెడ్డి వంశ చరిత్ర" ప్రచురించుదాము అనుకొంటున్నాము. కమ్మవారి " మైగ్రేషన్ " (వలసలు) గురించి కొందరు పెద్దలు సమాచారము సేకరించుచున్నారు. అది పూర్తికాగానే పుస్తకరూపంలో మీ ముంచుంచాలని ఆలోచన వున్నది. ఈ ప్రయత్నాలకు మీ ఆదరణసలహాలు లభించగలవని కొండంత ఆశతోవున్నాము.

ఈ ప్రయత్నంలో మొదటి నుండి మమ్ములను ప్రోత్సహించిన కోనేరు హనుమంతరరావుగారు, తెనాలి వారికి మరియు ఆలూరు సుబ్బారావు, తెనాలి, జంపాల రమేశ్ కుమార్, శ్రీనివాసనగర్ కాలని, గుంటూరు. కాట్రగడ్డ రమేశ్, బ్రిందావన్ గార్డెన్స్ గుంటూరు. రావెళ్ళ సుధాంశ్ VIRGINIA U.S.A. గార్లకు మేము ఎంతో ఋణపడి వున్నాము.

ఇట్లు
**కోనేరు శంకరరావు**
ప్రజాశక్తి నగర్
అంగలకుదురు
తెనాలి తాలూకా 522211.

**పత్తిపాటి లక్ష్మతులశమ్మ**
కిరణ పబ్లిషర్స్ : గుంటూరు-6

## ఇందుపయోగించవ గ్రంథముల సాంకేతికపదముల పట్టిక.

| | |
|---|---|
| Ind. Ant. | .... Indian Antiquities. |
| S. I. I. Vol. | .... South Indian Inscriptions volume. |
| A. R. No. no Ep Colle. | Annual report of Madras. .. Epigraphy and its inscription number. |
| J A. H. R S. | .... Journal of Andhra Historical Research Society, Rajahmundry. |
| J. A H. C. | .... Journal of Andhra History and Culture, Guntur. |
| L. R. | .... Local records or C.P. Brown or Meconzee records |
| Ep Ind. | .... Epigraphia Indica. |
| E. P. Car. | .... Epigraphia Carnatic. |
| N. I. | .... Nellore Inscriptions. |
| T T. Ins. | .... Tirumala Tirupati Devastanam Inscriptions. |
| J. A. S. B. | .... Journal of Asiatic Society, Bombay. |
| J. B. B. R. A. S. | .. Journal of Bombay Royal Branch Asiatic Society, Bombay. |
| Q. J. M. S. | .... Quarterly Journal of Mythic Society Bangalore. |
| Ins. No. | .... Inscription number. |
| తె. శా. | ....తెలంగానా శాసనములు. |
| శా. శ. | ....శాలివాహన శకము. |
| క్రీ. శ. | ....క్రీస్తు శకము. |
| C. P. | .... Copper Plates. |
| **Ibid** | ....డిటో యనుటకు. |

మరికొన్ని గ్రంథముల పేర్లు పూర్తిగానే గ్రంథ మధ్యమున వ్రాయబడినవి.

## పూర్వముద్రణపై కొన్ని పెద్దల అభిప్రాయములు.

---

(1) ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, యం. ఎ. గారు.
"మన ప్రాచీన చరిత్రములోని యొక ప్రాముఖ్యభాగమునకిది చాల శోభ నొడగూర్చుననియే నా నిశ్చయము". (1వ భాగము)

(2) శ్రీజయంతి రామయ్యపంతులు బి.ఏ.,బి.యల్., రిటైర్డ్ డిప్యూటీ కలెక్టరు. చారిత్రక పరిశోధకులు.
"It undoubtedly shows much Historical Research"

(3) చారిత్రక పరిశోధకులు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు
"ఈ గ్రంథము మీ పరిశోధనా పరిశ్రమను, నైపుణమును ప్రస్ఫుటము చేయుచున్నది" (1వ భాగము)

(4) శ్రీ అడిదము రామారావు పంతులుగారు, విజయనగర మహారాజా కాలేజి సీనియర్ తెలుగు పండితులు.
"మీ గ్రంథము ఒక్క కమ్మవారికేకాదు ఆంధ్రులెల్లరను సమాదరణీయమైనది. మీరుగావించు భాషాసేవ సర్వపండిత శ్లాఘ్యమైనది" (పార్టు 1)

(5) జయపూర్ మహారాజా, ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రోఛాన్సలర్ శ్రీవిక్రమదేవవర్మగారు.
"Its production shows that you have taken much trouble in the research work, which I appreciate".

(6) హిందూపత్రిక (4-4-43)
(Part 3)
"This volume brings to fruition the patriotic labours of Mr. Choudary. They will certainly serve as the foundation for further studies in Andhra feudal and tribal chronicles".

(7) ఆంధ్రపత్రిక (10-1-43)
"ఒకప్పుడు కమ్మవారు పాలెగార్లుగానూ, సేనాపతులుగానూ, సర్దారులుగానూ, సైనికులుగానూ, సంస్థానాధీశ్వరులుగానూ, కార్యకర్తలుగానూ, జాగీరుదారులుగానూ, ఉద్యోగులుగానూ, రైతువర్గంవారుగానూ, మెలగుతున్నట్లు తెలిపేచరిత్ర ఇది; విశేషముగా శ్రమించి, పరిశ్రమించి, గ్రంథకర్త రచించినారు."
(ఇట్లే మరికొన్ని యున్నను గ్రంథ విస్తరభీతి వివరించుటలేదు).

# విషయసూచిక

— c —

# స్వ కీ య ం

చాల కాలం క్రితం (విద్యార్థిదశలో) 'కమ్మవారి చరిత్ర' ను గురించి వినడం జరిగింది. చదవాలనే కోర్కె తీరలేదు. ఇటీవల ఆ పుస్తకం చదివే అవకాశం లభ్యమైనది. చదివినప్పుడెంతో ఉద్వేగాన్ని చవిచూడటమైనది. ఒక కులం గురించి ఉబ్బు మాటలతోనో, అభూతకల్పనలతోనో పుస్తకం నిండి ఉంటుందనుకున్న ఊహ తేలిపోయింది. కారణం - ఆంధ్రుల చరిత్రలో అంతర్లీనంగా సాగుతూ, ఒక ముఖ్యభాగంగా శోభిల్లుతూ, సప్రమాణంగా వ్రాయబడుటయే !

శ్రీ పొలడుగు శేషాచల వర్మగారు 'కూర్మరాజీయము'- శ్రీ సూర్యదేవర రాఘవయ్య చౌదరి 'కమ్మవారి చరిత్ర'లను బహు వ్యయప్రయాసలతో ప్రచురించ్హారు. శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు కమ్మవారి చరిత్రము ప్రథమ భాగం (1939); ద్వితీయ భాగం (1940), తృతీయ భాగం (1942లో) ప్రచురించారు. ఈ మూడు భాగాలను క్లుప్తీకరించి ఒకే సంపుటంగా (1962 లో) ప్రచురించారు. ఈ రచన గురించి శ్రీ. భావయ్య చౌదరిగారు, శ్రీ కొత్త వీరభద్రకవిగారు ప్రత్యేకంగా మద్రాసులో మకాం పెట్టారు. అచ్చట ప్రాచ్య లిఖితపుస్తకాలయము, విశ్వవిద్యాలయము, శాసన పరిశోధక కార్యాలయములలో విషయసేకరణ చేస్తూ ముద్రితాముద్రిత తాళపత్రాది గ్రంథములను, శిలాశాసనాలను శోధించారు. నాటి సంస్థానాధీశులు, ఇంకా అనేకమందిని సంప్రదించి - ఎన్నో ఉపేక్ష లెదురైనా జంకక కార్యదీక్షతో విషయాలు సేకరించారు. దాదాపు పన్నెండు సంవత్సరాల అకుంఠిత దీక్షతో ఈ రచనను వెలుగు చూపించారు.

దాదాపు ఇప్పటికే అలభ్యంగా మారిన ఈ గ్రంథాన్ని పదుగురికి, ముఖ్యంగా ఈనాటి తరానికి పరిచయం చేయాలనే ఉబలాటం మాలో ఊపిరి పోసుకుంది. ఉత్సాహమే ఊపిరిగా యధాతథంగా దీని ముద్రణకు పూనుకోవడమైనది. అడుగు ముందుకువేశాం.

వివిధ రంగాలలో ఉన్న మేటి మూర్తులను పరిచయంచేస్తే పుస్తకానికి సమగ్రత సమకూరుతుందని శ్రేయోభిలాషులు కొందరు సూచించారు. ఆ సూచన శిరోధార్యంగా భావించాము.

ఫలితంగా విషయసేకరణకై కొందర్ని కలిశాము. ఆదిలోనే హంస పాదులా - మేమేదో యాచనకొచ్చినట్లుగా వారు ప్రవర్తించారు. మా ఉత్సాహంపై నీళ్ళు చల్లినట్లయ్యింది. నిజానికి వారిని తప్పుపట్టనవసరం లేదేమో ! వాళ్ళ నా స్థితికి తెచ్చిన పూర్వఘనులను - పబ్బం గడుపుకునే పుణ్యాత్ములను స్మరించుకుంటే సరి. అప్పుడు తెల్సివచ్చింది శ్రీ భావయ్య చౌదరిగారి ఓర్మి-వారుపడ్డ శ్రమ.

దీనితో ఎవరినీ కలువరాదనే భావం బలపడినది. భావన తప్పుతో కూడినదే ! అయినా అభిమానంఅడ్డునిల్చింది. పుస్తకాన్ని ప్రచురించిచూపితే అప్పుడు అర్థం చేసుకోగలరనే ఉద్దేశ్యమే దృఢపడినది. భవిష్యత్తులో ఈ గ్రంథాన్ని లోపరహితంగా - సమగ్రంగా తీర్చిదిద్దవచ్చు. మరి ఇప్పటిమాటేమిటి ? మడం వెనుకకు తిప్పడం ఇష్టంలేదు. అందుకే మా శక్త్యానుసారం సమాచారాన్ని మీ ముందుంచుతున్నాం.

ఒకవైపున దాదాపు పుస్తకమంతా ముద్రించడ మౌతున్నది. వేరొకవైపున సమాచారం లేదు. అయినా ఒకే ఒకవారంలో సమాచారసేకరణ చేసుకుంటూ, శుద్ధప్రతితో సంబంధం లేకుండా నేరుగా ప్రెస్‌కు మ్యాటరిచ్చాం. భాషలో, భావనలో స్ఖాలిత్యాలు అనివార్యమయ్యాయి. విషయసేకరణలో తీవ్ర అసంతృప్తి మమ్ము చుట్టుకునేఉంది. ఎందరినో పలుకరించను - వ్రాయను వల్లకాలేదు. ఇదంతా మా తెలియనితనమే కాని ఇతరం కాదు. సహృదయులు దీనిని గమనించగలరు. లోపాలనుతెల్పి, తమకు తెల్సిన సమాచారాన్ని అందించగలరు. ఈ సారి జాగ్రత్త వహించటానికి వీలవుతుంది. ఆ ఆశే మాకు ఊతంగా నిల్చి ఈ గ్రంథ ముద్రణకు వీలు కల్పించింది.

స్థిరచిత్తంతో లక్ష్యగాములై స్ఫూర్తిమంతులై భాసిల్లేవారు; ఆదర్శాలతో, కఠోరదీక్షతో ఉన్నతశిఖరాలను అధిష్టించిన తేజోమూర్తులు, చిరస్మరణీయులు అనేకమంది ఉన్నారు. శ్రమైక్య సౌందర్య పిపాసువులను, జిజ్ఞాసువులను కొందర్ని పరిచయం చేయడమైనది. జీవన పథములుగా వారు మనకు జీవన తత్త్వాన్ని అందిస్తారు. జీవన మధురిమను పంచుతారు. మనలో ఆత్మగౌరవ వృద్ధికి, ఉనికికి ప్రేరణ ఇస్తారు. ఆ ఉద్దేశ్యంతో పరిచయం ప్రారంభించినా అందర్నీ పేర్కొనడం సాధ్యంకానందుకు మన్నించాలి.

ఒకప్పుడు క్షేత్ర తేజంతో ప్రకాశించినా కాలంతోపాటు కదురు- కవ్వం కదిలించిన జాతి ఇది. కర్రను- తొర్రను నమ్ముకొని కరువు రక్కసికోరలు తెంచినవారు వీరు.

**(....to be most industrious and intelligent cultivators,' who, now that gosha has been generally abandoned, beat all rivals out of the field - a fact which in recoginsed by severel proverbs - such as -** 'కమ్మవాని చేతులు కట్టినా నిలవడు' - 'కమ్మవారికి భూమి భయపడుతున్నది.' **- words of H A. Stuart quoted in 'castes and Tribes of South India' by E. THUR STON Vol III K** దాదాపు శతాబ్దం క్రితం బ్రిటీష్ వాళ్ళు వ్రాసిన గ్రంథమిది.)

సహజీవన సూత్రాన్నినమ్మి ఆచరించినవారు. ఆత్మగౌరవానికి ప్రతీకగా బ్రతికినవారు. అట్టి స్థితిని తెల్సుకొని ఉన్నతంగా జీవనయాత్ర సాగించే తత్త్వం నేటి యువతరానికి అందించాలనే కోర్కెమినహా ఈ గ్రంథ ప్రచురణకు వేరు ఉద్దేశ్యాలు లేవు.

హింసకో, ఉద్రేకానికో - లేక మూల బలానికో ఇది ఉద్దేశించినదికాదు. 'నిన్ను నీవు తెల్చుకోవడానికి, నిన్ను నీవు చక్కదిద్దుకోవడానికి కరదీపికగా ఇది ఉపకరిస్తుందనే ఆశతో దీన్ని అందించటమౌతున్నది. సాధారణస్థితి నుండి అసాధారణ స్థాయివరకు ఎదిగినవారినుండి స్ఫూర్తి పొందడానికి ఈ గ్రంథం అవకాశం కల్పించాలనే తలంపుకూడా ఇందులో ఇమిడి ఉన్నది. ఆమేరకు మా కృషి సఫలీకృత మెంతవరకయ్యిందో మీరే నిర్ణయించగలరు.

కులమతాలతో సంబంధంలేని హేతువాదులు, సమసమాజ లక్ష్యానికై పాటుపడుతున్న సామ్యవాదులను కొందర్ని పరిచయం చేయడమైనది. అన్యథా భావించవద్దు. వారినుండికూడా కొంత ఉద్దీపన కొందరైనా పొందటానికి వీలున్న దనే భావంతోనే ఈ ప్రయత్నం చేశాం. నిష్పక్షపాతంగా అందర్నీ పలుకరించే ప్రయత్నంలో లోపాలుంటే క్షమించగలరు.

గురుతుల్యులు, జానపద కవిబ్రహ్మ శ్రీ కొసరాజు రాఘవయ్యచౌదరి విరచితమైన 'గండికోట యుద్ధం' వీరకావ్యంలోని 'నామాటలు' నుండి దక్షిణాది

కమ్మవారు అంశాన్ని అనుబంధంగా స్వీకరించడమైనది. అందుకు స్వర్గీయ శ్రీ కొసరాజు - గ్రంధ ముద్రాపకులు - కమ్మ జనసేవాసమితి, గుంటూరువారికి ఎంతో ఋణపడి ఉన్నాము. వారందరికీ కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాము.

ఈ అవ్యవధి, అసమగ్గ ఆశాపుష్పం చిగురించడానికి చేతనైనంతలో నీరుపోసిన మిత్రులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, తెలుగు విద్యార్థి సంపాదకులు, డాక్టరు కె. ఆర్. యస్. సాంబశివరావు ఎమ్. యస్సీ; పిహెచ్.డి, జువాలజీ లెక్చరరు, నాగార్జున యూనివర్సిటి, గుంటూరు; శ్రీ సుంకర కోటేశ్వరరావు నాగార్జున యూనివర్సిటి, శ్రీ దరువూరి వీరయ్య, గుంటూరు, శ్రీమతి కొత్త సుబ్రమణ్యేశ్వరి రిటైర్డ్ **D.E.O,** సంగంజాగర్లమూడి జంపాల కేశవరావుగారు రాదికా బైమెటల్ బేరింగ్స్ ప్రైవేట్ లిమిటెడ్ బాలానగర్-హైదరాబాద్, ఐనంపూడి రమేశ్‌గారు అమీర్‌పేట-హైదరాబాద్, పాలేటి రమేశ్‌బాబు నాగార్జున నగర్-హైదరాబాద్, కన్నెగంటి వెంకయ్యగారు ఐతానగర్-తెనాలి, వెలగా స్థానికాబాబుగారు ఫైనాన్సర్-తెనాలి, అలపర్తి వెంకటసుబ్బయ్యగారు (V.M.) అంగలకుదురు. తదితరులను స్మరించ కుండా, కృతజ్ఞతాంజలులు సమర్పించ కుండా ఉండలేము.

పుస్తక ముద్రణను స్వంతపనిగా భావించి, త్వరితగతిన ప్రచురించిన శ్రీ లక్ష్మీప్రెస్, దాని సిబ్బందికి మా కృతజ్ఞతలు తెల్పుకోవడం మా ప్రధానవిధి-బాధ్యత. ఈ చరిత్ర సమగ్రతకు మీరు సైతం సమాచారాన్ని అందించగలరని ఎదురుచూస్తూ,

మీ

పత్తిపాటి లక్ష్మీరెడ్డి- నవభారత గెస్టుహౌస్ రోడ్
గుంటూరు—6

కామేపల్లి రామూజీ (లెక్చరరు) 9-33౬ సి ఆర్. నగర్
చిలకలూరిపేట-522 616

# తొలిపలుకు

భారతదేశంలో అనాదినుండి, విమర్శలకు గురియగుచూ వచ్చిన సంస్థలలో వర్ణవ్యవస్థ ఒకటి. హైందవసంస్కృతికి, సమాజ స్వరూపమునకు, వర్ణములు విశిష్టమైన స్థిరత్వాన్ని చేకూర్చినవి. కాని కులములు భారతదేశము గుత్తకొన్న సొత్తుమాత్రము కాదు. అతి ప్రాచీనకాలమున, నాగరికతాకేంద్రములైన ఈజిప్టు, బాబిలోనియా, చైనాలలోకూడ పూజారులు (**Priests**), పాలకులు (**Rulers**) వర్తకులు (**Artisans or Marchants**), బానిసలు (**Slaves**), అని వృత్తులాధారముగ సామాజిక విభజన జరిగినట్లు చరిత్రలో చదువుచున్నాము. "గుణకర్మ విభాగసః" అను గీతావాక్యమును బట్టి మన దేశమున సైతము, గుణము (స్వభావము), కర్మ (వృత్తి), అనుసరించియే నాల్గువర్ణము లేర్పడినట్లు తెలియుచున్నది. ఇతర ప్రాంతములందు, సమాజ-పరిణామక్రమంలో నీ వృత్తివిభజన ఎప్పుడో అంతర్ధానమైనది. కాని ఇండియాలోని పూజారులు (**Brahmins**) వర్ణవ్యవస్థకు దివ్యత్వాన్ని ఆపాదించి కాపాడుకుంటూ వచ్చారు. అంతేగాక, భారతసమాజానికి బాహ్యప్రపంచ ప్రభావాలు సోకకుండ హిమాలయ పర్వతములు చల్లని రక్షణ కల్పించినవి. తత్ఫలితముగా ఇండియాలో వర్ణవ్యవస్థకు శాశ్వతత్వము సిద్ధించెను. దీనివలన ప్రజలలో కృత్రిమవిభేదాలేర్పడి, జాతీయజీవనమునకు జరుగుచున్న అపకారాన్ని గుర్తించి మహావీరుడు, గౌతమ బుద్ధుడు, బసవేశ్వరుడు మొదలైన దార్శనికులు, సంస్కర్తలు కులాలమీద దండయాత్రలు చేసిరి. ఐననూ, వర్ణవిభేదములు, వానివలన కలిగే వైమనస్యములూ, ఈనాటికీ మనదేశమున ప్రధాన సాంఘిక సమస్యగా నిలచియుండుట, భారతజాతీయ సంస్కృతిలోని వైశిష్ట్యమో, దౌర్బల్యమో, దౌర్భాగ్యమో పరిశీలించవలసిన అవసరము నేడెక్కువగా కన్పించుచున్నది. అంతేగాదు; ప్రజాస్వామ్య సూత్రములపై సమతాసమాజమును (**Egalitarian Society**) సాధింప సంకల్పించిన నేటి భారతీయులు, జన్మహక్కుల తత్వముపై రూపొందిన వర్ణవ్యవస్థను పునఃపరిశీలించి, వర్ణవిభేదములలోని జాతీయ విద్రోహకరశక్తులను గుర్తించి వానికి శాశ్వతసమాధి నిర్మించుట గూడ నేటి జరూరుసమస్యలలోనొకటి.

క్రీస్తుశకారంభమున దక్షిణాపథము నేకచ్ఛత్రముగా నేలిన గౌతమీపుత్ర శాతకర్ణికి (క్రీ. శ. 78-102) "వినివర్తిత చాతుర్వర్ణ సంకరస్య" అను బిరుద మున్నట్లాతని మాతృదేవి గౌతమీబాలశ్రీ నాసికలో వేయించిన శాసనమువలన తెలియుచున్నది. గౌతమీపుత్రునకు ధాన్యకటకము (గుంటూరు జి.) ప్రధాన రాజధాని. కాబట్టి క్రీస్తుశకారంభమునాటికే ఆంధ్రదేశమున వర్ణములు పాదుకొని నట్లును, ఏవో అవాంతరములవలన వర్ణసాంకర్య మేర్పడుటచే గౌతమీపుత్రుడు నివారించినట్లును స్పష్టమగుచున్నది. గౌతమీపుత్రుడు "ఆగమానాం నిలయస్య" అనికూడా సంబోధింపబడినాడు. అందుచేత వైదికధర్మమునకు, వర్ణవ్యవస్థకు అవినాభావసంబంధము కూడ నాటికే కల్పింపబడినట్లు గ్రహించవచ్చును. ఈ పరిణామముల ఫలితముగ వైదికకర్మలకు అర్హతగల అగ్రవర్ణములవారు ఆర్యు లనియు, అనర్హులు ఆర్యేతరులనియు అభిప్రాయము నెలకొనెను. కాని వర్ణవ్యవస్థ ఆర్యనిర్మాణమను విషయము అనుమానాస్పదము.

ఆర్యులు ఇండియాలో ప్రవేశించినప్పుడు పశుపాలకులుగానున్న సంచార జీవనులు; గుడారములే వారి గృహములు. ఇట్టి ప్రజలలో వర్ణవ్యవస్థవంటి సుస్థిర సాంఘిక సాంప్రదాయములుగాని సంస్థలుగాని యేర్పడగల అవకాశ ములు చాలతక్కువ ఆర్యులు ఇండియాపై దండెత్తి, స్థానికులైన ప్రజలతో పోరాడి, వారినోడించి దేశము నాక్రమించిరి. ఈ ఆదిమభారతీయులే మహోజ్జ్వల హరప్పా సంస్కృతీ నిర్మాతలైన సింధుప్రజలు. సురక్షితమైన కోటలను నిర్మించుకొని ప్రశాంతజీవితము గడుపుచున్న సింధుప్రజలలోగూడ ఈజిప్టు, బాబిలోనియాలలోవలె వృత్తివిభజన జరిగినట్లు నిదర్శనము లున్నవి. కాబట్టి విజేతలై భారతదేశము నాక్రమించిన ఆర్యులు స్థానికముగనున్న వృత్తివిభజనతో జాతీయాధిక్యతను, (శ్వేత, కృష్ణ) వర్ణప్రాశస్త్యమునుచేర్చి కులములను రూపొందించిరి.

ఆర్యుల అధికారము వైదికమతములతోబాటు నూతన వర్ణవ్యవస్థసైతము దక్షిణాపథమునకు విస్తరించినది. కాని, దక్షిణదేశమునందలి బ్రాహ్మణులు, క్షత్రియులు, కేవలము ఆర్యావర్తము నుండి వలసవచ్చిన వైదిక సంస్కృతీ నిర్మాతలనుకొనుట చారిత్రకసత్యము కాజాలదు. ఆర్యసంస్కృతి నవలంబించిన దాక్షిణాత్యజాతులలోని పూజారులే బ్రాహ్మణులైరి; ఆ జాతుల నాయకులే

క్షత్రియులైరి. కాలక్రమమున వైదికసంస్కృతి నారాధించు వీరందరును తాము ఆర్యులమని భావించుటలో విచిత్రములేదు. అందుచేతనే దాక్షిణాత్యబ్రాహ్మణులు వైదికఋషిగోత్రములను ధరించిరి; దక్షిణదేశ రాజవంశములు, కురు కోసల రాజ్యములనేలిన ఐతిహాసిక చంద్ర సూర్యవంశ క్షత్రియులతో తమకు సంబంధమును సూచించు కథలు, గాధలు కల్పించుకొనిరి. క్రీస్తుశకారంభకాలమున, విదేశీయులైన పహ్లవులుసైతము భారద్వాజగోత్రజులైన పల్లవులుగా మారిపోయి దక్షిణాపథము నేలిరిగదా!

ఆంధ్రదేశములో పెక్కు రాజకీయ సాంఘిక పరిణామములు జరిగినవి. వీటిని సమన్వయపరచి నిర్వివాదమైన చరిత్రను రచించుటకు ఉపలభ్యములగు ఆధారములు చాలతక్కువ. అవికూడ అసంబద్ధములై, పరస్పరవిరుద్ధములై చరిత్రకారులను తలపట్టులు పట్టించునవిగా నున్నవి. వీనికితోడుగా స్థానిక దురభిమానములు చేరుచున్నవి. ఇక, చరిత్రకుపట్టగల దుర్గతి వేరె చెప్పవలయునా? ఈసందర్భమున మనదేశమున వర్ణములకు సంబంధించిన కొన్ని విరుద్ధ ఆధారములను పరిశీలింతము :

(1) సాతవాహన చక్రవర్తులు బ్రాహ్మణులుగా పరిగణింపబడు చున్నారు. అందులకు, గౌతమీపుత్రుని 'ఏక బ్రాహ్మణస్య' అను బిరుదమువినా యోగ్యముగ మరొక ఆధారము గన్పింపదు. గౌతమీపుత్రుడు వర్ణసాంకర్యమును మాన్పినట్లు చెప్పబడినది. కాని అతని కుమారుడు వాసిష్ఠీపుత్ర శివశ్రీ శాతకర్ణి శకరాకుమారియైన రుద్రదమనికను వివాహమాడినట్లు తెలియుచున్నది. శ్రీపర్వత ఇక్ష్వాకువంశస్థాపకుడైన శ్రీ శాంతమూల మహారాజు అశ్వమేధాది యజ్ఞములొనర్చిన వైదికమతోద్ధారి. అతని కుమారుడైన వీరపురీషదత్తుడు ఉజ్జయిని (శక) రాకుమార్తె రుద్రధర భట్టారికను భార్యగా స్వీకరించినాడు. ఇట్టి వివాహమువలన వర్ణసాంకర్యమెట్లు నివారింపబడును? ఇక, శకరాజవంశముకూడ తనవైదేశిక స్వభావమును గోల్పోయి స్థానిక సూర్య, చంద్రవంశములలో నొకదానియందు లీనమైపోయి యుండును. కాబట్టి ఏవి ప్రాచీన క్షత్రియరాజవంశములో, కానివేవో పరిశోధింపబూనుట కేవలము ఎండమావుల వేటవంటిది.

(2) పై అంశము చాళుక్యుల విషయమున మరింత స్పష్టము కాగలదు. చాళుక్యులు బ్రహ్మచుళుకమునుండి ఉద్భవించిన వీరావతంసుని సంతతివారని

యొకగాధలో నున్నది. కాని వేంగి చాళుక్యులు తాము చంద్రవంశజుల మని వర్ణించుకొన్నారు. నన్నయ భట్టారకుని ఆంధ్రమహాభారతావ తారికయే అందుకు నిదర్శనము. మరియొక గాదలో అయోధ్యాధిపుడైన జయసింహుడు దక్షిణాపథమునకు వలసవచ్చి చాళుక్యుల మూలపురుషుడైనట్లు చెప్పబడినది. ఐనచో, చంద్రవంశస్థులైన చాళుక్యులు సూర్య వంశస్థుల రాజ్యమైన అయోధ్యనుండి వలస వచ్చుటయేమీ ? అను సందేహము రాకమానదు. ఇదియిట్లుండ, సౌరాష్ట్రము నేలిన చాళుక్యులు తాము అగ్నికుల క్షత్రియులమని చెప్పుకున్నారు. వీరినే సోలంకీలు అని అంటారు. అగ్నికుల ప్రశస్తి చందుకవి రచించిన "పృద్వీరాజ రాసో" అను హిందీ కావ్యములో కన్పించును. పరశురాముడు సర్వక్షత్రాంతకుడై, యజ్ఞమొనర్చి, హోమాగ్నినుండి ఉద్భవించిన మహాపురుషునకు భూమిని దత్తమొనర్చి తపోవనమున కేగెనట. ఆతని సంతతివారైన ప్రతీహార, పారమార, చౌహాన, చాళుక్య రాజవంశములవారు తాము అగ్నికుల క్షత్రియులమని చెప్పుకొనిరి. ఐనచో చాళుక్యులు బ్రహ్మజులా ? చంద్ర వంశజులా ? అగ్నికులజులా ? నిజానికి చాళుక్యులు దక్షిణాపథమునకు స్థానికులై, అతి ప్రాచీనులైన 'చలికి' వంశమునకు చెందినవారు; 'చలికి' వంశస్థులు హిరణ్య రాష్ట్రాధిపతులైనట్లు నాగార్జునకొండ శాసనములు చాటుచున్నవి. చలికియే చాళుక్యగా మారి కాలక్రమమున పై గాధలన్నియు కల్పింపబడినవి.

(3) ఇదే విధముగ కాకతీయులేవర్ణజులు ? అను సమస్య. విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణ కావ్యములోని "అత్యర్కేందుకుల ప్రశస్తి మభిజర్యమ్ కాకతీయాన్వయమ్" అను శ్లోకపాదాన్ని ఆధారముగా చేసికొని కొందరు పండితులు "అత్యర్కేందుకులము" అనేది ఒకటి ఉన్నట్లు నిర్ణయించుచున్నారు. చందుకవి సృష్టించిన అగ్నికులము వంటిదే ఈ "అత్యర్కేందుకులము" సూర్య చంద్ర వంశములలో దేనికిగాని చెందని రాజులకొరకై వారి పోషణలో కావ్యముల నల్లిన వందిమాగధ కవుల శ్రమఫలితముగా ఇటువంటి గాధలుత్పన్నమై పురాణములలోగూడ ప్రవేశించినవి. ఇట్టి ప్రక్షిప్తముల వలననే చారిత్రక ఆధారములుగా పురాణముల విలువ నశించిపోయినది. పైన పేర్కొన్న అత్యర్కేందు కులానికి

చెందిన "క్రము"డను రాజు సంతానములోని చాళుక్య, కాకతి, రాయ అను వారలా యీ పేర్లుగల రాజవంశములకు మూలపురుషులైనారు. అని ఒక పురాణగాధ. ఈ గాథాస్రష్ట ఇందలి అసందర్భమును గ్రహించ లేదనుట స్పష్టము ! చాళుక్య, కాకతి అనునవి వంశనామములే; కాని 'రాయ' అనునది వంశనామముకాదు. రెడ్డి, రాజ, నాయక, పదములవలె గౌరవనామము; రాజశబ్దమునకు పర్యాయ పదము. విజయనగర సామ్రాజ్యాధీశులు రాయశబ్దాన్ని ధరించారు. వీరు సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశములవారు. వీరెవరును తాము 'రాయ' వంశస్థుల మని చెప్పుకొనలేదు. ఇది యిలా ఉండగా, పైగాధలనుబట్టి వీరందరును అత్యర్కేందు కులజులగుచున్నారు. కాని శ్రీకృష్ణదేవరాయలు చంద్ర వంశస్థుడని అల్లసాని పెద్దన పేర్కొన్నాడు. ఐనచో పౌరాణిక గాధ సత్యమా ? రాయలి సమకాలికుడైన ఆంధ్రకవితా పితామహుని సృష్టి సత్యమా ? మరొక విశేషము: అసలు శ్రీకృష్ణరాయలు ఆంధ్రుడుకాడు గదా ? కన్నడిగుడు ! కాబట్టి పై గాధలన్నియు క్రీ॥శ॥ 15, 16శతాబ్ద ములలోనో, తరువాతనో కల్పింపబడెనని తెలుచున్నది. ఇట్టి గాధలను గురించి సుప్రసిద్ధ చరిత్రకారుల అభిప్రాయమును పరిశీలింపుడు. "**The Rajputs no doubt ranked as Kshatriyas, but they had no glorious traditions behind them, and their recent origin obliged them to look upto Brahmins for the social prestige and status which was in the power of the Brahmins alone to give" (Dr. R. C. Majumdar)**. మాన్యము లనుభవించుచు విశ్వాస పాత్రులైన పూజారికవులు కల్పించిన గాధలవలన చారిత్రక సత్యములను కనుగొనుట ఎంతటి కష్టసాధ్యమో తెలియుచున్నది గదా!

మరియొక విషయము. వృత్తులనుబట్టియే వర్ణము లేర్పడినట్లు అందరు నంగీకరింతురు. చిరకాలమువరకును వృత్తులనుబట్టి వర్ణముల మార్పుకూడ జరుగుచుండెననుటకు నిదర్శనములున్నవి. "భారద్వాజ గోత్రానామ్ పల్లవా నామ్" అని చాటుకొన్న పల్లవులు కాలక్రమమున క్షత్రియులుగా పరిగణింప బడినారు. అందులకు వారు చిరకాలమనుసరించిన క్షాత్రధర్మమే కారణము. కర్ణాటరాజ్యము నేలిన కదంబవంశస్థాపకుడైన మయూరశర్మ బ్రాహ్మణవీరుడు.

ఆతని సంతతివారు రాజ్యపాలకులై పర్మలైనారు! ఈదేవిధమున చతుర్థాన్వయులై యుండియు క్షాత్రధర్మము ననుసరించి ప్రజారంజకులైన వారిని క్షత్రియులుగా పరిగణించుటలో వైపరీత్యము కల్పింపను; అది ధర్మవిరుద్ధముకాదు. విద్యానాథుడు కాకతీయులను "సూర్యచంద్ర వంశముల ప్రశస్తినిమించిన ప్రశస్తికల వంశమువారు" అని ప్రస్తుతించుటలోని అంతర్యముకూడ అదియే ! మరియు సమాజము విస్తరించినకొలది, నాలుగువర్ణములవారును తమతమ ఆదిమవృత్తులనే అంటిపెట్టుకొని యుండుటకు పరిస్థితు లనుకూలింపలేదు. ఉపవృత్తు లేర్పడి వర్ణములు శాఖోపశాఖలైనవి. పెక్కు బ్రాహ్మణకుటుంబములవారు రాజాస్థానములందు మంత్రి, సేనాపతి, దుర్గాధ్యక్షాది పదవులలో నియుక్తులైరి. ఆంధ్రదేశములో నియోగులని వ్యవహరింపబడుచున్న బ్రాహ్మణు లట్టివారే! తామనుసరించుచున్న ధర్మమును సూచించుటకుగాబోలు కొందరు నియోగులు కొమ్మరాజు, మాచిరాజు, అన్నంరాజు మొదలైన వంశనామములను ధరించిరి. అంతమాత్రమున వీరిని రాజులనిగాని, బ్రాహ్మణేతరులనిగాని నిర్ణయించుట పొరబాటు*. క్రీ॥ శ॥ 14, 15 శతాబ్దములనాటికి ఆంధ్రదేశమున వృత్తులు నశించిపోయినవి.

---

* ఇటీవల ప్రచురింపబడిన ఒక తెలుగు నవలలో ఒక నియోగితో జరిగిన సంభాషణ సారాంశము :

నియోగిని అడిగిన ప్రశ్న : మీరు బ్రాహ్మణులా ?

నియోగి ఇచ్చిన సమాధానము : కాను, నేను నియోగిని.

ఇట్టి రచనకు కారణము సమాజ పరిణామచరిత్రను గురించిన పూర్తి అజ్ఞానము. లేదా కరడుగట్టిన [illegible]ద్వేషమువలన సంభవించిన వక్రదృష్టి. వర్ణవిద్వేషములను రెచ్చగొట్టు నిట్టి విపరీతరచనలు సామాజికశాంతికిగాని, ప్రజాస్వామ్య సిద్ధాంత ఆచరణకుగాని జాతీయభావ సమైక్యతకుగాని గర్భశత్రువులు సంస్కారముగల ప్రతియొక్కరు నిట్టి రచనలను బహిష్కరింప వలసియున్నది. కాగా పై నవల పారితోషికమును పొందుటెగాక విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా కూడ నిర్ణయింపబడినది. ఇది చాల శోచనీయము.

బ్రాహ్మణులనైతము నీచస్మృతులకుబాల్పడి ఉపహాస్యము చేసినవారైరన్నట్లు, భట్టుమూర్తిదని ప్రచారములోనున్న ఈ క్రింది చాటువుద్వారా తెలియుచున్నది.

"గుత్తిన్ బుర్రెలుగుట్టి, చంద్రగిరిలో
గూడెత్తి, పెన్గొండలో
హత్తిన్ సత్రమునందువేడి, బలు
దుర్గాధీశ తాంబూలప్పన్
దెత్తుల్ మోసి, పదస్థుడైన ఘనుడున్ ...."

వర్ణములన్నిటికి ఇంచుమించు ఇట్టిగతియే ప్రాప్తించియుండెను.

కాకతీయ (క్రీ.శ. 13వ శతాబ్ది), కుతుబ్‌షాహీల (15వ శ.) యుగము లందువినా, ఆంధ్రదేశమునకు మరెప్పుడునూ రాజకీయసమైక్యత లభించలేదు. సాతవాహన పతనకాలమునుండియు (క్రీ.శ. 200 ప్రాంతము) ఆంధ్రదేశమును పెక్కురాజవంశముల వారుపరిపాలించిరి. వీరు అంతఃకలహములలో మునిగియుండెరని వేరుగచెప్పనక్కరలేదు. దీనికితోడు, కళింగమునుండి గాంగ, గజపతి వంశజులు మహారాష్ట్రమునుండి రాష్ట్రకూట, యాదవచక్రవర్తులు, కర్ణాటకము నుండి చాళుక్యులు, ద్రావిడ దేశమునుండి పల్లవ, చోళ, పాండ్య ప్రభువులు తరచు ఆంధ్రదేశముపై దండయాత్రలు సాగించిరి. తెలంగాణము, రాయలసీమ ప్రాంతములు చాలకాలము ఆంధ్రేతర రాజవంశముల పరిపాలనలో మగ్గుచుండెడివి. అంతఃకలహముల వలన, దండయాత్రలవలన రాజులకు పెద్దపెద్ద సైన్యములు అవసరమైనవి. తత్ఫలితముగ మధ్యయుగ ఐరోపారాజ్యములలో నేర్పడిన భూస్వామ్యవిధానము (**Feudalism**) అనగా భూస్వాములే సేనానాయకులై, రాజులకు తోడ్పడుచుండెడి సాంఘిక రాజకీయపద్ధతి ఆంధ్రదేశములోనేర్పడెనని చెప్పవచ్చును. నాటి సైన్యములు క్షత్రియ వర్ణమునకే పరిమితమై యుండగల అవకాశము క్షీణించినది. అధిక సంఖ్యాకులుగా చతుర్థకులజులు సైన్యములో చేర్చుకొనబడిరి. వీరు శాంతి సమయములలో వ్యవసాయముచేయుచు, అవసరమైనపుడు యుద్ధభూమికి నడచుచుండెడివారు. అనగా, మధ్యయుగమున ఆంధ్రదేశములో ఆయుధధారణ ఉపవృత్తిగానున్న పొలముకాపువర్ణ మేర్పడినది. ఆంధ్రబ్రాహ్మణులలో రాష్ట్రముల ననుసరించి "నాడీభేదము" లేర్పడినట్టులే, నీ కాపు క్షత్రియ - వర్ణములోగూడ ప్రాంతీయ విభేదము లేర్పడినవి. తెలంగాణములోని వారు తెలగలు, కమ్మనాటివారు కమ్మవారు, వెలనాటివారి వెలమలు —

ఐనారు. తెలగాలలో కొందరు బలిజలైనారు. అనగా బలిచక్రవర్తి సంతాన మని ఒక ఊహ. కాని వాణిజ్యవృత్తి ననుసరించిన తెలగలే (వణిజ) బలిజ లైనారనుట సమంజసముగా కన్పించుచున్నది. ఈ మూడు వర్ణములలో రెడ్లు చేరినారు. రెడ్లది ఒక ప్రత్యేకచరిత్ర. 'రెడ్డి' అనునది ఉద్యోగనామమనియు, దానికి 'రాష్ట్రకూట' పదము మూలమనియు చరిత్రకారులు నిర్ణయించుచున్నారు. రాష్ట్రకూటరాజులు మాన్యఖేటము రాజధానిగా దక్షిణాపథమున గొప్ప సామ్రాజ్య మును స్థాపించి పాలించిరి (క్రీ.శ. 8, 9 శ.). పశ్చిమ, దక్షిణ ఆంధ్రదేశభాగ ములను రాష్ట్రకూటులు జయించి తమ సామ్రాజ్యములో కలుపుకొనిరి. ఆయా ప్రాంతములలో రాష్ట్రకూటులు తమవారినే భూస్వాములుగను, పన్నులు వసూలు చేయు నుద్యోగులుగను నియమించియుండిరి. వీరే క్రమముగ రెడ్లు అని ప్రసిద్ధి చెందిరి. నేటికిని తెలంగాణము, రాయలసీమ ప్రాంతములలోనే అనగా ఒకప్పుడు రాష్ట్రకూటులచే నాక్రమింపబడిన ప్రాంతములలోనే రెడ్లు అధిక సంఖ్యాకులుగ నున్నారు. క్రమముగ నియోగి అను పదమువలెనే 'రెడ్డి'కూడా వర్ణనామముగ స్థిరపడిపోయినది. చిరకాలమువరకును ఈ నాల్గువర్ణములును ఒకే వరము నాపు-క్షత్రియ వర్ణము శాఖలుగా భావింపబడిరి.

క్రీ.శ. 11, 12, శతాబ్దముల నుండియు ఈ నాల్గువర్ణములు ఆంధ్రదేశ మున కన్పించుచున్నవి. ఆంధ్రరాజకీయములు అల్లకల్లోలముగనున్న యుగము కూడ నదియే. చాళుక్య, కోట, చాగి, తెలుగుచోడ, హైహయాది మాండలిక వంశములవారు నిరంతరము యుద్ధములలో మునిగితేలుచుండిరి. అట్టి పరిస్థితు లలో, తమ అధికారమును పటిష్ఠమొనర్చుకొనుటకై, మాండలిక ప్రభువులు స్థానికులై బలవంతులైయున్న తమ సేనాపతుల కుటుంబములతో వైవాహికాది సంబంధము లొనర్చుకొని, వారి విశ్వాస సహకారములను బడయుటకు ప్రయ త్నించిరి. ఇట్టి పరిణామములు కారణముగా, యుద్ధము వృత్తిగానున్న వర్ణము లన్నియు సమ్మిళితములైనవి; ప్రాచీన క్షత్రియవంశములు అంతర్ధానమైనవి. కాపు-క్షత్రియ వర్ణమున, ముఖ్యముగ కమ్మవారిలో సూర్యచంద్ర వంశముల వారుభయులు కన్పించుటకు కారణముకూడ నదియే !

ఆంధ్రుల దురదృష్టమో అన్నట్లు, క్రీ॥ శ॥ 11వ శతాబ్దినుండియు నీవర్ణములమధ్య రాజకీయాధికారమునకై స్పర్ధ ప్రారంభమైనది. పల్నాటి యుద్ధమే ఇందలి ప్రథమాంకము. తరువాత రెడ్డి, వెలమల స్పర్ధ ఫలితముగనే

క్రీ॥ శ॥ 15వ శ॥ నాటికి తెలంగాణామును బహమనీసుల్తాను లాక్రమించిరి. వీరితో సమకాలికులేయైనను కమ్మవారు విజయనగర యుగముననే పూర్తిగ విజృంభించిరి. పెమ్మసాని, రావెళ్ళ, సూర్యదేవర, సాయపనేని కుటుంబముల వారు విజయనగర రాజ్యచరిత్రలో శ్లాఘ్యమైన పాత్రను నిర్వహించిరి. ఈ యుగమున కమ్మవారి విజృంభణకొక ప్రత్యేక కారణము కూడ లేకపోలేదు. విజయనగరాధీశుల కొకవైపున వెలమలు, మరియొకవైపున రెడ్లు విరోధులైరి. అందుచే వారు కమ్మ, తెలగ వర్ణములను నాదరించి సేనాదిపతులుగా, అమర నాయకులుగా, దుర్గాధీశులుగా నియమించిరి. తరువాత కుతుబ్‌షాహీల కాలములో ఆంధ్రదేశములో చాలభాగమునకు కమ్మవారు పాలకులై (క్రీ॥ శ॥ 1580) 'చౌదరి' బిరుదము ధరింపసాగినారు. 'చౌదరి' అనగా పన్నువసూలు చేయు నధికారి. రెడ్లు, బ్రాహ్మణులు మొదలైనవారు కూడ చౌదరి పదవులలో నియుక్తులైనారుగాని ఈ గౌరవనామము కమ్మవారికే రూఢియైనది. కుంఫిణీయుగములో కూడ కమ్మవారు ముఖ్యముగా సర్కారు జిల్లాలలో జమీందారీలను బడసి పరిపాలన సాగించిరి. కాని, వీరు విజృంభించునాటికి దేశము అన్యాక్రాంతమగుట కారణముగ, రెడ్లవలె, కమ్మవారు, ఆంధ్రదేశ చరిత్రలో "కమ్మయుగమును" సృష్టింపలేకపోయిరి.

ఇట్టి కమ్మవారి చరిత్రను శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు రచింపబూనుట చాలముదావహము. శ్రీ చౌదరిగారు చిరకాలము నుండియు చరిత్ర, సారస్వత రంగములలో చేయుచున్న కృషి ఆంధ్రలోకమెరింగినదే ! సంస్కృతాంధ్ర భాషాసాహిత్యములను, నేటివరకు లభించిన శాసనములను పరిశీలించి కమ్మవారి చరిత్రను, ఇంతకు పూర్వమే శ్రీ చౌదరిగారు ప్రచురించియున్నారు. దానికి సంగ్రహరూపమే ప్రస్తుత గ్రంథము. ఐనప్పటికీ; పుట్టుపూర్వోత్తరములనుండి ఈనాటివరకు కమ్మవారి చరిత్రను అందింపగలుగుటయే ఈ గ్రంథములోని విశేషము.

ఆంధ్రదేశమున చరిత్ర రచనకు ఆదరణము చాల తక్కువగా నున్నది. ఇట్టి నిరుత్సాహకర వాతావరణములో, శ్రీ చౌదరిగారు పెక్కుమంది విస్మృతాంధ్ర నాయకుల నుద్ధరించి చరిత్ర కెక్కించిరి. ఇందు వీరొనర్చిన కృషి, చరిత్రకు చేసిన సేవ ప్రశంసనీయమైనది. కాని వీరి సిద్ధాంతములను, నిర్ణయము

లను చారిత్రకులందరు అంగీకరింపకపోవచ్చును. మన చరిత్రలో ఇంచుమించు వివాదగ్రస్తముగాని విషయమే లేదుగద ?

ఇది ఆంధ్రులలో ఒక కులమువారి చరిత్రయేగావచ్చును. ఐననూ, గడచిన వేయి సంవత్సరాలుగా ఆంధ్రదేశ రాజకీయ సాంస్కృతిక పరిణామ వికాసములతో సన్నిహిత సంబంధముగల కమ్మవారి చరిత్రయగుటచే, నీగ్రంధము చరిత్ర ప్రియులందరి ఆదరణను పొందగలదని నా నమ్మకము.

"కమ్మవారి చరిత్ర" ప్రస్తుతరూపములో వెలువడుటకు కారకులైన శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగారు అభినందనీయులు. శ్రీ తిమ్మరాజు చౌదరి గారు "జగమెరిగిన బ్రాహ్మణులు" చరిత్రలో, అందునూ ఆంధ్రుల చరిత్రలో వారికిగల శ్రద్ధ, అభిమానము సాటిలేనివి. తమ "శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి" పక్షమున శ్రీ తిమ్మరాజుగారిప్పటికే పెక్కు చారిత్రక గ్రంధములను వెలువరించి ఆంధ్రుల కృతజ్ఞతల నందుకొనియున్నారు. వారిపోషణలో, అచిర కాలముననే, సమగ్రమైన ఆంధ్రుల చరిత్ర తయారుకాగలదని నా ఆశ, విశ్వాసము. సెలవు.

త్రిపురసుందరి,
బ్రాడీపేట, గుంటూరు.
10—3—1962.

**భట్టిప్రోలు హనుమంతరావు.**

# 1. కమ్మవారి పుట్టు పూర్వోత్తరాలు

## కమ్మవారాంధ్రులు - ఆంధ్రుల ప్రారంభదశ.

కమ్మవారెక్కడనున్నను, శతాబ్దములనుండి మాతృభాష యాంధ్రముగా
గల్గియున్నారు. ఆంధ్రులకు తెలుగువారను మరియొక నామమున్నది. వీరి
కాదిలో నచ్చతెలుగుభాష వాడుకలోనుండి క్రమముగా నాంధ్రము వాడుకొన్నట్లు
చెప్పవచ్చును. ఆంధ్రుల ప్రశంస చాల పురాతనమైనది. క్రీస్తుపూర్వము చాల
దశాబ్దములనుండి యాంధ్రులున్నారు. వీరు చక్షునదీతీరమున (మధ్య ఆసియా)
నుండి క్రమముగా మనదేశమునకు వలస వచ్చిరట. ఐతరేయ బ్రాహ్మణము
నందు, మనుసంహిత, భారతము, మత్స్యపురాణము, మహాభాగవతము, కథా
సరిత్సాగరము, బుద్ధఘోషుని అర్థకథలందును, ఆంధ్రుల ప్రశంసయున్నది.
విశ్వామిత్రసంతతి కొందరు వీరిలోగలిసిరని బ్రాహ్మణములును, మ్లేచ్ఛ(ఆర్యేతర)
జాతులలోని వారని మనుసంహిత, మత్స్యపురాణాదులు చెప్పుచున్నను, మహా
భాగవతములో బలి యను రాజునకు జనించినవారిలో నాంధ్రుడొకడనియు,
నాతని సంతతియే యాంధ్రులని నుడువును. క్రమముగా వీరార్యులలోజేరిపోయిరి.
ఆర్యులు దక్షిణాపథమునకు వచ్చుసరికి నేటి యాంధ్రప్రాంతమున నాగులు,
యక్షులు, దానవులు, తెలుగులు మొదలగు వారుండిరి. పహ్లవులుగూడ నాంధ్రు
లతో వచ్చి స్థిరపడిరి. వీరందరాంధ్రులుగా మారిపోయి, తెలుగు లేక యాంధ్రము
మాతృభాషగా గలవారైరి. ఆంధ్రులు వసించు దేశమాంధ్రపథమైనది. నాగులు,
యక్షులరాజ్యములు క్రమముగా నాంధ్రులలోని శాతవాహనులను వారికి స్వాధీన
మయ్యెను. వీరంద రార్యమతమునజేరి, యందలి చతుర్వర్ణములతో గలసి
పోయిరి. ఆర్యులలోని కొందరు అన్ని వర్ణముల వారును నేటి యాంధ్రభూమికి
వలసవచ్చి యందలి శాఖలలో కలిసిపోయిరి. ఇట్లు కలిసినవారిలో ఆర్యబ్రాహ్మ
ణులు, ఇక్ష్వాకురాజులు, చంద్రవంశంజులు, హైహయరాజులు, దుర్జయవంశీకులు,
కుబేరసంతతి యక్షులు (వీరే తర్వాత వైశ్యులనబడిరి). యాదవరాజులు మొద
లగువారుండిరి. దక్షిణదేశములోని (నేటియాంధ్ర) చాలుక్య, చోళ మున్నగు
క్షత్రియవంశములుగూడ నందంతర్భూతమైనవి. కైవర్తులవంటి వారు సైతము
బ్రాహ్మణులుగా పరశురామునిచే జేయబడిరి. రాజులకు, వైశ్యులకు పూర్వము

వేదదీక్షనిచ్చి క్రమముగా బ్రాహ్మణులుగా మార్చుటయుండెను*1. ఇట్లు ఆంధ్రులుగూడ యార్యజాతిలో కలిసిపోయిరి (కణ్వశతపథ బ్రాహ్మణము).

ఋగ్వేదారంభకాలమునుండి ఆర్యజాతి మొదట గుంపులు గుంపులుగా నివసించుచున్నప్పుడు గోత్ర సూత్ర ప్రవర లేర్పడెను. గుంపులోని పెద్ద గోత్ర ఋషి. సూత్రఋషి యాతనిపైవాడు. ప్రవర ఋషులు గుంపులోని ప్రముఖులు. గోత్రఋషి సంతతి యేగుంపుగా నేర్పడినను, క్రమముగా సంఘలో (శిష్య వర్గము) నితరులుగూడ కలియుచుండిరి. సూర్యవంశ క్షత్రియులకు వేదకాలపు 12 ఋషిగోత్రములు, చంద్రవంశీయులకు 25 ఋషిగోత్రములు నుండెను. ఇట్లే తక్కినవారికుండెను. సూత్రఋషులలో అపస్తంభుడు, అశ్వలాయనుడు, బౌద్ధాయనుడు మున్నగువారున్నందున వారికాలమునందే యవియేర్పడినట్లుకనబడును. వీరు క్రీస్తుపూర్వము కొన్ని శతాబ్దముల నాటివారని పండితుల యభిప్రాయము. రాజులకు, వైశ్యులకు పురోహితగోత్రప్రవరలనే జెప్పవలసినదని అపస్తంభ ప్రవర కాండలోను సంకరులగువారికిగూడ నట్లే చెప్పవలెనని లగ్నిపురాణము లోను బ్రాహ్మణుడొకవేళ రాజైనను అతనికిగూడ పురోహితప్రవరలే చెప్పవలెనని అపస్తంభ సూత్రములందును, గోత్రములు తెలియనివారందరును కాశ్యపగోత్రము ధరింపవలెనని శూద్రకమలాకరాది స్మృతులలోను చెప్పబడినది. ఆర్యులు మొదట మూడువర్ణము లేర్పరచుకొనిరి. కాని వారిలోగలిసిన యనేకులకొరకు చతుర్థ వర్ణమేర్పరచిరి.

ఈ నాల్గువర్ణములలో నంతర్వివాహములు మెండై, యనేకశాఖలేర్పడెను. ఒక్కొక్కవర్ణమునందు అనేకశాఖలు కల్గెను. వృత్తి ప్రధానముగ ననేక నామములు వీరి కేర్పడెను. క్షత్రియు లనేక శాఖీయులైనను వారిలోవారు సంబంధములు చేయుచుండిరి. అట్లే తక్కినజాతులవారును చేయుచుండిరి. దేశభేదము చేత నీ శాఖలు పలువిధములైనను భాషచేతను, స్థానముచేతను అంధ్రపథము లోని వారంద రాంధ్రులుగనే పేరొందుట గమనార్హము.

ఇక్ష్వాకురాజు లాంధ్రదేశమున స్థిరపడినకాలమునకే వారిలోను వారి బంధుగులలోను యిక్ష్వాకు, పూకియ, కులక, ధనిక, హిరణ్యక, సగర మున్నగు

*1 విశ్వామిత్ర, వేదవ్యాస, శుకాదు లిట్టివారే.

నంతశ్శాఖ లేర్పడి వారిలోవారు సంబంధములగుచుండిరి. చంద్రవంశీయులైన చలికి శాఖతో వీరు బంధుత్వములను గల్గియుండిరి. క్షుద్రకులను వీరజాతిని యార్యులు జయించి శూద్రులుగా మార్చిరని యొక యభిప్రాయమున్నది. అలెగ్జాండరు కాలమువరకు వీరున్నారు. ఇట్లేర్పడిన యాంధ్రులు క్రీస్తు పూర్వము దాదాపు 5వ శతాబ్దినుండి బౌద్ధ, జైన మతములలో విస్తారముగా కలిసిపోయిరి. వీరిలో కులభేదములులేవు. ఆంధ్రదేశమున నెన్నో బౌద్ధస్తూప చైత్య, విహారములేర్పడి, జాలి సమత్వము, అహింస, ప్రేమ, సచ్ఛీలము మొదలగు విషయములందు బోధింపబడుచుండెను. ఈ మతములు 10వ శతాబ్దమువరకు ప్రాబల్యము వహించెనుగాని తర్వాత తగ్గిపోయి, హిందూమతముననే లీన మయ్యెను. బౌద్ధ, జైన మతములలో నుండినవారి గోత్ర సూత్ర ప్రవర లదృశ్య మయ్యెను. 12వ శతాబ్దినుండి మరల హిందూ, జైన, వైష్ణవ మతములు విజృం భించి, యందు మతాంతరులను కల్పుకొనజొచ్చిరి. గ్రామనామములే ఆకాలము నుండి చాల శాఖలవారికి గోత్రములుగా నేర్పడెను. ద్విజులుమాత్రము ఋషి గోత్రములు ధరించిరి. వైశ్యులు చాలమందికి "కులశబ్దాంత" గోత్రములున్నవి. ఇవి వారిలోగల నానాకుల శాఖీయులను తెల్పుచున్నవి. మన దేశములో ముఖ్య ముగా అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు మున్నగు ప్రాంతములందు వెలువడిన బౌద్ధస్తూపములు క్రీ॥ పూ॥ 3వ శతాబ్దినుండి వర్ధిల్లుచు, ననేక శిల్ప ములకు, విద్యాభివృద్ధికి, విజ్ఞానమునకు, మతోద్ధరణకు నిలయములైయుండి ప్రపంచఖ్యాతి నార్జించుకొన్నవి. ఇట్టి మతానుయాయులై కమ్మవారి పూర్వీకు లుండిరనుట కనేక నిదర్శనములు గలవు. ఆంధ్రపథమును క్రీ॥ పూ॥ 3వ శతా బ్దమునుండి క్రీస్తు తర్వాత 3వ శతాబ్దివరకు శాతవాహనాంధ్రులు 30 మంది వరుసగా పాలించుచు (శ్రీముఖుని మొదలు మూడవ పులకేశి వరకు), మిక్కిలి ప్రసిద్ధులైన యజ్ఞయాగాది క్రతువుల గావించుచువచ్చిరి. వారికాలములో దాదాపు 500 సం॥లు హిందూ, బౌద్ధమతములను సమానముగా నాదరించిరి. ఆంధ్రదేశ ములోని ప్రజలు హెచ్చుగా బౌద్ధులుగానుండిరి. ఆకాలములో కమ్మవారి పూర్వీకులట్లే యుండిరనవచ్చును. చాల విదేశములనుండిగూడ బౌద్ధ విశ్వవిద్యా లయములగు అమరావతి, నాగార్జునకొండలవద్ద నేర్చుకొనుట కనేకవిద్యార్థులు వచ్చుచుండెడివారనిన, నాటి బౌద్ధమత ప్రాబల్యమును మన మూహింపవచ్చును. ఇప్పటి త్రవ్వకాలలో దొరుకుచుండిన శిలాఫలకములు, శాసనాలు, కట్టడములు,

నానావిధ చిత్ర శిల్పములు యీ విషయములను రుజువుపరచుచున్నవి. నాటి యాంధ్రదేశపు నాగరికతను ఇవి స్పష్టముచేయుచున్నవి.

ఆంధ్రదేశములో (ముఖ్యముగా కళింగలో) కొన్నిచోట్ల అన్నివర్ణముల వారిలోను ఋషిగోత్రముల వాడుక శాసనములందు కనబడుచున్నది. అందుచే గోత్రములనుబట్టి కులవిచారణ చేయుట భావ్యముగా గనబడదు.

---

## కమ్మశబ్దము - కమ్మవారి యుత్పత్తి

కమ్మశబ్దము ఆంధ్రపథములోని "కమ్మకరాటమ"ను పేరు మొదటగా 3వ శతాబ్దిని మనదేశమున పాలించిన ఇక్ష్వాకువంశ వీరపురుషదత్తుని జగ్గయ్యపేట (బేతవోలు) ప్రాకృతశాసనమున కనబడుచున్నది.*1. సంస్కృతమున నిది కర్మరాష్ట్రమని వాడుచువచ్చిరి. పల్లవరాజులలోని కుమారవిష్ణు చందలూరు తామ్రశాసనమందును*2, విజయస్కందవర్మ ఒంగోలు తామ్రశాసనము నందును*3, విష్ణుగోపుని చూరశాసనమునందును* 4, కర్మరాష్ట్రప్రశంసగలదు. విష్ణుకుండరాజులలో మాధవవర్మ III పొలంబూరు శాసనములో* 5, కమ్మరాష్ట్రము పేరున్నది. ఇదిగాక 7వ శతాబ్దములోని రెండవ పులకేశి కొప్పరపు తామ్రశాసనములోను* 6, 8వ శతాబ్దిలో నుండిన రెండవ జయసింహుని పెణుకపర్రు శాసనమునందును*7, కర్మరాష్ట్రప్రశంస యున్నది. ఇట్లు కమ్మరాష్ట్రము, కర్మరాష్ట్రముగా పేరొందిన దేశము కృష్ణానదికి దక్షిణభాగమై యుండెను. కొద్దిగా నుత్తరమున గలదు. ఇది రెండు నాడులుగా విభజింపబడెను. కమ్మనాడు, వెలనాడు అనుపేర్లతో నీ విభాగముల మహమ్మదీయ పాలన 14వ శతాబ్దము వచ్చువరకు అనులునందుండెను. ఈపేర్లు అనేక శాసన

---

***1 Burgess - Bud Stupas of Amar and Jag P. 110. *2. Ep. Ind VIII P. P. 233-36. Ep. Ind. XV P P 249-252. *4. Ep Ind. XXIV P. P 137-43 *5. C P. No. 7 of M E. R 1914. *6. Ep. Ind. XVIII P. 250. *7. Bharati Srimukha and Ibid.**

ములందు వ్రాయబడినవి. [S I. I. వాల్యూములు IV and VI చూడుడు].
క్రీస్తుపూర్వము నాల్గుశతాబ్దములనుండి బౌద్ధ మతగురువులలో మహానవ కమ్మలు, నవకమ్మలను తెగలున్నట్లు అమరావతి శాసనములవల్ల తెలియుయున్నది. ఈతెగలే యొకవేళ కమ్మలుగా ప్రసిద్ధిచెందిరేమో శోధించుట కాధారములు లేవు. కమ్మశబ్దము దేశసంబంధమునుబట్టియే క్రమముగా కులములకు వ్యాపించియుండును. ఇది 10యవ శతాబ్దినుండి యమలునకువచ్చిన దృష్టాంతములు లభించుచున్నవి. పదియవ శతాబ్దినాటి రెండవ అమ్మరాజ విజయాదిత్యుని కురవాడ శాసనములోను* 1, క్రీ॥ శ॥ 1011 సం॥ నాటి పశ్చిమచాళుక్య అయిదవ విక్రమాదిత్యుని ఆలూరి శాసనములోను*2, కమ్మకులజులైన విప్రుల గురించి చెప్పబడినది. ఇందు కమ్మకులజులని చెప్పబడినను, వారు కమ్మరాష్ట్ర బ్రాహ్మణులను భావముననే అట్లు వ్రాయబడిరని కొందరు చరిత్రజ్ఞులు తలంచుచున్నారు. క్రీ॥ శ॥ 673లోని సర్వలోకాశ్రయవిష్ణువర్ధనుని పందలూరు శాసనములో*3, బోయబ్రాహ్మణుల ప్రశంస గలదు. కమ్మకులోద్భవులనబడిన మూసురులనుగురించి అమరావతి శాసనములో జెప్పబడియున్నది*4. అట్లే పల్లవ బ్రాహ్మణులను గురించి ఆరుంబాక శాసనమునను*5, కుప్పనయ్య శాసనములోను ఉన్నది*6. అందుచే పైననుడివిన కమ్మకులజులైన విప్రులు కమ్మవారినుండి ఏర్పడిరని తలంచుటకు అవకాశమున్నది. క్షత్రియ వైశ్యులు క్రమముగా బ్రాహ్మణులు కావచ్చునని ధర్మశాస్త్రములందున్నది*7. క్రీ॥ శ॥ 1068 సం॥ నాటి ద్రాక్షారామశాసన మొకదానిలో కమ్మకోమటి పాపయ్య యనునతడును*8, క్రీ॥ శ॥ 1150 సం॥నాటి ద్రాక్షారామశాసన మొకదానిలో కమ్మకోటి కొమ్మిసెట్టి యనువాడును*9, క్రీ॥ శ॥ 1201 సం॥నాటి సరసీపురి (ఏలూరు) శాసన మొకదానిలో కమ్మకోమటి అయితమశెట్టి యనువాడును*10, కనబడుచున్నారు. వీరు కమ్మవారిలో జేరిపోయిన కోమట్లుగాని, లేక కమ్మరాష్ట్రపుకోమట్లు గాని అయియుందురు. కోమట్లు 200 మంది కమ్మవారిలో విష్ణువర్ధనరాజు III తో విరోధము

---

*1. Sarada vol. II and E. P. Ind. XVIII *2. E.P. Ind XVIII P. 27. *3 E. P. Ind. VIII P. 236 *4. S. I. I Vol. IV - P. 235. *5. ఆంధ్ర సం. సంచిక 12. *6. Ep. Ind. IX P. 131.

*7. శాఙ్ఖ్యశతపథబ్రాహ్మణము 34—2—1—27 and అపస్తంభ సూత్రములు. *8. 9. 10. S. I. I. Vol. IV.

వచ్చినపుడు జెరిపోయినట్టు కన్యకాపురాణమున నున్నది. బ్రాహ్మణులలో బొజ్జ్వారి కమ్మలు, ఆరువేల కమ్మలు, కరణ కమ్మలు అను శాఖలవారున్నారు. లింగాయతులలో కమ్మకులజులైనవారు, బ్రాహ్మణులుగను, రాజశబ్దమునకు రస శబ్దము వాడుకొనువారును కొన్ని శాసనములందు గానసగుచున్నారు. 19 వ శతాబ్దిని వ్రాయబడిన ధర్మనందన విలాసమను గ్రంథములో కమ్మవారు చతుర్వర్ణములందున్నారని చెప్పబడినది. ఇది కాళ్ళకూరి గౌరీకాంత విరచితము. బ్రాహ్మణ, వైశ్యవర్ణములను వదలి యితరుల కీ కమ్మశబ్దము వచ్చినదెప్పుడని పరిశీలించినచో, పద్మనాయక చరిత్ర ప్రమాణమునుబట్టి కమ్మనాడు లేక రాష్ట్రపు కాపులకు ఓరుగల్లు పాలకుడగు ప్రథమ ప్రతాపరుద్రుని కాలమునుండి అనగా 12 వ శతాబ్దినుండి వచ్చినట్లు కనబడుచున్నది. అందులో కాపులెల్ల వెలమ, కమ్మలైరని వ్రాయబడినది. ఈ కాలమువరకు జైన, బౌద్ధమతములలో నుండిన కమ్మరాష్ట్రమువారు కొందరు (కాపు వృత్తిలోనివారు) ఆలని యోజానుసారము కమ్మ, వెలమ నామములు ధరించిరనవచ్చును.

కమ్మనాటి నాయకులు, కమ్మనాయకులని మొదట కొందరు పిలువబడి, కమ్మదొరలని గూడ చెప్పబడిరి. క్రమముగా కమ్మవారుగా ప్రసిద్ధపడిన వారు కమ్మరాష్ట్రములోని పాలకవర్గము, కాపువర్గమువారనవచ్చును. ఏలన, వెలుగోటివారి వంశావళిలో కమ్మనాయకుల విషయము ప్రస్తావింపబడినది. వారు యుద్ధాదులందు చాళుక్యాది రాజులకు సాయపడుచు 14వ శతాబ్దిలో నున్నట్టు వ్రాయబడినది. ఒక వెలమవీరుని బిరుదావళిలో "కమ్మదొరల మోహన కాలదండ" మనునది కలదు—

అందుచే కమ్మరాష్ట్రపు సేనానాయకులు కొందరు కమ్మవారిలో నున్నట్లు తెలియుచున్నది. కాపులు కమ్మవారైరని పైన నుడివితిమి— దీనినిబట్టి కమ్మ రాష్ట్రపు నాయకులు, రాజులు, కాపులు కమ్మవారుగా క్రమముగా 12వశతాబ్దము నుండి పేరొందినట్లు స్పష్టము—

ఇక నీ కమ్మశబ్దము యిప్పటి కమ్మవారి కెట్లువచ్చినదను విషయమై యనేక గాథలు గ్రంథములలో ప్రచారములందున్నవి. వానిని గూడ యిచట వ్రాయుచున్నాను.

(1) దౌర్వాసదేవీ పురాణములో కమ్మమహారాజు సంతతి కమ్మవారైరని, అతడు చంద్రవంశీకుడని వ్రాయబడినది. ప్రతాపరుద్రుడు కమ్మవారి పూర్వీకుడని యిందున్నది.

(2) ప్రతాపరుద్రరాజు కమ్మ శత్రురాజులు హరింపగా దానిని దెచ్చిన వారు కమ్మవారైరని, తేజాలనివారు వెలమవారైరని యీ గాథ 1891 సం॥ జనగణిత రిపోర్టులో నున్నది.

(3) వీర నరసింహరాయల కాలములో స్త్రీలకు ఘోషా లక్కరలేదన్న వారు కమ్మలో చేర్వాలుచేయగా కమ్మవారైరని, ఘోషాకావలెనన్నవారు వెలమవారైరని— ఇది చిత్తూరుజిల్లా మ్యాన్యూలులో గలదు.

(4) కృష్ణదేవరాయల కమ్మను పరరాష్ట్ర రాజులకిచ్చి వచ్చువారిని కమ్మవారని చెప్పిరనుట— ఇది ప్రౌఢ ప్రబంధమున నున్నది. ఇంతకు చాల కాలమునకుపూర్వమే కమ్మవారుండిరిగాన ఇది అసంగతము—3వ విషయమంతే.

(5) కమ్మవారు చంద్రవంశపులోని యయాతి సంతతిలో సంపుదను వాని వంశీకులని, కులగురువు బలభద్రభాస్కరయ్య యని ద్రావిడ కమ్మపురాణమున నున్నది.

(6) దిలీపరాజు సూర్యవంశీకుడని, అతని సంతతివారు చంద్రవంశీకులతో సంబంధములు చేసినారని, వీరికి మూలపురుషుడు ధర్మపాలుడని, గురువు ధర్మశీలుడని, ఈతడు పినాకినీ నది దాటివెళ్ళెనని వీరు పరశురామ, రేణుకాదేవి, జమదగ్నులను పూజింతురని, రేణుక చెవికమ్మనిచ్చి, నది దాటించెనని, అందుచే కమ్మవారనబడిరని ఈ గాధ బ్రాహ్మణ పురాణాంతర్గతమైన యొక సంస్కృత గ్రంథములోనిదని బలిజపురాణమున చెప్పబడినది.

(7) కామాదికరుషి తపోభంగము గాకుండ లక్ష్మీదేవియిచ్చిన చెవికమ్మ నుండి 500 మంది పుట్టి కమ్మవారనబడిరని— ఇది చిత్తూరుజిల్లా మ్యాన్యూలులో వ్రాయబడినది. పైగాధ (**Legends**) లన్నియు నూహలలో చెప్పబడినవైనను, కమ్మవారు క్షత్రియులనుండి ఏర్పడినారనుటకు కొన్ని గుర్తులు యిందున్న వని వచ్చును.

కమ్మ శబ్దము నేటి కమ్మవారి పూర్వీకులకు విరివిగా వ్యాపకమునకు వచ్చినది, 12, 14 శతాబ్దములనుండియే. ఆ వివరములు ముందు వ్రాయబడును. శాసన ప్రమాణములరీత్యా కమ్మవారు కొందరు కాకతీయ ప్రతాపరుద్రాదులవలె దుర్జయాన్వయులని దృఢపడుచున్నందున దౌర్వాసదేవీపురాణకథ నిజమగుచున్నది.

---

## కమ్మవారి పూర్వీకులు

కమ్మరాష్ట్రములోని ముఖ్యముగా కమ్మనాడులోని రాజులు, సేనానాయకులు, రాజ, నాయకశబ్దములు దరించి 12 మొదలు 14 శతాబ్ది వరకు అనేక శాసనములు వ్రాయించియున్నారు. కమ్మవారి గృహనామములు దాదాపు 1200 గలవు. ఇవియన్నియు 12వ శతాబ్దమునుండి యున్నవి. కమ్మవారి గృహనామములు, గోత్రములపట్టిక యొకటి వెలమవారితోపాటు క్రీ॥శ॥1098లో బడబాగ్నిభట్టు అను నతడు తయారుచేసినట్టు, వారి పూర్వీకు లేగ్రామనివాసులో ఆ గోత్రము వాడబడినట్లును, పద్మనాయక చరిత్రలోనున్నది. తర్వాతకాలపు శాసనములలో అవియే వాడబడినవి. ఈ యింటిపేర్లు, గోత్రములు గల శాసనములు పెక్కింటిని పరిశోధించినమీదట కమ్మవారు ఓరుగంటి పాలకులగు ప్రతాపరుద్రాదులవలెనే తాము దుర్జయవంశీకులమని చెప్పుకొన్నట్లు దృష్టాంతములు లభించినవి. కమ్మవారు ప్రతాపరుద్ర వంశీకులని దౌర్వాసదేవీపురాణము చెప్పుట గమనించవలెను. ఇక కమ్మనాటిలో సప్పటికుండిన తెలుగుచోళరాజులు కూడ క్రమముగా కమ్మవారిలో కలసిపోయిరి. దీనికి కమ్మవారిలో గల చోడ గృహనామస్థులే నిదర్శనము. ఈ చోడరాజులు తాము కరికాల వంశజులమని చెప్పుకొనిరి. కొన్ని దృష్టాంతములను దిగువ నిచ్చుచున్నాను.

(1) ఆలూరి పోతినాయుడు— శ్రీకాకుళములో ఒక శాసనము వ్రాసెను. దీనిలో తాను చతుర్థవంశీకుడనని, దుర్జయవంశస్థుడనని వ్రాసెను. ఇతనికి కాకతీయరాజులకున్న పలుమ్రొత్తిగండ బిరుదమున్నది. ఇతడు కులోత్తుంగ చోడ

చక్రవర్తికి సామంతుడు. ఈతని శాసనములో తేదీలేనందున ఎన్నవకులోత్తుం గుడో తెలియదు. కాని యితడు కమ్మరాష్ట్రములోని నాయుడని, కమ్మవారిలోని వాడని గుర్తింపబడినది—*1.

(2) విప్పర్ల అమరినాయకుడు— క్రీ॥శ॥ 1236 బెజవాడ శాసనం*2. దీనిలో తాను దుర్జయకుల విభూషణుడని వ్రాయించెను. ఇతడు వెలంకోట మత్తాన్వయుడనని వ్రాసుకొనెను. ఇతడొకవేళ వెలమవారిలోనివాడైనను వెలమ, కమ్మ వంశములు రెండును కాపు వర్ణమునుండి యేర్పడినట్లు పద్మనాయక చరిత్రలో నున్నందున కమ్మవారు దుర్జయాన్వయులలోని వారనుట కిదిగూడ ప్రమాణముగనే యున్నది. వెలమవారు దుర్జయాన్వయులేనని కాకతిబేతరాజు II కాలములోని విరియాలవారి శాసనమొకటి వచించుచున్నది.*3.

(3) రుద్రమదేవి చక్రవర్తిని కంగరక్షకులైన ప్రోలరౌతు కుమాళ్ళు. 1. ఎక్కినాయుడు, 2. రుద్రనాయుడు, 3. పినరుద్రనాయుడు, 4. పోతి నాయుడు మొదలగువారు వలవుట్ల గోత్రకులమని, దుర్జయాన్వయులమని రావూరులో ఒక శాసనమున వ్రాయించి యున్నారు *4.

కమ్మవారిలో చాలమంది వలవుట్ల రూపాంతరమగు వల్లుట్ల గోత్రములు ధరించియున్నారు. నాయుడు బిరుదాంకితులు, దుర్జయాన్వయులు, కమ్మనాటి వారు నగు వీరు దుర్జయవంశీకులని, అందుచే కమ్మవారట్టివారేనని తెలుచున్నది.

(4) కమ్మనాటిలోని మాదలగ్రామమందలి సాగరేశ్వరాలయశాసనములో పిన్నమనాయుడు, దుర్జయవంశీకుడని, వలరట్లకులజుడనని వ్రాయించెను *5. ఇది క్రీ॥శ॥ 1125 నాటిది. ఇచటనే క్రీ॥ శ॥ 1282లో దేవినాయని యెఱ్ఱ నాయుడు, కొమ్మినాయుడు, పోతినాయుడను వారలు బుద్ధవర్మసంతతివారమని వ్రాసియున్నారు *6. మల్లర్మ, బుద్ధవర్మాదులు త్రిలోచనపల్లవుని కాలములో

---

*1. S.I.I. Vol. పుట 317 *2 S I I Vol. పుట 243 *3 తెలంగాణా శాసనములు and A corpus of Telangana inscriptions by Hyderabad State *4 A R No 333 of 15 and A.R. of 1916 p. 135.

*5. A. R. No. 346 of 38. *6. A. R. No. 348 of 38

కమ్మరాష్ట్రమున బాలించిన దుర్జయాన్వయులగుటచే వారలలోని బుద్ధవర్మను వీరు మూలకుడుగా చెప్పుకొన్నారు. వలరట్లకులజులుగూడ బుద్ధవర్మ వంశీకు లేనని మరియొక శాసనమున నున్నది *1. ఈ వలరట్ల వంశీకులలో పరుచూరి కేతినాయుడను నతడు క్రీ॥ శ॥ 1163 ప్రాంతముననుండి, శాసనములు వ్రాసెను. *2. కమ్మనాటిలోని పరుచూరి గృహనామము ధరించిన యితడు యిపుడు కమ్మవారిలోనున్న పరుచూరివారి పూర్వీకులలో నొకడనవచ్చును. దేనినేనివారు గూడ కమ్మవారిలో వున్నారు.

(5) మల్యాలగుండ దండనాధుడు తాను దుర్జయవంశీకుడనని చెప్పుకొన్నాడు *3. ఇతడు 12వ శతాబ్దివాడు. కమ్మవారిలోని మల్లెలవారీ వంశీకులేనని తలపబడుచున్నది. పై యంశములవల్ల కమ్మవారిలో చాలమంది దుర్జయాన్వయులని తెలుచున్నది. రావెళ్ళవారు చంద్రవంశీకులనియు, చలమర్తి గండబిరుదాంకితులనియు సౌగంధిక ప్రసవాపహరణమున నున్నది. వీరు కమ్మవారు. ఈ బిరుదము కాకతీయరాజులు హెచ్చుగా వాడుకొనియున్నారు. వారు దుర్జయాన్వయులు.

(6) క్రీ॥ శ॥ 1121 సం॥నాటి ఎరువతొండయరాజొక మహామండలేశ్వరుడు. కరికాలాన్వయుడు. సూర్యవంశీకుడు. ఈతని శాసనమొకటి ద్రాక్షారామ భీమేశ్వరాలయమున నున్నది *4. దీనిలో నాతడట్లే చెప్పుకొనెను. ఎరువభక్తిరాజు, అనవేమరాజు, భీమరాజు, మల్లదేవచోడుడు మొదలగువారీ వంశీకులే. వారి శాసనములు చాల గలవు *5. అందు సూర్యవంశీకులమని, కరికాలాన్వయులమనిచెప్పుకొనిరి. వీరు రెడ్డిరాజులతో బంధుత్వము లొనరించిరి. భీమరాజు అనవేమారెడ్డి (కొండవీటిరాజు) కుమార్తెను పెండ్లాడెను *6. ఈ ఏరువవారిప్పుడు కమ్మవారిలోను, రెడ్లలోను వున్నారు. అందుచే కమ్మవారిలో కొందరు కరికాలాన్వయులని ధృవపడుచున్నది. ఇతర చోడరాజుల గురించి మున్ముందు చెప్పబడును.

---

1*. J A.H.C. Vol No I No 2 *2. Ibid. *3 తెలంగాణా శాసనములు

*4. **S. I. I. Vol. IV Page** 420.

*5. **Ibid.** ,, 474.

*6. **Ibid** కోరుమిల్లిశాసనం ,, 1348.

(7) క్రీ॥ శ॥ 1152 ప్రాంతీయుడు హైహయవంశీకుడగు కోనముమ్మిడి భీమరాజు కొడుకులలో మల్లిన సోమినాయుడు, లోకరాజు మొదలగువారుండిరి. వీరి శాసనములు 1152 **and** 1172 నాటివి. వీరు రాజు, నాయడు బిరుదములు ధరించిరి. మల్లినవారు కమ్మవారిలో నున్నారు. సేనానాయక పదవిలోనివారే అప్పుడు నాయడు బిరుదము ధరించుచుండిరి (A.R.1933&Anr.)గోన గన్నారెడ్డి హైహయవంశీకుడని రంగనాథరామాయణము జూపుచున్నది. అందుచే రెడ్లలోగూడ హైహయులున్నట్లు స్పష్టము.

(8) 1255 లో బెజవాడ కండివాడి మన్యపురవరాధీశ్వరుడగు కాలవనీయని ఇనుమెళ్ళశాసనములో నతడు మన్మకులస్థుడనని వ్రాసుకొనెను. ఈతడు కమ్మరాష్ట్రపు నాయకుడు, మన్మకులమనగా మనువుకులము. అందుచే నీతడు సూర్యవంశోద్భవుడై యున్నాడు. బెజవాడ వారిప్పటికి కమ్మవారిలోను, రెడ్లలోను కనబడుచున్నారు. ఇట్లే వెలిచర్ల పురాధీశ్వరుడగు మల్లినాయకులు 1159 లో మన్మకులస్థుడనని చెప్పుకున్నాడు. ఈ వెలిచర్ల గోత్రజులు కమ్మవారిలో గలరు. కొండవీటి రెడ్డిరాజుల గోత్రముకూడ నిదియే. కమ్మనాటిలోని తెలుగు చోడరాజులు, కరికాలాన్వయులైయుండి, తూర్పుచాళుక్య రాజులతో బంధుత్వములు హెచ్చుగా కల్గియుండిరి. అందుచే చాళుక్యులు కొందరును, కమ్మనాటి తెలుగుచోడులును కమ్మవారిలో జేరిపోయినట్లు స్పష్టపడుచున్నది. కమ్మవారిలోని ఎలమంచి, గొల్లపూడి, యలంపాటి లేక వెల్మపాటి, సమ్మెట, మచ్చ, కొండ, చోడ, వాసిరాజు లేక వాసిరెడ్డి, కట్ట, అడపా, నిడదవోలు వంశీకులు యీ చోడ, చాళుక్య శాఖలకు చెందినవారైనట్లు, చోడ చాళుక్య శాసనములలో గల యీ గృహనామములవల్లను, వెలుగోటివారి వంశావళివల్లను, స్పష్టపడుచున్నది. కమ్మవారిలోని వాసిరెడ్డివారికి "చాళుక్యనారాయణ" బిరుదమున్నట్లు అహల్యాసంక్రందనవిలాసములో జెప్పబడుటవల్ల నీవిషయము దృఢమగుచున్నది. చోడవారింకనూ కమ్మవారిలో నున్నారు. ఈ చోళ, చాళుక్యులు నివసించిన యనేక చోట్లనుబట్టి క్రమముగా ననేక గృహనామము లేర్పడెను. గ్రంథవిస్తరభీతి వాని నిచట వ్రాయమానితిని. కరికాలాన్వయులు ప్రాచీన కాలమునుండియు సూర్యవంశీకులననియే చెప్పుకొనుచున్నారు. సంగంవాఙ్మయములో కరికాలుని గురించి యట్లేయున్నది. 7వ శతాబ్దపు పుణ్యకుమారచోళుని

మాలెపాటి తామ్రశాసనములో గూడ నట్లెయున్నది*1. తూర్పుచాళుక్యరాజులు చంద్రవంశీకు లగుటవల్ల తెలుగుచోడులతో బంధుత్వములుసల్పిన తర్వాత సూర్యచంద్ర వంశములు కలసిపోయినవనియు, వానిలో కొందరు కమ్మవారిలో నున్నట్లు చెప్పవచ్చును. వీరి బంధుగులగు హైహయాన్వయులుగూడ చంద్ర వంశీకులగుటచే వారిలో కొందరుకూడ కమ్మవారిలో జేరిరనుట స్పష్టమే. పైననుడివిన దుర్జయుడుగూడ హైహయవంశీకుడనియే పురాణములందును, సూర్య లేక చంద్రవంశీకుడని కొన్నిశాసనములందునుకలడు. కృష్ణకుదక్షిణమున పాలించిన సామంతరాజులు కొందరాతని వంశీకులు. కొండపడమటి రాజులు మొదలగు వారు చతుర్థాన్వయులమని చెప్పకొన్నారు. కాని ఆకాలములోనే కృష్ణకు ఉత్తరమున బాలించిన సాగివారు మొదలైనవారు దుర్జయుడు సూర్య వంశీకుడనియే చెప్పినారు*2. కాకతీయరాజులాతడు సూర్యచంద్రరాజులలో వాడనియే వ్రాసుకొనిరి*3. దీనికి కారణమేమన, త్రిపురప్రాంతమునుండి బుద్ధవర్మాదులు పశ్చిమ చాళుక్య మంగలేశునిచే పారదోలబడినపుడు దుర్జయ వంశీకులు కొందరు (6వ శతాబ్ద) త్రిపురప్రాంతములనుండి తమ పరివారముతో వచ్చి ఆంధ్రరాజ్య భాగములు ముఖ్యముగా కమ్మరాష్ట్ర భాగములను ఆక్ర మించిరి. కొందరంతకుపూర్వము త్రిలోచనపల్లవుని కాలములో వచ్చి కమ్మ నాటిలో స్థిరపడిరి. వీరు జైన, బౌద్ధ మతములలో నుండినవారు. వీరు తర్వాత చతుర్థులుగా బరిగణింపబడిరి. కాని వీరు కృష్ణకు పుత్తరమునగల తమ వంశీకు లగు సాగివారితోను, కాకతీయులతోను వివాహములు సల్పుచుండిరి. ఐనను కృష్ణకు దక్షిణప్రాంతీయులందరు చతుర్థులుగనే నిలచిపోయిరి. కాని ఉత్తరపు వారు క్షత్రియధర్మములు, జన్నిగధారణాదులు రాజశబ్దమును వర్జించక, క్షత్రి యులుగా వ్యవహరించునట్లు అనేక శాసనములవల్ల తేలుచున్నది. దుర్జయాన్వయు లగు కాకతీయరాజులు, తమ జాతి వారిలోనేగాక తెలుగుచోడులతోను, చాళుక్యు లతోను సంబంధములు కల్గించుకొన్నందున దాదాపివంశములన్నియు ఒకేతెగగా మారినను, కమ్మరాష్ట్రపువారు కమ్మవారుగను, ఉత్తరముననున్నవారు క్షత్రియు లుగను క్రమముగా స్థిరపడిరి. గాని కత్తియనాడు వైశ్యులవలె యాజాతివారు కొంధరు జంధెములు విసర్జించిరి.

---

*1. Ep Ind XI *2. A R. of 1924 చూడుడు 283 etc.
*3. E P Ind XVIII P P. 346-55 కాకతీయసంచిక J A.H.R.S. vol. IV.

దుర్జయవంశీకుడగు మొదటి ప్రతాపరుద్రుడు కందూరి ఒదయచోడుని కుమార్తె పద్మావతిని*1, గణపతిదేవచక్రవర్తి కమ్మరాష్ట్రములోని పిన్నచోడుని కుమార్తెలగు నారమ్మ, పేరమ్మలను పరిణయమైరి *2. ఇవి జరిగినపిమ్మటనే వారి శాసనములందు కరికాలుడుగూడ మూలపురుషులలో ఒకడుగ వారు వ్రాసుకొనిరి. కమ్మనాటిలోని వారందరినిట్లు ఒకే శాఖీయులుగా చక్రవర్తి మార్చివేసెను.

కమ్మవారికిట్లు దుర్జయ, చోడ, చాళుక్య, హైహయవంశముల పూర్వీకత (**ancestry**) కల్గినను, వృత్తినిబట్టి వీరు కమ్మ, కాపులనిగూడ వ్యవహరించుచు వచ్చిరి. సేనాధిపతుల వంశీకులు నాయక, నాయుడు బిరుదములు ధరించుచు రాగా, రాజులు రాజశబ్దము ధరించిరి. వీరికి రాష్ట్రకూట వంశోద్భవులగు రెడ్డి రాజులకుగూడ 14వ శతాబ్దినుండి కొన్ని సంబంధములున్నట్లు కనబడుచున్నవి*3. కమ్మవారిలోని వాసిరెడ్డి, తమ్మారెడ్డి, సూర్రెడ్డి, కొమ్మారెడ్డి, గంగిరెడ్డి, పాతరెడ్డి, పల్లంరెడ్డి, బోగిరెడ్డి, వల్లభరెడ్డి, సన్నపరెడ్డి, సాదిరెడ్డి మున్నగు గృహనామము లీయంశమును బలపరచుచున్నవి. వాసిరెడ్డివారు చాళుక్యరాజులలోనివారయ్యును, రాజమహేంద్ర పాలకులగు వేమారెడ్డి, వీరభద్రారెడ్ల పాలనలోనే వాసిరెడ్డివారైనట్లు శృంగారధామమను గ్రంథములో వ్రాయబడుటవల్ల యీ గృహనామములట్లే వేరుకారణములచే గూడ నేర్పడియుండవచ్చును. కాని కమ్మనాటిలోని రెడ్లు కమ్మవారుగా చెప్పుకొనియుండవచ్చునని చరిత్రకారులు కొందరభిప్రాయము. అయితే రెడ్లుగూడ సూర్య, చంద్ర వంశీకులమని, చతుర్థులమని చెప్పుకున్నవారేయైనందున కమ్మవారికి, రెడ్లకుగూడ సంబంధములుండి యుండవచ్చును. పిచ్చుకుంటలవాళ్ళు చెప్పే గాథలలో నిట్లే యున్నది. చాల యింటిపేర్లు రెడ్లకు, కమ్మవారికి కలిసినవి కలవు. వీనినిబట్టి కమ్మవారిలో కొందరు పూర్వం రెడ్డినామధారణులుగా నుండి యుందురనుట కవకాశముగలదు. ఇట్లే వెలమవారిలోని యింటిపేర్లు, గోత్రములు కమ్మవారిలో నున్నవి. వారు కమ్మవారినుండియే విడిపోయియుందురు. పైవిషయములనుబట్టి కమ్మవారు, దుర్జయ, కరికాలాన్వయులని తేలుచున్నది.

---

*1. తెలంగాణా శాసనములు. *2. జాయపనాయకుని చేబ్రోలు శాసనము (E. P. Ind V Part V) *3. ఎరుపవారి సంబంధములనుబట్టి.

దుర్జయుడు హైహయ వంశీకుడైనందున, నాసంతతిలోని వారార్యులనియే నిశ్చయ మగుచున్నది. వీరి బంధువులగు చాళుక్యులు చంద్రవంశీకులైనందున వారుగూడ ఆర్యశాఖీయులే. ఇక కరికాలుడు ద్రావిడదేశవాసియైనను, ప్రాచీనమునుండి సూర్యవంశీకుడుగానే చెప్పబడినాడు. ఈతని వంశీకులు చాల శతాబ్దములు ద్రావిడాంధ్రదేశములలో స్థిరపడి, యచటి భాషాసంప్రదాయములలవరచు కొన్నను ఆర్యసంతతియే యనవచ్చును. కరికాలునికి పూర్వమే యెన్నియో శతాబ్దములక్రిందటనే ఆగస్త్యునికాలము నుండి యార్యులు ద్రావిడదేశములకు వచ్చుట కారంభించి ద్రావిడులలో జేరిపోయిరి.

---

## మనుమకులవంశీకులు కొందరు

ప్రాచీన శాసనములలో నాయకుడు, నాయుడు బిరుదములు ధరించి, చతుర్ధవంశమువారమని చెప్పుకొనుచు మనుమకులవంశజులుగా చెప్పుచు నుండిన వారు కొందరు కనబడుచున్నారు. కమ్మనాటి లేక రాష్ట్రమునందలి యిట్టివా రెవరైయుందురో ఆలోచించవలసి యున్నది. మనుమకులమనగా మనువుకులము. ఇదియే సూర్యవంశము. దీనినుండి చ్యుతులై చతుర్థవంశములో జేరినట్లు వీరిని గురించి చెప్పవచ్చును. కమ్మనాటిలోని యిట్టివారు కమ్మవారుగానే క్రమముగా మారియుందురనుటలో నసత్యములేదు. అట్టివారిని కొందరి నిచట బేర్కొ-నెదను.

(1) క్రీ॥ శ॥ 1160 సం॥లో మన్మకులవార్థి వర్ధనసుధాకర వెలిచెర్లపుర శాసన మున్నగు బిరుదములు ధరించిన మల్లినాయకులు*1. ఇతడు వెలిచర్ల గృహనామము లేక గోత్రము క్రమముగా ధరించియుండవలెను. కమ్మవారిలో నివి కలవు.

(2) క్రీ॥ శ॥ 1254 సం॥లో మన్మకులాభరణుడనని చెప్పుకొన్న కాంప నాయడు, ఇతడు బెజవాడ కండవాడి మన్యపురవరాధీశ్వరుడు. ఇతని శాసనము ఇనుమెళ్ళ గ్రామములోనిది*2. బెజవాడవారు కమ్మవారిలో నున్నారు.

---

*1 S. I. I. Vol VI No. 649 *2 S. I. I Vol VI No 602

(3) మనుమకుల వంశీకుడగు వడ్లూరి పురవరాధీశ్వర గుండపనాయనిం గారు*1.

ఇట్టివనేకము రెడ్లనుగూర్చి గూడ దొరకుచున్నవి. రేచెర్ల బేతిరెడ్డి, నామిరెడ్డి, గోన గన్నారెడ్డి మొదలగువారందరి కీ మనుమ కులవంశ బిరుద మున్నది*2. దీనినిబట్టి రెడ్లును, కమ్మవారిలో కొందరును పూర్వము సూర్య వంశీకులైయుండి క్రమముగా చతుర్థులైనట్లు స్పష్టపడుచున్నది. అంతేగాని యెవ్వరో కొందరు దుర్జయాన్వయులు చతుర్థులుగా తర్వాత వ్యవహరించినంత మాత్రమున, వారి ప్రాచీన కులము లేక వంశము అట్లే యనరాదు. మతాంతరులై క్రమముగా చతుర్థవర్ణములో జేరిపోయి రనవలెను. పురాణములలో క్రీస్తు పూర్వము పాలించిన మహాపద్మనందుని కాలమునుండి చాలమంది క్షత్రియులు శూద్రప్రాయులైరని వ్రాయబడినది. నందులు జైనమతస్థులగుటయు నప్పటినుండి క్షత్రియులు సంస్కార శూన్యులగుటయు సంభవమే.

క్షత్రియశాఖలోని దుర్జయుడొకడును, చతుర్థవంశములో నొక దుర్జయుడును కలరని, ఆ యిర్వురి వంశములవారు నను యాంధ్రలో పాలించిరని కొందరు చరిత్రజ్ఞులు తలంచిరిగాని యిది కేవలము తప్పుగానేయున్నది. ఒకే దుర్జయుని కొందరు చతుర్థవంశీకుడని, కొందరు క్షత్రియుడని వ్రాసిన దృష్టాంతము లున్నవి. కాకతీయులకాలపు శాసనాలలో కాకతీయులను గురించి చెప్పిన పలుశాసనములలో నిట్లు ద్వివిధములుగా వ్రాయబడెను. చతుర్థులమని చెప్పుకున్న కోటరాజులతో కాకతీయులును, అట్లే వెలనాటి రాజులతో హైహయాన్వయులగు పలనాటి చాగివారును సంబంధము లొనర్చిరి. మతాంతరభేదమున వారు ద్వివిధములుగా వ్రాసుకొన్నను నిజమునకు వారంద రొకేదుర్జయవంశీకు లనదగియున్నది. దుర్జయాన్వయులు చాల శతాబ్దములు బౌద్ధ, జైన మతములలోనుండి కులప్రాముఖ్యత జూపక, ముఖ్యముగా తమ వంశప్రాముఖ్యతనే చూచి బంధుత్వము లొనరించిరి. తక్కిన క్షత్రియశాఖలతో గూడ వీరు చుట్టరికములుసల్పిరి. కాకతి రుద్రదేవ, గణపతిదేవు లొనర్చిన సంబంధములే దీనికి నిదర్శనము.

---

*1. & 2. తెలంగాణా శాసనములు.

## చోడ, చాళుక్య, హైహయ, దుర్జయ వంశజుల గుర్తింపు.

కమ్మరాష్ట్ర నివాసులైన చోడ, చాళుక్య, హైహయ, దుర్జయవంశరాజులు క్రమముగా నా పేరులు తగ్గించుకొని కమ్మవారుగా ప్రసిద్ధి పడిరని లోగడ తెలిపితిమి. ఇట్టివారిని శాసనములనుబట్టియు, పూర్వ గ్రంథములను బట్టియు కొంతవరకు గుర్తింపవచ్చును.

దుర్జయ వంశీకులు :- ఆలూరి పోలినాయని శాసనము ప్రకారము ఆలూరి వారును, విప్పర్ల లమరినాయకుని శాసనముప్రకారము విప్పర్లవారు, ఎపిగ్రాఫికా రిపోర్టు 283 of 24 ప్రకారము విప్పర్ల గోత్రీకులును, ఎపిగ్రాఫికారిపోర్టు 1916 పుట 135ను బట్టి పలవుట్ల లేక పల్లుట్ల గోత్రీకులును, గూడూరి శాసనము ప్రకారము పిరియాలవారు, తెలంగాణా శాసనములనుబట్టి మల్యాలవారు (మల్లెల). కమ్మవారిలోని వందావారు, మందావారు (దుర్జయాన్వయులలోని పేర్లనుబట్టి) బుద్ధవర్మ వంశీయులైన పరుచూరివారు, రాంకివారు (రాయంకి) (**J.A.H.C. 1 and** 2 లోని శాసనాలు) దేవినేనివారు (కూదరం శాసనాలనుబట్టి), దుర్జయాన్వయులై యుండిరి. వీరు కమ్మవారిలోను, వెలమవారిలోను వున్నారు.

ఇంకను నేటి యాంధ్ర క్షత్రియులలోని మందపాటి, పూసపాటి, సాగి, వత్సవాయ, ఉత్పలపాటి, సయ్యపరాజు, సంబూరి, గుంట్రాజు, పాతపాటి, ఈదరపల్లి, కరారి, బెల్లంకొండ, కనుమూరి, లకంరాజువారు మొదలైనవారు దుర్జయాన్వయులైనట్లు సోమదేవరాజీయము, రామవిలాసము, పూసపాటిరాజుల వంశావళి, సాగివారి శాసనాలవల్ల విదితమగుచున్నది. ధరణికోట రాజులలోని కోటవారివంశీకులే కమ్మవారిలోజేరి కోటవారుగా పేరందిరి. దంతులూరివారాంధ్ర క్షత్రియులలోనుండిరి. వీరుగూడ నీ కోట వంశీకులేనందురు. తెలుగుచోడరాజుల నుండి కమ్మవారిలో ఎరువవారు, ఆలమందలవారు, చోడవారు, కొణిదెనవారు ఏర్పడియుండిరని వీరందరి శాసనములవల్ల స్పష్టము.

తెలుగుచోడులు నివసించిన ప్రదేశములు మోపూరు, బొప్పూడి, పల్లూరు, మాలెంపాటి, కంచెర్ల, పొందూరు, నెక్కొండ, కందార, కట్టా మున్నగు పేర్లతో కమ్మవారి గృహనామములు కొన్ని యేర్పడెను. ఒరయూరు పురవరాధీశ్వర

బిరుదము ధరించిన తెలుగుచోడులనుండి సూర్యదేవర, కట్టా, గొల్లపూడిమున్నగు వారు కమ్మవారిలో నేర్పడిరి. ఇంకనూ కొండ్రాజు, మట్ల, పొత్తూరి, కొండూరి, రాచిరాజు, మంచిరాజు, గొట్టికంటి, వంగలి, పూద్రాజు, కాలుపపోడి, గురు రాజు, కీర్తిరాజు, బద్య మొదలైనవారేర్పడి క్షత్రియులుగా నితరచోట్ల వ్యవహరించిరి.

చాళుక్యవంశములనుండి మచ్చవారు, కొండవారు, అడపావారు, వాసి రాజువారు (తర్వాత వాసిరెడ్డివారైరి), యలమంచిలి వారు, సమ్మెటవారు, నిడదవోలువారు మొదలైనవారు కమ్మవారిలో నేర్పడిరి. వెలుగోటివారి వంశావళి వీరందరు చాలుక్యవంశీకులని నుడువుచున్నది.

హైహయ వంశీకులనుండి కోనవారు, మల్లినవారు, సాగివారు, విప్పర్ల గోత్రజులు మొదలైనవారేర్పడినట్లు వారి శాసనములవల్ల స్పష్టము. ఈ హైహయ రాజులలోను, కోటవారిలోను క్రమముగా నాయడుబిరుదాంకితులు కొందరున్నట్లు శాసనములనుబట్టి విదితమగుచున్నది. ఈ రీతిగా కమ్మనాటిలోని రాజవంశీకు లందరును, కమ్మవారుగా పేరుగాంచుటవల్లనే వారిని "కమ్మదొరలని, కమ్మ నాయకు"లని వెలుగోటివారి వంశావళి నుడువుచున్నదని గ్రహింపవలెను.

నెల్లూరిప్రాంతపు చోడరాజులు యాదవరాజులతో సంబంధములు చేసి, వారిలో నైక్యమైరి. పిళ్ళయారులమని, మొదలియారులమని గూడ వీరు చెప్పు కొనిరి. (**T. T. ins Vol. I.**)

---

## ఇతరాభిప్రాయములు

కమ్మవారు సురాష్ట్రములో పాలించిన వల్లభులు; కుంతల, వేంగిదేశము లందు పాలించిన చాలుక్యులు, బుద్ధవర్మాదులు, కాకతీయులు, ఇక్ష్వాకులు మొదలైనవారినుండి యేర్పడినట్లు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారియభిప్రాయము (ఆంధ్రుల చరిత్ర). స్వామిజి యస్. బి. సరస్వతీ స్వాములవారుగూడ కమ్మ వారు ప్రాచీన క్షత్రియ వంశములలోని వారనియు నుత్తర దేశమునగల కూర్మ,

కుంబి, మహారాష్ట్రి వంశజులే తెనుగుదేశములో కమ్మవారుగా పేరొందిరనియు, కూర్మ, కుంబి వంశము లొకేజాతి యనియు, వేదకాలములోని పురూరవ వంశములోని గృత్సమదరుషి కుమారుడు కూర్మని సంతతియనియు, నందుచే చంద్ర వంశీకులనియు, శివాజి చక్రవర్తి, గ్వాలియరురాజా, సతారారాజు, అయోద్య రాజులు మొదలగు వారీ కూర్మ వంశీకులనియు, వారును కమ్మవారివలె చౌదరీ బిరుదము ధరింతురనియు, కుంబీలన వారిలోని వ్యావసాయక వృత్తి వారనియు, ఆ రెండు తెగలకు సంబంధము లున్నవనియు పద్మనాయక చరిత్ర దీనిని బల పరచుచున్నదనియు బొంబాయిగజెటీరువంటి సర్కారు గెజెట్లనుబట్టిగూడ నిది స్పష్టపడుచున్నదనియు నుడివియుండిరి. కూర్మిలు మనదేశములోని కమ్మ వారిలోవలె మహారాష్ట్రిములోనుండి చంద్ర వంశీకులే యట్లు పేరొందినను, కమ్మ వారికి మూలపురుషులు కాకపోయినను, ఒకే ప్రాచీన క్షత్రియవర్గము వారని పైయంశములవల్ల స్పష్టము.

కమ్మవారికి మూల పురుషుల వివరము లోగడ పేర్కొనబడియేయున్నది. తూర్పు చాళుక్యులు, వారి బంధువులనుండి కమ్మవారేర్పడగా, పశ్చిమ చాళుక్యులు వారి వంశీకులగు నరపతి రాజులనుండి (విజయనగర, ఆరవీటి, తులువ వంశములు) వారి బంధువులగు కోటబలిజ వారేర్పడిరనియు, కమ్మవారును, బలిజవారును పూర్వ మొకేవర్గము వారనియు, దేశభేదముచే కమ్మవారనబడిరని శ్రీ చి. వీరభద్రరావుగారు వ్రాసిన దానిని పద్మనాయక చరిత్ర బలపరచుచున్నదనియు (కాపులెల్ల వెలమ కమ్మలైరి) బలిజకుల చరిత్రలో నెటీపల వ్రాసినారు గాని లోగడ శాసనముల రీత్యా కమ్మవారి పూర్వీకు లుదాహరించిన దుర్జయ, కరికాలాదులను బలిజ శాఖీయులలో పూర్వీకు లెవ్వరు నుదాహరించనందున ప్రాచీన కాలమునుండి యీ తెగలు వేరుగనేయున్నట్లు తేలును. కాపుశబ్దము, రెడ్లు, తెలగాలు, బలిజలు, కమ్మ, వెలమవారు యింక చాలవర్ణములు సాధారణముగా భూమికాపువృత్తినిబట్టి వాడుకొనుచు వచ్చినను, వీరందరొకే వంశము వారుగా నుండలేదు. బలిజవారికి అయ్యావోలు పురాధీశ్వరులను బిరుదము శాసనములందున్నది. అందుచే వారు మొదట ఐహోలు ( **ihole**) ప్రాంతమునుండి వ్యాపించినట్లు చెప్పవచ్చును. కమ్మవారు, కమ్మరాష్ట్రిమువారే.

“కాపులు” పదమునకు శూద్రులను నర్థ మిటీవల అవిచారితముగా నిఘంటువులందెక్కినది. కాపువృత్తి పూర్వమువైశ్యులది. వారిని శూద్రులనుటకు

వీలులేదు. ఈ కాపువృత్తిలోనున్న బ్రాహ్మణ, క్షత్రియ వర్గములవారినిగూడ శూద్రులనజాలము. అట్లే కాపులన్న మాత్రమున నందరును బలిజవర్గములోనికి రారనవచ్చును. ఇక్ష్వాకువంశజులు ప్రాకృత శాసనాలలో "ఓఖలుఖీయులు, ఓఖలుల" మని అనగా కర్షక లేక కాపువర్గీయులమని చెప్పుకొన్నారు. వారు సుక్షత్రియులేగదా. (నాగార్జునకొండ శాసనాలు).

---

# గృహనామముల యుత్పత్తి

కమ్మవారి గృహనామములలో 11వ శతాబ్దినాటికే ఆలూరి, చిలుకూరి, ముసునూరి వంశములును,

12వ శతాబ్దములో వెలనాటి, ఆలూరి, మందడి, కోట, కోన, సాగి, మల్యాల, ఎరువ, రావర్తి, సెజ్జా (సజ్జా), ఎలమంచి, తూమాటి, విప్పర్ల, మోరంపూడి, నల్లూరి, పాములపాటి, కొల్లూరి, ద్రోణాది, కురుగంటి వంశములును,

13వ శతాబ్దములో వెలనాటి, ఎలమంచి, పులిపాతు, అడపా, కోన, నిడదవోలు, నాదెండ్ల, కోట, సాగి, మల్యాల, గొల్లపూడి, రావర్తి, విప్పర్ల, రావెళ్ళ, కంకణాల, గొట్టిపర్తి వంశములును,

14వ శతాబ్దములో ముసునూరి, తంగేటి, ఎలమంచి, కోన, ఎరువ, గురిజాల, కొండ్గా, మచ్చ, సమ్మెట, నిడదవోలు, సాయపనేని మున్నగు వంశములును,

15వ శతాబ్దములో ఎలమంచి, ఆలమందల, మంచెళ్ళ, వాసిరెడ్డి,రావెళ్ళ, పెమ్మసాని, మేదరమెట్ల, సాయపనేని, చిటి, గుమ్మడూరి, బొచ్చుల, కంచెర్ల, సూర్యదేవర వంశములును,

16వ శతాబ్దములో రావిళ్ళ, పెమ్మసాని, యేర్లగడ్డ, నల్లా, జూపల్లి, సూర్యదేవర, మేదరమెట్ల, కూరపాటి, దాసరి, అడపా, కోనేరు, చిరుమామిళ్ళ, వాసిరెడ్డి, కూరపాటి, గోళ్ళ, అబ్బినేని, వెలంపాటి వంశములును యేర్పడి

మిక్కిలి ప్రసిద్ధికివచ్చినట్లు ఆయా వంశీకుల శాసనాలనుబట్టి గ్రంధాలనుబట్టి చెప్పవచ్చును.

వీరికిగల గోత్రములు 12వ శతాబ్దములో నేర్పడెను. అపుడే వీరు నూతనముగా శైవ, వైష్ణవ మతములను స్వీకరించిరి.

---

## కమ్మవారి మూలపురుషులు.

## 1) దుర్జయ మహారాజు.

ఈయన క్రీస్తుపూర్వమే యనేక శతాబ్దుల క్రిందటినుండియున్న హైహయ వంశరాజులలో నొకడు. సాగివారి శాసనాలలో నితడు హైహయ వంశీకుడనియే యున్నది. పురాణములలో ముఖ్యముగా కూర్మపురాణమున నీ దుర్జయరాజు చరిత్ర వివరింపబడియున్నది. ఈతని తండ్రి అనంతుడు. తాత వీతిహోత్రుడు. వీతిహోత్రుని తండ్రి కార్తవీర్యార్జునుడు. ఈతడు హైహయవంశములోని వాడు. మాహిష్మతీపురమునందు ఈ హైహయ వంశరాజులు పాలించుచువచ్చిరి. త్రిపురి ప్రాంతములందు తర్వాత పాలించిరి. పలనాటిలో 12వ శతాబ్దిని పాలించిన అనుగురాజు పూర్వీకులలో సహస్రార్జునుడనువాడు త్రిపురిలో పాలించెను. అతనికి 7వ పురుషాంతరమువాడే అనుగురాజు. ఆంధ్రదేశములో పాలించిన దుర్జయాన్వయులు అందరును కాకతీయులును, హైహయవంశీకులని చెప్పుకొనిన పొంచర్ల, కోనసీమ, పలనాటి రాజులును యీ మహారాజు వంశీకులేనని చెప్పవచ్చును. వీరంద రన్యోన్య సంబంధము లొనర్చుటయేగాక, సూర్యవంశీకులగు చోడరాజులతోను, చంద్రవంశీకులగు చాళుక్యులతోను కమ్మరాష్ట్రమున సంబంధములు చేయుచుండిరి. తుదకు మతాంతరభేదములనుబట్టి, వారివారి హోదాలను బట్టి కమ్మ, వెలమ, రాచవారలుగా చీలిపోయిరి. రెడ్లకు మూలపురుషులగు రాష్ట్రకూటరాజులతోగూడ వీరికి సంబంధములుండెను.

## 2) కరికాలుడు

ఈయన సూర్యవంశోద్భవుడని పెక్కు శాసనములందున్నది. ఇతడు దాదాపు 3వ శతాబ్దిని ఒరయూరు రాజధానిగా పాలించెను. కావేరీనదికానకట్ట కట్టించి యచట వ్యవసాయమును వృద్ధిజేసెను. ఆంధ్రదేశమునుగూడ నితడు జయించెను. పొత్తపి మున్నగుచోట్ల నరణ్యములను కొట్టించి యీయన గ్రామములను నూతనముగా కట్టించెను. ఈయన చరిత్ర సిలప్పాదికారము మున్నగు ప్రాచీన తమిళ గ్రంధములు తెలుపుచున్నవి. త్రిలోచనపల్లవుని జయించిన కరికాలుడీ మొదటి కరికాలుడో తర్వాత వచ్చినవాడో తెలియుటలేదు. ఈతడు 101 శివాలయములను కట్టించెనట. కొన్ని తటాకములను త్రవ్వించెను. ఈయన చాల బ్రాహ్మణాగ్రహారములిచ్చెను. అందులో పుష్పగిరి యొకటి — న్యాయపల్లి మరియొకటి. ఆంధ్రదేశములోనే పుష్పగిరి, కమలాపురము, కొండూరు, యర్రగుడి, చడిపిరేల, పట్టపురావి, గుల్లమల్లి, లేమల్లి మున్నగు గ్రామములో నీతడు దేవాలయములు నిర్మించెనని లోకలు రికార్డులందున్నది. ఇందు ఒకవేళ రెండవ కరికాలుడు కట్టించినవి కొన్ని యుండును. ఇతడాంధ్ర చోడులందరికిని (పొత్తపి, కమ్మనాటి వారు) మూలపురుషుడు. ఈయన వంశములో మహిమానుడు, రెండవకరికాలుడు, తొండమానుడు, దాశవర్మ యను వారు జనించి ప్రసిద్ధిచెందిరి.

రెండవ కరికాలుని వంశమున తెలుగుబిజ్జన 10 వ శతాబ్దిలో జనించి మిక్కిలి ప్రసిద్ధికి వచ్చెను. పూండూరు మున్నగు యుద్ధములలో పరాక్రమము జూపెనట. ఈతడు పశ్చిమచాళుక్య సోమేశ్వర చక్రవర్తి 1కి సామంతుడు.

## కమ్మవారి బిరుదావళి

నేటి కమ్మవారి పూర్వీకులు రాజు, రెడ్డి, నాయకుడు, నాయుడునేని, నీడు, చౌదరి, వర్మ శబ్దములు ప్రాచీనమునుండియు వాడుకొన్న దృష్టాంతములు లభించుచున్నవి. లోగడవ్రాసిన నిదర్శనములుగాక, యీ క్రింది విషయములు గమనించిన నీ విషయము సత్యమని ధృవపడును. కమ్మవారి గృహనామము

లలో కొమ్మరాజువారు, కొసరాజువారు, పోతురాజువారు, ఇప్పటికినుండి వారి రాజశబ్ద వాడుకను తెలుపుచున్నవి. వారి పూర్వీకులొనర్చిన రాజ్యపాలనను బట్టియె యిట్టివి ధరించియుందురు. వర్మ శబ్దము భూపరిపాలకులైన అన్ని వర్ణములు ధరించుచువచ్చిన దృష్టాంతములు శాసనములందు కానవచ్చుచున్నవి. అట్లే కమ్మవారి పూర్వీకులు ధరించిరనవచ్చును. "వర్మాంతనామాపి నరేంద్ర చిహ్నమ్" అనునది ప్రమాణముగనయ్యెను. శాలంకాయన, విష్ణుకుండి, పల్లవ, చోడ, చాళుక్య, యిక్ష్వాకు వంశములందు చోడ, ఆనందగోత్రిజ, కదంబ, గంగరాజవంశములందరు దీనిని వాడుచువచ్చిరి. వర్మ శబ్దమునకు కవచాదులను ధరించువాడని యర్థము. రెడ్డి శబ్దము కమ్మవారు వాడుకొనుచున్నట్లు కమ్మవారిలోని యనేక గృహనామములు సాక్ష్యమిచ్చుచున్నవి. వాసిరెడ్డి, తమ్మారెడ్డి యిత్యాదులు. ఇది రేడు శబ్దముయొక్క పరిణామమవి నా తలంపు. రాట్ అను సంస్కృత శబ్దమునుండి క్రమముగా వచ్చినది. ఇప్పటికిని రెడ్డి శబ్దము గ్రామ యజమానులకు కొన్ని చోట్ల వాడుచున్నారు. నాయకశబ్దము సేనానాయకార్థమున పూర్వకాలమునుండి యన్ని తెగలవారును వాడిరి. రెడ్డి శబ్దము రట్టడి మున్నగు పేర్లతో నొక అధికార చిహ్నముగా నితరులుగూడ వాడియున్నను, క్రమముగానది రెడ్లకు కులసంజ్ఞగా అమలులోనికి వచ్చినది. ఇది దాదాపు 11వ శతాబ్దినుండి వచ్చెననవచ్చును. రట్టగుడులనువారు రాజులే ?

ఇట్లే చౌదరిశబ్దముగూడ గ్రామపెత్తనదారు లేక చౌత్ మున్నగుపన్నులు వసూలుచేయువాడను నర్థమున దేశములో వాడుకకు వచ్చెను. ఈ చౌదరి బిరుదము హిందూదేశములో చాలవర్ణములవారు, మహమ్మదీయులలో సైతము వాడుకొనుచువచ్చినను, ముఖ్యముగా కమ్మరాష్ట్రములో కమ్మవారే వాడుచు వచ్చిరి. రెడ్లు రెడ్డి బిరుదమునే వాడుచున్నారు. ఇతర ప్రదేశములలోని కమ్మవారు నాయక శబ్దార్థము క్రిందనే నాయుడు బిరుదమును ధరించుచున్నారు. ఇది ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. 11వ శతాబ్దినుండి గల శాసనములందిట్లే వాడబడినది. రాజశబ్దము ధరించినవారి బంధువులే నాయుడుశబ్దము ధరించిన దృష్టాంతములను లోగడ తెలిపితిమి. దుర్జయాన్వయులలో కొందరు రాజశబ్దమును, కొందరు నాయుడుశబ్దమును ధరించుచున్నట్లుగూడ లోగడ చెప్పబడినది. వారివారి హోదాలలో గల వ్యత్యాసమే దీనికి కారణము. ఒక నేని, నీడు శబ్ద

ములుగూడ రాజశబ్దార్థమునే తెలుపుచున్నవి. ఇవి కమ్మవారి పేర్లలోను, యింటి పేర్లలోను అసంఖ్యాకముగానుండి కమ్మవారు ప్రాచీనకాలమునుండి రాజవంశీకులే ననుటకు గుర్తుగానున్నవి. ఈ గృహనామములు, పేర్లు 11వ శతాబ్ది నుండి శాసనములందు కనబడుచున్నవి.

ఈ శబ్దముల యుత్పత్తిని గురించి యిచట విస్తరింపజాలము. కమ్మవారాదినుండి వానిని వాడిరని చెప్పుటయే యిచట కావలసిన విషయము. కమ్మవారి గృహనామములలో ఆలము, ఏనుగుల, కత్తి, కటారి, వీరమంచ, వీరమాచనేని, దండు మొదలైనవి యుండుటవల్ల కమ్మవారు పూర్వము కేవలము కాపువృత్తిలోనేగాక, యుద్ధాది కార్యములందు పాల్గొన్న క్షత్రియ వీరులనుటకు చిహ్నములుగా నిలచియున్నవి.

కమ్మవారిలో అయోధ్య, రఘుపల్లె, శ్రావస్తి, దశరథ, రాజేంద్ర, రఘుపతి, గృహనామములు లేక గోత్రములు కలవారున్నారు. ఇవి వారి పూర్వస్థానములను, వారి వంశములను వివరించుచున్నవి.

గోత్రములందును, మతప్రాబల్యము గనబడుచున్నది. శైవ, వైష్ణవ మతములు స్వీకరించిన కొందరు కమ్మవారు పద్మావతి, శ్రీవెందల, శ్రీపర్తి, శ్రీలక్ష్మి, మారేడు, శివలీల లేక శివనీల, శ్రీకంఠ, పొన్నపాల, మల్లెపువ్వుల, మొగలిరేకుల గోత్రములు ధరించిరి. ఇవి వీరశైవ, వీరవైష్ణవ మతప్రాబల్యకాలములలో నేర్పడియుండును. కమ్మవారిలో కొందరు దేసట్ల (దేశిశెట్ల) గోత్రముగల వారున్నారు. వారాకాలపు దేశిశెట్లుగా వ్యవహరించియుందురు. వెలనాటి రాజుల బంధువులలో సిట్టి శెట్టిబిరుదాంకితులు కనబడుచున్నారు. కమ్మవారిలో మిధునకుల పాలకుల. అన్నంకొల కొలకుల, గనికుల, వీరంకుల గోత్రీకులున్నారు. కులశబ్దాంత గోత్రములు వైశ్యులకున్నందున, వీరందరి పూర్వులు వైశ్యశాఖనుండి వచ్చినవారని తోచుచున్నది.

## ఆచారములు - శాఖలు - జనసంఖ్య

కమ్మవారిలో నిపుడు జమీందారీకమ్మ, పెద్దకమ్మ, చిన్నకమ్మ, గండికోటకమ్మ, గంపకమ్మ, మాచకమ్మ, యిల్లువెల్లనికమ్మ, కూచికమ్మ, కుడిపైట

కమ్మ, ఎడమపైటకమ్మ, బంగారుకమ్మ, కావలికమ్మ మున్నగు శాఖాభేదములు గలవు. గాని పూర్వశాసనములందివి కానబడవు.

1891 సం॥ జనగణితరిపోర్టులో క్రింది శాఖలపేర్లు వ్రాయబడినవి. బంగారు, వడుగ, కావలి, గోడచాటు, యిల్లువెల్లనిది, పెద్దకమ్మ యనుసవి.

| | | |
|---|---|---|
| బంగారుకమ్మవారు ఉత్తరార్కాటుజిల్లాలో నుండిరి. | సంఖ్య | 12,617 |
| వడుగకమ్మవారు కోయంబత్తూరు జిల్లాలోనుండిరి. | " | 28,518 |
| కావలికమ్మవారు గోదావరిజిల్లాలో నుండిరి. | " | 42,888 |
| గోడచాటు కమ్మవారు, యిల్లువెల్లనికమ్మవారు, పెద్దకమ్మవారు — కలిసి, కృష్ణ, గుంటూరు, అనంతపూరు, ఉత్తరార్కాటుజిల్లాల మొత్తము | " | 3,82,895 |

1921 సం॥రపునాటి కీశాఖలు క్రమముగా లెక్కలలో తగ్గినట్లు కనబడుచున్నవి. జనాభాలెక్కలలో మదరాసురాష్ట్రమున కమ్మవారీక్రిందివిధముగా నుండిరి.

| | | | |
|---|---|---|---|
| విశాఖపట్టణం (శ్రీకాకుళం) | 12016 | కోయంబత్తూరు | 53569 |
| | | ఉత్తరార్కాటు | 28227 |
| కృష్ణాజిల్లా | 226734 | దక్షిణార్కాటు | 12743 |
| గుంటూరు | 316668 | తిరునల్వేలి | 56868 |
| నెల్లూరు | 99969 | రామనాడు | 52849 |
| గోదావరి | 56260 | మదరాసు | 1920 |
| చిత్తూరు | 95448 | సేలం | 4808 |
| అనంతపురం | 39917 | తంజావూరు | 2484 |
| కడప | 20171 | మధుర | 19990 |
| కర్నూలు | 14313 | తిరుచునాపల్లి | 3955 |
| బళ్ళారి | 4716 | గోదావరి యేజన్సీ | 2229 |
| చెంగల్పట్టు | 35160 | | |
| | | మొత్తం. | 11,61,014 |

## —* మరికొన్ని వివరాలు *—

| | మొత్తం కమ్మవారిలో— | | బ్రాహ్మణులు— | |
|---|---|---|---|---|
| | మగవారు. | స్త్రీలు. | మగవారు. | స్త్రీలు. |
| | 588017— | 572967 | 267692— | 264146 |
| తెలుగు కమ్మవారు | 575753— | 560019 | | |
| తమిళ కమ్మవారు | 10674— | 10539 | | |
| చదువుకొన్నవారు | 79740— | 8486 | 159730— | 39576 |
| ఇంగ్లీషు చదివినవారు | 2672— | 111 | 46498— | 1402 |
| సంపాదించువారు | 311042— | 116710 | | |
| ఇతరులపై ఆధారపడినవారు | | 733232 | | |
| వ్యవసాయకులు | 297843— | 109657 | 93277— | 44172 |
| స్వార్జితులు | 21— | 23 | 927— | 311 |
| ఇండ్లలో పనులజీవనం | 72— | 43 | 1029— | 381 |
| నిర్ణీతవృత్తిలేనివారు | 1864— | 2334 | | |
| పబ్లికు అడ్మినిస్ట్రేషను | 283— | | 6953— | |
| కళలు వగైరా | 40— | 1 | 661— | 122 |

ఈ సంఖ్యలనుబట్టి కమ్మవారిలోని విద్యావిహీనత బ్రాహ్మణ సంఖ్యల పోల్చిచూచిన చక్కగా దెలియగలదు. కాని నేటి లెక్కలంత హీనముగా నుండవు. పలువురు విద్యాధికులు, వృత్తులచే జీవించు వారున్నారు. చివరిపుట జూడుడు వీరిలో నంతశ్శాఖాభేదములున్నను వారివారి స్థితిగతులనుబట్టి యందరును సంబంధ బాంధవ్యములను జేయుచున్నారు. పూర్వమివి కొంచెము పట్టింపుగా నుండెడివి. ముఖ్యముగా పొలముదిరిగెడివారితో దక్కిన వారు వియ్యపుపొత్తు కంచపుపొత్తులను గలిగించుకొనకుండిరి. కంచములలో భుజింప జేయుట దగ్గరిచుట్టరికమునకు నిదర్శనముగా 19వ శతాబ్దమువరకుండెను. ఇప్పుడది చాలవరకు సమసిపోయినది.

కమ్మవారు మైసూరు, నైజాము, నాగపూరు రాష్ట్రములందు గూడ నున్నారు. వారి సంఖ్యలిపుడు లభ్యముకాలేదు. మైసూరు రాష్ట్రములోని శివ

మొగ్గ, చిక్కమగలూరు, చిత్రదుర్గము, చిక్కబలాపురు, మైసూరు, బెంగుళూరు, జిల్లాలలో కమ్మవారున్నారు. 1951 సం॥ నాటికి సంఖ్యలు 30% కనీసము వృద్ధియైయుండును. కమ్మవారు ప్రాచీనకాలమునుండి యాంధ్రవంశీకులుగా గనబడుచున్నందున నయ్యాంధ్రార్యుల యాచారములే వీరిలో కానవచ్చుచున్నవి. క్షత్రియ, వైశ్య, ధర్మములు అనగా దేశపాలన, దేశరక్షణ, యిత్యాది కార్యములు, వ్యవసాయవృత్తి వీరికి ముఖ్యధర్మములుగా నుండెను. ఆర్యమతమువదలి బౌద్ధ, జైన మతములలో B C. 500 దాదాపు మొదలు 1200 A. D వరకు కొందరు వీరి పూర్వీకులున్నను, పైధర్మములు నిర్వర్తించుచునేయున్నట్లు చెప్పవచ్చును. వీరు దేవాలయస్థాపనలు, వాని ధర్మకర్తృత్వములు కావించుచునేయున్నారు. కాని చాలమంది కమ్మవారి పూర్వీకులు బౌద్ధ, జైన మతములలో నుండి ఆర్యమతచిహ్నమగు జందెమును వర్జించి, ఆ మత ధర్మములు స్వీకరించి ఉపనయనకర్మమునుగూడ వర్జించినట్లు కనబడుచున్నది. గాని మిగతకార్యములన్నియు బ్రాహ్మణమతానుసరణముగనే నేటికి జరుగుచున్నందున వీరు తిరిగి బ్రాహ్మణమతములో చేరినకొలదిని మరల వానిని స్వీకరించినట్లు స్పష్టపడుచున్నది. ఇది దాదాపు 12వ శతాబ్దినుండి యనవచ్చును. వీరిలో చాలమంది వీరమహేశ్వరులు, వీరవైష్ణవులైరి. నూతనగోత్రములు, వానిని చెప్పుటకు పిచ్చుకుంటవంశమువారు, వందిమాగధులక్రింద భట్రాజ కులస్థులు వీరికి యేర్పడిరి. వీరికి గొన్నిచోట్ల భూములు దానముగా నీయబడెను.

కమ్మవారి వివాహములకుముందు కొన్నిచోట్ల వీరుల పూజలు జరుగును. కొందరిలో పెండ్లికుమారుడాడు వేషము, పెండ్లికుమార్తె మగవేషము ధరించి గ్రామ దేవతలను చూతురట. అడుగులకు మడుగులొత్తుచు నా దేవతలవద్దకు వెళ్ళు ఆచారము కొందరికున్నది. అట్లవాయనములు, లేక చేటలవాయనములు, పుస్తెదానములు కమ్మవారి స్త్రీలలో నిర్బంధవ్రతములు. చనిపోయినవారికి గూడ నివి చెల్లవలసినవే. కుడిచేయివారుగా కమ్మవారు దక్షిణదేశమున కొందరు చెప్పబడుచున్నారు. కమ్మవారికి బసవశంకరధ్వజము పూర్వము నుండి వాడుకలోనుండెను. ఇట్లే ప్రతికులమువారికిన్ని 98 మంది తెగలవారికి ఉండెను.* కమ్మవారు క్రమముగా సచ్ఛూద్రులుగా పరిగణింపబడి, క్షత్రియాచారముల నన్నిటిని కర్మకలాపములందు కలిగియున్నారు. ఆ కర్మ

* **Madras Manual**

కలాపములందు జంధ్యములను ధరించి క్రతువులను చేయుచుందురు. 12వ శతాబ్దినుండి వీ రటనట దేవాలయస్థాపనాదికార్యము లొనరించుచున్నారు. బృహన్నారదీయము మొదలగు శాస్త్రములనుబట్టి యట్టిహక్కు శూద్రులకులేదు. కమ్మవారు ప్రాచీన క్షత్రియజాతిలోనుండి వచ్చినవారైనను, యిచ్ఛాపూర్వక ముగ మతాంతరులై, క్షత్రియచిహ్నములలో నొకటియగు జన్నిదధారణము విసర్జించుటవల్లనే యీమార్పులు వచ్చినవి. కాని కమ్మవారీ విషయములను రమారమి 50 సం॥ముల నుండి తెలుసుకొని కొందరు యజ్ఞోపవీతధారణ గావించుచు, గాయత్రీజపము నారంబించి వైదికపద్ధతుల ప్రకారము కర్మకాండ లను గావించుకొనుచున్నారు. ఇట్టివారు పూర్వఋషిగోత్రములను గూడ ధరించుచున్నారు. గోత్రములాయా మతకర్తలు లేక పురోహితుల పూర్వీకుల నామములేయగుటవల్ల, కమ్మవారి పూర్వీకులు చోడ చాళుక్యాది ప్రభువులుగూడ మార్చుకొనుచువచ్చిన దృష్టాంతము లున్నందునను, వీనినిప్పుడు మార్చుకొను టలో తప్పుగాని, విశేషముగాని లేదని చెప్పవచ్చును. గోత్రము తెలియని వారికి కాశ్యపగోత్రము ధర్మశాస్త్రములందు చెప్పబడినది *. రాజులుగానీ వైశ్యులుగానీ యాజకునిగోత్రము ధరింపవలెనని అగ్నిపురాణములోను, అశ్వ లాయన శ్రౌతసూత్రము, అపస్తంభ ప్రవరకాండలోను చెప్పబడినది. ఇది సంకరులకు, క్షత్రియ, వైశ్యులకుగూడ చెప్పబడెను. కమ్మవారిలోగల శాఖలు వారివారి ప్రవర్తనలను హోదాలనుబట్టియే యేర్పడినను, అవి మారినకొలదిని అందరొక్కటే యను భావముద్భవమగును.

కొన్ని శాఖలలో వివాహములందు పెండ్లికూతురిని మేనమామయేతెచ్చి వేదికకడ నప్పగింపవలయును. పూర్వకాలమునుండి మనదేశమున మేనరిక మొక హక్కుగా నుండెననియు, దానిని తప్పించినపు డీయాచార మమలునకు వచ్చియుండుననియు గ్రహింపవచ్చును. సత్యనారాయణవ్రతము, కుంకుమ పూజలు, గౌరీవ్రతము మొదలగు పెక్కు వ్రతకల్పములను కమ్మవారాచరించు చునేయున్నారు. కొందరు రెడ్లు, బలిజవారి యాచారము ప్రకారము పెండ్లి కుమారైను వరునియింటికి దెచ్చుకొని వివాహముసల్పుకొనుట కమ్మవారిలోలేదు. ఇది వారి ప్రత్యేకతను తెలుపును.

---

*శూద్ర కమలాకరస్మృతి.

# 2. కమ్మవారి పూర్వీకుల పాలన

కమ్మవారు దుర్జయాన్వయులు, హైహయ వంశీకులు, చోడ, చాలుక్య రాజవంశీకులైయుండి కాపు వృత్తిలో మెలంగుచు కమ్మరాష్ట్రమున స్థిరనివాసులై తుదకా పేరులను క్రమముగా తగ్గించుకొని మొదటి ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునుండియు కమ్మవారుగా ప్రసిద్ధపడ నారంభించిరని లోగడ తెలిసి కొంటిమి. ఆయా రాజవంశీకులుగూడ క్రమముగా తమ పూర్వపు పేర్లు తగ్గించుకొని, 14, 15వ శతాబ్దముల చివరకు వీరు సంపూర్ణముగా కమ్మవారిలో జేరి పోయి కమ్మనాయకులని, కమ్మదొరలని పిలువబడుచువచ్చిరి. ఈ వంశముల వారందరి చరిత్రలు దిఙ్మాత్రముగ నీప్రకరణమున దెలిసికొందము. ఆ కాలపు మిగత కమ్మవారిని గురించిగూడ యిందు వివరించెదము. రెడ్లు మొదలైనవారిలో గూడ యిట్లే కలిసిపోయిరి.

ఆంధ్రశాతవాహన రాజులపాలన కమ్మరాష్ట్రములో దాదాపు 230 ప్రాంతమున ముగిసిన పిమ్మట నాగార్జున కొండవద్ద శ్రీపర్వతము దాపుననుండిన విజయపురి రాజధానిగా సూర్యవంశీకులగు యిక్ష్వాకు రాజులు పాలించిరి. వీరిలో వాసిస్టీపుత్ర శాంతమూల, మాదారిపుత్ర వీరపురుషదత్త, రెండవ శాంతమూల, రుద్రపురుష దత్తరాజులు కలరు. వీరలకాలములో బౌద్ధవిహారములు, చైత్యములు ఆంధ్రదేశమున వృద్ధినందెను. వీరు దాదాపు 275 వరకు పాలించిన తర్వాత పల్లవ రాజులు పాలించుచు శైవమతమును వృద్ధిజేసిరి. ఇది దక్షిణాంధ్రమునను ముఖ్యముగా పలనాడులోను జరిగెను.

## తూర్పు చాలుక్యులు

కమ్మవారుగూడ కొందరు యిక్ష్వాకు వంశములోని కరికాలునివంశీకులుగా నుండిరని లోగడ తెలిపితిమి. ఈ యిక్ష్వాకురాజుల జయించి కమ్మరాష్ట్రమందు పల్లవ, ఆనందగోత్ర, శాలంకాయన, విష్ణుకుండి రాజులపాలన సాగెను. సముద్రగుప్తుని దండయాత్రలో వీరందరాతనికి లోబడిరి. ఇది 344 ప్రాంతము. క్రీ.శ. 624 ప్రాంతమున చంద్రవంశీకుడును, పశ్చిమ చాలుక్య చక్రవర్తి యునగు

రెండవ పులకేశి కమ్మరాష్ట్రమును జయించి తమ్ముడగు కుబ్జవిష్ణు వర్ధనుని కిచ్చెను. ఈ కుబ్జవిష్ణు చాలదుర్గములను జయించి విషమసిద్ధియను బిరుదమును ధరించెను. కుబ్జవిష్ణు తర్వాత జయసింహుడు 641 ప్రాంతమున రాజై రాజ్య మును విస్తరించెను. సర్వసిద్ధి యను బిరుదముతో నితడు 673వరకు పాలిం చెను. తర్వాత 673—752 సం॥ల మధ్య ఇంద్రభట్టారకుడు, రెండవ విష్ణు వర్ధనుడు, మంగిరాజు, జయసింహ II, కొక్కిలిరాజు, మూడవ విష్ణువర్ధనులు పాలించిరి. పిమ్మట వచ్చిన విజయాదిత్యుడు 770 వరకు నేలెను. ఈతడు తఱచు రాష్ట్రకూట కృష్ణరాజులో యుద్ధములు సల్పుచువచ్చెను. మంగిరాజువద్ద కమ్మరాష్ట్రమును అయ్యనవంశాన్వయుడగు అనమవర్మసామంతుడుగాపాలించుచు వచ్చెను. నాల్గవ విష్ణువర్ధనుడు 771-806 మధ్య వేంగిదేశమును పాలించెను. ఇందులోనే కమ్మరాష్ట్రము జేరియుండెను. ఈయన తన కుమార్తెను రాష్ట్రకూట రాజగు ధృవునకిచ్చి వివాహమొనర్చెను. ఇతని తర్వాత వచ్చిన విజయాది త్యుడు మిక్కిలి పరాక్రమవంతుడై, నరేంద్ర మృగరాజను బిరుదువహించి, 12 సం॥లు తన సోదరుడగు భీమసలికితో రాజ్యాదికారమునకై పోరాడుచు, చివర కాతని జయించి 806—849 మధ్యను పాలించెను. ఈతని కుమారుడగు కలి విష్ణువర్ధనుడు రాష్ట్రకూట అమోఘవర్షుని సోదరిని పెండ్లాడి 1½ సం॥లుమాత్రమే పాలించెను. 849 నుండి గుణగ విజయాదిత్యుడు పాలించెను. ఈతడు గూడ మిక్కిలి పరాక్రమశాలి. ఈయన పశ్చిమ చాలుక్య రాజులకు లోబడియున్న నోలంబవాడి, గంగవాడి మున్నగు ప్రాంతములను జయించెను. రాష్ట్రకూటుల నోడించి త్రిపుర మర్త్య మహేశాది బిరుదులను ధరించెను.

తర్వాత 891 నుండి చాలుక్యభీముడు మన కమ్మరాష్ట్రమును పాలించుచు 360 యుద్ధములొనరించి రాజ్యమును నిల్పుకొని 922 వరకు పాలించెను. ఈ కాలములో ఎరియరాజు వెలనాడేలెను. ఇతడు దుర్జయవంశీకుడు. 922 లో అమ్మరాజు సింహాసన మెక్కెను. ఈతడు 929 వరకు 7 సం॥లు యేలెను. ఈయన చనిపోయిన తర్వాత దాయాదు లార్గురు వరుసగా పాలించిరి. పిమ్మట యుద్ధమల్లుడు, 2వ చాలుక్య భీముడు, అమ్మరాజు 2, దానార్ణవుడు, బాదవ రాజు పక్షమున జటచోడ భీముడు క్రీ. శ. 1000 వరకు యీ రాజ్యమును శాసించిరి. ఈ కాలములో ననేక అంతర్యుద్ధములుగల్గెను. జటచోడ భీముని జంపి శక్తివర్మయు, నాతని తర్వాత విమలాదిత్యుడును 1022 A.D. వరకు

రాజ్యమును పాలించిరి. రెండవ అమ్మరాజు కాలమున కమ్మరాష్ట్రమును దుగ్గ రాజు సామంతుడుగా నేలెను. శక్తివర్మ కాలమున వెలనాడును ఎరియవర్మ 2, పాలించుచువచ్చెను. విమలాదిత్యుడు కాంచీపుర రాజగు రాజరాజుకుమార్తెను పెండ్లాడెను. తర్వాత రాజరాజ నరేంద్రుడు 1020-61 మధ్య పాలించుచు మధ్య మధ్య పశ్చిమ చాలుక్య రాజులకు లోబడుచు వచ్చెను. ఈయనయే యాంధ్ర మహాభారతమును నన్నయ భట్టుచే వ్రాయింప నారంభించెను. విజయాదిత్యుడు 1075 వరకు పాలించిన తర్వాత చోళచాళుక్య వంశమూలకుడగు కులోత్తుంగుడు చక్రవర్తి యయ్యెను. ఈయన వంశీకులు రాజప్రతినిధులుగా నుండిరి. వీరు 1179 వరకు కమ్మరాష్ట్రమును పాలించిరి. వీరందరును దేవబ్రాహ్మణులను బోషించుచు 8వ శతాబ్దినుండి యనేక దేవాలయములను గట్టించుచు వచ్చిరి. అప్పటినుండి దేశికవితను వృద్ధిజేసిరి.

ఈచాలుక్య రాజులలో తర్వాత పిఠాపుర చాలుక్యులు, ముదిగొండ చాలుక్యులు, వేంగి చాలుక్యులు, నిడదవోలు చాలుక్యులు, యలమంచిలి చాలుక్యులు, జల్లిపల్లి మగతలప్రాంత చాలుక్యులు మొదలగు శాఖలేర్పడెను. చాలుక్య రాజులు రెడ్డి వంశీకులకు మూలపురుషులుగా భావింపబడుచున్న రాష్ట్రకూటులతో సంబంధములు చేసియున్నారు. కమ్మరాష్ట్రములోని చోడ, దుర్జయవంశములతో గూడ నొనర్చి యట్టివారు క్రమముగా కమ్మనాయకులలో కలిసిపోయిరి. ఇతర చోట్ల వారచ్చటి క్షత్రియ వర్గముతో గలిసిరి.

ఇక వీరిక్రింద సామంతరాజులుగా పనిచేసిన కమ్మరాష్ట్రనాయక రాజుల వివరముల అరయుదము—

కమ్మరాష్ట్రములో ముఖ్యముగా వెలనాటిరాజులు, కొణిదెన చోడరాజులు, పలనాటి హైహయరాజులు, కొండపడమటి దుర్జయరాజులు, కోనకంద్రవాటి, నతవాటి రాజులు, ధరణికోటలోని కోటరాజులు సామంతులుగానుండి క్రమముగా కమ్మవారుగా మారిపోయిరి. వీరిలో కొణిదెన చోడులు కరికాలాన్వయులుగాను పలనాటి హైహయులు హైహయ వంశీకులుగను, దక్కినవారు చతుర్థులుగను వ్యవహరించినను, అందరును వృత్తిచే క్షాత్రమువహించి యన్యోన్య సంబంధముల నొనర్చి యేకజాతిగా వ్యవహరించిరి. వీరందరును చివరకు కమ్మవారైపోయిరి. కోనసీమ, పాంచధార్ల, హైహయులు, చోడ, చాళుక్యులలో సంబంధము లొనర్చి

నను వారు కమ్మరాష్ట్ర నివాసులు గానందున నెందు వారిచరిత్ర వదలివేయబడినది.

## పలనాటి హైహయ వంశరాజులు - సాగివారు

12వ శతాబ్దిలో త్రిపురి ప్రాంతమునుండి హైహయ రాజగు అనుగురాజు పలనాటికి తన పరివారములో వలసవచ్చెను. ఈయన త్రిపురి ప్రాంతములో 10వ శతాబ్దిని పాలించిన సహస్రార్జునుని కేడవ పురుషాంతరమువాడు. ఈతడు వెలనాటి గొంకరాజు కుమార్తెను పెండ్లాడి, పలనాటి సీమ 300 గ్రామములను అరణముగా సంపాదించి పాలింపజొచ్చెను. ఈ వంశీకులు హైహయ వంశములోని దుర్జయ శాఖవారుగాక, మరొక శాఖవారుగా నున్నారు. వీరు దుర్జయుని స్మరించలేదుగాని దుర్జయ వంశీకులగు వెలనాటి చోడరాజులతో బందుత్వములు సల్పిరి. అందుచే వీరందరొకే జాతివారనవచ్చును. అనుగురాజు పలనాటి సీమ యదికారమును బొందక పూర్వముగూడ నచట వాగివారనే హైహయ వంశీకులు పాలించిరి. క్రీ॥ శ॥ 1103 ప్రాంతమున వాగి బేతరాజు, తర్వాత 1114 నుండి వీరకాముడు పల్నాడును పాలించిరి. తర్వాత రెండవ బేతరాజు, రాజరాజులు 1134 వరకు నేలిరి. పిమ్మట పైన నుడివిన అనుగురాజు పాలనకువచ్చెను*(1). బేతరాజు, రాజరాజులు పశ్చిమ చాళుక్య భూలోకమల్లుని సామంతులుగా పాలించిరి. అనుగురాజు 1147 వరకు పాలించెను. తర్వాత నలగామరాజు (కామ IV) పాలించెను. ఈయన కాలములోనే 1184 ప్రాంతమున పల్నాటి యుద్ధము జరిగెను. రామానుజమతము స్వీకరించి, మాలమాదిగలను సైతము తమ కులములో జేర్చుకొని బ్రహ్మనాయడు మున్నగు వారు వేరైపోయి, వెలమ వారని ప్రసిద్ధి జెందిరి. అప్పటి వరకు కమ్మవారిలో నుండిరి. కమ్మవారిలోని అట్లూరివారు, గోవిందువారు, గండువారు, కోటవారు, కొండవారు, సాగివారు పల్నాటి యుద్ధమున బాల్గొనిరి*(2). బ్రహ్మనాయని కొడుకు బాలచంద్రుడు కమ్మవారిలో గండువారి కన్య మాంచాలను పెండ్లాడెను. సాగివారు క్రమముగా చతుర్థ వంశీకులుగనే చెప్పుకొని వినుకొండ ప్రాంతమును గజపతుల కాలములోను, కొందరు కాకతీయులకాలములో సేనాపతులుగను మెలంగిరి. ఈ వివరములుముందు అధ్యా

---

*1. ఆంధ్రుల చరిత్ర.  *2. పలనాటి వీరచరిత్ర.

యములలోచెప్పబడును. కృష్ణకుత్తరమున దుర్జయాన్వయులగు సాగివారు విప్పర్ల గోత్రము ధరించిరి. (2/1). విప్పర్ల గోత్రజు లనేకులు కమ్మవారిలో నున్నారు. వీరినుండియే వలనాటిచాగి వంశీకులు 1134 వరకు పాలించిన వారేర్పడిరి.

## (1) వెలనాటి రాజులు

త్రిలోచనపల్లవుని సామంతుడుగా దుర్జయవంశములోని మల్లవర్మ వెలనాటిని దాదాపు 5వ శతాబ్దిలో పాలించెను. ఈ వంశీకులు వరుసగానే యచట పాలించిరి. వీరిలో కొందరికి పిడుపరాదిత్య బిరుదమున్నది. రెండవ లేక మూడవ మల్లవర్మ ర88—945 మధ్య పాలించిన తూర్పు చాళుక్య రెండవ భీమరాజు సామంతుడు. ఈతని వంశీకుడగు కుద్యవర్మ II, 1011-22 మధ్య నేలిన విమలాదిత్య చక్రవర్తి సామంతుడు. నన్నిరాజు రాజరాజనరేంద్రునికి, వేమరుడు వీరచోడునికి సామంతుడుగా నుండిరి.

వెలనాటి గొంకరాజు I :— కులోత్తుంగ చక్రవర్తి సామంతుడు. ఇతడు విద్వత్పంకజాశీమ్పృగాంకుడు*1. ఈతడు చాళుక్యరాజ్యములోని 1300 గ్రామములకు మొదటి ప్రభువు. కేయూరబాహుచరిత్రమున మంచనకవి యీతని ప్రతిభ విశేషముగ గొనియాడెను. నాదెండ్ల గోపయ యీతని మంత్రి. ఈయన పాలన క్రమముగా విస్తరించెను.

వెలనాటి కులోత్తుంగ చోడరాజు I :— ఇతడు 1108—1136 మధ్య వెలనాడు మున్నగు 16వేల గ్రామములు తూర్పుచాళుక్య చక్రవర్తి పక్షమున పాలించెను*2. కులోత్తుంగ చక్రవర్తి అభిమానపుత్రుడు. చాళుక్యరాజ్య భవనమూలస్తంభ బిరుదము బొందినవాడు. కాని 1126-38 మధ్య నితడు పశ్చిమ చాళుక్య విక్రమాదిత్య VI, సోమేశ్వర III లకు లోబడి పాలించెను.

వెలనాటి గొంకరాజు II :— వెలనాటి రాజేంద్రచోడుని కుమారుడగు గొంకరాజు II, 1130 లో వెలనాటి రాజయ్యెను. ఈయన పాలనక్రింద

(2/1) అను మంచిపల్లెశాసనము, Ind 283 of 1924 & S I.I. Vol. IV పుట 244. *1. & 2. S.I.I. Vol. IV లోని వీరిశాసనములు & J. A. H. R. S. Vol. XVIII

16 వేల గ్రామములుండెను. ఈతని కాలమున సామంతులు స్వతంత్రులగుటకు ప్రయత్నింపగా కుమారుడగు రెండవ రాజేంద్రచోడుని, తన మేనల్లుడగు కోట చోడ రాజులను జంపి మార్గవాడిబొలకేశి, కొలనిభీముని, పిఠాపురపు విజయా దిత్యుని, రాజమహేంద్రవరమున విష్ణువర్ధనుని లోబరచుకొని చాళుక్యచోళ సార్వభౌమత్వము నిల్పెను. 1133 లో పశ్చిమ చాళుక్యరాజసైన్యములను, గోదావరీయుద్ధమున నోడించి పారద్రోలెను. కాకతి ప్రోలరాజు వెలనాటిపై దండెత్తిరాగా యాతని వీరరాజేంద్ర, కోటచోడయరాజులు కలిసి మడియించిరి. ఇతడు 1160 వరకు విక్రమచోడ, ఇమ్మడికులోత్తుంగుల సామంతుడుగా పాలించెను. ఈయన కాలములో దేశమున తెలుగుకవనముపై మోజు హెచ్చయ్యెను. ఇతడు కాళహస్తి వరకుగల దండయాత్రలలో బాల్గొనుచు వచ్చెను. కొలను రాజుల నీతడు జయించెను.

వెలనాటి రెండవ రాజేంద్రచోడరాజు :— 1160 నుండి ఈయన స్వతంత్రముగా పాలించెను. అపుడు చాళుక్యచోడుల ప్రతిష్ఠ దాదాపంతరించెను. ఈయనమంత్రి నండూరి కొమ్మన 32 చోట్ల విష్ణ్వాలయముల నెలకొల్పెను. చాళుక్యచోడుల సాయములే నిది గ్రహించి యీ వెలనాటి రాజ్యముపై 1180 ప్రాంతమున కాలచుర్యరాజులు, కాకతీయరాజులు, వేంగిచాళుక్యులు, పాకనాటి చోడులు కలిసి దండెత్తి యీయనను వధించి, చందోలును దగ్ధమొనర్చిరట.

వెలనాటి గొంకరాజు III :— ఈయన 1181—1186 మధ్య నుండినవాడు. వెలనాడు శత్రువులు హరింపగా పిఠాపురమున నితడు పాలించి నట్లు కొందరు చరిత్రజ్ఞుల విశ్వాసము. ఈతనిభార్య జయాంబిక పిఠాపురములో కుంతీమాధవాలయము నిర్మించి సింహాచలమున స్వామికి సువర్ణతొడుపుచేయించి నవఖండ వాడగ్రామమును దానమొనర్చెను. ఈయనకాలమున శ్రీశైల ప్రాంతముపై కాకతి రుద్రదేవుడు దండెత్తి ఆక్రమించెను.

వెలనాటి పృథ్వీశ్వరుడు (1186-1211) :- ఈయన మూడవ గొంక రాజునకు జయమహాదేవివల్ల జనించెను. వెలనాటిరాజ్యమట్లు శత్రుహస్తగతము కాగా, తండ్రితో నీయన పిఠాపురమునకుబోయి రాజ్యము స్థాపించుకొని యచట బలపడిన పిమ్మట దండెత్తి 1203 నాటికి వెలనాటి రాజధానియగు చందోలును

తిరిగి స్వాధీనపరచుకొనగల్గెను. ఈతడు ఇమ్మడి రాజాదిరాజచోళునకు సాయ మొనర్చుచు నాతని సామంతుడై 1211 వరకు పాలించెను. ఆతనికి సాయముగా నితడు నెల్లూరు చోడతిక్కనతో యుద్ధమొనరించి యందులో హతుడయ్యెను. గణపతిదేవచక్రవర్తి 1201 లో దండయాత్రరాగా నితడు వెనుకకు పారద్రోలెను. కాని యీతని మరణానంతరము గణపతిదేవుడు 1212—14 మధ్య వెలనాడాక్రమించెను.

వెలనాటి ముమ్మడి రాజేంద్రచోడుడు :— పృధ్వీశ్వరుడు చనిపోయిన పిమ్మట వెలనాటిరాజ్యమును ముందు నెల్లూరు చోడులాక్రమింపగా నీ వెలనాటి ముమ్మడి రాజేంద్రచోడుడు ముమ్మడి రాజాధిరాజుచోడను, ఏరువ రాజులతోను కలిసి పునరాక్రమణకై ప్రయత్నించెనుగాని జయము లభించినట్లు కనబడదు. 1230-1256 ల మధ్య నితడు కాంచీపురము మొదలగు దండ యాత్రలలో దిరుగుచు జివరకు 1257 లో వధింపబడినట్లు కనబడుచున్నది. అంతటిలో నీ రాజవంశపాలన మంతరించెను. పృధ్వీశ్వరికి సోదరి అక్క మహాదేవి పుత్రుడగు చోడగొంకరాజొకడు 1210 లో బాపట్లప్రాంతమున నధికారము నల్పుచువచ్చెను. ఈతడు పృధ్వీశ్వరుని సామంతుడై యుండును. ఆతని బంధువులలో నొకడనవచ్చును. ఈ వెలనాటిరాజుల సంబంధీకులు సామంతులుగా 1343 వరకు కాకతీయ రెడ్డిరాజ్యములలోగూడ నుండినట్లు చరిత్రజ్ఞులు గుర్తించుచున్నారు. (J. A. H. R S X\III P. 110).

కొండపడమటిరాజులు :— * త్రిలోచనపల్లవుని సామంతుడుగా పాలించిన బుద్ధవర్మ వంశములో ఎలదాయసింహ బిరుదాంకితుడగు మండవర్మ 1114-18 మధ్య కొండపడమటిసీమ త్రిసప్తతి (370) గ్రామము లను పాలించెను. ఈ వంశములో మరియొక బుద్ధవర్మ తూర్పుచాళుక్య కుబ్జ విష్ణువర్ధనుని సామంతుడుగా 625 A D. ప్రాంతమునందుండెను. మండవర్మ కుమారు బుద్ధవర్మ IV, గండరాజులు తర్వాత 1125 వరకు పాలించిరి. ఈ సీమకు నాదెండ్ల ప్రధాననగరము. విక్రమచోళుని సామంతుడు మన్మమండరాజు

---

* J.A H R.S. Vol. XIX లో నూతనముగా వ్రాయబడిన శ్రీ యశోదదేవి గారి వ్యాసమును బట్టి, S.I I. Vol IV లోని శాసనములను బట్టి వ్రాయ బడినది.

1125-39 మధ్య నేలెను. ఇతడు కళింగదండయాత్రలో బాల్గొనెను. ఈతనికి కావ్యవినోద, సుకవికీర, సహకారాది బిరుదులున్నవి. ఈ సీమను 1139-49 మధ్య మల్లరాజును, తర్వాత 1173 వరకు మూడవ మండరాజును, పాలించినట్లు కనబడుచున్నది. 1186 లో మరియొక మండరాజు, 1213 ప్రాంతమున పండ రాజును, 1242 ప్రాంతమున బేతరాజు, 1250 ప్రాంతమున మురారి గణపతి దేవరాజును, 1252 ప్రాంతమున వెనుకుల గోత్రజురాలగు గణపమభర్త మన్మ రాజును, 1282 ప్రాంతమున వలవుట్లగోత్రజుడగు దేవినాయని ఎఱ్ఱమనాయడు, పోతినాయడులును, 1277, 1288 ప్రాంతమున పోతినాయుడు కుమాళ్ళు సూర నాయడు, పోతనాయడు, మారనాయడులు యీ రాజవంశీకులుగానుండి యధికా రము చలాయించుచువచ్చిరి. వీరిలోను, వెలనాటిరాజులలోను గల పండా, మండా రాజులపేర్లనుబట్టి కమ్మవారిలో నా గృహనామము లేర్పడియుండును. మురారి వారల్లే యేర్పడిరి.

## 2] ధరణికోటరాజులు

ధరణికోట రాజ్యము 1051-91 మధ్య బేతరాజు పాలించెను. తర్వాత 1108 వరకు గండరాజు పాలించెను. 1108-1127 మధ్య భీమరాజు ఏలెను. ఈ రాజ్యమునకు దనుంజయుడు మూలపురుషుడు. 1127—48 మధ్య రెండవ బేతరాజును, 1148—56 మధ్య కోట కేతరాజును, 1156—82 మధ్య కోట భీమరాజును పాలించిరి. ఈ రెండవ భీమరాజు పల్నాటి యుద్ధములో నలగామ రాజునకు సాయపడెను. ఈయన కుమారుడు రెండవ కేతరాజు సంధి రాయబార మొసర్చెను. కొండపడమటిసీమ యీతని కాలములో నీయన వశమయ్యేనట. కేతరాజు II వెలనాటి గొంకరాజు II తోబుట్టువ సుబ్బాంబికను పరిణయమై ప్రసిద్ధుడయ్యేను. నెల్లూరు చోడరాజులతో నితడు యుద్ధయాత్రలు చాళుక్యరాజు పక్షమున సల్పెను. కొమ్మనదండనాయక, చౌండరాయలను బరిమార్చి సిద్ధి చోడ, బేతరాజులకు సింహమువంటివాడని చెప్పబడినది. ఇతని తర్వాత 1160—1175 మధ్య కోట రెండవ గండరాజును, తర్వాత రెండవ బేతరాజును, 1211ప్రాంతమున ముమ్మడిదేవరాజును, 1231-34మధ్య కోటభీమరాజు IIIను, 1234—40 మధ్య కోట మూడవ కేతరాజును పాలించిరి. ఈతడు కాకతీయ

గణపతి దేవచక్రవర్తి తోబుట్టువ మైలమ్మ కుమార్తె బయ్యలదేవిని పెండ్లాడెను. ఈతని తర్వాత 1262 వరకు కోటగణపతిరాజును, తర్వాత 1268 వరకు భీమరాజు IVను పాలించిరి. గణపతిరాజు బావమరది మాచినాయుడని పేరొందెను. ఈతని శాసనమొకటి త్రిపురాంతకమున నున్నది. తర్వాత నీ వంశములో కోట దేవరాజు, ముమ్మడిరాజులు పాలించిరి. యనమదలలో కోటరాజులు కొందరు 1216 నుండి వేరుగా పాలించనారంభించిరి. వీరిలో మొదటివాడు కోటరుద్రరాజు 1241 వరకును, తర్వాత కోటబేతరాజు 1250 వరకును పాలించిరి. ఈ బేతరాజే కాకతి గణపతి దేవచక్రవర్తి కుమార్తె గణపాంబను పరిణయమయ్యెను. ఈయన చనిపోయిన పిమ్మట గణపాంబ 1264 వరకు పాలించెను. తర్వాత కోనమన్మ గణపతిదేవరాజు పాలన కనబడుచున్నది. కోటవారి పాలనమింక గొన్నిచోట్లగూడ కనబడుచున్నది. 1240 తర్వాత భీమరాజు, 1263 వరకు ప్రోలరాజు, తర్వాత బైరవరాజు పాలించినట్లు పెదకల్లేపల్లి శాసనమున నున్నది గాని వీరి రాజ్యప్రదేశము తెలియదు. తాడికొండలో 1176 ప్రాంతమున కోటమన్మపోతరాజు, తర్వాత ఆతని భార్య పందాంబికయు పాలించిరి.

త్రిపురాంతకములో కేతరాజు II జ్యేష్ఠ సోదరుడగు చోడ రాజునకు జనించిన ముమ్మడిపోతరాజు, రాజయ్యలు 1218 ప్రాంతమున కాకతి గణపతి దేవచక్రవర్తి సామంతులుగా బాలించిరి.

దస్పాడవాడ కోటరాజులలో 1140 ప్రాంతమున కోట పోతరాజు, 1179 ప్రాంతమున చోడరాజులు పాలించుచు కులోత్తుంగ II, రాజరాజ II, ల సేనానాయకులుగా పేరొందిరి. 1400 ప్రాంతమున గన్న భూపాలుడు ధరణికోట నేలెను. ఈతని పుత్రికయగు సూరాంబిక పెదకోమటి వేమారెడ్డిని పెండ్లాడెను*. ఈతడు దంతులూరి గృహనామము ధరించెనని మూర్తిత్రయోపాఖ్యానమున నున్నది. కోటరాజులనేక గృహనామములు ధరించిరి. అందులో నిదియొకటి. కమ్మవారిలో కోటవారిప్పటికినున్నారు.

---

* ఫిరంగిపుర శాసనము.

## దుర్జయులు కొందరు

క్రీ. శ. 1125 ప్రాంతమున మాదల ప్రాంతమునందు వెలనాటి చోడుల సామంతులుగా దుర్జయాన్వయుల పాలనయుండెను. వీరిలో పిన్నమనాయఁడా కాలమున పాలించినవాడు. ఈయన తండ్రి విట్టపనాయకు - తాత - నామి నాయుడు - రాంకి, పరుచూరి ప్రాంతములందు పరుచూరి పురవరాదీశ్వర కేతి నాయడొక పాలకుడుగా నుండెను. ఈతడు వెలనాటి రెండవ చోడరాజు సామంతుడు. ఈయన వలరట్ల వంశజుడనియు, బుద్ధవర్మ శాఖీయుడనియు జెప్పబడినది. వలరట్ల కులజులు బుద్ధవర్మ సంతతివారని రాంకి సమస్త నాయక సమూహపు శాసనములో స్పష్టపరుపబడియున్నది.

## నతవాటిసీమ దుర్జయాన్వయులు.

నతవాటిసీమ (మదిరజిల్లా)ను దుర్జయవంశపు దుర్గరాజు 12 వ శతాబ్దా రంభమున పాలించుచువచ్చెను. మడపల్లిదుర్గ మీయన రాజధానిగా నుండెను. ఈ వంశీకులు కాకతీయరాజులకు బంధువులు. దుర్గరాజు తర్వాత బుద్ధరాజీ సీమను 12వ శతాబ్దిమధ్య పాలించెను. ఈయన రెండవ కుమారుడగు రుద్రరాజు కాకతీయ మహాదేవ చక్రవర్తి కుమార్తె మేళమ్మను వివాహమాడెను. ఈయనకు "వక్కడిమల్ల, దొడ్డప్పారి బైరవుడు" మున్నగు బిరుదులున్నవి. ఈతని కెనిమిది మంది కుమాళ్లు—బయ్యాలదేవి యను కొమరితయు నుండిరి. బయ్యాలదేవిని కోట కేతరాజు III పెండ్లాడెను. కుమాళ్లలో మహదేవరాజు, ముమ్మడి గణపదేవ రాజులు శక. 1170 ప్రాంతమున నుండి త్రిపురాంతక దేవునికి దీపదానములు గావించిరి. మేళాంబిక యచట మేళాంబికేశ్వర దేవుని బ్రతిష్ఠించి, భూదాన మిచ్చెను. మరియొక భార్య కుమారాంబవల్ల మాధవరాజు జనించెను.

## కమ్మనాటి రాజ్యము - తెలుగు చోడరాజులు

కమ్మరాష్ట్రములోని కమ్మనాటిని నరసరావుపేటలోని కొణిదెన రాజధానిగా జేసుకొని వెయ్యి గ్రామములను కరికాలాన్వయులైన తెలుగుచోడరాజులు పాలించుచు వచ్చిరి. కరికాల, త్రిలోచన పల్లవుల కాలమునుండి వీరు పాలించుచుండినట్లు కొన్ని ఆధారములున్నవి. హొత్తపిలో 1079, 1115

మధ్య పాలించిన కామచోడుని కుమారుడగు కన్నరదేవుడు కమ్మనాటిని 1115 నుండి పాలించుచు మధుకంబల్లి గ్రామమును బాపట్లలోని స్వామికి దానమిచ్చెను. ఈ వంశీకులే వరుసగా పాలించుచు కొణిదెనలో బల్లేశ్వర, కామేశ్వర, త్రిభువన మల్లేశ్వరాలయముల గట్టించి, వానికి భూదానముల నిచ్చుచువచ్చిరి. వీరు చోడ చాళుక్య చక్రవర్తులకు సామంతులుగా నుండిరి. పశ్చిమ చాలుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుడు దేశము 1120లో జయించి నపుడాతనికి విధేయులైరి. మరల చాళుక్య ప్రతినిధులగు వెలనాటి చాలుక్యుల సామంతులుగానే 1133 తర్వాత మెలంగిరి. ఈ వంశీకులు కమ్మనాటిలో పాలించుచు కమ్మవారుగా ప్రసిద్ధపడిరి. కామచోడుడు పొత్తపిలో పాలింపక పూర్వమచట నన్నెచోడుడు పాలించుచుండెననియు, నాతడే టెంకణాదిత్య బిరుదాంకితుడనియు, కుమార సంభవ గ్రంథకర్త యతడేననియు, నతని తండ్రి చోడబల్లి 1000 A.D. ప్రాంతమున పాలించెననియు, నాతని భార్య హైహయవంశజ యగు శ్రీదేవి యనియు, నాతని తండ్రి బల్లిచోడుడు 950 ప్రాంతమున పొత్తపిలో పాలించె ననియు చరిత్రకారులు కనుగొనిరి. నన్నెచోడుని కావ్య మచ్చ తెనుగును చాల వరకు వెలార్చుచు, చోడుల యాంధ్రత్వమును నిరూపించుచున్నది. ఇది నన్నయ భారతమునకు దీటైనది. కమ్మనాటిలో కన్నరదేవుడు 22 సం॥లు పాలించిన పిమ్మట 1136 నుండి 1151 వరకు కామచోడుడు, అతని కుమారుడు త్రిభువన మల్లచోడుడు కలిసి పాలించుచు వచ్చిరి. వీరు రెండవ కులోత్తుంగ, రెండవ రాజరాజులకు సామంతులు. త్రిభువనమల్ల 2 గ్రామములను దేవుళ్ల కిచ్చెను. వీరు జగనొబ్బిగండ, టెంకణాదిత్యాది బిరుదుల ధరించిరి. వీరి తర్వాత 1151—1160 మధ్య రెండవ నన్నెచోడుడు కమ్మనాటిని పాలించెను. ఈయనవద్ద గుండిమెడ అన్నామాత్యుడొక మంత్రిగా నుండెను. ఈ మంత్రి పూర్వీకులు పారంపర్యముగా త్రిలోచన పల్లవుని కాలమునుండి యుండిరట. వీరనేక గ్రామములను ఆయాకాలపు రాజులవద్దనుండి పొందినట్లు చెప్పబడినది. బొప్పూడిలో 1156లో త్రిభువనేశ్వరాలయ మాతని తండ్రిపేర కట్టించి నూదని పాటి భూమి యొసగెను.

1160—87 మధ్య కామనచోడుడు కమ్మనాటని పాలించెను. ఈయన నన్నూరు గ్రామములు దేవునకు దానమిచ్చెను.

1145–1166 మధ్య మన్నెపల్లి ప్రాంతమున రెండవ చోడబల్లి పాలన కనబడుచున్నది. ఈయన కామచోడుని పుత్రుడు, వెంకచోడుని పౌత్రుడు, పొత్తపి నన్నెచోడుని ప్రపౌత్రుడు నట.

ఈయన తర్వాత 1211–1222 మధ్య కమ్మనాటిని బల్లిచోడ మహారాజు పాలించెను. కాకతి గణపతిదేవ చక్రవర్తి 1212–14 మధ్య వెలనాటి రాజ్యమంతయు నాక్రమించుటవల్ల నీకమ్మనాడు గూడ నాతనికి లోబడిపోయెను. కాని పొత్తపి చోడరాజులనే యిచట పాలకులుగా నియమించుచు వచ్చెను.

1195 ప్రాంతమున నీవంశములో కీర్తిరాజు మల్లిదేవ చోడ రాజు పాలన విప్పర్ల ప్రాంతమున గానవచ్చుచున్నది.

1224 ప్రాంతమున పొత్తపి శాఖలోని రెండవ ఓపిలిసిద్ధి గణపతిదేవ చక్రవర్తి సేనాధిపతిగా కొణిదెన ప్రాంతము నేలెను. ఆతడు ప్రసిద్ధి నొందిన తెలుగు బిజ్జన వంశీకుడు. బిజ్జన వంశమున మల్లిదేవుడు, ఆతనికి చోడసిద్ధి, మల్లిదేవులును; అందలి సిద్ధికి సోమేశ్వర మల్లిదేవులు; చోడసిద్ధి తమ్ముడగు మల్లిదేవునికి ఓపిలిసిద్ధి, మల్లిదేవులు; అందలి మల్లిదేవునికి గౌరిశ్రీదేవి యందీ రెండవ ఓపిలిసిద్ధియు జనించిరి. ఈతడు కమ్మనాడు సేనేగాక, వెలనాడు, ఆరు వేలనుగూడ గణపతిదేవ చక్రవర్తి యానతిమీద పాలించెనట.

1249–80 మధ్య కన్నరదేవుడు గణపతి సేనానిగా పాలించెను. ఆతని వద్ద నల్లాప్రగడ, పద్మనాభ, సూరయామాత్యులను మంత్రులుండిరి.

1273 ప్రాంతమున పందిళ్లపల్లి కన్నర దేవరాజొక యధికారిగానుండెను. ఆతడీయన సామంతుడు కావచ్చును.

ఈ తెలుగు చోడులు నివసించిన ప్రదేశములే వారి గృహనామము లయ్యెను. కమ్మవారిలో కొందరు చోడ గృహనామము ధరించిరి. అందుచే కమ్మవారిలో కమ్మరాష్ట్ర నివాసులు నీశాఖీయులు కలిసిపోయినట్లు దృఢ మగుచున్నది. ఈ తెలుగుచోడ రాజులు తూర్పు చాళుక్య రాజులకు, వారి ప్రతినిధులగు వెలనాటి దుర్జయాన్వయ చోడ రాజులకు సామంతులుగా మెలంగుచు వారికి సంభవించిన యుద్ధములందు లయచు పాల్గొనుచు ననేక బిరుదములను బొందుచువచ్చిరి. కాకతీయ గణపతిదేవచక్రవర్తి వెలనాటిలోపాటి కమ్మనాడును జయించిన పిమ్మట 1212 ప్రాంతమున వీరాతనికి లోబడిపోయిరి.

కనుపర్తిలో 1428 ప్రాంతమున బుక్కరాయల సామంతుడుగా నుండిన అలమందల నూకయదేవ చోడరాజు కొడుకు వీరఅవుకు భూదేవ చోడరాజు *1, నాగులపాటి యందాకాలముననుండిన ఆలమందల గంగయదేవ చోడరాజును*2, తెలుగు చోడశాఖీయులనియే వారు ధరించిన చోడశబ్దమును బట్టి చెప్పవచ్చును. ఈ ఆలమందలవారు కమ్మవారిలో నున్నారు. ఇతరులలో గూడ నున్నను, చోడ గృహనామస్థులు కమ్మవారిలోనే యున్నందున, ఈ ఆలమందల చోడ రాజులు కమ్మవారికి సంబంధించినవారే యగుచున్నారు. ఒరయూరి పురవరా ధీశ్వర బిరుదమును కొందరు తెలుగు చోడ రాజులు ధరించుచు వచ్చిరి. వారి వలెనే 1285 ప్రాంతీయుడగు గొల్లపూడి కామానాయడు ధరించెను*3. ఆతడు గూడ చోడ వంశీకుడేయై యున్నాడు. ఇట్లే మరికొందరు కలరు. ఈ తెలుగు చోడులనుండి యేర్పడిన కట్టావారు కమ్మవారిలోను క్షత్రియులను వారిలోను కనబడుచున్నారు. రెడ్డి మత శాస్త్రములో చెప్పబడిన కొండ్రాజువారు, పుట్ల వారు తెలుగు చోడ వంశీకులైనను, కమ్మవారిలో జేరియుండలేదు.

కొందరు తెలుగు చోడరాజుల వంశీకులు కమ్మరాష్ట్రము వెలుపల ని... సించినవారు క్షత్రియులుగానే వ్యవహరించినట్లు కనబడుచున్నది. ఇట్టివారిలో పొత్తూరి, కొండూరి, రాచిరాజు, మంచిరాజు, గొట్టికంటి, వంగలి, పూద్రాజు, కాలువబోడి మున్నగు గృహనామస్థు లున్నారు. లోకలురికార్డులలో నీ గృహ నామములు దొరకుచున్నవి. చోడరాజులు పాలించిన ప్రదేశములు కోడూరు, నెల్లూరు, మోపూరు, వల్లూరు, కొణిదెన, మాలెపాటి, కంచెర్ల, పొందూరు, నెక్కొండ, కందార లనుబట్టి కమ్మవారిలో నీయింటిపేర్లు వచ్చియుండునని నాతలంపు. దుర్జయ, చోడ, చాళుక్య, హైహయ వంశములలోనుండి కమ్మ రాష్ట్రము వెలుపలనుండినవా రాయాప్రదేశముల గల యితర క్షత్రియాది కుల ములలో నైక్యమైపోయిరి. 15వ శతాబ్దినుండి కమ్మరాష్ట్రము, వేంగిరాష్ట్రము, ఓరుగల్లురాష్ట్రములందు వీరిపేర్లు మాసిపోయినవనవచ్చును. అనగా చోడ, చాళుక్య, హైహయనామము లదృశ్యములైనవి. కమ్మవారు క్షత్రియులు అనుపేర్లే నిలచినవి. దుర్జయ, చోడ, చాళుక్య పదములు వాడుకున్న కాలములో కమ్మ శబ్దము వీరువాడుకొనలేదు. కమ్మశబ్దములేకుండా కొందరుచతుర్థవంశమని చెప్పు కున్నవారున్నారు.

---

*1. N. I. 0.56. *2. N. I. 0.85. *3. N. I. A/25.

## ఏరువరాజ్యము - ఏరువతొండయరాజు

ఏరువవారు తెలుగుచోళ శాఖీయులు. వీరు మొదట ఏరువనాడును పాలించుచు ఏరువవారుగా పేరుజెందిరి. క్రీ॥ శ॥ 1121 ప్రాంతమున నీ వంశములోని తొండయరాజు పశ్చిమచాళుక్య చక్రవర్తి త్రిభువనమల్లుని సామంతుడుగా నుండెను. ఈయన భార్యమైలమదేవి ద్రాక్షారామభీమేశ్వరునికి దీపదానము గావించి శాసనము లిఖించెను. దానినిబట్టి యీయనకు "కోడూరుప్పురవరేశ్వర" మున్నగు బిరుదులున్నవి. అందుచే నితడు కోడూరుశాఖలోని చోళరాజనవచ్చును. ఈయనవద్ద వెంపలవంశీకు లమాత్యులుగా పేరందిరి.

1250 ప్రాంతములో ఏరువమల్లదేవు డనునతడు కాకతీయ రుద్రమదేవి సామ్రాజ్యత్వమును ధిక్కరించి యామె సేనానులగు గోన గన్నారెడ్డి, అంబదేవులచే నొకానొక యుద్ధమున జంపబడెను. దాదాపీకాలములోనే ఏరువ భీమరాజుగూడ ప్రసిద్ధిచెందియుండెను. ఈతనితల్లి అన్నెమాంబ. భీమచోడునకు ప్రోలాంబయను సతీమణివల్ల "చౌహత్తనారాయణ" బిరుదాంకుడైన దామనృపాలుడును, అతనికి లక్ష్మీదేవియను సతివల్ల సోమభూపతియు, నాతనికి సోమాంబయందు గంగాధరచోడుడను నామాంతరముగల అన్న దేవచోడుడును, అతనికి యిరుగాంబికవల్ల కామభూపతి యనబడు భక్తీశ్వరచోడుడును, అతనికి రెండవ అన్నదేవచోడుడును జనించి సైన్యాధికారులుగా వ్యవహరించిరి.

14వ శతాబ్దమున మరియొక భీమరాజుండెను. అతడో లేక యందలి భీమరాజో అనేకదుర్గములను జయించినట్లొక చాటువుగలదు. 1300 ప్రాంతమున తాళ్ళప్రొద్దుటూరునద్ద గంగయమల్లిదేవచోడుని పాలనమును, 1322 నాటికి అతని కుమారుడగు గంగయచోడుని పాలనమును గనబడుచున్నవి. ఈగంగయ చోడుడు మిక్కిలి పరాక్రమశాలియై గంగయసాహిణిని యుద్ధములో జయించెను. జోగుల కుమార, ఔరౌరభీమాదులను జంపెనట. వీరందరు ఏరువవంశీకులే యైయున్నారు.

ఈ ఏరువవారు క్రమముగా కమ్మరాష్ట్రమునకు వచ్చి స్థిరపడుటవల్లనే కమ్మవారనబడిరి. ఈవిషయము మరొక ప్రకరణమున జదువగలరు.

## సాగి లేక చాగివంశీకులు - గుడిమెట్టసీమ

దుర్జయవంశములో సాగివంశమొక శాఖ. వీరిది విప్పర్ల వంశము. యీ శాఖీయులు గుడిమెట్టసీమను 11వ శతాబ్దినుండి పాలించిరి. ముప్పరాజనునతడు కులోత్తుంగ చక్రవర్తి సామంతుడుగా 1070-1118 మధ్య నుండినవాడు. ఈతని తర్వాత దోరభూపాలుడు పాలనకువచ్చి 1118-60 మధ్య పాలించుచు కొన్ని నాణెములను సైతము వేయించెను. 1103 నాటి యొకశాసనములో పలనాటి హైహయవంశమిందునుంచి చీలినట్లు సూచనగలదు. దోరభూపతి కొడుకు బేత రాజు పలనాటిప్రభువుగా నందున్నది. బేతరాజుగాక పోతరాజను నొక కుమారు డుండి గుడిమెట్టను పాలించెను. ఈ పోతరాజు 1161-1190 మధ్య పాలించెను. ఈతడుగూడ త్యాగి గద్యాణములను వేయించెను. విజయవాడ ప్రాంతముగూడ నీయన పాలించెను. ఈతడు పలనాటియుద్ధమున నలగామరాజునకు సాయ మొనర్చెను.

రెండవ దోరరాజు 1190-99 మధ్య పాలించుచు బెజవాడకు తన రాజధానినిమార్చెను. వీరిరాజ్యము నతవాటివిషయమునిగూడ పేరందెను. ఈతని తర్వాత రెండవ పోతరాజు 1199-1230 మధ్యను పాలించెను. సోదరుడు గణపయరాజు పాలనతో సహాయుడుగానుండెను. వీరు కాకతీయరాజులకు లో బడిరి. తర్వాత గణపతి, మూడవదోరరాజులు కలిసి 1230-1257 మధ్య పాలిం చిరి. 1257-68 మధ్య యీరాజ్యమును మన్మపోతరాజు, మన్మగణపయ్యలును, తర్వాత మన్మచాగిరాజు 1268-1292 మధ్యను పాలించిరి. రుద్రచాగిరాజు 1292-1305 మధ్యను పాలించెను.

15వ శతాబ్దిలో నీ వంశీకులు గజపతుల సామంతులైరి. ఆ వివరములు ముందు చెప్పబడును. కమ్మవారిలో నిప్పటికి సాగివారున్నారు.

## పరుచూరి కేతినాయకుడు

ఈయన 1163 ప్రాంతీయుడు. తండ్రి యెఱ్ఱపనాయకుడు. తల్లి వెన్న సాని. పరుచూరి పురవరాధీశ్వరుడు. పలరట్లవంశజుడు. రాంకి (రాయంకి) పురాధీశ్వరుడగు మల్లయకు మఱది. ఈతడు బుద్ధవర్మ వంశములోనివాడు. ఈతడు వల్లూరునకు వచ్చిన శత్రువులను బారద్రోలి పేరొందెను. ఈతడీక్రింది విధముగా వర్ణింపబడినాడు—

"శ్రీయుతుం డెఱియమనాయకు తనయుండు, వలరట్ల వరవంశవర్ధ నుండు, దండిదానవినోది గండయ తమ్ముండు, వెన్నమాంబ సుతుండు, మాన్యమూర్తి, వీరుండు వీరావతారుండు వఱుచూరి, పురవరాధీశుండు నరనుతుండు గిరి పశ్చిమంబున గురుతరంబగు రాంకి పురమున నెల కొన్న పురహరునకు సలలితుండు రాంకిమల్లయ మఱంది, త్రిలోకనుతుడు వైరిభీకరుండు దిరముగా నఖండదీపకంబెత్తించె, దిరగుణుండు వంశ దీపకుండు".

(J A H. & C Vol I)

## కోనకంద్రవాడి దుర్జయరాజులు

12, 13 శతాబ్దులలో బెజవాడ రాజధానిగా ద్రిసప్తతిగ్రామములు (370) యీ కోనకంద్రవాడి శాఖీయులు పాలించిరి. పోతభూపతి మొదటివాడు. వీరు వేంగీచాలుక్యచక్రవర్తుల సామంతులు. ఈ పోతనృపాలుని వంశమున వీర చోడ రాజు, ఆయనకు భీమరాజు, ఆతనికి రెండవచోడరాజు, ఆతనికి అయతమాంబ యను సతివల్ల సూరపోతరాజు జనించి యీ సీమపాలకులుగా నున్నట్లు కనబడు చున్నది. సూరపోతరాజు "దుర్జయకులార్జున, విజయవాటికా పురేశ్వర, చాళుక్య కటకవజ్రప్రాకార, అరిగిరి కులిశాయుధ, వైరి రాజన్యముద్రక, వాసరాయతారక షడానన, ఈరుగమదేభపంచానన, చీలదుర్గనరేంద్రచూఱ, పండియవినిర్జితశౌచ మహావ్రత" ఆది పెక్కు బిరుదములను గలిగియున్నాడు. ఈయన 1157ప్రాంతీ యుడు. ఈ వంశములోని భీమరాజనునతడు జాయంటుగా పాలించుచు నిట్టి బిరుదములనే ధరించుచు శక 1135 లో 25 పాడియావులను మల్లేశ్వరస్వామికి దానమిచ్చెను. పోతరాజు కుమార్తెలు పార్వతి, ప్రోలకదేవులు వరుసగా కోట కేతరాజు II, నతవాటిదుర్గరాజులను పెండ్లాడిరి. ఈ వంశీకులు క్రమముగా బెజవాడ గృహనామము ధరించియుందురు.

## యీమనికంద్రవాడి దుర్జయరాజులు

కమ్మరాష్ట్రములోని యీమనికంద్రవాడి దుర్జయరాజులకు మొదటివాడు పోతభూపతి. ఈయనకు కంటభూపతిజనించెను. ఈతడు వెలనాటి రెండవ చోడ రాజు సామంతుడు. నెల్లూరు సిద్ధిచోడుని కీతడు వైరిగానుండెను. ప్రాయశః ఆత

నితో యుద్ధములొనరించియుండును. అందుచే నితడు 1175-92 మధ్యవాదన వచ్చును. ఈతనికి గొంకనృపాలుడు జనించెను. యీ గొంకనృపాలుడు విప్పర్తి పోతరాజు కుమార్తె మేడాంబను పెండ్లియాడెను. ఈతనితర్వాత నీవంశములో రెండవ కేతరాజు 1207-1234 మధ్యపాలనకు వచ్చెను. గొంకరాజున కితడే మగునో తెలియదు. దాయాది కావచ్చును. ఈతడు చాల ప్రసిద్ధికెక్కెను. ముక్త్యాలలో నీతని శాసనమొకటి యున్నది. ఈతడు భోగాపురమున కధిపతి. వెలనాటి పృధ్వీశ్వరుని కితడు సామంతుడు. ఈమనినుండి యీతడు భోగాపురమునకు తన స్థానమును మార్చియుండును. ఈతని తర్వాత నీవంశవివరము తెలియదు. ఈ వంశీకులు భోగాపురపు గృహనామము ధరించియుందురు. రెడ్లలో నిట్టివారు కలరు.

## అయ్యవంశ నారపనాయకుడు

ఈయనకుజల్లయ, సూరయ యను సోదరులుండిరి. వీరందఱును యుద్ధమునం దారితేరియుండిరి. జల్లయ కన్నారదేవుని రణరంగమున జయించెనట. ఈ కన్నారదేవుడు తెలుగు చోడులలోనివాడు.

నారపనాయకుడు కృష్ణాసాగర సంగమమున కోటపురమును, రాజమందిరములను గట్టించి, యచట మంచితోటలను నిర్మించి, యచట కరాళ భైరవాలయ మొకటియు, విష్ణ్వాలయ మొకటియు గట్టించి ప్రసిద్ధి వహించెను. ఇంతేగాక నితడు వట్టికూరను గ్రామమున తన తండ్రి పేరిటి భీమేశ్వరాలయమును గట్టించి, యచట భీమసముద్ర మను చెఱువు నొకదానిని ద్రవ్వించెను. ఈయన వెలనాటిలోని క్రొయ్యూరను గ్రామమున నివసించుచువచ్చెను.

ఈయనకు పిన్నచోడు డను కుమారుడు జనించెను.

## పిన్నచోడుడు

ఈతడు గూడ వెలనాటి చోడరాజువద్ద (పృధ్వీశ్వరుడైయుండును) నొక సేనాధిపతిగా నుండెను. ఈయనకు జయపనాయకుడు, పృధ్వీనాయకుడు, నారపనాయడు నను కుమారులును, నారాంబ, పేరాంబ యను కుమార్తెలును గలరు. ఈయన భార్యపేరు దామాంబ. ఈయన కుమారులందరును యుద్ధము

లలో నారితేరిన వీరాగ్రేసరులుగా నుండిరి. కాకతి గణపతిదేవచక్రవర్తి వెలనాటిని జయింప వచ్చినప్పు డీయన విభవమును జూచి యీయన కన్యామణులగు నారాంబ, పేరాంబలను వివాహమాడి, యీతని కుమారులలోని జయపనాయకుని తన గజసేన కధ్యక్షునిగా నియమించెను. పిన్నచోడుడు వెలనాటి పృధ్వీశ్వరుని పేరిట తన కుమాళ్ళలో నొకనికి పృధ్వీనాయకుడను పేరు పెట్టినట్లు గన్పడుచున్నది.

## జయపనాయకుడు

గణపతిదేవ చక్రవర్తికడ నితడు గజసైన్యాధిపతిగా మిక్కిలి ప్రసిద్ధి వహించెను. ఈయన చక్రవర్తియనుగుగా బేరందెను. ఈతనికి "వైరిగోధూమ ఘరట్ట"ను బిరుదము గలదు. జయపనాయకుడు చక్రవర్తి పక్షమున కళింగ దేశ దిగ్విజయమునకై వెడలి యచటి వారిని జయించి, రాజ్యమును చక్రవర్తి స్వాధీన మొనరించెను. ఈయన శా. శ. 1175వ సం॥లో శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరస్వామి కఖండదీపదానము గావించెను. ఇతడు చక్రవర్తిపేరిట గణపేశ్వరాలయ మొకదానిని గట్టించి దాని కనేక గ్రామములను దానమిచ్చెను. ఇది శా. శ. 1153 వ సం॥లో జరిగెను. ఈ యాలయ పోషణకై పదవ కొక పణము పన్ను గైకొనుటకుగూడ యేర్పాటొనరించెను. ఇతడు చేబ్రోలులో తన తండ్రియగు పిన్నచోడుని పేరిట చోడేశ్వరాలయమును ప్రతిష్ఠించి, యచట దేవదాసీలకు రెండంతస్థులుగల రెండు వరుసల యిండ్లను గట్టించి యిచ్చి, దేవ భోగమునకై మోదుకూరను గ్రామమును దానమిచ్చి శాసనము వ్రాయించి కీర్తి జెందెను.

ఈయన గొప్ప విద్వాంసుడు గూడ నైయుండి నృత్తశాస్త్రమను గొప్ప శాస్త్రగ్రంధమును రచించెను.

ఈ అయ్యవంశీకులు కరికాలాన్వయులైనవారే యనియు నంబులుకుంట ప్రాంతము నేలిన శంకర చోడుడుగూడ నీవంశీకుడే యైనట్లతని శాసనములవల్ల స్పష్టపడుచున్నది.

## గొల్లపూడి కామానాయకుడు, దేవినాయకుడు.

వీరు శా. శ. 1207 వ సం॥ర ప్రాంతమువారు. వీరు తెలుగుచోడమును రాజు లశాఖీయులు. అందువలననే వీరి శాసనములో "ఒరయూరిపుర"బిరుదమును

జెప్పుకొని యున్నారు. వీరిర్వురును సోదరులు. కేశిమనాయకుడను నాతని పుత్రులు. వీరు ఆత్మకూరు తాలూకా చిరమన గ్రామమున వసించుచు నచట పాలకులుగా పేరందిరి. వీరు పల్లవరాజగు విజయగండ గోపాలునికి సామంతులుగా నుండిరి. వీరచటి మల్లికార్జునస్వామికి గొంతభూమిని దానమిచ్చి శా. శ. 1207వ సం॥లో శాసనము వ్రాయించిరి. వీరికి "గండరగండ, ప్రజ మెచ్చుగండా"ది బిరుదులు గలవు. ఈ వంశీకులు కులోత్తుంగ రాజ్యపాలనము నాటినుండియు ప్రసిద్ధిగా నున్నట్లు కనబడుచున్నది. కులోత్తుంగ రాజ్య 18 వ సం॥లో గొల్లపూడి నాయకర్ అనునాతడు ఆ గ్రామములోని కేశవస్వామికి పన్నులు దానమిచ్చి శాసనము వ్రాయించియున్నాడు. అతడుగూడ నీ వంశీకుడే యనవచ్చును. వీని చరిత్రనుబట్టి వెలుగు చోడరాజవంశము వారని చెప్ప వచ్చును. గొల్లపూడివారు నేటికిని కమ్మవారిలో గలరు.

## ఆలూరి ప్రోలభీముడు

ఆలూరివారు 11వ శతాబ్దమునుండియు ప్రసిద్ధిగ నున్నట్లు దృష్టాంతములు గలవు. ఈయన వెలనాటి గొంకనృపాలుని బంటునని చెప్పుకొనెను. ఈయన తండ్రిపేరు ఆలూరిబోయ పోతయ్య. ఈ ప్రోలభీముడు శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరస్వామి కఖండదీపారాధనకై లోహదండొకటి జేయించి యిచ్చి శాసనము వ్రాయించెను.

## ఆలూరి పోతినాయుడు

ఈయన ఆలూరి పురవరాధీశ్వరుడుగా నుండెను. ఈయనకు "సకల భువనరాజ్య లక్ష్మీనివాస, చలమర్తిగండ, శౌచగాంగేయ, సకల లక్ష్మీనివాస, వివేక కమలాసన, శిష్టసముద్ధరణ, పతికార్యసాధక, పరనారీదూర, పతిమెచ్చు గండ, మర్త్యయదుల, విబుధ వార్ధి వర్ధనసుధాకర, సర్వాలంకార, స్వామి ద్రోహరగండ సహకార నివాస, నిజపరాధి" అనుట బిరుదములు గలవు. ఇతడు చోడ నారాయణదేవ దివ్య శ్రీ పాదపద్మారాధకుండనని వ్రాసికొని యున్నాడు. అందుచే నితడు కులోత్తుంగ చక్రవర్తి 1 సామంతుడనవచ్చును. ఈయన 11 వ శతాబ్దములోనివాడు. ఈయన తండ్రి పేరు మల్లినాయుడు. ఇతడు శ్రీకాకొలనులోని శ్రీవాసిశ్వరస్వామికి నందాదీపము నుంచి

పఱుత్తిగడ పందుము చేను భూదానము గావించి శాసనము వ్రాయించెను. ఈయన దుర్జయవంశీకుడ ననియు చతుర్థకులస్థుడననియు జెప్పుకొనెను. ఈయనకు గల బిరుదములలో కొన్ని దుర్జయవంశస్థులగు కాకతీయ రాజులును, వెలనాటి రాజులును ధరించియున్నారు. ఈతండా వంశీకు డగుటవల్లనే యవి ధరింపగల్గెను.

## తూంబర్తి సిద్ధపనాయకుడు

గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలో తూబాడను గ్రామము గలదు. అది పూర్వము తూంబర్తి యనబడుచుండెడిది. ఆ గ్రామమున నివసించినవారు తూంబర్తి వారనియు తర్వాత తూమాటి వారనియు ప్రసిద్ధికెక్కిరి. అందు తూంబర్తి సిద్ధపనాయకుడు ఆ గ్రామమున కధీశ్వరుడుగా నుండెను. ఆతడు బుద్ధవర్మచే గొంత రాజ్యపాలనము బొందినట్లీ క్రింది పద్యమువల్ల దెలియును. ఇది యీతని వంశీకుడైన యొక కాపయనాయకుని శాసనములోనిది*.

"చం॥ అడపయు సందలంబు నివి * ధాతప వారణ కాహళావళిం
ఒడియము రాదిగా గల నృ * పాంక విహ్నలు బుద్ధవర్మచే
బడిసిన వాడు నాయక స * ధాముఁ సిద్ధపనాయ కాంఘ్రుఁ డి
వ్వుడమి దదీయ వీరభట * పుంగవు మన్మఁడుదాత్త సంపదన్".

యీ సిద్ధపనాయకుడు కాపయనాయకుని మనుమ డనియు, నా కాపయ గూడ తూంబర్తి శాసను డనియు దెలియుచున్నది. యీ సిద్ధపనాయకుడు యెఱ్ఱమండరాజు బనుపగా శత్రువుల జయించినందులకై ఆతుకూ రను గ్రామమును వృత్తిగా నిచ్చినట్లా శాసనమున గలదు. అందలి పద్యమిది.

"శా॥ తన్నుగ్గించుచు నెఱ్ఱమండఁడు ఋధా * ధారుండు పన్పంగ స
మన్నీటంగ నయంబుల న్రిపులకు * న్మార్పెట్టి యోడించి పే
ర్కొన్న న్మండన గంధవారణ సమా * ఖ్యం జేసి దూంబర్తి పై
నెన్న న్వృత్తిగ నాతుకూరు దయతో * నిచ్చె న్నిజస్వామియున్॥"

ఈయన సేవణి, సింగన, జగదేవుడు మున్నగు వారితో యుద్ధమొనరించి

* శాసన పద్యమంజరి.

యోడించినట్లు గన్పడును. ఈయన శా. శ. 1054వ సం॥లో నచటి శివాలయమునకు అఖండదీపదానముగావించి, వృత్తులను నృత్య వాద్యాదులనేర్పరచెనట.

ఈయనకు మండమాంబ యందు కాపయ నాయకుడు జన్మించెను. ఆ కాలపు భాషాశైలికి పై పద్యము నిదర్శనముగా నున్నది. అప్పటి కింకను ఋత్వమును విరివిగా వాడుకొనకుండిరి.

## తూంబర్తి కాపయనాయకుడు

ఈ కాపయనాయకుడు వెలనాటి రెండవ గొంకనృపాలుని వద్ద నొక సేనాధిపతిగా ప్రసిద్ధి వహించి నట్లరని శాసనములోని క్రింది పద్యమువల్లదెలియుచున్నది*1.

"ఉ॥ శ్రీ వెలనాటి గొంకనృప * శేఖరుశ్రీకరు సిద్ధిబేత వి
ద్రావణ రావణాంతక ప * రాక్రము విక్రమ చక్రిధూరితే
వో విభవాధి రాముఁడగు * చోడన వక్రము గొల్చి తత్ప్రసా
దావహలీల దాల్చిన మ * హోన్నతుఁడు కాపఁడు ధర్మశీలుఁడై॥"

ఈయన తూంబర్తిలో శివాలయ మొకదానిని గట్టించెను. ఈ వంశీకులే యిప్పుడు కమ్మవారిలో తూపాటివారుగా నున్నారు. ఈతడు క్రీ॥ శ॥ 1150 వ సం॥ ప్రాంతీయుడని చెప్పవచ్చును.

## విప్పర్ల అమరినాయకుడు

విప్పర్లవారు 12 వ శతాబ్దము నుండియు ప్రసిద్ధిగా నున్నట్లు కన్పడుచున్నది. ఈ అమరి నాయకుడు వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడరాజువద్ద నొక (భటాగ్రణి) యుద్యోగిగా నుండెను. ఈయన తండ్రిపేరు పోతినాయకుడు. ఈయన శా. శ. 1091 సం॥లో (శాలిహి 25) శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరాలయమున నఖండ దీప దానము గావించి శాసనము వ్రాయించెను2*. ఈయన తల్లి పేరు పెల్లమాంబ.

---

*1. శాసన పద్యమంజరి. *2. S.I.I. Vol. IV, No. 1241

## విప్పర్ల అమరి నాయకుడు ॥

ఈయన శా. శ. 1158 వ సం॥ర ప్రాంతీయుడగు సామంత నృపాలుడు. ఈయనకు "సమధిగత పంచమహాశబ్ద సామంత, తురగ రేవంత, దుర్జయకుల విభూషణ, దెలమదంలిసగాన, పరబలసాధక, స్వామిద్రోహ కులాంతక, సంగ్రామభీమ, శౌచగాంగేయ, గొత్తంగోస, రాచగుడియ, గోపులమారి, పులియ మూర్కొలువ, కటకమున్నెఱువమండలిక ధూమకేతు" మున్నగు బిరుదు లనేకము గలవు. వానిని మొదటి భాగమున వివరించితిమి. ఈ బిరుదములను బట్టి యీతడొక గొప్ప సేనాధిపతియని తలపవచ్చును. ఈతడు శా. శ. 1158 వ సం॥లో బెజవాడలోని మల్లేశ్వరస్వామి కఖండ దీపదానముగావించి పేరందెను. ఈయన దుర్జయ వంశజుడననియే వ్రాసికొనుట గమనింప దగినది. ఈ విప్పర్ల వారు కమ్మ వారిలో నేటికిని గలరు. వెలమవారిలో గూడ నీ వంశీకులు కొందఱున్నారు.

## భండారి ముప్పినాయకుడు

ఈయన వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడరాజు ॥ వద్ద భండారిగా నుండుటచే నాగృహనామము ధరించెను. శ్రీ ద్రాక్షారామములోని శ్రీ భీమేశ్వర స్వామి కితడు శా. శ. 1087వ సం॥లో నఖండ దీపదానము గావించి శాసనము వ్రాయించెను. ఈయన తల్లిపేరు బెత్తమాంబ.

## నిడుబ్రోలి సబ్బినాయకుడు

ఇతడు వెలనాటి కులోత్తుంగ చోడరాజు ॥ వద్ద కొట్టములపై నధికారము వహించి యుండెను. అందుచే నితని వంశీకులు కొట్టూరివారై పోయిరి. ఈతని కుమారుడగు ఎరియమనాయకుడు శా. శ. 1085వ సం॥లో నొక శాసనము వ్రాయించెను.

## కొట్టూరి ఎరియమనాయకుడు

ఈయన గూడ కోష్ఠములపై యధికారిగా వెలనాటి కులోత్తుంగ చోడ నృపాలుని వద్ద నున్నట్లితని శాసనము వల్ల దెలియగలదు. ఈతడు శా. శ.

1085 వ సం॥ర ప్రాంతీయుడు. ఈయన ద్రాక్షారామ భీమేశ్వరస్వామికి నిత్య నైవేద్యమునకు ద్రవ్యములన్నియు నిచ్చి, కొంత భూమి నిచ్చి లనన్తారామమున పోకతోట నొక దానిని దేవునకు కొనియిచ్చి ఖ్యాతి జెందెను. ఈయన కొని యిచ్చిన పోకతోట వెయ్యి చెట్లు గలదిగా నుండెను. ఇతడు తర్వాత వెలనాటి రాజేంద్ర చోడరాజువద్ద ధనాధికారిగా నుండి శా. శ. 1089వ సం॥లో ఒంగోలు తాలూకా కొండమంజులూరు గ్రామములో నొక శివాలయము గట్టించి భూదాన మొసంగెను *.

## మోరంపూడి పోతినాయడు

ఈయన వెలనాటి కులోత్తుంగ గొంక నృపాలుని వద్ద నొక మంత్రిగా నుండి ప్రసిద్ధి వహించెను. ఈయన తండ్రి పేరు కాటయ్య. ఈ పోతినాయడు శా. శ. 1077 వ సం॥లో శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరస్వామి కఖండ దీపదానము గావించి లోహ దండొకటి చేయించి యిచ్చుటయే గాక, నాదేవుని మధ్యాహ్న నివేదనమునకై నిత్యమూ రెండు కుంచముల దియ్యము వండుటకు నన్నైచెట్టి పొలము పడమర భాగములో మూడుపుట్ల భూమిని దాన మొసంగి ఖ్యాతి గాంచెను. తేవనికంద్రవాటి మొఱమపూడి యీయనగ్రామమైయుండెను. ఆ మొఱమపూడియే క్రమముగా మోరంపూడిగా నిప్పుడు పిలువబడుచున్నది. ఇది తెనాలి తాలూకాలో నున్నది.

## వింజము పోతరాజు

ఇతడు కులోత్తుంగ చోడ నృపాలుని యధికారులలో నొకడు. ఈయన వద్ద ఎఱ్ఱిపోతను సేవకుడుండి శా. శ. 1062 వ సం॥లో శ్రీ భీమేశ్వరస్వామి కఖండ దీపదానము గావించి యుండెను. ఈయన తల్లి వింజమదేవి, తండ్రి భీమరాజు. వింజమదేవి శా. శ. 1067 వ సం॥లో శ్రీ భీమేశ్వరుని కఖండ దీప దాన మొసర్చెను. 50 యినుప యెద్లనుగూడ సమర్పించెను. కమ్మవారిలో నిప్పటికిని వింజము వారున్నారు. ఈ వంశ మింత ప్రాచీన మైనదిగ గన్పడు చున్నది.

---

* N. I. O. / 59 & 60.

పాములపాటివారు

## పాములపాటి కొమ్మనాయకుడు

ఇతడు పాములపాటి మండనకు యేడుమాంబయందు జనించెను. ఈతడొక సేనాధిపతిగా నుండి పాములపాటిలో మల్లిఖార్జున స్వామికి శా. శ. 1094 వ సం॥లో నఖండ దీప దానము గావించెను*. ఈ దీప దానము తన తల్లిదండ్రుల ధర్మమునకైచేసెను. ఈ విషయమాతడు వ్రాయించిన పద్యశాసనమున నున్నది. అది యీ క్రింది విధమున నున్నది.

"ఉ॥ పాములపాటి మండనకు * బంకరుహానన యేడుమాంబకుం
గామ నిభుండు గొమ్మన సు * ఖస్థితి బుట్టి నిజాన్వవాయ సు
త్రాముఁడు తల్లిదండ్రులకు * ధర్మవుగా దన వృత్తిపై గ్రహ
గ్రామణి బోలిదీపక మ * ఖండితమై మహి బర్వి యొప్పఁగాన్॥"

"కం॥ శరధినిధిఖేందుసక వత్సర సంఖ్యల గా త్రిఃకమున * దనరిమ పూర్ణన్
స్థిరగురు దినమున గొమ్మన యురుతర దీపంబు శివున*కొప్పగ నిల్పెన్॥"

## పాములపాటి కేతన కుమారుడు కొమ్మన

పైన నుడివిన కాలమునకే మఱియొక కొమ్మన గూడ నీ వంశమున ప్రసిద్ధిగా నుండెను. ఈయన పాములపాటి కేతన కుమారుడు. ఈతడు గూడ మల్లిఖార్జున స్వామి కఖండ దీప దానము గావించినట్లీ క్రింది శాసనము వల్ల దెలియుచున్నది.

"ఉ॥ శ్రీమహిమాభిరాముఁడు వి * శేషిత కీర్తుఁడు గొమ్మఁ డర్థి చిం
తామణి తల్లిదండ్రులకు * ధర్మవుగా శివధర్మయుక్తుఁడై
పాములపాటి నొప్పఁగఁ గ * వర్ధికి సజ్జన సంస్తుతంబుగా
ధీమణి వెట్టె నాత్మకుల * దీపకమైన యఖండ దీపమున్॥"

---

* శాసన పద్యమంజరి.

## పాములపాటి వేమయ్య

ఇతడు శా. శ. 1095 వ సం॥ర ప్రాంతమున పాములపాటిలో నుండిన యొక ప్రసిద్ధ పురుషుడు. ఈయన యెరగాంక పుత్రుడు. ఇతడు గూడ మల్లికార్జున స్వామికి పాములపాటిలో నఖండ దీపదానము గావించి యీ క్రింది శాసనము వ్రాయించెను*1.

"ఉ॥ వారక యా నిశాకర ది * వాకరమై చనఁగా శకాబ్దముల్
ధారుణివార్ధి నందదివి * తారకనాథ మితంబుగా మహిన్
గౌరవ నుత్తరాయణము * గారమె(యిన్) యెరగాంకపుత్రుఁడు
త్సారిత దోషపుంజము వి * చార వరుండు ధరాతలంబునన్॥"

## పాములపాటి కొండయ్య

ఇతడు పాములపాటి భీమన్నకు కామవసానికి బుట్టి పేరొందినవాడు. ఇతడు గూడ తన తల్లి దండ్రుల ధర్మమునకై పాములపాటి మల్లికార్జునున కఖండ దీపదానము గావించి యుండెను*2.

## భట్టిప్రోలి చోడపనాయకుడు

ఇతడు శా. శ. 1102 వ సం॥ర ప్రాంతీయుడు. ఈయన వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడరాజువద్ద భట్టిప్రోలు ప్రభువుగా బ్రసిద్ధి వహించియుండెను. ఈయన తండ్రి కంచెమ నాయకుడు. ఇతని తల్లి గుండసాని. ఈయనకు కామాసాని యను భార్య యుండెను. ఇతడు తన తల్లి దండ్రులకును దనకును తన భార్యకును ధర్మార్థమై శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరున కఖండ దీవ దానము గావించి లోహ దండొకటి చేయించి యిచ్చి శాసనము వ్రాయించెను. భట్టిప్రోలి వారిప్పటికిని రెంటచింతల ప్రాంతములో కమ్మవారిలో నున్నారు.

## ఈడుపుగంటి సేవకేతినాయుడు

ఇతడు పన్నెండవ శతాబ్దములో నుండిన యొక ప్రసిద్ధ పురుషుడుగ గన్పడు చున్నాడు. ఈయన శాసన మొకటి బెజవాడలోని మల్లేశ్వరాలయమున

---

*1 & *2 శాసన పద్యమంజరి.

నున్నది. దానిని బట్టి చూడగా నీయన యచటి మల్లేశ్వరస్వామికి అఖండ దీపారాధనకై కొన్ని గొఱ్ఱెలను సమర్పించినట్లు కనబడుచున్నది. **(S I I Vol IV. P. 955)**

## నాదెండ్ల కేతి నాయుడు

ఈయన శా. శ. 1177 వ సం॥ర ప్రాంతీయుడు. ఈయన తండ్రిపేరు భీమనీడు. తల్లిపేరు యఱకాసాని. ఈయనగూడ బెజవాడలోని మల్లేశ్వర దేవరకు శా. శ. 1177 వ సం॥లో నఖండ దీపదానముగావించి ప్రసిద్ధి వహించెను. **(S. I I. Vol IV P. 252)**

## కొల్లూరి దుడియపనాయకుడు

ఈయన 12 శతాబ్దములో నుండిన యొక ప్రసిద్ధపురుషుడు. గుంటూరు తాలూకాలోని కాజ గ్రామమందు గల నరేంద్రీశ్వర మహాదేవర కితడు సంధ్య దీపమునకై ద్రవ్య దానమొసంగి శా. శ. 1078 వ సం॥లో నొక శాసనము వ్రాయించెను. ఆకాలమున నా గ్రామము క్రాంజ యను పేరిట నుండెను. **(S. I I. Vol IV. P. 253)**

## కొల్లూరి భీమినాయకుడు

ఈయనగూడ 12వ శతాబ్దములోనివాడే. ఈయన తండ్రిపేరు కాపినాయకుడు. ఈతని భార్య మేడాసాని. ఈమె శా. శ. 1067 వ సం॥లో ప్రేంపల్లి (బాపట్ల) లోని భావనారాయణస్వామి కఖండదీపదాన మొనర్చి శాసనము వ్రాయించెను*1.

## ద్రోణాది నారపనాయకుడు

ఈయనకూడ 12వ శతాబ్దమువాడే. ఈతని తండ్రిపేరు ద్రోణాది వేమె నాయకుడు. ఈనారపనాయకుడు శా. శ. 1071 వ సం॥లో ప్రేంపల్లి (బాపట్ల) లోని భావనారాయణస్వామి కఖండ దీపదానము గావించి ప్రసిద్ధి వహించెను2*.

---

*1. S. I. I. Vol. VI. No. 129 2. S. I. I. Vol. VI No. 134

## కంకణాల మల్లినాయకుడు

ఈయన 13 వ శతాబ్దమువాడు. ఈయన తండ్రి కందెనాయకుడు. మల్లెనాయకుడు శా. శ. 1163 వ సం॥లో బాపట్లలోని శ్రీ భావనారాయణదేవర కఖండ దీపదానము గావించి యచట నొక శాసనము వ్రాయించి కీర్తిజెందెను.

## చిలుకూరి భీమనాయకుడు

ఈయన 11వ శతాబ్దములోనివాడు. ఇతడు కులోత్తుంగ చోడరాజు దివ్య సం॥ 9 లో బాపట్లలోని శ్రీ భావనారాయణస్వామి కఖండ దీపదానము గావించి ప్రసిద్ధివహించెను. ఇతడు పెన్నాతవాడిలోని వాడనని చెప్పుకొనెను. ఆకాలమున బెజవాడ ప్రాంతమట్లు ప్రసిద్ధినొందెను. ఈయన తండ్రిపేరు చిక్కినాయకుడు.

## మునునూరి గొండయ్య

ఇతడు టూర్పునాటి వాడనని చెప్పుకొనెను. ఇతడుగూడ కులోత్తుంగ రాజ్యపాలన కాలమునాటివాడు. అందుచే 11వ శతాబ్ద పురుషవర్యు డనవచ్చును. ఈయన దాన శాసనమొకటి బాపట్లలోని భావనారాయణస్వామి యాలయమున గనబడుచున్నది.

ముక్రామల ఉప్పినేడు 1296 ప్రాంతీయుడు. ఈయన శాసనము పాలకొల్లులో నున్నది.

కురుగంటి కొమ్మనాయకుడు - డామలూరి పురాధిపతి. ఈయన 1155 ప్రాంతీయుడు. అమరేశ్వరస్వామి యాలయమున నితని శాసనమున్నది. ఇతడొక అమాత్యుడు. వెలనాటి కులోత్తుంగ గొంకరాజు వద్దనుండెను.

ముసునూరి ముచ్చినాయుడు. ఇతడు 1221 ప్రాంతీయుడు. జమ్మిపల్లిలో నీయన శాసనమున్నది. (A. R No 188 of 17)

నల్ల సూరప్పనాయడు. వోగోరుప్రాంతమున నెల్లూరు చోడ రాజులలోని గండగోపాలతిరు కాలతిదేవరాజు సామంతుడగు ముక్కంటి కామయదేవునివద్ద నొక అధికారి. ఈయన 1231 ప్రాంతీయుడు. (L. R. Vol. 8).

విప్పర్ల కొండపనాయుడు, గుండపనాయుడులు. వీరు 1218 ప్రాంతీయులు. కోటకేతరాజు సామంతులు. (A R. No. 109 of 16) వీరు ముక్త్యాలలోని దేవళ్ళకు భూదానము లొసంగి ప్రసిద్ధికెక్కిరి.

మందడి ప్రోలినాయకుడు. 1128 ప్రాంతీయుడు. ఈయన వెలనాటి గొంకరాజు సేనాధిపతులలో నొకడు. ఇతడు పహిండిపాల (పైడిపాల రూపాంతరము) వంశీకుడు. తనుమందబర్తి పురవరాధీశ్వరుడు. ఇతనికి గండరగండ, గండమార్తాండ, అరిబిరుదమదద్విరద మదనివారణ" బిరుదులున్నవి*1. ఇతనికి మట్టినాయకుడను సోదరుడు, వాసినాయకుడనే కుమారుడు గలరు. మట్టినాయకుడు 1119 లో వెల్లటూరిలో త్రికోటేశ్వరాలయము గట్టించి 122 పుట్ల భూమి నొసంగెను *2. 1160 ప్రాంతమున నీవంశములో కొండపనాయకుడు పేరొందెను. వెలనాటి గొంకభూపాలుని యిష్టభృత్యుడు సథాముడు యను నొక మందడికోటడు కనబడుచున్నాడు*3. ఇట్టివారెందరోయుండినను కాలగర్భమున బడి వారిపేర్లన్నియు దొరకుటలేదు.

## సంస్కృతి, దేశరక్షణాదులు 1250 A.D. వరకు

12వ శతాబ్ది మధ్యవరకు కమ్మరాష్ట్రములోని కమ్మవారి పూర్వీకులగు దుర్జయచోడవంశీకులు, ధనంజయవంశీకులు, త్రిలోచన పల్లవుని కాలమునుండి సామంతులుగా మెలంగుచు దేశరక్షణకార్యములో స్వప్రమత్తులుగా నుండుటవల్లనే వారిక్రింద కమ్మరాష్ట్రము దాదాపు 9 శతాబ్దము లుండగల్గెను. వీరు బౌద్ధ, జైన మతముల కాలములో నామతము ననుసరించి వానిని పోషించుచువచ్చిరి. వీరు తిరిగి యార్యమతమున జేరినకొలదిని యనేకదేవాలయములను నిర్మించుచు, వానిని పోషించుటకై యనేక భూములు మొదలైనవి యిచ్చుచువచ్చిరి. శాశ్వతాఖండ దీపారాధనలకై తమ ద్రవ్యమును, గొర్రెలను,యెనుములను, ఆవులనుగూడ దానమిచ్చుచువచ్చిరి. ముఖ్యముగా నివి 11 వ శతాబ్దినుండి హెచ్చుగా కనబడుచున్నవి.

---

*1 L. R Vols. 38 & 41.

*2. & *3. L R. Vols. 38 & 41.

కులప్రాశస్త్యమునకై యంత పట్టుదలచూపక, కొందరు క్షత్రియులుగాను, కొందరు చతుర్థులుగాను వ్యవహరించిరి. అట్లున్నను అన్యోన్యము వివాహాదుల గావించుకొనిరి. మతము వీరి కడ్డురాలేదు.

వీరు విద్యాపోషకులుగాగూడ ప్రసిద్ధినందిరి. మంచనకవి వెలనాటిరాజుల కాలములో కేయూర బాహుచరిత్ర రచించి, యందు వెలనాటిరాజుల ప్రతిభను విస్తారముగా వర్ణించెను. ఆ కాలములో ప్రజలవద్ద మంటికడవలు, నులకమంచములు లేవట. అందరైశ్వర్యముతో తులతూగుచుండిరట. వెలనాటి గొంకరాజు విద్వత్పంకజాళీమృగాంకుడు. 1125–39 మధ్యనుండిన కొండపడమటి మన్మమండరాజు కావ్యవినోది. సుకవికీరసపి కారుడు. ఈ రీతిగా కవితాగోష్ఠి యందు రాజులు పాల్గొనుటయేగాక ప్రజలకుగూడ అభిమానముండెను. పాములపాటిలోని 1172 సం॥రపు శాసనములో పద్యరచన యున్నది. సంస్కృతశ్లోకములు ధారాళముగా రచింపబడి, శాసనములందు ప్రభువులచే వ్రాయింపబడెను. 1224 సం॥పు శాసనములో పక్కని తెలుగు కందపద్యములను [illegible] రాజగు ఓపిలిసిద్ధిచోడుడు II వ్రాయించియున్నాడు. ఆ కాలపు బిరుదములు గూడ ముచ్చటగానున్నవి. 10వ శతాబ్దములో "అవనిరాభరణ, సమరైకవీర, అసహాయవిక్రమ, సగర్వాయబృహస్పతి, ఆకారభగీరథీ, రణరంగ రాక్షస, విక్రాంతచక్రాయుధ, రాజమకరధ్వజ, అరిరాజభీషణ, నరలోకరుద్ర, త్యాగమహార్ణవ, ఉదారదధీచి" యిత్యాదు లాకాలపు కవితాసౌందర్యమునకు నిదర్శనములు. వీరు బ్రాహ్మణులకనేక అగ్రహారములొసంగిరి. కోటకేతరాజు ఒక్కడే 15 గ్రామములనిచ్చెను. కొన్ని బ్రాహ్మణులకు, కొన్ని దేవునకు, కొన్ని బౌద్ధులకు నిచ్చెను. బౌద్ధదేవాలయములలోను, ఆర్యమత దేవాలయములందును, తమ కొరికలను దీర్చుటకు, పుణ్యమునకు, జన్మాంతరమునపుణ్యము చేకూర్చుటకు అనేకదానములను నాటి ప్రభువులు, ప్రజలు కావించిరి. ఈ విశ్వాసములే పరంపరా యిప్పటికి వచ్చుచున్నవి. దేవునకు బంగరుకలశములు, నగలు, కనకవలయములు, గద్యలు, వళ్ళెములు యిత్యాదు లొసంగుచుండిరి. బౌద్ధమతమునకు, జైనమతమునకు, వీరశైవమునకు గొన్ని మతయుద్ధములు జరిగినట్లు బసవపురాణము, పండితారాధ్య చరిత్ర మొదలైన గ్రంథములనుబట్టి చెప్పవచ్చును. చివర కార్యమతము ప్రాబల్యములోనికి వచ్చినట్లు కనబడు

చున్నది. 12వ శతాబ్దమధ్య నీకారణముననే కాకతీయరాజులు తమరాజ్యములో శైవదేవాలయముల నభివృద్ధి గావించిరి. కమ్మరాష్ట్రములో నట్లే జరిగెను.

రాజులు అన్ని కులములవారిని సేవలలో జేర్చుకొనుచువచ్చిరి. గొల్లలు, వైశ్యులు, విశ్వకర్మలు, మాలలు, మాదిగలు, బ్రాహ్మణులు, వెలమలు, కమ్మలు, రాజులు, రెడ్లు మొదలగువారు యుద్ధములు చెలరేగినప్పుడెల్లను పాల్గొనుచువచ్చిరి. వీరందరి శాసనములు అచటనచట కనపడుచున్నవి.

రాజులొనర్చెడు ధర్మకార్యములు సాధారణముగా బంధుప్రీతిగా నుద్యోగములిచ్చుట, సత్రములు నిర్మించుట, శివాలయములు కట్టుట, చెరువులు త్రవ్వించుట, నిధులు నిర్మించుట, అర్థుల పోషించుట యిత్యాదులుగానుండెను. మారయ పండదను సేనాని వెలనాటి గొంకనృపాలుని మాయమైయుండి, యీ కార్యములొనర్చియుండెను.

ఏదో యొకదేవుని గొల్చుట కమ్మరాష్ట్రములోని ప్రతిమానవునికి ముఖ్య ధర్మముగా నుండెను. సప్తసంతానములనునవి రాజులు పోషించిరి.

## 12 వ శతాబ్ది స్థితి

కమ్మరాష్ట్రవాసులైన ప్రభువులు కమ్మవారుగా గాకతీయ మొదటి ప్రతాపరుద్రునిచే బేర్కొనబడి, యప్పటినుండి క్రమముగా 14వ శతాబ్ది నాటికి ప్రత్యేకకులముగా కమ్మవారెన్నబడుచుండిరి. అప్పటివరకు కమ్మరాష్ట్రము, నాడులలో సూర్యవంశీకులగు తెలుగుచోడరాజులు, వారిలోశాఖీయులు ధనంజయ గోత్రికులగు కోటవంశ చోడరాజులు, దుర్జయాన్వయులు, దుర్జయాన్వయ వెలనాటి చోడరాజులు, హైహయవంశరాజులు, చంద్రవంశపు చాళుక్యరాజులు, నాగరాజులు, యాదవరాజులు, పల్లవరాజులు మొదలగు ప్రముఖులు వసించుచువచ్చిరి. తెలుగుచోడరాజులు హైహయ, చాళుక్యరాజులతోను; దుర్జయాన్వయులు, కోటవంశీకులు, వెలనాటిరాజులు, దుర్జయాన్వయులతోను; హైహయ రాజులతోను, చాళుక్యరాజులు, తెలుగుచోడరాజులు, హైహయరాజులు, దుర్జయాన్వయులతోను; పల్లవరాజులు, చోడరాజులతోను సంబంధములు చేయుచుండిరి. కాకతీయ దుర్జ

యాన్వయులు తెలుగు చోడులతోను, కోటవారితోను; నతవాటిసీమ దుర్జయుల తోను, చివరకు చాళుక్యరాజులలోను, బంధుత్వములు సల్పుచుండిరి. వీరందరును మతాంతరభేదములను పాటింపక అందరును సుక్షత్రియులను భావమందే యట్టి చుట్టరికములు గావించుచు వచ్చిరి. వీరందరును 'వర్మ' బిరుదము ధరించిరి. ఇందులో చాలమంది కమ్మరాష్ట్రనివాసులై క్రమముగ కమ్మవారైపోయిరి. కమ్మ నాయకులు, కమ్మదొరలను పేర్లు 14వ శతాబ్ది మధ్యనే స్థిరముగా నేర్పడినట్లు వెలుగోటివారి వంశావళివల్ల దెలియుచున్నది.

ఇందలి నాగ, యాదవ, పల్లవరాజులు కమ్మవారిలో జేరినట్లు కనబడుట లేదు. అయ్యవోలు పురాధిపతులుగా చేరొందిన బలిజకులస్థులి శతాబ్దములో వేరుగా గన్పడుచున్నారు. వీరు బలిజులమని చెప్పుకొన్నవారి శాసనములు 12, 13 శతాబ్దములనుంచి కమ్మనాటిలోగనబడుచున్నవి. అప్పటినుండి వీరు ప్రత్యేక ముగా నుండిరని చెప్పవచ్చును.

—— ——

# 3. కాకతీయ, ముసునూరి రాజ్యములు

## కాకతీయుల పాలన

హనుమకొండ రాజధానిగా దుర్జయాన్వయులగు కాకతీయ రాజులు 10వ శతాబ్దికి పూర్వమునుండి పాలించిరి. వారి చరిత్ర 11వ శతాబ్దినుండి తెలియుచున్నది. పశ్చిమచాళుక్య చక్రవర్తి ఐదవ విక్రమాదిత్యుని సామంతుడుగా మొదటి బేతరాజు 1025-50 మధ్య పాలించెను. ఈతడు కొరవిమండలమును పాలించుచు చోడరాజులతో తన చక్రవర్తిపక్షమున యుద్ధములు సల్పుచువచ్చెను. విరియాల యెఱ్ఱభూపతి, కామమసాని లీతనికి తోడ్పడి రాజ్యమును కాపాడిరి. వీరుగూడ దుర్జయవంశీకులే. ఈ గృహనామస్థు లిప్పటికిని కమ్మ, వెలమవార లలో నున్నారు. కమ్మ, వెలమవార లొకేజాతి యనుటకును, కాకతీయు లీవంశీకులేననుటకును, వీరి శాసనములు దృష్టాంతముగా నున్నవి.

ఈయనతర్వాత కుమారుడు ప్రోలరాజు 1050-80 మధ్యనేలెను. ఇతడు త్రైలోక్యమల్లవిభుని సామంతుడు. ఈతడనేక దండయాత్రలలో బాల్గొని ధారావర్షుని, గొడవర్తి దుగ్గరాజు కొడుకును, పురకుదేశపు గన్నయను, భద్రంగ పురాధిపతిని జయించెను. ఈతని వద్దనున్న బ్రహ్మసేనాని కంచిదుర్గ కవాటములను భేదించి, యాదేశమును జయించెను. కొంకణము, చక్రకూటముల నీనృపాలుడు లోబడజేసెను. ఈయనకాలమున జైనమతము పోషింపబడుచుండెను. ఋషభనాధయతి హనుమకొండలో నివసించెను.

ఈయనతర్వాత 2వ బేతరాజు రాజ్యమునకువచ్చి ఆరవ విక్రమాదిత్యునికి సామంతుడై 1080-1115 మధ్యను పాలించెను. ఇతనికి సబ్బిసాయిరమండలముల వెయ్యిగ్రామముల పాలనగూడ నీబడెను. మాళ్వ, చోళనృపాలురతో నీతడు యుద్ధములు సలుపుచు విక్రమచక్రియని పేరొందెను. వైజనదండనాథుడీతనిమంత్రి. హనుమకొండలో వనమొకటియు, శివపురతీర్థమును, బేతేశ్వరాలయమును, వరుణాలయమును నెలకొల్పెను. ఈయన మొదట జైనమతస్థుడుగా నుండి చివరకు కాలాముఖ శైవశ్రీశైల గురాచార్యునివద్ద శైవదీక్షను బొందెను.

ఈతనితర్వాత రెండవ ప్రోలరాజు 1115-1158 మధ్య పాలించెను. ఇతడు తైలపదేవచక్రవర్తిని బంధించి, విడచి తర్వాత స్వతంత్రుడయ్యెను. కుంరోరిని పాలించిన గోవిందరాజును, మంత్రకూటాధిపతి గుంద్రాజును, జగద్దేవుని, దొమ్మెరాజు, మేడరాజులను జయించి గుంద్రాజును చంపించెను. ఉదయచోడునికి సామంతపాలన మిచ్చెను. ఈతని గురువగు రామేశ్వరదీక్షితు లనేక దానధర్మము లాచరించుచు నిత్యాన్నదాత యయ్యెను. ధర్మసత్రములు, శైవాలయముల నాతడు నెలకొల్పెను. ఈతడు ముప్పమదేవియను భార్యవల్ల 5 గురు కుమాళ్ళను గాంచెను. రుద్రదేవుడు, మహాదేవుడు మొదలగువారు, బేతమంత్రి యొక చెరువును ద్రవ్వించగా దాని కితడు గొంత భూమినిచ్చెను. ఈతడు వెలనాడుపై దండెత్తగా నాయుద్ధములో జంపబడెను. ప్రోలరాజను నొక కవి యీకాలములో నుండెను.

## రుద్రదేవుడు

తర్వాత రుద్రదేవుడు పాలనకువచ్చి 1159-95 మధ్య 36 సం॥ ములు పాలించెను. పేరుకుదగినట్లే యీతడు మిక్కిలి పరాక్రమశాలి. వర్ధమానపుర మందలి గోకర్ణ భీమచోడులను, ఉదయచోడుని జయించెను. ఉదయచోడుని కుమార్తె పద్మావతి నితడు పరిణయమాడెను. ఈతడు తన తండ్రికాలములోనే మేడరాజు, మైలగి, దొమ్మెరాజులను జయించెను. ఈతడు శ్రీశైలము వరకు రాజ్యమును విస్తరించెను. పడమట కటకపురివరకు వ్యాపింపజేసెను. ఇతడు పండితకవియై నీతిశాస్త్రమును రచించెను. సంస్కృతాంధ్ర కవీశ్వరులను జాల మంది నీయన పోషించుచువచ్చెను. అచింతేంద్ర కవి యిందొకడు. చెల్లెకి గ్రామ వాసియగు గంగాదర కవికి అమాత్య పదవినిచ్చెను. ఆతడు విద్వజ్జనుల కగ్ర హారములిచ్చి, సప్తసంతానములగాంచి శైవ, వైష్ణవాలయముల ననేకచోట్ల నిలిపి పేరొందెను. ఈయన రాజధానిని యేకశిలానగరమునకు మార్చెను. ఈయన రాణి మేళమాంబిక. దేవాలయములపోషణ కితడు 84 గ్రామములిచ్చి, సప్తఋషి గురువుల పేర 11 బ్రాహ్మణాగ్రహారములనిచ్చి యశస్వియయ్యెను. ఈయన రాజ్యములో శైవ, వైష్ణవమతములు సమానముగావ్యాప్తిజెందెను. కమ్మ, వెలమ వారలు దుర్జయాన్వయులై యుండి, మిక్కిలి తోడుపడుచుండగా మెచ్చి వారికి కమ్మవారు, వెలమవారను గౌరవనామములనిచ్చి సత్కరించెను. వీరు జాతిషితగ

నీయనను జూచుచుండిరి. వెలమవారికి 72 మందికి దుర్గరక్షణాదిపత్యమును, దేశరక్షణ సేనాధిపత్యముల నిచ్చి గౌరవించెను. సహపంక్తి గౌరవముల నిచ్చెను. రేచెర్ల నామిరెడ్డి, బేతిరెడ్డి, మల్యాల సజ్జ సేనాపతి మున్నగువారీయన సామంతులు. తుదకీతడు దేవగిరిపాలకుడగు జైతుగిలో నొనర్చిన యుద్ధము లందు హతుడయ్యెను. అంతట మహాదేవుడు రాజయ్యెను. ఈతడు తన కుమార్తె కుందాంబను నతవాటిదుర్జయాన్వయుడగు రుద్రరాజునకిచ్చెను. బాలసరస్వతి యనుకవి యాకాలమున ప్రసిద్ధిజెందెను. ఈతడు 1198 వరకు పాలించి చని పోగా నితని కుమారుడు గణపతిదేవచక్రవర్తి పాలకుడయ్యెను.

## గణపతిదేవచక్రవర్తి 1198-1261

ఈయన వెలనాడును జయించి, యచట పిన్నచోడుని కుమార్తెలగు నారమ్మ, పేరమ్మలను పరిణయమై వారి సోదరుడగు జాయపనాయకుని తన గజసైన్యాదిపతిగా నియమించెను. కోటబేతరాజునకు తనకూతురు గణపాంబనిచ్చి వివాహమొనర్చెను. ఈయనకు విశ్వేశ్వరశివుడను మతగురువుండెను. ఈయన చెప్పినప్రకారమే రాజ్యాంగమును నడపుచువచ్చెను. మందడగ్రామమువద్ద నాతని కొక మఠమును నెలకొల్పెను. కమ్మరాష్ట్రములో ప్రముఖులతో సంబంధ ములను గల్పించుకొని యేకజాతిగా వ్యవహరించి జాత్యభిమానము నీతడు చూరగొనెను.

ఈయనవద్ద వెలమవారిలోని ప్రసాదిత్యనాయడు మున్నగు 77 నాయ కులును, రేచెర్ల బేతిరెడ్డి, రుద్రరెడ్డి, నామిరెడ్డి ఇందులూరి సోమరాజు మొదలగు సేనాధిపతులుగూడ నుండిరి. వీరందరి పరాక్రమమువల్లను యితడాంధ్రదేశము లోని కళింగము, కొలను, గోతమీతటము, గోగునాడు, వెలనాడు, పొత్తపి, ములికినాడులు, ఏరువనాడు, సకిలినాడు, రేనాడు, కమ్మనాడు, గండికోట, కాంచీపురి, నెల్లూరు మున్నగు ప్రదేశములను జయించి, యనేక జనపదముల గట్టించి, నూతులు, చెరువులనేకములు త్రవ్వించి కీర్తిశాలియయ్యెను. మోటుపల్లి రేవును వృద్ధిజేసి విదేశవ్యాపారము నభివృద్ధిపరచెను. జైనమతస్థుల గొందరను చంపించి వారి వసతులను తీసుకొనెను. ఈయనకాలములో గోపాలకవి, హరిహరార్యుడు, తిక్కన సోమయాజి, బాలభారతి, వంశమిత్రుడు, కవి చక్ర వర్తి, మయూరభట్టు మున్నగు ప్రసిద్ధకవులుండిరి.

ఈయన పట్టపురాణి సోమిదేవి. ఇతడు కందుకూరుసీమ, ములికినాడు, సకిలినాడు, ఏరువనాడు, పొత్తపినాడు, రేనాడు, గండికోట, కమ్మనాడు, వెల నాడు, కొలనుపురము, కళింగదేశములోని బొక్కెర వరకు గల ప్రాంతములను జయించి చక్రవర్తి యయ్యెను. కాయస్థుడగు గంగయ సాహిణియు, రేచెర్ల బేతిరెడ్డి, రుద్రరెడ్డి, ప్రసాదిత్యనాయడు మొదలగు ప్రసిద్ధ సేనాను లీయనవద్ద పనిచేయు చుండిరి. వెలమవారు 77 గోత్రములవారు ఈయనవద్ద సేనలలోను, కోట బురుజులపద్దను రక్షకులుగా నుండిరి. ఈయన పాండ్యరాజులను జయిం చెను. గంగయ సాహిణికి బాహత్తర నియోగాధిపత్యమిచ్చెను. అనగా 72 విధములైన ఉద్యోగముల నియమించు నధికారమిచ్చెను. వెలమవారికి సహపంక్తి భోజనమిచ్చి గౌరవించెను. జైన, బౌద్ధుల గొందరిని చంపించెను. కమసాళ్ళ కరిణీకముల దీసుకొని గోపరాజు రామన్న మంత్రి ప్రోత్సాహమున నియోగుల కిచ్చెను*1.

ఈ మహారాజు క్రింద నీక్రింది కమ్మనాయకులుండిరి.

(1) జాయపనాయకుడు : పిన్నచోడుని కుమారుడు. అయ్య వంశీకుడు, అందుచే తెలుగు చోడవంశీకుడే, పిన్నచోడుని తండ్రి నారయ్య వెలనాటి రాజువద్ద కృష్ణా ముఖద్వార ప్రాంతమున కదిపతి. ఈతనికి జల్లయ్య, సూరయ్యయను సోదరులుండెడివారు. వీరందరు క్రొయ్యూరు కాపుర స్థుడగు భీమనాయకుని సంతతి. జాయపనాయకుని సోదరీమణులగు నారమ్మ, పేరమ్మలను గణపతిదేవ చక్రవర్తి పెండ్లాడిన పిమ్మటనతనిని గజసేనాధ్యక్షుని జేసెను. ఈ జాయప నృత్త శాస్త్రమును సంస్కృత మున రచించి పేరొందెను. ఈతని శాసనము కమ్మరాష్ట్రము నందలి చేబ్రోలులో నున్నది. నారప్ప కుమాళ్లలో చోడనాయకుడు, భీమనాయ కుడు, బ్రహ్మనాయకుడునను వారుగూడ వెలనాటి చోడరాజులవద్ద సేనాధి పతులుగా మెలంగిరి *2.

(2) మల్యాల చౌండసేనాని : దుర్జయాన్వయుడు, గణపతిదేవుని సేనాను లలో నొకడు. అగ్రహార మొకటి, తటాకమొకటి నిర్మించి, కొండిపర్తిలో

*1 ఆంధ్రుల చరిత్ర V. శ్రీ చి. వీ. విరచితము.

*2 ఆంధ్రులచరిత్ర V. కాకతీయులచరిత్ర (శ్రీమా. రామారావు)(వి ఏ.)

చౌండేశ్వరాలయమును గట్టించి పేరొందెను. ఈ వంశములో నాటి చమూపతి కూడ గణపతి సామంతుడే. గుండ దండనాథు డట్టివాడే. ఇతడొక టటాకమును నిర్మించెను. ఈ గుండయ గోనబుద్ధారెడ్డి కుమార్తె కుప్పాంబను పెండ్లాడెను - సంకిసపురాధిపతి *1.

(3) ప్రోలరాజు : దుర్జయాన్వయుడును, వల్లుట గోత్రకుడునగునితడు గణపతి దేవుని తంత్రపాలకుడుగా నుండెను. ఇతడు కమ్మరాష్ట్రియుడే *2.

(4) మేచయనాయకుడు : నాగి వంశీకుల బంధుగుడు. ఏకశిలా పురీపాలకుడై తలవరిగా పేరువహించినవాడు. చతుర్థాన్వయుడు, కమ్మవారిలోని వాడు *3.

(5) ఓపిలిసిద్ధ చోదరాజు II. పొత్తపి చోడనాయకు డెందినవాడు. వెల నాటిలో కొంతకాలము గణపతిదేవుని సామంతుడుగా పాలించెను *4.

(6) భీమదేవ కేశవదేవుడు. 1235 ప్రాంతమున పెన్నూరులో గణపతి సామంతుడుగా నుండెను.

(7) నాగి నాగమాదరి. ఇతడు చతుర్థాన్వయుడని పేరొందెను. విప్పర్ల గోత్రీకుడు, పాకనాటిసీమ కధిపతిగాగల గణపతి దేవునికడ నుండెను. ఇతని తండ్రి మల్ల చమూపతి, తల్లి పోతాంబ, మారనకవి రచిత మార్కండేయ పురాణము నీతని విషయముగలదు. మల్యాల హేమాద్రి రెడ్డి, గణపతి దేవుని సేనా నాయకులలో నొకడు, కులోత్తుంగ రాయ రాజేంద్ర చోడగొంక విజాపట్ట బిరుదముగలవాడు. దుర్జయాన్వయుడు*5.

## కోటవారు

కోట రెండప కేతరాజు ధరణికోటను పాలించెను.

ఇతడు చాలప్రసిద్ధుడు - ఆయన విషయము లోగడ తెలిపితిమి.

---

*1to*4. ఆంధ్రులచరిత్ర V. కాకతీయుల చరిత్ర (శ్రీమా. రామారావు)(బి.వి.)

*5. ఆంధ్రుల చరిత్ర V. కాకతీయుల చరిత్ర (శ్రీ మా. రామారావు) (బి.వి.)

కోటభీమరాజు III : 1230—34 మధ్యనేలెను. బేతరాజుII పుత్రుడు *1.

కోటకేతరాజు III : 1234—40 మధ్య నేలెను. గణపతిదేవ చక్రవర్తి తోబుట్టువగు మైలమ్మ కుమార్తె నితడు పెండ్లాడెను *2.

కోటగణపతిరాజు : ఇతడు ధరణికోటను 1240—62 మధ్య నేలెను. ఈయనకు కొమరాంబయను భార్యయుండెను. ఈమె సోదరుడు మాచినాయడని ప్రసిద్ధిజెందెను. రాజ, నాయడు శబ్దములొకే వంశమున వాడినందుల కీయన దృష్టాంతము *3.

ఈ కోటవారిలో భీమరాజు IV : 1262—68 మధ్యను, కోటదేవరాజు, ముమ్మడి రాజులు తర్వాతసు పాలించిరి. వీరు రుద్రమదేవి చక్రవర్తిని సామంతులన వచ్చును *4.

యనమదల కోటరాజులు : రెండవ కేతరాజునకు పిమ్మట ధరణికోట నుండి యీ యనమదల రాజ్యము విడదీయబడెను. అందీ క్రిందివారు పాలించిరి.

(1) కోట రుద్రరాజు : ఇతడు రెండవ కేతరాజు కొడుకు 1216—41 మధ్యపాలించెను *5.

(2) కోట బేతరాజు : 1241-51 సం॥ల మధ్య కాకతి గణపతి దేవ చక్రవర్తి సామంతుడుగా పాలించెను. ఇతని భార్యయగు గణపాంబ, గణపతి దేవుని రెండవ కుమార్తె. ఈ గణపాంబ భర్త మరణానంతరము 1251—64 సం॥ల మధ్య పాలించెను. గణపేశ్వరాలయము, బేతేశ్వరాలయములు కట్టించి 2 గ్రామముల నిచ్చెను. ఇంక ననేక ధర్మము లొనర్చెను. వివాహ సుంకములను దేవుని కొసంగెను *6.

1[illegible] తర్వాత నొక భీమరాజు, 1263 వరకు నాతని కుమారుడు పోర్లరా[illegible], తర్వాత భైరవరాజును పాలించినట్లు పెదకళ్ళేపల్లి శాసనమున నున్నది. కాని వీరెచట పాలించిరో తెలియుటలేదు.

తాడికొండలోని కోటవంశీకులు : 1176 ప్రాంతమున కోట మన్మ పోతరాజు, ఆతని భార్య పండాంబిక: 1261 ప్రాంతమున వెన్నెల దేవమ్మ

*1. to *6. of A.H.R.S. Vol. XIX.

రాణి, పినకొమ్మరాజను వారచట పాలించిరి. వీరు వరుసగా గణపతిదేవ చక్రవర్తి, రుద్రమదేవుల కాలము వారుగా నున్నారు *1.

త్రిపురాంతకములోని కోటరాజులు : కేతరాజు II జ్యేష్ఠ సోదరుడగు చోడరాజునకు ముమ్మడి పోతరాజు, రాజయ్యను కుమారులుండిరి. వీరు గణపతి దేవుని సేనాధిపతులై యుండిరి. ముమ్మడి పోతరాజు 121౽లో త్రిపురాంతమున గొన్ని దానములొనర్చి శాసనములు వ్రాయించెను *2.

కోటభీమరాజు కొడుకు పోతరాజొకడు 1140 ప్రాంతమున నున్నాడు. ఈయన కొడుకు చోడరాజు 1179 ప్రాంతీయుడు. వీరు దన్నాలకోట రాజులుగా పేరొందిరి. వీరు చాళుక్య చోడ కులోత్తుంగ III, రాజరాజు II ల వద్ద సామంతులట *3.

కోటకేతరాజు సామంతులు - విప్పర్ల కొండపనాయకుడు, గుండపనాయకుడు - 1218 సం॥ర ప్రాంతీయులు. కేతరాజు పుణ్యమునకై ముక్కామల గ్రామములో గొన్ని భూదానము లిచ్చి పేరొందిరి. వీరు దుర్జయాన్వయులు. [No 109 of 16 ]

## రుద్రమదేవి

గణపతిదేవ చక్రవర్తి 1261లో చనిపోగా నాతని కుమార్తె రుద్రమదేవి చక్రవర్తిని యయ్యెను. ఈమెయే యాంధ్రదేశమును 1295 వరకుపాలించెను. ఈమె చాలుక్య రాజగు నిడదవోలు మహాదేవ చక్రవర్తిని పెండ్లాడెను. రాజ్యాధికారము తన కియ్యలేదని యీమె భర్త శత్రుకోటితో జేరి కుట్రసాగించి, యుద్ధములు కల్గుటకు కారకుడయ్యెను. దేవగిరి రాజగు మహాదేవుడు 3 లక్షల సైన్యముతో వచ్చి 15 దినములు ఘోరముగా బోరి జయింపలేక, కోటిరూకలపరాధము చెల్లించి తన రాజ్యము నిల్చికొనెను. ఈమె వద్ద కాయస్థులును, దుర్జయాన్వయులగు కమ్మవారును హెచ్చుగా అధికారములు గల్గియుండిరి. గోన గన్నారెడ్డి, పడికము బాపదేవుడు, త్రిపురాంతక మహాదేవుడు, జన్నిగదేవుడు, అంబదేవుడు సేనాధిపతులుగా నుండిరి. ఆడుది రాజ్యపాలన జేయు

*1 to *3. of A H R.S. Vol. XIX

చున్నదని దేశములో సామంతులు చాలమంది యెదురు తిరిగి స్వతంత్రులగుటకు ప్రయత్నింపగా వారిలో చాలమందిని చంపించి, జయించి దేశకల్లోలమును తగ్గించుచు ఈమె 35 సం॥లు చక్కగా పాలించెను. ఈ వీరనారీమణి యుద్ధములందు స్వయముగా నిలిచి పోరాడి శత్రువులను జయించుచు వచ్చెను. తనకోట నన్నివిధముల వృద్ధిజేసి రాతికోటను గట్టించెను. గోళకీశైవ సంస్థ కీమె యొక గ్రామమును దానమిచ్చెను. ఇంపులూరి అన్నయామాత్యునను సేనాని కీయమ తన పెంపుడు కొమరిత రుయ్యాంబ నిచ్చెను. ఈమె పాలనను మార్కోపోలో మున్నగు విదేశీయులు మెచ్చుకొనిరి. ఈమె కాలములో దుర్జయాన్వయులగు కమ్మవారే క్రిందివారు సామంతులుగా మెలంగిరి.

(1) మల్యాల గుండ దండాధిపతి : దుర్జయాన్వయుడు - రుద్రమ దేవికి దక్షిణ భుజాదండుడు, బాచ సేనాధిపతి పుత్రుడు — ఇతడనేక చెర్వులు, దేవాలయాలు కట్టించి పేరొందెను. ఈయన భార్య కుప్పము గూడ దేవాలయములను చెర్వులను నిర్మించెను. సమర సమయాఖండల, పెద ముద్దుగండ నిఖిలాయుధ కుశల చంద్రమూర్తి గండాది బిరుదుల నితడు వహించెను. బూదపూడున వీరి ధర్మశాసనము లున్నవి. ఈశ్వర భట్టోపాధ్యాయుడీ కాలపు పండితకవి.

(2) సాగినాగ భూపతి : దుర్జయాన్వయుడు-పాకనాటి సీమకధిపతి. ఈతడు సాగి మల్లచమూతి పుత్రుడు. ఈయన మేచయ నాయకుని పుత్రిక మల్లమాంబను పెండ్లాడెను. ఈయనకు గన్నమనాయుడు, ఎల్లయ నాయుడు, మేచయ నాయడులు జనించి సైన్యాధికారులైరి.

(3) మల్లిదేవ చోడుడు : 1290 ప్రాంతమున కమ్మనాటను సామంతుడుగా పాలించెను. తెలుగుచోడులలో నొకడు.

(4) రుద్రమదేవి అంగరక్షకులు : ఎక్కినాయుడు, రుద్రినాయుడు, పినరుద్రి నాయుడు, పోతినాయుడు, వల్లయనాయుడులు. వీరు దుర్జయవంశీకులు, వలవుర్తి గోత్రీకులు - కమ్మవారిలో నీ గోత్రము కలవారు చాలమంది యున్నారు. ఇందలి పోతినాయుడు రావూరులో నొకదేవళమునుగట్టించి శాసనము వ్రాయించెను.

(5) దేవినాయకుని కొడుకు యెఱ్ఱనాయడు, అతని యగ్రసోదరుడగు కొమ్మి నాయడు, అతని కొడుకు పోతినాయడు. వీరందరును 1282 ప్రాంతీయులైయుండి రుద్రమదేవి చక్రవర్తినికి సామంతులుగానుండిరి. వీరు దుర్జయాన్వయులును, బుద్ధవర్మ శాఖీయులునైయుండిన కమ్మరాష్ట్ర నివాసులు. ఈ దేవినాయని లేక దేవినేని గృహనామస్థులిప్పటికిని కమ్మవారిలో నున్నారు.

(6) 1285 ప్రాంతమున ఆత్మకూరు తాలూకాలో గొల్లపూడి కామానాయడు, దేవినాయడను వారలు రుద్రమదేవి వీరప్రతాపరుద్ర చక్రవర్తులకుసామంతులుగా నుండిరి. వీరికి ఒరియూరి పురవరాధీశ్వర బిరుదముండుటచే తెలుగు చోడ శాఖీయులైయుండిరి. కమ్మరాష్ట్రవాసత్వమున తద్వంశీకులు తక్కినవారివలెనే కమ్మవారుగా పేరొందిరి. వీరిదాన శాసన మొకటి చిరమన గ్రామములో నున్నది (N.I.A. 25). పులిపాడు గొంకి నాయదు 1298 ప్రాంతీయుడైయుండి శ్రీగిరిపాడులో దేవునికి కొంత భూమిని దానమిచ్చి శాసనము వ్రాసెను. అతడుగూడ నొక సామంతుడు. పులిపాటివారు గూడ కమ్మవారిలో నున్నారు.

## వీరప్రతాప రుద్రదేవుడు 1295 - 1323

రుద్రమదేవిపాలన తర్వాత 1295లో వీరప్రతాపరుద్రదేవుడు ఓరుగల్లులో చక్రవర్తియై 1323 వరకు పాలించెను. ఈయన రుద్రమదేవి మఱదియగు చాలుక్య మహాదేవునికి ముమ్మడాంబ యందు జనించినవాడు. రుద్రమదేవి తన యనంతర మీయననే రాజ్యాధికారిగా నేర్పరచెను. ఈయన రాజ్యము ఉత్తరమున సింహచలము వరకు, దక్షిణమున కాంచీపురము వరకు, తూర్పున సముద్రము వరకు వ్యాపించెను. ఈయనకు 9 లక్షల సైన్యముండెను. దీనికి బెండపూడి అన్నయామాత్యుడదికారి. కర్నూలు జిల్లాలో నడవుల గొట్టించి యీతడు నూతన గ్రామములను నాలకొల్పి వ్యవసాయమును వృద్ధిజేసెను.

విద్యానాధుడను కవి యొక అలంకార శాస్త్రము రచించి యీ మహారాజుకు కృతి నొసంగెను. ఈయన విడెము కొమ్మయ రాజులు కందనవోలులోను, సిరిసింగళదేవుని నంది కొట్నూరులోను, శ్రీనాధరాజును దూపాటిసీమలోను, జుట్టి

యలంక గొంకారెడ్డిని పొత్తపినాడు, ములికినాడులలోను, మన్మగండ గోపాలుని కాంచీపురిలోను, సాగిదేవరి నాయనింగారిని పలనాడులోను, సోమయ వెంకయ్య గారిని వెలనాటిలోను, కామయ బొప్పనింగారిని కమ్మనాటిలోను, పోతయ సాహిణిని పాకనాడులోను నిట్లనేక సామంతులను నిల్పి రాజ్యమును చక్కగా పాలించెను. 1310 ప్రాంతమున, 1316తోను రెండుసార్లు పంచపాండ్యులు, రవివర్మ మున్నగువారు కాంచీనగరముపై దండెత్తిరాగా, ముప్పిడినాయకుడు, యెఱ్ఱదాచా నాయకుడు, మొదలైన సేనానులనుబంపి వారలనుబారద్రోలించెను. అంబదేవుడు, త్రిపురాంతకదేవుడునను గండికోట, ములికినాడు పాలకులుతన్ను ధిక్కరింపగా సర్వసేనానిని బంపి వారల నణంచెను. ఈయన కాలములో భైరవారాధనలు, ఏకవీరా పరశురామపూజలు, చమడేశ్వరి, మైలారుదేవుడు, ముసానమ్మ, కుమారస్వామి, వీరభద్రుడు, పాండవులు మొదలగు వారికి దేవళములుండి పూజాపునస్కారములు జరుగుచుండెను. పలనాటి వీరపురుషుల ఆరాధనగూడ కలదు. ఈయన క్రింద కమ్మవారిలోని ముసునూరివారు, గొల్లపూడివారు, సాగివారు మొదలైనవారు సామంతులుగా నుండిరి. ఈ క్రింది కమ్మ సామంతులుగూడ గలరు.

ముప్పిడినాయుడు - ప్రసిద్ధ సేనానాయకుడు. తండ్రి నాగనాయుడు; తల్లి గంగసానమ్మ. కాంచీపురమున చక్రవర్తి సామంతుడగు మన్మగండ గోపాలుని పాండ్యరాజులు జయించి దేశమాక్రమింపగా నితడచటకు పంపబడెను. అచట జరిగిన యుద్ధములందు జయించి తిరిగివచ్చెను. పాకనాడు, తొండమండలములయందు ప్రతినిదిగా పాలించెను*1.

మన్మగండ గోపాలచోడరాజు - కమ్మనాడు, దర్శిప్రాంతములు, తర్వాత కాంచీపురిప్రాంతములను పాలించెను. వీరుగాక కమ్మనాటిలో గుండయనాయకుడు, వెలనాటిలో సోమయ వెంకయంగారు, మాచయ నాయనింగారు, సాగిదేవరి నాయనింగారు, పలనాటిలో కమ్మనాటిలో కామయబొప్పనింగారు చక్రవర్తి ప్రతినిధులుగా పాలించియుండిరి*2. వీరందరును కమ్మనాటి నాయకులై యున్నారు. వీరందరు 1304–23 మధ్య నున్నవారు. మొదటియిరువురు

---

*1. to *2 ఆంధ్రుల చరిత్రము V.

మాత్రము 1290-1311 మధ్యనుండెరి*1. 1303 నుండి మహమ్మదీయ దండ యాత్రలు సాగెను. మల్కికాఫరు మూడుసార్లువచ్చి ఘోర యుద్ధము లొనర్చి వెనుదిరిగి పోయెను. 1309 లో వచ్చిన దండయాత్రలో ప్రతాపరుద్రదేవు డోడిపోయినందున వేయి యొంటెలను మోసినధనమును మహమ్మదీయులు దోచు కొని, రాజీపడిరి. ఢిల్లీ చక్రవర్తికి కప్పముకట్టుటకు ప్రతాపరుద్రుడు సమ్మ తించెను. 1322 నాటికితడు కప్పము చెల్లించలేదని యప్పటి ఢిల్లీపాలకుడగు ఘియాజుద్దీనుతుగ్లకు తన సేనాని జ్యేష్ఠపుత్రుడు అగు అలూఫ్ఖానును 1323 లో పంపెను. ఈయుద్ధములో ఆంధ్రరాజ్యము తురుష్క వశమయ్యెను. చక్రవర్తి ఖైదీగా ఢిల్లీకి గొనిపోబడుచు త్రోవలో మరణించెను. అప్పుడు మహమ్మదీయులు 140 వేల సైన్యముతో వచ్చిరి. ఈ చక్రవర్తి చేతిక్రింద దుర్జయాన్వయులు, చాళుక్యాన్వయులు అనేకులు కమ్మనాటికి వెలుపల రాజ్యాదికారములు కల్గి యుండిరి. గాని వారి చరిత్రమిచట గ్రంధవిస్తరభీతిచే చెప్పుటలేదు. ఈ మహా రాజు 11 బంగారుగోవులను దానమిచ్చెను. అనేక తులాభారముల తూగి పంచి పెట్టెను. కమ్మరాష్ట్రనాయకులందరీరాజ్యము తమ వంశీకులదని పట్టుదలతో బోరాడినను, ఓటమి తప్పలేదు. తుదకిది మహమ్మదీయపరమయ్యెను.

ఈ మహారాజు కాలములో వర్తకము వృద్ధిజెందెను. తెనుగు సారస్వత మభివృద్ధియయ్యెను. త్రిపురాంతకవి 'ప్రేమాభిరామము' మొదలగు సంస్కృ తాంధ్ర గ్రంధములను, గోన బుద్ధారెడ్డి 'రంగనాధ రామాయణమును', మారన కవి 'మార్కండేయపురాణము'లను వ్రాసియుండిరి. ఇట్లనేక గ్రంధములు వెలు వడెను. సంస్కృతభాషలో శాసనశ్లోకములు పండితులు సాధారణముగా రచించు చుండిరి. శైవమతమీకాలములో బాగుగా పోషింపబడెను.

## కాపూరి పోతినీడు

ఈతడు 1320 ప్రాంతమున వుప్పలపాటి గ్రామమున ప్రసిద్ధిజెందెను. ఈ కాపూరివారిది ఆరెకట్ల గోత్రము. ఈయన యాగ్రామములో చెన్నకేశవ, చెన్నమల్లేశ్వరాలయములను పునరుద్ధారణచేసి 4 కుచ్చెళ్ళ (96 యకరములు) భూమి దానమిచ్చి పేరొందెను. (**L. R. Vol.** 7)

---

*1 ఆంధ్రుల చరిత్రము V.

## పులిపాడు గొంకినాయడు

ఈతడు వీరప్రతాపరుద్రుని కాలమువాడు. 1298 సం॥లో శ్రీ గిరిపాడు గ్రామములోని దేవునికి చెర్లగుడిపాడులో కొంతభూమిని దానమిచ్చి శాసనము వ్రాయించి పేరొందెను.

## సాగివంశీకులు

సాగివంశీకులు కొందరు గణపతిదేవ చక్రవర్తికడ అధికారులుగానుండిరి. వీరిలో సాగి మల్లనృపాలుడు ప్రథముడు. ఈయనకు నాగభూపతి జనించెను. ఈ నాగభూపతి గణపతిదేవచక్రవర్తికడను, రుద్రమదేవికడను సామంతుడుగా నుండెను. ఈతడు పాకనాటిని పాలించుచువచ్చెను. ఈతడు తలవరి మేచయ నాయకుని కుమార్తె మల్లమాంబను పెండ్లాడెను. ఆమెవలన నీయనకు గన్నమ నాయడు, యల్లయనాయడు, మేచయనాయడను కుమాళ్ళు జనించిరి. ఇందలి గన్నమనాయడు నీతియుగందరుడను పేరొంది, వీరప్రతాపరుద్ర చక్రవర్తికడ సచివాగ్రేసరుడయెను. తక్కినవారుగూడ సేనానులుగానుండిరి. ఈతడు రాజ్య రక్షణకై పలుపాట్లుపడి రక్షించి యనేక బిరుదులను బొందెను. గాని ముస్లిము లతో జరిగిన 1323 ప్రాంతపు తుదియుద్ధమున నీతడు వారికి చక్రవర్తితోబాటు పట్టుపడెను. బలాత్కారముగా నితడు ముస్లిముగా మార్చబడి, మల్లికుమక్బూల్ పేరునుబడసి, మహమ్మదుతుగ్లకుచే ముల్తాను గవర్నరుగా 1334 లో చేయ బడెను. ఇతనిని తెలంగాణా పాలకుడుగా బంపగా, కాపయనాయకు డెదిరించి పారద్రోలెను. అంతట నీతడు గుజరాతు పాలకుడయ్యెను. 1372 లో నితడు చనిపోవువరకు ఫిరోజిషానవాబు సామంతుడుగా నుండెను.

ఢిల్లీసుల్తాను రాజ్యరక్షణ సభలో నీతడొక సభ్యుడయ్యెను. ఈతనికి ఖానిజహాన్ అను బిరుదొసంగబడెను. తర్వాత నితడు నవాబునకు ప్రధాన మంత్రియయ్యెను. సుల్తాను రాజధానిలో లేనపుడితడే సర్వాధికారిగ నుండెను. ఈయన 1372ప్రాంతమున చనిపోయెను. మతాంతరుడైనను, గన్నమనీడత్యంత సమర్థుడనుటలో సందియముండదు. ఈతడు సుల్తాను మహమ్మదు, ఫిరోజిషాల వద్ద పనిజేసెను. మల్లికునాయబ్ అనుపేరుగూడ నితనికి గలదు*.

---

* భారతి సంపు 16 - సంచి - 2.

ఈయనకు బైచరాజు, దేవరినాయనింగారను తనయులుండిరి. బైచరాజు
ఘూనమల్కులను జయించెను. కాకతీయ సేనానులుగనే వీరుండిరి. ఈయనకు
'పులియమూర్కొలుగండ, మల్లసురత్రాణ' బిరుదములు గలవు. దేవరినాయనిం
గారు పల్నాటిసీమలో చక్రవర్తి పక్షమున బాలించెను. ఈ సాగివారు విప్పర్ల
వంశీకులగుటచే గుడిమెట్ట సాగివారి శాఖీయులే కావచ్చును.

గుడిమెట్ట సాగివారినుండి యొకశాఖ చీలి వత్సవాయవారుగా పేరొంది
నట్లు రామవిలాసమున చెప్పబడినది. ల్లటే కొల్లిపాకలో పాలించిన దుర్జయా
న్వయ పరిచ్ఛేదులు ఘూసపాటిలో వసించుచు ఘూసపాటిరాజులైపోయిరి. అందుచే
వారల చరిత్ర నిచట వివరించుటలేదు.

## నతవాటి దుర్జయ వంశీకులు - మడపల్లి పాలకులు

మడపల్లిపాలకుల మూలపురుషుడు చేతరాజు. ఈయనకు మగ్గరాజు
జనించి 1104-1157 మధ్య పాలించెను. ఇతడు పశ్చిమ చాళుక్య ఆరవ విక్రమా
దిత్యునికి లోబడి పాలించెను. ఇతని తర్వాత 1157-1201 మధ్య బుద్ధరాజు
పాలించెను. ఈయన కాకతీయుల సామంతుడు. ఈయన కుమారుడు రుద్రరాజు
కాకతి మహాదేవరాజు కుమార్తె కుందాంబను పెండ్లాడెను. ఈమడపల్లి పాలకులు
చతుర్థులమని చెప్పుకొనిరి గాని దుర్జయుని స్మరింపలేదు. పైననుడివిన సంబంధ
మునుబట్టి వీరు దుర్జయవంశీకులనియే తేలుచున్నది. రుద్రరాజు 1231-48 మధ్య
పాలించెను. తర్వాత రెండవరుద్రదేవుడు 1249 నుండి 1253 వరకు నేలెను.
తర్వాత గణపతి పాలించెను.

1255 ప్రాంతమున మడపల్లి అర్జునరాజు పాలన గనుపడుచున్నది. ఈతని
తండ్రి శ్రీరామరాజు. ఇతడు వసవులగోత్రజుడని చెప్పబడినది. ఈ గోత్రీకులు
నేటికిని కమ్మవారిలో నున్నారు. మడపల్లి నూకయ, పట్టమ, ముప్పిడినాయ
కులు, కాచయనాయకుడు, కులోత్తుంగ చక్రవర్తి సామంతులుగా నుండిరి.
నూకయ కనేక బిరుదులున్నవి. ఇతడు సమర్థుడైన యోధుడు.

## గురిజాలవంశము - ముప్పభూపతి II

ఈ వంశమువారు రెండవ ప్రతాపరుద్రుని కాలమునుండి గౌతమీతటమున
గల సబ్బినాటి రాష్ట్రపాలకులుగా నున్నట్లు కనబడుచున్నది. గురిజాలవారి

ఆస్థానకవియగు సింగన రచించిన వాసిష్ఠ రామాయణమునుబట్టి యీ వంశముల పురుషుడు కూనయ్య. ఈతని కుమారుడు ముప్పరాజు. అతనికొడుకు తెలుగు విభుడు. అతనికొడుకు ముప్పభూపతి II. ఈయనకు "నిరువెత్తు గండ, గండ గోపాల, గోపాలకాంచిరక్షపాలక, చోడస్థాపనాచార్య, దొంతిమన్నియవిభాళ, చలమర్తిగండ, మూరురాయజగదళవిభాళ, రాజగజ కేసరి, గజగంధవారణ" బిరుదములున్నవి. అందుచే నితడు రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి సామంతుడై, కాంచీపుర దండయాత్రలో బాల్గొని, మన్మగండగోపాలుని తిరిగి నిల్పిన సేనానులలో నొకడని తలపవచ్చును. ఈతనిమంత్రి వాణస కందనామాత్యుడు కృతిబొందిన సింగనరచిత పద్మపురాణోత్తరఖండమున నీతని ప్రశంసయున్నది. తెలుగురాయని గురించి పద్మపురాణోత్తరఖండమున, 'గురిజాల వంశీకుడనియు, శత్రుభయంకరుడనియు, భూరిభోగాఢ్యుడ'నియు, వర్ణింపబడినది. ఈతెలుగురాజు కొడుకు ముత్తభూపతి తండ్రికి రాజ్యపాలనలో సాయపడుచు వచ్చెను. ఈరాజ్యమును 1433 ప్రాంతమున అహమదుషా (గుల్బర్గసుల్తాను) దండెత్తివచ్చి వీరి వంశీకులను జయించి ఆక్రమించెను*.

## ముసునూరి నాయకరాజులపాలన (1325—1369)

కాకతీయ వీరప్రతాపరుద్ర రాజ్యము తురుష్క ప్రభువులచే 1323 లో భగ్నమయ్యెను. ఆంధ్రదేశమున ముస్లిము పాలన భయంకరమయ్యెను. ధనవంతులు మొదలు దరిద్రులవరకు, బ్రాహ్మణులు మొదలు అన్నివర్ణములవారును మిక్కిలి బాధలు జెందుచుండిరి. తురకలను చూచినంతనే ప్రాణము లెగిరిపోయెడివి. బ్రాహ్మణులు వారి జపహోమాది కార్యములు జరుపుటకు వీలులేకుండెను. దేవాలయములు ధ్వంసము చేయబడి, పూజాదులు రద్దయ్యెను. ఎవ్వరి కుటుంబములకు, ద్రవ్యములకు రక్షణ లేకుండెను. తురుష్కులు త్రాగుడు,వ్యభిచారము, మాంసభక్షణము, బ్రాహ్మణుల వధించుటలందే నిమగ్నులైరి. ప్రజలలో నసంతృప్తి పెచ్చు పెరిగిపోయి, భరింపలేకుండిరి. ఈస్థితిలో కాకతీయ రాజ్యపూర్వదండ నాయకులు 75మంది జేరి తమలోని ముసునూరి ప్రోలయ నాయనింగారి యాధ్వర్యమున తురుష్కసేనల బ్రతిఘటించి దేశమును మరల స్వాధీనము చేసుకొనుటకు 1325 ప్రాంతమున పూనుకొనిరి.

---

* వెలుగోటివారి వంశావళి పీఠిక

ఢిల్లీయందు ఘియాసుద్దీను తుగ్లకు చనిపోవుటయు పరిస్థితులు వీరి కనుకూలముగా నుండుటవల్లను గోరిల్లా యుద్ధములు సాగించి తురుష్క సేనను బారద్రోలి ఒరంగల్లు కోటను స్వాధీనపరచుకుని, ప్రోలయ నాయనింగారిని ఆంధ్ర భూమండలాధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఆతడంతవరకు ఓరుప్పునాటిరేకపల్లి ప్రాంత పాలకుడుగా నుండెను.

కొలని రుద్రదేవుడను కాకతీయ సేనాని మొదలగు వారీపనులలోమిక్కిలి శ్రద్ధతో పట్టుదలతో నెరవేర్చి జయమొందిరి. ముసునూరి నాయక రాజులు "నాయనింగారు" బిరుదాంకితులై 1221 A D ప్రాంతమునుండి ప్రసిద్ధులై యుండిరి. జమ్మిపల్లి మల్లికార్జునాలయములో ముసునూరి ముచ్చినాయకుని 1221 A. D నాటి శాసన మొకటి కలదు. కొప్పుల ప్రోలనాయకుడు గూడ పై యుద్ధములందు బాగ్లొని ప్రసిద్ధి వహించిన వాడగుటచే నతడుగూడ ముసునూరి ప్రోలయనాయని వలెనే 'హిందూ రాయసుర త్రాణ'డని పేరువహించియుండెను. ఆత డుత్తరాంధ్ర దేశపాలకుడు. ముసునూరి ప్రోలయ రాజ్యాధీశుడైన తర్వాత పూర్వపు దేవబ్రాహ్మణ అగ్రహారముల నన్నిటిని స్థిరపరచి మతధర్మములకు, ప్రజలకు రక్షణ గల్గించెను. అందుచే భూమి కాపులు సంతోషముతో పన్నులు చెల్లించిరి. తపసులు వారి తపస్సులో నారవ వంతు ధారపోసిరి. ప్రోలయ నాయకుడంతట విలస గ్రామమును నూతనముగా నగ్రహారము జేసి బ్రాహ్మణోత్తముల కొసంగెను. అద్దంకిలోని ప్రోలయ వేమారెడ్డి 1326-52 లో గూడ యాతనికి సామంతుడుగా పాలించుచువచ్చెను. అట్లే రేచెర్ల సింగయనాయకుడుండి తర్వాత స్వతంత్రుడయ్యెను. ఈయన చనిపోయినంతనే కాపయసింహాసన మెక్కెను. అప్పటి కింకను తెలంగాణ మంతయు వశపడియుండలేదు. అందుచే నీకాపయనాయకుడు హోయసల వంశవీరబల్లాలుని సాయముతో మహమ్మదీయుల నెదిరించి 1336 లో తుగ్లకు తాలూకు నవాబు వజీరు నోడించి యోరుగల్లును తిరిగి స్వాధీనము జేసుకొనెను. అప్పుడీయన "ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసుర త్రాణ" బిరుదములను ధరించి గురజ గ్రామమును బ్రాహ్మణుల కగ్రహారముగా ధారవోసెను. కంపిలిలో హరిహరరాయలు ముస్లిములకు లోబడి, వారి మత మవలంబించి యుండెనుగాని కాపయ దిగ్విజయ వార్తవిన్నంతనే ఇస్లాము మతమును వదలి స్వతంత్రుడయ్యెను. సంగమ వంశీకుడగు నితడు కాపయకు చుట్టమని 'జియాబిరనీ'యను మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసెను.

కాపయ యాంధ్రదేశాధీశ్వరత్వము వెలమవారికి యిష్టములేకుండెను. అందుచే సింగయనాయకుడు కాపయతో యుద్ధములు సాగించెను. ఒకసారి విజృంభించినను మరల వెంటనే అతనిని కాపయనాయకు డోడించి సామంతు డుగా నుండునట్లు ప్రమాణము జేయించెను. 1347 లో గుల్బర్గనందు అలావుదీను బహమనీ రాజుగానుండి, కాపయవల్ల తాను ఢిల్లీ నవాబు నెదిరించు టలో సాయమును బొందెను. కానికొద్ది కాలములోనే 1348 లో కృతఘ్నుడై హఠాత్తుగా నోరుగల్లును ముట్టడించెను. ఉప్పుచాతని కొకకోటయు, గొన్ని యుద్ధ గజములను బహూకరించి కాపయ తన రాజ్యమును నిలుపుకొనెను. అలావుదీను 1355-56 లలో మరల నొక దాడిసలిపి యాతని క్రిందనుండిన సామంతపాల కత్వములను హరించెను. కాని 1359లో అలావుదీను చనిపోయెను. ఈ సమయ మున విజయనగర రాజు సహాయముతో కాపయ బహమనీ రాజ్యముపై దండె త్తెను. దానిలో కాపయనాయకుని కుమారుడగు వినాయక దేవు డాధ్వర్యము వహించి కౌల్సను ప్రదేశమున ఘోరముగా బోరాడెను. మొదట వినాయక దేవునికి జయముగన్పడినను, ముస్లిము సేనాని బహదరుఖాను విజృంభించి, వారి నోడించి కాపయ సంధికి వచ్చునట్లు చేసెను. కాని యీ సంధివల్ల శాంతి చిర కాలము నిలువదయ్యెను.

1363 లో వినాయక దేవు తన్నవమానించెనని మరల బహమనీరాజు ఓరుగల్లుపై దండెత్తెను- విజయనగరాధీశ్వరుడు సాయపడినను, కాపయ యీ యుద్ధములో నోడి, చివరకు 1365 లో గోల్కొండ దుర్గము, వైఢూర్య సింహా సనము మొదలైన విలువగల కానుక లనేకమిచ్చి పోరుమానునట్లు చేసుకొనెను. కాపయకు 57 గురు (కాకలీయ) సేనానాయకులు లోబడియున్నట్లు, అతడు విశ్వేశ్వర భక్తుడని కలువచేరు శాసనమున గలదు. కాపయ పాలన మంతట 1369వరకు సాగెను. ఇంతలో వెలమనృపాలుడగు సింగయయన పోతానాయడు రాజ్యకాంక్షతో ఓరుగల్లుపై దండెత్తి యుద్ధ మొనర్చి భీమవర ప్రాంతమున కాపయ నాయకుని సంహరించెను. అంతటిలో నోరుగల్లు వెలమవారికి లోబడెను.

కాపయ తెలంగాణావాలియని మహమ్మదీయ చరిత్రకారుడగు బర్హానిమసిరో నుడివియున్నాడు. అతని పరాక్రమము, మత దేశాభిమానములు మిక్కిలి మెచ్చ కొనదగినవి. కేవలమసూయచే అన ఘోతానాయడు మహమ్మదీయులలోజేరి కమ్మ

నాయకులపాలన మంతము జేసెను, తుపకదె తన రాజ్యము ముప్పునకే కారణ మయ్యెను. ఇట్లు మహమ్మదీయులు విభజించి పాలించి 1460 తర్వాత వెలమవారి దేవరకొండ రాచకొండ రాజ్యములను గూడ హరించిరి.

కాపయనాయనింగారికి "అగును మనగంటి పురవరాధీశ్వర, చోడరాయ స్థాపనాచార్య, కాంచీరక్షపాలక, విషమదాడి పాంచాల, ఇరువెత్తుంగండ, గండ గోపాల, మూరురాయజగదళ" మున్నగు బిరుదావళి యున్నది. ఇవి యీయన వీరప్రతాపరుద్ర చక్రవర్తి సామంతుడుగా నున్నపుడు పొందినట్లుచెప్పవచ్చును. ఇతడు కాంచీపురములో గండగోపాలుని రక్షించి చక్రవర్తి సామంతుడుగా నుంచిన వారిలో నొకడన వచ్చును. ఈయనవద్ద అనుమకొండ మాచినాయని కొడుకు ఎరపోతులెంక యొక సామంత పాలకుడుగా నుండి పిల్లలమఱ్ఱిలో ఎర కేశ్వరుని పునఃప్రతిష్ఠించెను. ఈ ముసునూరి వంశ మూలపురుషుడు పోతన నాయడు. ఈయనకు పోచానాయడు, దేవనాయడు, కామనాయడు, రాజనాయ డను కుమారులుండిరి. రాజనాయడు తొయ్యేరు గ్రామ నాయంకరమును బడసి సేనాదిపతిగా నుండెను. తక్కినవారి వివరములు తెలియదు. ఇందలి పోచా నాయకునకు ప్రోలనాయనింగారు, ఎరపోతానేని యను పుత్రులు జనించిరి. దేవనాయకునకు కాపానాయడు, ముమ్మడినాయకుడను సుతులు గల్గి ప్రఖ్యాతి బొందిరి. కామనాయకునకు ఇమ్మడేశుడు, దేవనాయకుడు II అనువారుగల్గిరి గాని వారి చరిత్రలు తెలియుటలేదు. కాపయనాయకుని కుమారుడు వినాయక దేవుడు 1366 ప్రాంతమున బహమనీ సుల్తాను మహమ్మదుషా వద్దకు వచ్చు చుండిన గుఱ్ఱపు వ్యాపారులగు అరబ్బులవద్దనుండి బలాత్కారముగా గుఱ్ఱములను మరలించి తీసుకొనెననియు నందుచేతనే మహమ్మదుషా కుపితుడై యాతని నొక యుద్ధమున హరాత్తుగా బట్టుకొని వధించెననియు జెప్పబడినది.

## మంచికొండవారి రాజ్యము

కాపయనాయకుడు ఆంధ్రదేశాధీశ్వరుడైన పిమ్మట నాతని తోబుట్టు అల్లుడైన మంచికొండ కూనపనాయకుని (కమ్మవారు) కోరుకొండలోనుండి రాజ మహేంద్రవర ప్రాంతమును పాలింపుమని నియమించి పంపెను. అతడు కోరు

కొండలో నొక దుర్గమేర్పరచి యచటికి దండెత్తిన తురక సమూహములను పారద్రోలి పాలించెను. వీరప్రతాపరుద్ర చక్రవర్తి సామంతుడైన ఈయన తండ్రి గణపతినాయకుడు 1300-25 ప్రాంతీయుడు. తాత కేశవనాయకుడు, కూనప నాయడు 1325-40 మధ్యనుండెను. ఆయన తర్వాత కుమారుడు ముమ్మడి నాయకు చడట రాజయ్యెను. ఈతని పాలనలో అంగరసీమ, జాంగలునాటి సీమ, కురవాటిసీమ, కోనసీమ, కొర్ధాము సీమ మొదలైనవియుండెను. ఈతడు 30 సం॥లు 1340-70 మధ్య కోరుకొండలో పాలించి, యచట లక్ష్మీనృసింహా లయమును 1359లో గట్టించి, దానికి రెండు గ్రామాలు ధారవోసెను. ఈతని సోదరుడు సింగయనాయకుడుగూడ నగ్రజునికిరాజ్యపాలనలో దోడ్పడుచుండెను. పరాశరభట్టున కీరాజు శిష్యుడై వైష్ణవ మతాభివృద్ధి గావించెను. ఈతనికి కూనపనాయడు, అన్నారెడ్డి, కాటమనాయడు, రామానాయడు మున్నగుకుమాళ్ళు జనించిరి. కూనపనాయకునకు ముమ్మడినాయడు జనించెను. ముమ్మడీంద్రుడు చనిపోయిన పిమ్మట రెండవ కూనపనాయకుడు రాజై 1385-1394 మధ్యను పాలించెను. 1370-85 మధ్య అన్నారెడ్డి మున్నగువారు పాలించియుందురు. 1394 నుండి రెండవ ముమ్మడినాయకుడు రాజై 1395 వరకు పాలించెను. తర్వాత యీ రాజ్యమును కాటయవేమునికి కొమరగిరి రెడ్డిచే నొసగబడియెను. కాపయ నాయకుడు 1369 లో చనిపోవు వరకు యీ రాజు లాయనకు సామంతులై యుండిరి. తర్వాత క్రమముగా కొండపీటి రెడ్డిరాజులకు అనగా వేమారెడ్డి, కొమరగిరి రెడ్డిరాజులకు సామంతులైరి. చివరకు వీరి రాజ్యమును కొమరగిరి తన బావమరది యగు కాటయ వేమారెడ్డి కొసంగెను. తర్వాత నీ వంశీకులేమైరో తెలియదు.

రెండవ ముమ్మడి నాయకునిక్రింద సింహాద్రిసెట్టి, బలిసెట్టియను వైశ్యులు కార్యకర్తలుగా నుండిరి. ఈ ముమ్మడి నాయకుని తండ్రియగు రెండవకూనప నాయకుడు శ్రీరంగనాయకస్వామి కోవెలను గట్టించి, ప్రాకారాదుల నేర్పరచి, భూదానము లొసంగి, వైభవరాయలను బ్రతిష్ఠజేసెనట. ఇంతేగాక నీయన అర్చకులకు, దేవతాయుత్సవాదులకు, అంగరంగ భోగములకు భూములనిచ్చి పోషించెనట.

ముసునూరి ప్రోలయనాయడు ఆంధ్ర దేశాధిపత్యము వహించియున్నపుడు విద్యావంతు లనేకులు దేశమున విస్తరించి యుండిరి. జ్యోతిష, తర్క, మీమాంస శాస్త్రవిశారదులు, షడ్దర్శన పారీణులు, సంగీత సాహిత్యవేత్తలు, ధర్మ శాస్త్రవిదులు, ఆయుర్వేద విధులుగూడ నున్నట్లు విలస శాసనములోని బ్రాహ్మ ణులపేర్లవల్ల తెలియుచున్నది. ఈ విద్యాభివృద్ధికి కారణము పరంపరావచ్చిన హిందూ రాజుల పోషణమే కారణమగు చున్నది.

రెడ్డి, విజయనగర రాజుల పాలనలో గూడ నిట్లే యుండెను గాని వాని వివరము లిచట వివరింపజాలము.

---

# 4. రెడ్డిగజపతులకాలపు కమ్మ సేనానులు

## రెడ్డిరాజుల పాలన - అద్దంకి, కొండవీడులు

(కమ్మవారి సామంతత్వము)

ముసునూరు ప్రోలయనాయకుడు, కాపయనాయకుడును ఆంధ్ర దేశాధీశ్వరులై పాలించుచు రేకపల్లి, తొయ్యేరు, కోరుకొండ, సబ్బినాడు మున్నగుచోట్ల తమ బంధుగులనుంచి పాలించుచుండగా అద్దంకిలో పాలించుచుండిన ప్రోలయ వేమారెడ్డియు, వెలమ సింగమనాయుడు (దేవరకొండ, రాచకొండలలో బాలకుడు) మొదలగువారును లోబడిన సామంతులుగా నుండిరి.

కాపయనాయకుడు, ఆతని రాజ్యముతోబాటు 1369 లో నశించెను. ఈలోపల కాపయ యుద్ధములలో మునిగియుండగా రెడ్డిరాజులు స్వతంత్రులైరి. ఓరుగంటిరాజ్యము వెలమవారి స్వాధీనమయ్యెను. అందుచే తమకు సామంతులుగా నప్పటివరకుండిన యీ వెలమ, రెడ్డి రాజ్యములందు హెచ్చుగా కమ్మవారు సామంతులుగా నుండక తమ బంధువులగు విజయనగర సంగమరాజుల వద్దకుబోయి, యచట సైనికులుగా, సేనాధిపతులుగా నుండిరి. వెలిచెర్లగోత్రజుడగు దేసటి ప్రోలయవేమారెడ్డి 1323 నుండి 25 సం॥లు అద్దంకినుండి పాలించెను. కమ్మనాడనుపేరీయనకాలమునుండి యదృశ్యమయ్యెను. తర్వాత నతని కుమారుడగు అనపోతారెడ్డి పాలన కొండవీడునుండి 18 సం॥లు 1350—68 సం॥ములమధ్య జరిగెను. ఇంతవరకు వీరు కాపయనాయకునికి లోబడియుండిరి. వీరితర్వాత అనవేమారెడ్డి పాలనవచ్చెను. ఈమహారాజు 1385 వరకు నేలెను. ఈతడావెలమ సింగమనాయనిచే నొక యుద్ధమున జంపబడగా తర్వాత కొమరగిరిరెడ్డి రాజయ్యెను. ఈయనగూడ 22 సం॥లు వైభవముగా కొండవీడు నందు పాలించెను. ఈయనయే గృహరాజు మేడ కట్టించినది.

ఈయన తర్వాత పెదకోమటి వేమారెడ్డి 1407 నుండి 13 సం॥లు పాలించెను. ఈయనకాలములో రాచకొండ, దేవరకొండ వెలమవారు ప్రత్యర్థులుగా నున్నందున గుల్బర్గు నవాబు ఫిరోజిషాతో నితడు స్నేహమొనరించి రాజ్యమును

కాపాడుకొనెనుగాని వేదగిరి రాజు నొక యుద్ధములో నితడు సంహరించిన వైర మును పురస్కరించుకొని సింగమనాయడు, అనపోతానాయడులు దాడిసలిపి యాతనిని 1420 ప్రాంతమున జంపిరి. అంతట రాచవేమారెడ్డి 4 సం॥ములు మాత్రము పాలించెను గాని యాతడు హఠాత్తుగా సౌరము యెల్లనయను బలిజచే పొడువబడి మృతినొందినందున నంతటితో రెడ్డి రాజ్యము కొండవీటిలో నంత మయ్యెను. వీరందరు విద్యాపోషకులుగా, కవిపోషకులుగా, పండితులుగా వన్నె కెక్కిరి. రాజమహేంద్రవరరాజ్యముగూడ అనపోతారెడ్డి, అనవేమారెడ్డి కొమరగిరి రెడ్డులపాలనక్రిందనే యుండెనుగాని కొమరగిరి చివరకు తన బావమరదియగు కాటయ వేమారెడ్డికి 1395లో దాని నొసగెను. అందుచే కాటయ వేమారెడ్డి ఆరాజ్య మును 1410వరకు పాలించెను. ఈతనిపుత్రుడగు కొమరగిరి అకాలమరణమొందగా కుమార్తె అనితల్లికి రాజ్యము స్వాధీనమయ్యెను. అల్లాడరెడ్డి యామె ప్రతినిధిగా 10 యేండ్లు పాలించినపిమ్మట 1420 లో చనిపోయి నతని కుమారులలోని వీరభద్రారెడ్డి లనితల్లిని పెండ్లాడినందున రాజ్యాధికారమును బడసెను. ఈతడు తన యన్నయగు వేమారెడ్డితో కలిసి 1448 వరకు పాలించెను గాని వెలమ నృపాలుడు లింగానాయకుడు, గజపతులలోని కపిలేశ్వరుడు నందెత్తి వీర భద్రాదులను జంపి రాజ్యమును హరించిరి. ఈ రెడ్డిరాజులకాలపు కమ్మవీరుల చరిత్ర దెలిసికొందము.

## వెలమ నృపాలుర విజృంభణ

ముసునూరి కాపయనాయకుడు యుద్ధములందు వెలమనృపాలురచే జంప బడుటకుముందే వెలమవీరులు మిక్కిలి యుత్సాహముతో ఒరంగల్లు ప్రాంత మందేగాక యితరచోట్లనెల్ల తమరాజ్య విస్తరణకై ప్రయత్నింపసాగిరి. చాళుక్య రాజులకు వెలమవారికిగూడ తీవ్రవిరోధము లుండెను. కాపయనాయకుని యాధ్వ ర్యమున నుండుటయే వారు తమకు శత్రుకోటిలోనివారని వెలమవారు భావించిరి. మొళుగూరు, జల్లిపల్లి, ఇనుగుర్తి, మగతల మున్నగు దుర్గప్రాంతములవద్ద వెలమ వారికి చాళుక్యులకు ననేకయుద్ధములు సంభవించెను. రెడ్లకు వెలమవారికిగూడ రామగిరి మున్నగు దుర్గములపై యాధిపత్యముకొరకు యుద్ధములు గల్గెను. అట్టి వానిలో చాళుక్యులకు, రెడ్లకు, కమ్మవారు అనగా కమ్మనాటినాయకులు సహాయ మొనరించిరి. రెడ్లతో వెలమవారికి మొళగూరు, చేబ్రోలు ప్రాంతములందు యుద్ధ

ములు జరిగెను. అందనేకులు రెడ్లును, కమ్మవారును వీరస్వర్గమునలంకరించిరి. వెలమవారిలోని సింగమనాయనిని తమ్మలజియ్యనిచే మోసమున చాళుక్యరాజులు జంపించిరి. దానితో వెలమవారికి శివమెక్కుడయ్యెను. క్రీ॥ శ॥ 1361 శార్వ రిలో నొక గొప్ప యుద్ధము జరిగెను. అందులో గెలుపు వెలమవారిదయ్యెను. చాళుక్యులనేకులు వెలమవారిచే చిత్రవధ గావింపబడిరి. వెలమవీరులలో అనపోతానాయడు, మాదానాయడనువారు ముఖ్యులు. వీరికి జయము లభించిన పిమ్మట సోమకుల పరశురామ, కమ్మదొరలమోదిన 'కాలదండమ' బిరుదులు దరించిరి. అప్పటినుండి చాళుక్యనామమదృశ్యమై కమ్మవారిలో చాలుక్యులు జేరిపోయిరి. వీరు కమ్మరాష్ట్రమువారు. ఎరువభక్తిరాజొకడు వెలమవారికి సాయపడి రెడ్డిరాజులతో బోరాడుచు చివరకు వెలమవారి సహాయమున కామపురి లో 1366 సం॥లో నొక రాజ్యమును స్థాపించుకొనెనుగాని యిది చిరకాలము నిలువలేదు. 1417 లో నిచట పాలించుచుండిన ఎరువ అనదేవచోడుని రాజమండ్రి పాలకుడగు అల్లాడరెడ్డి సంహరించి యాప్రాంతమును స్వాధీనపరచు కొనెను. కాని భీమరాజు II ను సైన్యాదిపతిని జేసెను. ఈతని కుమార్తెను ... ను వివాహమయ్యెను.

మచ్చవారు చాళుక్యవంశీకులైయుండి, యందలి గన్నవిభుడు, కొమ్మా నేని, బాచడు, రుద్రసేనాని, ఓబలరాజు మొదలగువారు జీలుగుపల్లి, మగతల, జల్లిపల్లి యుద్ధములందు బాల్గొనుచు, తుదకు యెఱ్ఱదాచానాయడు, సింగమనాయడు, అనపోతానాయడు, మాదానాయడులను వెలమవీరులచే వరు సగా హతులైరి. హతశేషులగు మచ్చవారు కమ్మవారిలోనే చేరిపోయిరి. 17వ శతాబ్దిలో మచ్చకొండనృపాలుడు అడపనృపాలునికి తనకుమార్తె నిచ్చి పరిణయ మొనర్చెనని జానకీరాఘవమున చెప్పబడినది. మచ్చకాచనేని 1415 ప్రాంతమున కొండవీడు ప్రాంతమున నివసించెను. కొండమరాజను చాళుక్య రాజుగూడ 136. లో జల్లిపల్లికోట యుద్ధములో జంపబడగా, నాతని వంశీకులు కమ్మవారిలో కలిసిపోయినట్లు కనబడుచున్నది. ఈ వెలమవీరుల యుద్ధముల తర్వాతనే చాళుక్య చోడరాజులనుపేర్లు అదృశ్యమైనవి. కమ్మవారిలోనే వీరంద రును చేరిపోయినట్లు కమ్మవారలు, చాళుక్యులు కలిసి యుద్ధ మొనరించిన దానిఁబ ట్టియే నిశ్చయమగుచున్నది. చోదపర్వతరాజు 1361 లోని జల్లిపల్లి యుద్ధ ములో చనిపోయెను. తద్వంశీకులుగూడ క్రమముగా కమ్మవారుగానే పేరొందిరి.

ఒకప్రక్క చాళుక్య, వెలమ యుద్ధములు జరుగుచున్నను రెడ్డివిభులు క్రమముగా కొండవీడునుండి రాజమహేంద్రవరము వరకు పాలన సాగింపమనే వచ్చిరి. వెలమ వీరులకు, రెడ్డిరాజుల కనేకయుద్ధము లాప్రాంతపాలన కొరకై జరుగుచు వచ్చెను. గాని వానినన్నిటి నిచట చెప్పుటలేదు. వెలమనృపాలురు కమ్మవారికి బిరుదులిచ్చి తమవంకకు త్రిప్పుకొనజూచిరి గాని వారు నిరాకరించిరి. అందుననే పెమ్మగోటివారి వంశావళిలో నొకచోట 'బిరుదులు నిరసించు కమ్మనాయకులు' అని చెప్పబడినది.

కమ్మవారు యీయుద్ధముల విరక్తితో రాజ్యభారము వహించుటకు యిచ్ఛగింపకుండిరి. 1416 వరకు నిట్లు జరిగెను. కాని రాజమహేంద్రవరమున అల్లాడరెడ్డి రాజ్యము స్థిరపరచుటకై మంచెళ్ళ నరహరినేని సాయమొనరించి 'అల్లాడ రెడ్డిరాజ్య ప్రతిష్ఠాపక' బిరుదులు పొందెను.

వెలమవారు బహమనీసుల్తానుకు స్నేహితులుగాను, లోబడిన సామంతులుగానే 1384 వరకు మెలంగిరిగాని సుల్తాను పెదకోమటి వేమారెడ్డితో సఖ్యమొనర్చినదాది, వారిలో వైరముపూని విజయనగర రాజ్యాధికారులతో మైత్రి కల్పించుకొనిరి. అందుచే కొన్ని యుద్ధములైన పిమ్మట 1433లో వెలమవారి రాజ్యముగూడ సింగమనీడుకాలములో బహమనీసుల్తాను వశమయ్యెను.

## అప్పటి కమ్మ ప్రముఖులు

[1] వాసిరెడ్డి పోతినీడు (చాళుక్యరాజులలోని వాసిరాజు కుమారుడైయుండును) క్రీ. శ. 1430 ప్రాంతమున రాజమహేంద్ర పాలకులగు వేమ, వీరభద్రా రెడ్లవద్ద నొక సామంతుడుగా జేరి, వారిచే వాసిరెడ్డి బిరుదము బడసి, పిఠాపుర ప్రాంతమున పాలకుడయ్యెను. ఇతడిచట 4 లక్షల, అరవైవేల తాడిచెట్లను దేశమున నాటించి, తాడిచెట్లు 'సర్వగ్రంథముల నిర్మాణమున కుపయోగకరమైనదని యభినందించుచు శాసనము వ్రాయించెను *1. ఆ కాలములోనే వనప్రతిష్టావశ్యకతను గుర్తించుట విశేషము. ఇతడచటి విష్ణు, సూర్య, విశ్వేశ్వర, గౌరి, కుక్కుటేశ్వరాలయములను పునర్నిర్మాణ మొనరించి శాసనములు లిఖించెను *2. ఈతనికి వేమయ్య యను

(*1, *2) S.I.I Vol. VI Nos. 673 to 677.

కుమారుడు, పోతసానియను భార్యయు నుండిరి. వేమయ్య తన తల్లి దండ్రుల పుణ్యమునకై యొక బృందావనము వేయించెను *1.

[2] మంచెళ్ళ నరహరినేని : 1416 ప్రాంతీయుడు. అల్లాడ రెడ్డి రాజ్య ప్రతిష్ఠాపక బిరుదముగల సామంతుడు. ఇతడు పాలకొల్లులో మండపము, గోపురము దేవునికి కట్టించి శాసనము వ్రాసెను *2.

[3] ఉప్పల హనుమయ్య : 1400 ప్రాంతీయుడు. కాటయ వేముని సామంతుడు. కాటయ వేమారెడ్డి పుణ్యమున కితడు మొల్లేరు గ్రామమున నొక చెరువు త్రవ్వించి శాసనము వేయించెను *3.

రెడ్డిరాజుల క్రింద హెచ్చుగా కమ్మవారున్నట్లు కనబడదు. కొండవీటి దండకవిలలోని రెడ్డిసామంతనాయకులలో వెలమ, బలిజ, తురుష్కనాయకులే 39 మంది చెప్పబడినారు. కమ్మరాష్ట్రము, కమ్మనాడను పేరులుగూడ తొలగించి నూతనముగా కొండవీటిలో కోటనుగట్టి కమ్మరాష్ట్రమును కొండవీటి రాజ్యమని, రాష్ట్రమని పిలుచుకొనుచువచ్చిరి.

[4] ప్రోలునాడు, కాకినాడు, శలపాకనాడు అను ప్రదేశములు కాటయ వేమారెడ్డి పాలన కాలములో వంటిపిల్లివారనే కమ్మవారికియ్యగా, వారా గ్రామ జమీందారులుగా నుండి వారిలో వారికి సరిపడక తగాదావచ్చి, కొట్టుకొని చనిపోగా, నితరుల కీబడెనని పిఠాపురం కైఫియతులోనున్నది. [L.R. 19] ఇది గజపతుల కాలములోనని మరియొక చోట గలదు. [P. 148].

[5] తంగేటి సిరిగిరినాయుడు : 1359 ప్రాంతీయుడు. మందాడి ప్రాంతమున కధికారి. అచట మల్లిఖార్జునస్వామి కాగ్రామమును దానమిచ్చి శాసనము వ్రాసెను. [A. R. No. 65 of 2930] ఈతడు రెడ్డి ప్రభువుల పాలనలోనివాడు.

---

(*1) S.I.I. Vol. VI No. 673 to 677

(*2) Ibid Vol. V, (*3) A.R. No 238 of 24

[6] బొచ్చుల భీమనీడు : 1402 ప్రాంతీయుడు. దర్శి తాలూకా రాజం పల్లి కాపురస్థుడు. అచటి గోపీనాధునికి పందుము భూమినిచ్చి శాసనము వ్రాసెను *1.

[7] కంచర్ల కొండమనాయడు : 1402 ప్రాంతీయుడు. ఇతడుగూడ రాజం పల్లి వాస్తవ్యుడే. గోపీనాధస్వామి కితడు 2 కుంటల భూమినిచ్చెను *2.

[8] పొదిలపల్లి సింగమనాయడు : 1338 ప్రాంతీయుడు. ఈయనకు నాయంకరమున్నది. అందుచే నొక సేనానాయకుడనవచ్చును. ఒంగోలు తాలూకా ధేనువ కొండలోని దేవుని కితడు కొంత భూమినొసంగి పేరొం దెను *3.

[9] కసకుర్తి బావినాయనింగారు : యీవిపాటినాయనింగారు : వీరు1337 ప్రాంతీయులు. ఒంగోలు తాలూకా వీరన్నపాటి కాపురస్థులు. అచటి లక్ష్మీనృసింహదేవరకు బృందావనము వేయించి శాసనము లిఖించిరి *4.

[10] చిటి పోతినీడు, వల్లభయ్య, చెన్నయ్యలు : చిటి పోతినీడు 1427 ప్రాంతీయుడు. ఇతని తండ్రి ముమ్మన్నేని, తల్లి ప్రోలాంబ. వీరి పుణ్యము నకై పోతినీడు పాటిబండ్లలో కొంతభూమిని అమరావతిలోని అమరేశ్వరుని కిచ్చి శాసనము వ్రాసెను *5. వల్లభయ్య, చెన్నయ్యలు దాదాపీకాలము వారే. వెలమ భూపాలుడగు మాదయలింగ నృపాలునితో బోరాడుచు వచ్చిరని వెలుగోటివారి వంశావళివల్ల తెలియుచున్నది.

[11] కూనపులి అనపోతానాయడు : 1416 ప్రాంతీయుడు. తండ్రి గుండా నాయడు. తల్లిలక్కసాని. ఇతడు తల్లిదండ్రుల పుణ్యములకై పొన్నూరు లోని భావనారాయణస్వామికి కొంత భూదానమిచ్చి, బృందావనము వేయించి శాసనము వ్రాసెను. నిడుబ్రోలు కాపురస్థుడు. ఇట్లు ప్రతి కమ్మ సామంతుడును దానధర్మపరుడుగానే యుండుట విశేషము.

---

*1. & *2. N.I.D 62, *3. N I.O 35,

*4. N I O. 109

*5. S I I. VI No. 242.

[12] సమ్మెట సోమనృపాలుడు : 1417 ప్రాంతీయుడు. కడపజిల్లా పెర్నిపాడు పాలకుడు. కొండవీటి ప్రాంతమున జరిగిన యొక యుద్ధములో రాయరావు బిరుదాంకితుడగు వెలుగోటి అనపోతనృపాలునిచే నోడింపబడెను. ఆతని సామంతుడై యుండెను. ఇతని తర్వాత సోమనృపాలుని కొడుకు పిన్నమనేని పాలకుడయ్యెను. చాళుక్యవంశమునుండి కమ్మవారిలో జెరిన వంశములలో నిదియొకటి.

[13] సాయపనేని వెంకటాద్రినాయుడు : ఈయన క్రీ. శ. 1369 ప్రాంతీయుడు. ఈయనకు పొదిల తాలూకా గురాలమడుగు గ్రామంలో అమరనాయంకరముండెను. దీనిలో కొంత భూమిని కోరుమిల్లి రఘుపతీశ్వర శాస్త్రుల్లవారికి దానమిచ్చి శాసనము వ్రాయించి ప్రసిద్ధికెక్కెను. ఇది రెడ్డి ప్రభువుల పాలనాకాలముగా నున్నది.

## ఎఱువ వారి రాజ్యము

### భక్తీశ్వర చోడుఁడు *

ఎఱువవారిలో కొందరి చరిత్రము లోగడ తెలుపబడినది. క్రీ॥శ॥ 1360వ సం॥ర ప్రాంతములో నీయన పాలనము గన్పడుచున్నది. ఇతడు తమ పూర్వస్థానమగు ఎఱువ ప్రాంతమునుండి గోదావరీ ప్రాంతములకు వచ్చి యచట రెడ్డి రాజగు అనపోతారెడ్డికి సామంతుడుగా మొదటినుండి యున్నట్లు చరిత్రజ్ఞులు గుర్తించుచున్నారు. అనదేవచోడుని శాసనములవల్ల నీతఁడు మిక్కిలి శూరాగ్రేసరుడనియు, బొగ్గర మున్నగు యవనరాజులను గులవుండివద్ద యువరాజుగా నున్నపుడే జయించెననియు, పంచధార్లవద్ద గజపతిని, ధరణిపాడువద్ద సింగభూపతిని, పెదకొండవద్ద దిబర్ ఖాన్ మున్నగు వారిని, సూరవరంవద్ద వీరాన్నపోతుని యోడించెననియు, తురుష్కుని సాయముతో కర్నాటకరాజు నోడించెననియు, అత్తిలివద్ద జరిగిన యుద్ధములో శత్రువుల నెదిర్చి యోడించి 10 వేల సైన్యమును రక్షించెననియు, ఉండిరాజు సాయముతో కాకరపర్తివద్ద జరిగిన

---

* Followed J.A.H R.S. Vol. I. & Introduction in Velugotivari Vamsavali (1939)

యుద్ధమున కన్నడ సైన్యమును హతమార్చె ననియు, కాటయ వేమారెడ్డి కుటుంబము తనతోడి యుద్ధమున నోడింపబడి శరణు జొచ్చగా వారలను రక్షించె ననియు దెలియుచున్నది. ఇందుగల తురుష్క సేనాధిపతులు బహమనీసుల్తానగు అల్లావుద్దీను హసన్‌గంగు సైన్యములోనివారై యుందురనియు, అనపోతారెడ్డి (అద్దంకిప్రభువు) కొప్పుల కాపయనాయకుని కొలకై గజపతితో బోరాడిన సమయమున నీతడుగూడ వెడలియుండుననియు, లపుడు గజపతి యోడింపబడి కాపయనాయకుడు పునఃప్రతిష్ఠంపఁబడెననియు, తర్వాత నితడు తనకొక చిన్న రాజ్య మేర్పరచుకొనియుండు ననియు చరిత్రజ్ఞులు గుర్తించుచున్నారు.

ఈయన యేకారణమువలననో తర్వాత రెడ్డిరాజులతో విరోధమువహించి రాజ్యము కొఱకు యుద్ధములు సల్పుచున్నట్లు కన్పడును. ఈతడు కామపురి యను పట్టణము గట్టించి కామరాజను పేర్గాంచి యందు దాను పాలింపదొడగెను. గోదావరి ప్రాంతమున అనపోతారెడ్డి పాలనము క్రీ॥ శ॥ 1356 వ సం॥ తర్వాత ముగిసిపోయి, తిరిగి అనవేమారెడ్డి పాలనము క్రీ॥ శ॥ 1373 వ సం॥లో నచట కన్పడుచున్నందున నీ మధ్యకాలములో నితడు పాలించుచున్నట్లు చరిత్రకారుల యభిప్రాయము. అనవేమారెడ్డి యీతనితో సఖ్యపడి యీయనను సామంతునిగా జేసికొన్నట్లు కన్పడును. ఇంతేగాక అనవేమారెడ్డి ప్రభువు తన కుమార్తెను యీయన కుమారుడగు బీమరాజున కిచ్చి వివాహము గావించినట్లు శివలీలా విలాసము, కాశీఖండమను గ్రంధములవల్ల దెలియుచున్నది*. ఈ వివాహము భక్తీశ్వరచోడుడు బ్రతికియుండగా జరిగినదియు, లేనిదియు చెప్పుటకు వీలు

---

* "మ॥ అనవేమ క్షితిపాలు పౌత్రియగు వే • మాంబా మహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడ భూమిపాలునకు సం • గ్రామ స్థలీ గాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధా • ధ్యక్షుండు దొడ్డ ప్రభుం
డును నన్నయ్యయు బహువిక్రమ కళా • టోప ప్రతాపోన్నతుల్.
శ్రీనాధుని కాశీఖండము.

శివలీలావిలాసములోని పద్యమునకు ప్రధమభాగము,
104 పుట చూడుము.

లేకున్నది. లోకలురికార్డులోగల యొక శాసనమునుబట్టి చూడగా*1 నితని కుమారుడగు అనదేవచోడుడు కి౹౹ శ౹౹ 1366 వ సం౹౹లో ననగా అనవేమారెడ్డి పాలనమునకు ముందే సింహాసన మెక్కినట్లు గన్పడును.

భక్తీశ్వరచోడుడు గోముఖగిరీశ్వరాలయమునకును, పట్టిస వీరభద్రాలయ మునకును బంగారు మలాము వేయించెనట. ఈతడు కాశీవిశ్వేశ్వరస్వామికి గొన్ని గ్రామములను, పట్టిసంలోని బ్రాహ్మణులకు గోశతమును దానమిచ్చి ప్రసిద్ధి వహించెను. ఇతడు పర్వతస్వామికి చెరువాడు, అతుకూరుగ్రామముల నిచ్చెననియు, త్రిపురాంతక స్వామికి ఆముదాలపల్లి యను గ్రామ మొసంగె ననియు,శ్రీనాథమహాకవి రచితమగు శివరాత్రి మాహాత్మ్యమనుగ్రంథమున వ్రాయ బడినది. ఈ మహారాజు శైవభక్తుడగుటచే దినమున కాఱుమార్లు శివుని ధ్యానించు వాడట. ఈయన భార్యపేరు అన్నెమాంబ. ఈ మహారాజునకు భీమరాజు,అనదేవ చోడుడను నిర్వురు కుమాళ్ళుండిరి. భక్తీశ్వరుడు శా. శ. 1227 వ సం౹౹లో శ్రీశైలయాత్ర నొనర్చి విశ్వేశ్వర బ్రహ్మచారికి కంద్యకోల నగ్రహారముగ నిచ్చెను. ఈ విశ్వేశ్వరబ్రహ్మచారి శ్రీశైలముమీద వసించి శిష్యులకు విద్య నేర్పుచు తెలుగుదేశమున మతప్రచారము జేయుచు బేరొందెను.

భక్తిరాజునకు 'గండభేరుండ, రాయవేశ్యా భుజంగాది' పెక్కు బిరుదులు గలవు. ఈయన పూర్వికులు ముమ్మడి ప్రోలవరమున నుండినట్లొక యభి ప్రాయము గలదు.

## అనదేవ చోడమహారాజు*

ఈయన తండ్రియనంతరము రాజ్యమునకు వచ్చెను. కాని తన సవతి తల్లి కుమారుడును, రెడ్ల బందుగుడు నైన భీమరాజు యొక్క తంత్రమువల్ల గాబోలు పదభ్రష్టుడైనట్లు కన్పడుచున్నది. భీమరాజు అనవేమారెడ్డి సహాయ ముతో నీయనను రాజ్యమునుండి తొలగింపగా, నితడు త్రిపురాంతక ప్రాంతము నకు తమ పూర్వరాజ్యమగు 'ఎఱువ' సంస్థానమును బాలించుకొనుటకై యచ్చటి

*1 Mac M.S.S 215—4—4 P 231.

* Followed Introduction in Velugotivari vamsavali

కేగినను, అది యంతకు పూర్వమే విజయనగర రాజ్యాధిపతి యగు రెండవ హరిహరరాయలుకు లోబడిపోయిన దగుటవల్ల, చేయునదిలేక, దేవరకొండ రాజ్యాధిపతియు, వెలమ వంశోద్భవుంతు నగు వేదగిరి నాశ్రయించెను. ఈయ నకు వేదగిరి తన సైన్యములనిచ్చి పంపగా భీమరాజునకు సాయముగా కొండ వీటి ప్రభువగు అనవేమారెడ్డి సైన్యములను దోడుకొని వచ్చెననియు, నప్పుడు రెండుసార్లు యుద్ధములు జరిగి, చివరకు అనవేమారెడ్డి ప్రభువును సింగభూపతి పుత్రుడగు అనపోతానాయడు II రణరంగమున జంపినట్లును దెలియుచున్నది. కాని తుద కప్పుడుగూడ అనదేవచోడుడు రాజ్యలాభము బొందజాలకయ్యెను.

అనదేవచోడు డంతట నూరకొనక గుల్బర్గు రాజ్యాధీశ్వరుడగు ఫిరోజషా నాశ్రయించి, యాతనికిని కర్నాట రాజులకును జరుగుచువచ్చిన యుద్ధములలో సాయపడి, సాగరవద్ద జరిగిన యుద్ధములో కర్నాటకులనోడించి, కోట పట్టుకొని యాతని స్నేహితునిగా జేసికొనెను.

ఇంతలో రెడ్డిరాజ్యమునకు పాలకుడగు కుమారగిరిరెడ్డి చనిపోయినందున రాజ్యవిషయమున పెదకోమటి వేమభూపాలునకును, కాటయ వేమునకును తగాదా లేర్పడెను ఈ సమయమును గనుపెట్టి మరల తన రాజ్యమును గైకొనుటకై యితడు రాచకొండ వెలమ వీరులయొక్కయు, యవనులయొక్కయు సాయ ముతో బ్రయత్నించినట్లు కన్పడుచున్నది. అప్పుడు వెలమవీరుడగు వేదగిరికి ననేకరాజులకు (రెడ్డి సామంతులైయుందురు) యుద్ధములు జరిగి, బెంతపూడి కోటను వేదగిరి పట్టుకొనినట్లు వెంకటగిరి రాజవంశావళి తెలుపుచున్నది. ఈ యుద్ధములలో జయించినందుననే చివరకు అనదేవచోడుడు "రాజాధిరాజపరమే శ్వర పూర్వసింహాసనాధీశ్వ" రాది బిరుదములతో తన రాజ్యమును వశపఱచు కొనె నని చరిత్రకారుల విశ్వాసము. ఇట్లు అనదేవమహారాజు విజృంభించుటచే కాటయ వేమారెడ్డి రాజ్యమునకు నష్టమేర్పడగా నాతడు మరల నన్నదేవచోడు నిపై గవియుటకు బ్రయత్నించుచు వచ్చెను. ఈ సంగతి ముందుగనే గుర్తించిన వేదగిరి భూపాలుడు తన మంత్రియగు పినమాదానాయని రాజమండ్రిలోనుంచి అనదేవచోడుని కంటికి రెప్పవలె గాపాడగగ్గెను.

కాటయవేము డంతట తన బంధుగుడగు విజయనగర రెండవ హరిహర రాయల నాశ్రయించి కొంతసైన్యమును తోడ్కొని అనదేవమహారాజు నెదిర్చెను.

అనదేవచోడుడు తన పూర్వస్నేహితుడగు గుల్బర్గసుల్తానుఫిరోజిషా నాశ్రయించి కొంత సైన్యమును ప్రోగుజేసికొని, దేవరకొండ వెలమవీరుల సైన్యముతోసహా డీకొనెను. గుండుగొలనువద్ద నొక యుద్ధము జరిగి యందు వెలమవీరులచే కాటయవేముని సైన్య మోడింపబడెను. ఆ యుద్ధములోనే కొప్పునూళ్ళ తిప్పా నాయని వారిచే కాటయవేముడు సంహరింపబడినట్లు వారి వంశప్రాశస్తి తెలుపు చున్నది. అత్తిలివద్దగూడ నొక రణరంగము జరిగెను. కాకరపర్తివద్దగూడ విజయనగరసేనలకును, అనదేవచోడుని బావమఱదియగు పిన్నుండిరాజునకు ఘోరయుద్ధము జరిగి యందు అనదేవచోడుడే జయముగాంచెను. కర్నాట సైన్యము చెల్లాచెదరై నష్టపడిపోయెను. కాటయవేముడు చనిపోయియుండుట వల్లను తర్వాత యుద్ధములలో రెడ్లకోటమి గల్గుటవల్లను, తుదకు కాటయవేముని కుటుంబము 10 వేల సైన్యముతో అనదేవచోడుని శరణుజొచ్చెను. అనదేవ చోడుడు వారలను మన్నించి వదలినను, యీమైత్రి చిరకాలము నిలచియుండ లేదు. ఏలయన, కాటయవేముని సైన్యాధిపతులలో నొకడును, రాజమండ్రి పాలకుడునునగు దొడ్డయఅల్లాడరెడ్డి మరల విజృంభించి, అనదేవచోడునకు రాజ మండ్రి దుర్గమును స్వాధీనముగాకుండ జేయుటయేగాక, యింతలో ఫిరోజిషా తెలంగాణాదిక్కుగా నేగవలసివచ్చు సమయ మెఱిగి యెదిర్చెను. అప్పుడు విజయనగర దేవరాయల సాహాయ్యముగూడ అల్లాడరెడ్డి కుండెను. క్రీ॥ శ॥ 1417 వ సం॥లో దాదాపు మఱియొక ఘోరయుద్ధము జరిగి యందు దురదృష్ట వంతుడగు అనదేవచోడ మహారాజు సకుటుంబముగ నల్లాడరెడ్డి వలన జంపబడె నట. శ్రీనాధ రచయితమగు భీమేశ్వర పురాణమున అల్లాడరెడ్డి పక్షమున బోరిన అర్ధియేటి లింగనతో నిత డోడిపోయినట్లు వ్రాయబడియున్నది.

అనదేవమహారాజు తన తండ్రివలెనే శైవభక్తుడైయుండి దినమున కాఱు మార్లు శివధ్యానము చేయుచుండువాఁడు. ఇతడు శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరునకు సువర్ణ ఖచితమును, సువర్ణ వృషభమును, కలశములను చేయించి శాసనము వ్రాయించెను. ఇతడు తన తండ్రికాలములో గట్టింపబడిన కామపురియందే వసించుచువచ్చెను.

కామపురి (కళ్యాణపురి) యెచటనుండెనో గుర్తింపబడలేదు. కాని యందు నిత్యము కస్తూరి, నవరత్నములు మున్నగు వస్తు విక్రయిశాల లనేక ముండెనట.

ఈ మహారాజు జగ్గవాయ యను రాజు నోడించినట్లు తన శాసనములో వ్రాసి కొనెను. ఈయన శ్రీ చక్రవర్తి కుమార్తెయు, పిన్నుండిరాజు సోదరియు నగు నిరుగాంబిక యను కన్యను పెండ్లాడి వీరభద్రరాజను కుమారుని గాంచెనట. ఈతడుకూడ యుద్ధములలో బాల్గొనుచు వచ్చెను. అనదేవమహారాజు వీరభద్రా లయమునకు కొన్ని గ్రామములను ధారాగ్రహీత మొనర్చెను. ఇంతేగాక నీతడు వినరివాడులో తన పేరిట అన్నదేవచోడాగ్రహార మొకటి నిర్మించి బ్రాహ్మణుల కొసంగెను. ఇతడనేక బ్రాహ్మణాది వివాహములు గావించి ప్రసిద్ధికెక్కెను. ఈయన వ్రాయించిన క్రీ॥ శ॥ 1388 వ సం॥ను నాటి శాసన మొకటి త్రిపు రాంతక ప్రాంతమున గలదు. ఈయన శా. శ. 1335 వ సం॥లో తన తల్లి దండ్రుల పుణ్యమునకై పాలకొల్లు క్షీరారామేశ్వరాలయమునకు భూదాన మొసంగెను*.

## భీమరాజు II

ఇతడు భక్తీశ్వర చోడుని కుమారుల్లో నొకడని లోగడ తెల్పితిమి. ఈయన కొండవీటి పాలకుడగు అనవేమారెడ్డి కుమార్తెను పరిణయమై తమకు జనించిన వేమాంబ యను కన్యను రాజమండ్రి పాలకుడగు దొడ్డయ అల్లాడరెడ్డి కిచ్చి వివాహ మొనరించి, యాతని సహాయముతో తన సోదరుడగు అనదేవ చోడునిపై వైరము వహించి రెడ్లకు నాతనికి జరిగిన యుద్ధములో ప్రధానపాత్ర వహించినట్లు కన్పడుచున్నది. కాని రాజమండ్రి దుర్గముగాని మఱియొకదుర్గము గాని యీతడు పాలించినట్లులేదు. ఇతడు అల్లాడరెడ్డి సైన్యాధిపతిగనేయుండెను. కడపజిల్లా తాళ్ళప్రొద్దుటూరు శాసనమున నిత డిట్లు వర్ణింపబడియున్నాడు.

"ఉ॥ పన్ని తురంగమంబునకు • బక్కెర వెట్టిన వార్త హారిచే
విన్న భయంబునం గలిగె • వీసరనాడును జక్రగొట్టమున్
మన్నియవడ్లె కేలియమల • ద్యన వేంగి గళింగలాదిగా
నెన్నియు నొక్కనాడ • (నే)ఱువ భీమనృపాలు దాడికిన్."

---

• S I. I. V. No. 145

ఇట్టి శూరాగ్రేసరు డగు భీమరాజు సోదరునితో సఖ్యపడి యుండినయెడల వీరి రాజ్య మన్యాక్రాంతము గాక యుండెడిదే. కాని విధిప్రేరణచే నట్లు జరగ దయ్యెను.

## ఎఱువ కేశవరాజు

ఈ యెఱువవంశమున ప్రసిద్ధి వహించినవారిలో నీ కేశవ రాజొకడు. ఇతడు ఎఱువ సింగరాజునకును, లక్ష్మీదేవికిని పుత్రుడు. ఈయన శాసనమొకటి అమరావతిలోని అమరేశ్వరాలయమున గానవచ్చుచున్నది. దానినిబట్టి చూడగా నితడు చిలుమూరు గ్రామములోని పుట్టెడుచేను నా దేవునకు దానమిచ్చి శాసనము వ్రాయించినట్లు గన్పట్టును. ఇది యాతని వృత్తిభూమి నుండి యొసగబడి యుండును. కమ్మవారిలోని యేరువ వారీ వంశీకులే యగుదురు.

ఈ యెఱువ వంశీకుల తర్వాత విషయము చరిత్ర ప్రసిద్ధిగా గన్పడదు. కాని శా.శ. 1579వ సం॥ర ప్రాంతములో విప్పర్ల గోత్రీకులగు యేర్మ పేరా రెడ్డి, జంగంరెడ్డి, కొండా రెడ్డి, పెదవెంగన, తిమ్మారెడ్డి, చిన వెంగన యను వారలు కనిగిరి తాలూకా కూటగుండ్ల గ్రామములో గోపాలస్వామి గుడి పునః శిలాకట్టడము గట్టించినట్లు వారి శాసనమువల్ల దెలియుచున్నది. వీరల తండ్రి లచ్చిరెడ్డి యనియు, తాత కొండా రెడ్డి యనియు వ్రాయబడినది. వీరికిని పై రాజ వంశీకులకును గల సంబంధము తెలియుటలేదు. వీరందరును రెడ్డి వంశీకులై పోయినవారని తోచుచున్నది. (**N. I. K.** 16)

### మచ్చ వారు

## మచ్చ గన్నవిభుడు

మచ్చవారు చాళుక్య వంశములోనివారని వెలుగోటివారి వంశావళి తెలుపుచున్నది. వీరు కమ్మవారిలోని అడపావారికి ముఖ్య బంధువులై యున్నారు. 14వ శతాబ్దమున నీ మచ్చ వంశములో ననేకులు వీరాగ్రేసరులుగనుండి పద్మనాయకరాజులతో విరోధులై యుండిరి. ఆ కాలములో పలువురు రాజ్యాతిక్రమణములకై పోరాడుచువచ్చిరి. మచ్చవంశములో ధాదాపు క్రీ. శ. 1321వ సం॥ర

ప్రాంతమున గన్న విభుడను ప్రముఖ నృపతి యుండెను. ఆతఁడు వెలుగోటి యెఱ్ఱదాచానాయనిచే యుద్ధమున జంపబడినట్లు వెలుగోటివారి వంశావళిలోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

"స్ర. వీరుం డా యాచవృధ్వీ-విభుఁడతుల భుజా ♦ విక్రమ మన్యకృత్యాన్య
స్ఫారుండై మచ్చగన్న-ప్రముఖనృపతులన్ ♦ ప్రాణముల్వాపి హెచ్చెన్
(దోరాజత్) ఖడ్గదారన్-దునిమె దురకలం ♦ దోలి తత్సైన్య రాజీ
ఘోరాజీ ధాటి చెల్లన్-గొలచలమపురిన్ ♦ ఘోటికా కోటిదెచ్చెన్".

ఎఱ్ఱదాచానాయని పుత్రుడగు సింగమనాయడు గూడ జీలుగుపల్లి కడ జరిగిన యుద్ధములో నొక మచ్చ గన్నమనేనిని జంపినట్లు వ్రాయబడినది. ఈ యుద్ధములో తండ్రియు, కుమారుడు గలిసి పోరాడి యుందురు. ఈ చాలుక్యలకు మిగత కమ్మవారు కొందరు సాయపడినను లాభము లేకపోయెను.

## మచ్చ కొమ్మానేని, బాచడు

మచ్చ కొమ్మ విభుని పుత్రుడు బాచడు. ఈ తండ్రిబిడ్డ లిర్వురును శూరాగ్రేసరులై యుండిరి. వీరు వెలుగోటి యెఱ్ఱదాచానాయని పుత్రుడగు సింగమ నాయనితో ఘోర యుద్ధము లొనర్చుచు నోడిపోయిరట. మగతలవద్ద జరిగిన యుద్ధములో మచ్చ కొమ్మానేని సంహరింపబడియెను. తర్వాత జీలుగుపల్లి వద్ద జరిగిన యుద్ధములో సింగమ నాయనిచే బాచనేని సంహరింపబడి నట్లీ క్రింది పద్యము దెలుపుచున్నది.

"చ. బలువిడి మచ్చ కొమ్మవిభు ♦ బాచని జీలుగు పల్లియొద్ద న
చ్చలమున దున్మించి తద్రణము ♦ సాహసుఁడై కుడిపించె భూతముల్
పలుమరు సొక్కియాడుచును ♦ బాడుచు మోద మెలర్ప నయ్యెడన్
జెలఁగఁడె యెఱ్ఱదాచవిభు ♦ సింగఁడు బూరిపరాక్రమంబునన్॥"

## మచ్చ రుద్రుఁడు

ఈయనగూడ పరాక్రమశాలియై యుద్ధములలో బాల్గొనుచు వచ్చెను. దుర దృష్టవశమున మగతలయొద్ద జరిగిన యుద్ధములో నీతడుగూడ సింగమ నాయనిచే జంపబడినట్లీ క్రింది పద్యము దెలుపుచున్నది.

"వ. మగతల యొద్ద నుద్దవిడి ♦ మార్కొని రాజులు సన్నుతింపఁగా
నగణిత విక్రమస్ఫురణ ♦ నాలము లోపల మచ్చ రుద్రునిన్
దగ వడదోలి చంపె నెఱ ♦ దాచయ సింగఁడు పార్థుకైవడిన్
బగ యడగించి యచ్చటన ♦ పండువు సేసెను భూతకోటికిన్॥".

జీలుగుపల్లి వద్దను, మగతల వద్దను జరిగిన యుద్ధములలో కమ్మవీరు లనేకులిట్లు సంహరింపబడినట్లు కనపడుచున్నది. సింగమ నాయడంతట 'మచ్చ నాయకుల తల గొండగండ', 'కమ్మదొరల మోదిన కాలదండమ' యను బిరుదములను ధరించెనట. ఈ సింగమ నాయడు తుదకు జల్లిపల్లి కోట ముట్టడిలో తమ్మల బొమ్మనిచే బొడువబడి చనిపోయెను.

## మచ్చ ఓబలరాజు

ఈత డిందువంశంబు రాజులలోని వాడని స్పష్టముగ వెలుగోటివారివంశావళి తెలుపుచున్నది. (పుట 18) జల్లిపల్లి వీరక్షేత్రమున అయిదు లక్షల అఱువది వేల బలముతో నీ మచ్చ ఓబలరాజు మున్నగుననేక సేనాధిపతులుజేరి వెలుగోటి అనపోతానాయడు, మాదానాయడులతో (క్రి.శ. 1361వ సం॥) శార్వరి సం॥లో ఘోరయుద్ధమొనర్చిరి. ఈ రణరంగములో శూరాగ్రేసరుడగు ఓబలరాజుగూడ అనపోతానాయనిచే జంపబడి నట్లీ క్రింది పద్యము స్పష్టపరచు చున్నది.

"ఉ. కొమ్మని మచ్చ యా బఱని ♦ గూల్చి శిరంబులు ద్రుంచి గన్నయన్
బిమ్మట ద్రుంచి తత్సుతుల ♦ బేర్చిన బొమ్మలు వెట్టి దారులం
దమ్మటము ల్వేసం గొనియె ♦ దాచయ సింగని పట్టి యెట్టిడో
బొమ్మలు బెట్టు నిట్టు లన పో ♦ తఁడు వైరము బూను వారికిన్॥".

ఈ మచ్చవారిలో చాలవరకిట్లు హతులైపోగా, హతశేషులగు వారెచ్చటనో తలదాచుకొని తర్వాత కమ్మవార మనియే చెప్పుకొనజొచ్చిరి. వీరిలో 15 వ శతాబ్దమున మచ్చకొండ నృపాలుడగు నతడుండి యాతని కుమార్తెయగు తిరుమలమ్మను అడప నృసింహ నృపాలుని కిచ్చి పరిణయము గావించినట్లు జానకిరాఘవమను గ్రంథమువల్ల దెలియుచున్నది.

## మచ్చ కామినేని

ఈ మచ్చ వంశములో శా.శ. 1337 వ సం॥ (క్రి. శ. 1415 వ సం॥) నాటికి మచ్చ కాచినేని యను నతడు కొండవీడు ప్రాంతమున నొక ప్రసిద్ధ

పురుషుడుగా నున్నట్లు కనబడుచున్నాము. ఈయన భార్యపేరు నాగసాని. వీరికి కొలవేమసాని యను పుత్రిక గలదు. ఈ కుమార్తె శా.శ. 1337వ సం॥లో కొండవీటిలోని మూలస్థానమైలారదేవర యాలయమునమధ్యరంగము కంభమును తన తల్లిదండ్రుల పుణ్యమునకై వేయించి శాసనమొకటి వ్రాయించి ప్రసిద్ధి వహించెను *1.

## కొండవారు

## కొండ మల్రాజు

క్రీ. శ. 1361వ సం॥ర ప్రాంతమున నీ కొండ వంశములో కొండమల్రాజను నతడొక ప్రసిద్ధ వీరాగ్రేసరు డుండెను. ఆతడు చాళుక్య రాజులలోని వాడనియే వెలుగోటివారి వంశావళి నుడువుచున్నది. వెలమ వీరులగు అనపోతానాయడు, మాదానాయడను వారలు (రాచకొండ, దేవరకొండ ప్రభువులు) జల్లిపల్లి కోటపై దండెత్తి వచ్చినప్పు డీతడుగూడ తక్కిన చాళుక్యనృపాలురతో పాటు ఘోర యుద్ధము నొనర్చెనుగాని వారిచే నా రణరంగమున సంహరింపబడెను. ఈ వంశీకుల తర్వాత వివరము తెలియుటలేదు. కాని కమ్మవారిలో నేటికి నున్న కొండవారీ చాళుక్య వంశమువారే యనవచ్చును.

## సమ్మెటవారు *

## సమ్మెట కొండ్రాజు

సమ్మెటవారు చాళుక్యవంశజులని వెలుగోటివారివంశావళి తెలుపుచున్నది. వీరినే సంపెటవారనియు, సంబెటవారనియుగూడ నందు వ్రాయబడినది. క్రీ.శ. 1361వ సం॥ర ప్రాంతమున నీ వంశములో సంబెట కొండ్రాజను వీరాగ్రేసరు డుండెను. క్రీ: శ. 1361వ సం॥లో ఇనుగుర్తివద్ద వెలమ వీరులకును చాళుక్య రాజులకును జరిగిన ఘోర సంగ్రామములో బాల్గొనిన వీరులలో నీతడొకడు. దురదృష్టవంతుడగు నీ శూరశిఖామణి గూడ నా రణరంగమున రావులింగయ నాయకుని కొడుకగు ననపోత నృపాలునిచే దక్కిన చాళుక్య రాజులవలెనే మడిసినట్లు వెలుగోటివారి వంశావళి తెలుపుచున్నది. అప్పటి నుండియు నారాజ్యమున చాళుక్యులమని చెప్పుకొనుట కష్టమయ్యెను. అచటివారు క్రమముగా కమ్మవారు

---

*1. S. I. I. Vol. IV, No. 695.

* వెలుగోటివారి వంశావళిని బట్టి వ్రాయబడెను.

గనే చెప్పుకొనుచున్నట్లు కన్పడును. మిక్కిలి దూర ప్రాంతీయులగు నీ వంశీకులు కొందఱు మామూలుగ క్షత్రియులుగ జెప్పుకొనుచు వచ్చిరి.

## సమ్మెట సోమనృపాలుడు

ఈ వంశములో దాదాపు క్రీ॥ శ॥ 1417 వ సం॥ ప్రాంతమున కడప జిల్లా పెర్నిపాడు పాలకుడుగా నీ సోమనృపాలుడు పేరందెను. ఈతడు విజయనగర సామ్రాజ్య ప్రభువగు రెండవ దేవరాయల సామంతుడని చరిత్రజ్ఞులు గుర్తించుచున్నారు. ఈతడు కొండవీటి ప్రాంతమున జరిగిన యొక యుద్ధములో రాయరావు బిరుదాంకితుడగు వెలుగోటి అనపోత నృపాలునిచే నోడింపబడినట్లు వెలుగోటి వారి వంశావళిలోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

"కం. సమ్మెట సోముని సరెపలి ♦ తిమ్మని నలకొండవీటి ♦ దిక్కున మెఱయన్
దమ్మటము వేసి గెలిచితి ♦ పమ్మక్కారాయరావు ♦ అనపోతాంకా॥"

ఇట్లు గెలిచినను, యీతని పాలనము గైకొనినట్లు లేదు. ఏమైన కప్పమును గైకొనెనో లేదో తెలియదు. ఈయనకు పిన్నమనేని యను కుమారుడుండెను. ఈతని యనంతర మతడే పెర్నిపాడు పాలకుడయ్యెను.

## సమ్మెట పిన్నమనేని

ఈయనకును వెలుగోటి మాదానాయని కొడుకు లింగమనాయనికిని జరిగిన యొక యుద్ధములో నితడోడిపోయినట్లు వెలుగోటివారి వంశావళి తెలుపుచున్నది. దేవరాయల రాజ్యపాలన నాటి యొక శాసనములోగూడ నీ పిన్నమనేని పెర్నిపాడు పాలకుడుగా నుదహరింపబడి యున్నాడు *. లింగమనాయని మరల దేవరాయలోడించి పిన్నమనేనిని తిరిగి తన సామంతుడుగా జేసికొని యుండునని దీనిని బట్టి గుర్తింప బడుచున్నది. ఈ సమ్మెట వంశీకులిప్పటికిని కమ్మవారిలో నిలిచి యున్నారు. ఈ వంశములో నొక యోధుడు కృష్ణదేవరాయల సామంతుడుగా నున్నట్లును, ఆతడు సింహాద్రికి జయస్తంభమును జేర్చినట్లును ఒక చాటువు గలదు. ఆతడు దాదాపు క్రీ॥శ॥ 1520వ సం॥ ప్రాంతీయుడనవచ్చును.

*L. R. Vols. 18 & 14.

## భండారం చవుంణాయనింగారు

ఈయన 1317 ప్రాంతీయుడు. రెడ్లపాలన కాలమునాటివాడు. ఇతడు పొంటూరు గ్రామములో నొక రాటివనమును వేయించి కీర్తికెక్కెను. ఈతని వలెనే వాసిరెడ్డి పోతినీడు పిఠాపుర ప్రాంతమున రాటివనముల వేయించినట్లు లోగడ తెలిపితిమి. (L. R Vols 21 & 22)

## చోడవారు

## చోడె పర్వతరాజు

ఈయన 1361 సం॥ ప్రాంతీయుడు, యోధాగ్రేసరుడు. ఈతడు చాలుక్య వంశములోని వాడని వెలుగోటివారి వంశావళి తెలుపుచున్నది. చోడవారు తెలుగు చోడులలోని వారయ్యును, బంధుత్వమువల్ల నాటికి చాలుక్యులుగా పరిగణింపబడి రనవచ్చును. వెలమ నృపాలుడు అనపోతానీడు, మాదానీడులలో చాలుక్యరాజులు జరిపిన యుద్ధములలో బ్రాహ్మణ యందీపడు హతుడయ్యెను. చోడ పర్వతరాజు మస్తక బంపము అప్పి వెలమ రాజులు బిరుదు ధరించిరి. ఈ చోడవారిలో హతశేషులు కమ్మవారిలో కలిసిపోయిరి.

## చిలుకూరి అబ్బినేడు

ఈయన 1461 సం॥ ప్రాంతీయుడు. కొవ్వూరు తాలూకా అనంతపల్లి గ్రామములోని కేశవస్వామి కితడు కొంత భూమిని దానమిచ్చి ప్రసిద్ధి జెందెను. ఈయన తండ్రి కాచినేడు. ఆకాలమున నాగ్రామము లనంతపల్లి యనబడు చుండెను.

## గజపతులక్రింది - కమ్మసామంతులు ఇతరసామంతులు

కొండవీటిరాజ్యమున రెడ్డిరాజుల పాలన యంతరించిన తర్వాత నది క్రీ॥ శ॥ 1420 ప్రాంతమున లాంగూలగజపతికి స్వాధీనమయ్యెను. ఆతడు 1428 వరకు పాలించెను. ఇంతలో విజయనగర రాజ్యాధిపతులగు రెండవ దేవ రాయలు దీనిని స్వాధీనము గావించుకొనెను. తర్వాత మహావీరాగ్రేసరుడగు కపిలేశ్వరగజపతి రాజ్యమునకు వచ్చి 1455 లో ఆక్రమించెను. ఈయన దక్షిణ

దేశమువరకు జయించెను. అతనికాలములో కుమాళ్ళగు హంవీర, పురుషోత్తమ గజపతులు యువరాజులుగా కొండపీడులో నుండిరి. ఆతడు 1470 ప్రాంతమున చనిపోగా పురుషోత్తమగజపతి పాలకుడయ్యెను. ఆతడు 1497 వరకు పాలించి చనిపోగా నతని కుమారుడు ప్రతాపరుద్రగజపతి పాలకుడయ్యెను. ఈతడు కొండవీడులో 1515 వరకు రాజ్యపాలన గావించెను. ఇతని కుమారుడగు వీరభద్రగజపతి యువరాజుగా నుండెను. 1515 వ సం॥లో జనవరి 23వ తేదీ యీ కొండవీటి రాజ్యము శ్రీకృష్ణదేవరాయలకు లోబడిపోయెను. (కొండవీటి సామ్రాజ్యమను తెలుగుగ్రంథము చూచుడు) వీరికి 1471, 1474, 1477 సం॥ లలో భామినీసుల్తానులతో యుద్ధములుండెను *1.

ఈ గజపతుల సామంతులుగానుండిన కమ్మవారి వివరములరయుదము:

(1) రాజా సాయపనేని వెంకటపతినాయడు: శాయపనాయని వెంకటపతి యనికూడ అందురు.) ఇతడు క్రీ.శ. 1475 ప్రాంతీయుడు. ఇతడు పురుషోత్తమ గజపతి కాలములో ప్రతాపరుద్రగజపతి యువరాజుక్రింద పాలించినవాడు. ఇతడు దూపాటిసీమను పాలించుచు రాజాబిరుదము ధరించెను. ఈతడు 1475లో త్రిపురాంతకములోని దేవునికి యేటేట 720 వరహాలు ఖర్చుపెట్టి వైభవముగ యుత్సవ కైంకర్యముల నొసర్చుటకై నిర్ణయించి సంస్కృతభాషలో నొక శాసనము వ్రాయించెను *2.

(2) తాళ్ళూరి మాకినీడు : పావులూరి గ్రామములోని ప్రసిద్ధుడు. లాంగూలగజపతి పాలించుకాలములో నా గ్రామములోని చెన్నకేశవస్వామికి నాంచారమ్మదేవతకు 12 కుచ్చెళ్ళ భూమి నిప్పించెనట. అందుచే నితడు 1430 ప్రాంతీయుడనవచ్చును *3.

(3) సాగి గన్నమనీడు : చతుర్థవంశీకుడుగా చెప్పుకొనిన యీతడు వినుకొండరాజ్యమును ప్రతాపరుద్రగజపతి సామంతుడుగా పాలించెను. ఈతని పూర్వీకులు యిచటనే పాలించుచుండిరి. వీరి మూలపురుషుడు గన్నమనాయడు

*1. కళింగదేశ చరిత్ర.

*2. L. R. Vol 14. పుటలు 536, 537.

*3. L. R. Vol. 5. పుటలు 464, 465

లేక అన్నమనాయడు. తర్వాత వరుసగా పెదగన్ననృపతి, తర్వాత నతని కుమారుని తిప్పనృపతి, గాదభూపతి, చెన్ననృపతి యనువారు, తర్వాత గాదనృపతికి జనించిన పెదతిప్పనృపతి. గన్నమనాయకులును, లింగభూపతి, పినతిప్ప నృపాలుడు ననువారు అచట నుండిరని, యిందలి గన్నమనాయడు 1477 ప్రాంతీయుడనియు నొక శాసనములో నున్నది. ఈతడు 3 గ్రామములను అగ్రహారములుగా బ్రాహ్మణులకిచ్చి పేరొందెను. దేవాలయము, మంటపాలు, బావులు, చలమలు గట్టించెనట. ఈయనకు 'పులియమార్కొలుగండ, కరవాల భైరవ, గండభేరుండ' బిరుదములున్నవి.

(4) అడపా కూనయ్య : 1593—99 మధ్యవాడన వచ్చును. ఈతడు గజపతిరాజులలోని విద్యాధరునిచేత కొండపల్లి, కొండవీడుసీమల పాలనను బొందినట్లు జానకీరాఘవమను గ్రంథమున నున్నది. ఛత్రచామర, మకరటెక్కె ములాది బహుమతులను బొందెను. ఈవంశములోని అడపా నారపనృపాలుడే పైన నుడివిన గ్రంథము వ్రాయించెను. కృతిభర్తయయ్యెను. చేతపూడి కృష్ణ మంత్రి యాగ్రంథము రచించిన కవి.

అందీ క్రింది పద్యములు గమనార్హములు :

శ్రీలక్ష్మీరమణీశ పాదయుగ రాజీవంబునంబుట్టి గం
గాలీలావతి తోడబుట్టువయి లోకాలోకపర్యంతఘున్
బాలించున్ ధరణీతలం బడప కూనయ్య క్షమానాథు డు
ద్వేల శ్రీకర కమ్మసత్కులమునన్ దీపించు సత్కీర్తులన్.

గీ॥ కనకమణిమయభూషణ గజతురంగ, మౌక్తిక చ్ఛత్రచామర మకరటెక్కె
ములను విద్యాధరునిచేత నెలమినందె,నతడు గజపతి కుడిభుజమనఁగమిగుల.

గీ॥ కొండపల్లి కొండవీడు లఖండవైభవమున నాఖండలునిరీతి నమరనేలె
తనదు కీర్తిప్రతాపసుధాంశు పద్మహిత మనఁవ్రథ బ్రహ్మాండమెల్లనింప.

## మేదరమెట్లవారు

(5) మేదరమెట్ల నరసభూపతి: మేదరమెట్లవారు తమ్మలూరుగోత్రస్థులు. వీరి చరిత్రము 16వ శతాబ్దినుండి మాత్రమే తెలియుచున్నది. క్రీ॥ శ॥1520 సం॥

ప్రాంతమున నీవంశములో మేదరమెట్ట నరసభూపతియను పాలకు డుండెను. ఈతడు పువునూరి పురవరాధీశ్వరుడని పేరొందెను. ఈయన తండ్రి పేరు అయ్యలరాజువరపు బొబలరాజు. ఈయన గజపతిరాజునకు (ప్రతాపరుద్ర గజపతి కాబోలు) సాహాయ్యకర్తయై యుండెననియు, మహమ్మదీయసుల్తాను గర్వ మపహరించె ననియు గొన్ని చాటువులు నుడువుచున్నవి. ఇంతేగాక యీయనకు గల బిరుదములలో "గజపతిమన్నీడు, రాచూరి దుర్గాపహారుం" డనునవి గలవు. అందుచే క్రీ॥ శ॥ 1520 వ సం॥ర ప్రాంతమున కృష్ణదేవ రాయల కాలములో జరిగిన రాయచూరు యుద్ధమున నితడు పాల్గొనెనేమోయని తోచుచున్నది. అప్పుడు గజపతి కృష్ణదేవరాయలకు సహాయపడెనా యని యను మానింపదగియున్నది. ఈయనకు "కౌదమనాయకుల మగడు, కోటలగొంగ, సురుమాయి, గజపతిమన్నీడు, రాజవేశ్యాభుజంగుడు, రాచూరి దుర్గాపహారుడు, కేళాదిరాయడు, గగ్గోలు రాయాంకుడు" మున్నగు బిరుదులు గలవని కొన్ని చాటువులు తెలుపుచున్నవి. ఈయనకు రమణభూపాలుడను కుమారుడుండెను. ఈ వీరాగ్రేసరుని యుద్ధనైపుణ్యము నొక కవి యిట్లు వర్ణించియున్నాడు.

సీ॥ కాల్బలంబులమీఁద - ఖడ్గంబు వేయఁడు, రాయరాహుత్తుల - వేయు గాని
రథికెక్కిన పయా-రూఢులఁ డాయఁడు, వీరసాహసులను - వేయుగాని
వెన్నిచ్చి పరచు భూ-విభుల వెంటాడించఁ, డెదురించు రిపులపై-నెక్కుగాని
సామాన్యయోధుల-సరకు సేయం డాజి, మించు నెక్కుడుకాంద్ర - డించుగాని

గీ॥ వెఱచి పఱచిన గసువులు-కఱచిపఱచి, గట్టు లెక్కిన సఱచిన- గాచు రిపుల
భళిరె! మేదరమెట్టయౌ-బళసుతుండు, మన్నె మాత్రుండె నరసన-న్మావిభుండు"

(6) మేదరమెట్ట రమణభూపతి : ఈయన నరసభూపాలుని పుత్రుడు. ఇతఁడు తన తండ్రి వహించిన బిరుదుల నన్నిటిని ధరించెను. ఈయనగూడ తన తండ్రితోపాటు పైన బేర్కొనిన యుద్ధములలో బాల్గొనుచు వీరపురుషుడని ప్రసిద్ధికెక్కెను. ఈయన పేరిట గొన్ని చాటువులున్నవి. కాని గ్రంథవిస్తరభీతి నుదాహరించుటలేదు.

(7) మేదరమెట్ట కొండప ప్రభువు : ఈయన మేదరమెట్ట మల్ల నృపా లుని పుత్రుడు. ఈయనకును పైన నుడివిన నరసభూపతికిని, రమణభూపతికిని గల సంబంధము తెలియుటలేదు. ఈతఁడు గజపతి రాజువద్ద నొకసేనాధిపతిగా

నున్నట్లు కన్పడుచున్నాడు. అందుచే నితడు 16వ శతాబ్దమువాడే యన వచ్చును. ఈయనకు "సురమాయి, కేళాదిరాయ, గాంగేయశౌర్య" మున్నగు బిరుదులు గలవు. ఈయన పేరిట నీక్రింది చాటుపద్య మొకటి కనబడుచున్నది.

సీ॥ సిరిమించు సురమాయి-బిరుదు మన్నెకుమార । భీమప్రతాప సం-గ్రామవిజయ
గజపతి సామ్రాజ్య - గజమన్నె సింహమ । కేళాదిరాయ గాం-గేయశౌర్య
కమ్మకులాధ్యక్ష - ఘనకీర్తివిస్తార । తమ్మలూరి సుగోత్ర-దాన కర్ణ
సత్య హరిశ్చంద్ర - నిత్యాన్న వరదాన । భటకవి సంస్తుత్య-బంధు మిత్ర

గీ॥ మిత్రజన పోష మేదర-మెట్ట వంశ । జలది సారంగలోభివే-శ్యా భుజంగ
మల్లభూపాల సత్పుత్ర-మంజుగాత్ర । భవ్య గుణగణ్య కొండప-ప్రభువరేణ్య!"

దీనిని బట్టి యీతడు కొన్ని యుద్ధములలో బాల్గొని విజయములందె నని స్పష్టపడుచున్నను, కాలగర్భమున బడిపోయినవానిని గుర్తించుటకు వీలు కలుగుటలేదు. వీరి తర్వాత చరిత్ర తెలియుటలేదు. రొంపిచర్ల దుర్గమొకటి వీరి పాలనలో నుండగా, రావెళ్ళవారు వచ్చి కోటలోనికి నీరు వచ్చు మార్గమును బంధించి లోబరచుకొనిరని, యిది శ్రీ రంగరాయలు కాలములోనని వీరి రికార్డులలో నున్నది. గాని యిది శ్రీ కృష్ణరాయల కాలమని తోచుచున్నది.

(౮) మేదరమెట్ట సింగినాయడు : ఇతడు శా.శ. 1440వ సం॥ర ప్రాంతీయుడు. ఇతడు పొదిల తాలూకా చిలమకూరిసందు గ్రామకాపురస్తుడు. ఆసంవత్సర మీతడాగ్రామమున పొలిమేర హద్దు లేర్పఱుచునపుడు పొలిమేర నడచి స్థాపించినందులకై యచటి కైలాసనాధభీమ సంస్థానికులు 10 కుంటలు వరిచేనిచ్చినట్లొక శాసనమున వ్రాయబడినది *. ఇది యాకాలపు టాచారమును దెలుపుచున్నది.

(9) మేదరమెట్ట రామయ్య : ఇతడు క్రీ.శ. 1493 ప్రాంతముననుండి వోరుగంటి అమ్మవారికి పుట్టికి అడ్డెడు ధాన్యం యిచ్చు లాగున నిర్ణయించి శాసనము లిఖించెను. అందుచే నితడాకాలపు టధికారులలో నొకడనవచ్చును. [No. 418 of 15.]

---

* N I P. 5

(10) కందిమళ్ల బయ్యనసేడు : ఈతడు 1460-1515 మధ్యనున్న వాడు. పేరూరి గ్రామ కాపురస్థుడు. గజపతి రాజుల కాలమువాడు. భక్తాగ్రేసరుడు. ఇతనికి సోమేశ్వరస్వామి ప్రసన్నుడు కాగా నొక గుడి కట్టించి పేరొందెను *1.

(11) కొండపల్లి కమ్మ వెంకటపతినాయుడు : 1468 ప్రాంతీయుడు. గోమడుగు గ్రామములో చెన్నకేశవాలయము గట్టించి పేరొందెను *2.

(12) అడపా నాగన్న నాయడు : 1457 సం॥ర ప్రాంతీయుడు. తండ్రి తిమ్మానాయడు, తాత రంగప్పనాయడు. ఈ నాగన్ననాయునికి 'స్వామి ద్రోహరగండ' బిరుదముగలదు. అందుచే నొక సేనాధిపతికావచ్చును. ఈయన పట్నం గ్రామములో కేశవస్వామికి రాతి ధ్వజస్తంభము వేయించి శాసనము వ్రాసెను *3. అడపా గుండరాజు రొంపెచర్లలో నొక కోటను గట్టించెను. ఏ కాలమో తెలియదు. 1293 ప్రాంతీయుడగు అడపా కొప్పయ్య తణుకు తాలూకా మల్లిపూడిలో నొక దీపదాన మొనర్చెను *4.

(13) బండారు గంగన్న : 1435 ప్రాంతీయుడు. కొణిదెనలో సంత నేర్పాటుచేసి, నిబంధనలు శాసనమున వ్రాయించెను. అచటి యధికారి యన వచ్చును *5.

ఈ గజపతుల కాలములో కొండవీటి సీమలోని పేరాల, స్వర్ణగ్రామముల సరిహద్దు విషయముపై తగాదావచ్చెను. స్వర్ణగ్రామముకు చెందిన పోతినేని గురువులు, పేరాల వాసులు తగాదా పడినవారు. ఈ తగాదాను కారంచేడులో ప్రసిద్ధి వహించిన యార్లగడ్డ పెరగురువులు, కారుమంచి చౌదరి, పంగులూరి రామన్నగార్లు మధ్యవర్తులుగ పరిష్కరించిరట. [L. R. Vol. 14]

(14) గండె కన్నమనాయడు, పోతయ్యలు : 1498 ప్రాంతమువారు. కన్నమనాయని తండ్రి యల్లమనాయడు - పెద అమ్మినాయడను సోదరుడు కన్నమ నాయనికుండెను. తొరెర్రిమల గ్రామములో ఆంజనేయాలయమువద్ద

*1 L R Vol 50. *2 L.R. Vol XI. *3. A. R. No 668 of 28. *4 A R. No 535 of 28. *5 A. R. No. 374 of 15.

నొక బావిని యీ కన్నమ నాయడు త్రవ్వించి ప్రసిద్ధి వహించెను. [L. R. Vol. 15] గండె పోతయ్య రామలింగేశ్వరాలయము కట్టించి, దేవుని ప్రతిష్ఠించి యొక శాసనము లిఖించెను. [A. R. No. 467 of 15]

ఈ గజపతిరాజుల కాలములో రాజులు, సేనాధిపతులు కవులను, పండితులను పోషించుచు వచ్చినట్లు వారు వ్రాయించిన గ్రంథములను బట్టియు, వారి శాసనములలో సంస్కృత శ్లోక రచనములను బట్టియు, వారి పేరిటగల చాటువులను బట్టియు విదితమగుచున్నది.

(15) అట్లూరి వెంగళేంద్రుడు : కొండపల్లి దుర్గములో గజపతుల పాలనలో పాలించిన కమ్మప్రభువు. చాటువులందు "కొండపల్లీ దుర్గ కువలయ దేశాహి విభవుండు లట్లూరివెంగళన్న" అనికీర్తింపబడినాడు. ఈతడు తురుష్కులచే జంపబడెనట. ప్రాయశః యితడు 1600 వాడైయుండును. "కమ్మలందరు కమ్మలా ! కమ్మలరయ । కమ్మంకు కీర్తిదెచ్చెన కమ్మనీపె । ప్రదితగుణహార" అని యీతడు నుతింపబడినాడు.

## తర్వాత గజపతులు

విజయనగర సామ్రాజ్యము 1565 లో మహమ్మదీయులు భగ్నపరచిన పిమ్మట గజపతి రాజులలో కొందరు విజృంభించి మహమ్మదీయులపై దాడుల సాగించి యనేకచోట్ల వారితో యుద్ధము లొనరించుచు వచ్చిరి. అట్టివారిలో 1590 ప్రాంతమున హరిశ్చంద్ర రాజును, అతని సేనాపతియగు ముకుంద రాజును సర్వరాజు, విద్యాధరుడును ముఖ్యులు. వీరు స్వల్పకాలము మరల కొండవీడు, కొండపల్లి మున్నగు దుర్గములను స్వాధీనము గావించుకొని తమ సామంతుల నచట దేశాహులుగను, చౌదర్లుగను నియమించి పాలించుచు వచ్చిరి. వీరు కాశింకోట, విశాఖపురి, పోతనూరు, మదపాడ, ముస్తఫాబాదు, కొండపల్లి మున్నగు దుర్గములవద్ద బోరాడుచు వచ్చిరి. 1599లో వీరు చింతపల్లి గండివద్ద జరిగిన యొక యుద్ధములో బైరామల్, అమన్ముల్కుతో యోడిపోయిరట. అంతటి నుండి ఆంధ్రదేశము క్రమముగా మహమ్మదీయుల పరమయ్యెను. వీరి క్రింద నీ క్రింది కమ్మవారు పాలించుచుండిరి. విజయనగర సామ్రాజ్య సామంతుల వివరములు ప్రత్యేకముగ నున్నది గాన యిట వివరించుటలేదు.

దాసరివారు

## దాసరి చిన గంగయ్య

ఈతడు పురుషోత్తమ పట్టణ పాలకుడుగానుండిన యొకప్రసిద్ధపురుషుడు. ఈతడు కవి పోషకుడై వడ్డెపూడి పెద్దయ్యయను కవీశ్వరునిచే మాఘ మాహాత్మ్య మను గ్రంథమును వ్రాయించి కృతిబొందెను. ఈయన క్రీ. శ. 1600వసం॥ర ప్రాంతీయుడనియు గజపతుల సామంతుడనియు, ఆంధ్రకవుల చరిత్రలో శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు నిర్ణయించియున్నారు. ఈతడు హరిశ్చంద్ర గజపతి సేనాదిపతులలోని ముకుంద దేవుని సామంతులలో నొకడుగా గన్పడుచున్నాడు. మాఘమాహాత్మ్యము ద్వితీయాశ్వాసారంభ పద్యముననీతని వర్ణించుటలో నీ విషయము సూచింపబడినది. ఆ పద్య మీక్రింది విధముననున్నది.

"కం॥ శ్రీ సార్వ హరిశ్చంద్ర మ । హీస్థల సుత్రామ(ప్ర)హృష్ట-హృదయాదరుణో
ద్భాసిత విభవ ముకుంద స । దా సేవాంతరంగ-దాసరి గంగా॥"

ఈయన హరిశ్చంద్ర నృపాలునిచే రత్నాంబరాదుల బొందినట్లీ క్రింది పద్యము వలన దెలియుచున్నది. ఈ బహుమానము లేల యొసంగబడెనో తెలియుటలేదు.

"ఉ॥ సాంద్రయశో ధనుండు-హరి - శౌర్యుఁడు బాహుబలీంద్రుఁడా హరి
శ్చంద్ర మహీతలేశుఁడు భృ - శంబుగ సత్యవచో నొసంగఁగా ।
చంద్ర సుగంధ పుష్ప ఘన - కుంకుమ దాంబర రత్నరాజి ని
స్తంద్రి శుభోక్తి గైకొనియె - దాసరి గంగన లోక మెన్నఁగన్॥"

ఈ హరిశ్చంద్ర నృపాలుడు విష్ణువర్ధన సాతోడా బెహరా మహాపాత్ర శ్రీశంకర హరిశ్చంద్ర మహారాజే. శా,శ. 1518నసం॥రం నాటి యీ శంకర హరిశ్చంద్రరాజు శాసన మొకటి పాలకొల్లులోగలదు. [**S.I.I. Vol. No.** 165]

ఈ చిన గంగయ్య పురుషోత్తమ పట్టణ పాలకుడనుట కీ క్రింది పద్యమే ప్రమాణముగ గ్రహింపవచ్చును.

"కం॥ శ్రీ మత్పురుషోత్తమ పుర । ధాముసకును కాంతి తుహిన-ధామునకును తే
జోమాన నీయ సుగుణ । స్తోమునకును వైరిశిఖరి-సుత్రామునకున్॥"

ఈ చిన గంగయ యాస్థాన మా కవి యిట్లు వర్ణించుచున్నాడు.

"సీ॥ అతులిత శాస్త్రోక్తి-హోమంబు లొకవంక । నొకవంక పండిత నా-యక గణంబు
తత చతుర్విధ వేద-తత్వజ్ఞు లొకవంక । నొకవంక నిస్తులశా-బ్ద కవయంబు
ప్రకటితప్రౌఢతా-ర్కిక బృందమొక వంక।నొకవంక జపుర వా-క్సుకవినికర
మకళంక పౌరాణి-క కదంబ మొకవంక । నొకవంక జ్యోతిష ప్రకరవేత్త

గీ॥ లొక్కచో బంధు నివయంబు-లొక్కచోట న । మగ్ర సామంత - విసరంబు
మహిమ గొలువ।కొలువు కూటంబునందుండి-కలిత రచన । గౌరవము మీర
సభికులఁ - గాంచి పలికె॥"

ఇందు కొంత యతిశయోక్తిగా భావించినను, మొత్తము మీద నీతడొక సామంత నృపాలుడనియే చెప్పవచ్చును. శుకసప్తతి కృతి నొసంగిన గ్రంథకర్తయగు వడ్డెపూడి పెద్దయ్యయే చిన పొడ్డపూడి పురనాయకుడనియు, వెంకట మంత్రికి పేరమాంబకు జనించిన వాడనియు, నా గ్రంథములోని యీ క్రింది పద్యము తెలుపుచున్నది.

"ఉ॥ వినుత సమస్త సామ కుమారు - [illegible] పేరమాంబకున్
దనయుని పుణ్యవర్తనుని - దాన గుణాన్వితు నారసింహ్వా స
ద్వనరుహ చంచరీకుని స - వార్య వచో రచనా విశారదు
న్నను చిన పొడ్డపూడి పుర - నాథుని పెద్దకవీంద్ర చంద్రమునిన్॥"

ఈ గంగినీడు చౌదరి పట్టభద్రుడనియు, కోదండరామస్వామిని ప్రతిష్ఠించిన వాడనియు, వన ప్రతిష్ఠ, తటాక ప్రతిష్ఠ మున్నగు నిర్మాణము లొనరించిన ధర్మాత్ముడనియు నీ క్రింది పద్యము తెలుపుచున్నది.

"సీ॥ సహకార పనస కే-సర నింబ జంబీర । సరళాది భూరుహో-త్కరమునిల్పె
నిఖిల జీవాధార- నిమ్న పుష్కరమైన । చెఱువు వేయించె న-చ్చెరువుగాఁగ
చతుర దేవాగార - శార్ఙ్గ కోదండ ప్ర । తిష్ఠా సమాసక్తి - దేజరిల్లె
నుర్వీసురశ్రేణి - కుపనయ నోద్వాహ । వస్త్ర పదాద్యుఁడై-వాసికెక్కె

గీ॥ నారయను మీరె పురుషోత్త-మాభిధాన । పట్టణ స్థిర చౌదరి-పట్టభద్రుఁ
దనుపమౌదార్యనియతవ-ర్తనుఁడుమాన । ధనుఁడు దాసరి చినగంగ - మన
యశుండు"

ఈ గ్రంథమున పురుషోత్తమ పట్టణము, పురుషోత్తమ గజపతి నిర్మిత మైనదని వ్రాసియుండుటవలన, నాతని కాలము తరువాత నుండిన యీ చిన గంగయ్య శ్రీ వీరేశలింగము పంతులుగారు చెప్పిన కాలమువాడేయని తోచు చున్నది. ఈ చిన గంగయ్యకు తాత తండ్రియగు తిమ్మానేడు క్రీ.శ 1579వ సం॥ర ప్రాంతీయుడుగా రుజువగు చున్నందునగూడ దీనినే ధృవపఱచుచున్నది. హరిశ్చంద్రరాజా ముకుందదేవుడులుకూడ కుతుబుషాతో కాళింకోట, విశాఖపురి, పోతనూరు, మదవాడ, ముస్తఫాబాదు, కొండపల్లి మున్నగుచోట్ల బోరాడి యుండిరి. అట్టి యుద్ధములందీతడు సాయపడి వారిచే బహుమానములు, చౌదరీ పదవియు బొందియుండును. ఈతడు కవితా పోషకుడై మాఘ మాహాత్మ్య మను కృతిని వ్రాయించనిచో, వీరి చరిత మసకగమ్యగోచరముగ నుండెడిది. ఈయన మద్దాలి తిరుమలాచార్య శిష్యుడనియు, బ్రాహ్మణ పరీక్షణాభిలాషుం డనియు, మారుట్ల గోత్రుడనియు నందు జెప్పబడినది. ఈయనకు మల్లమాంబ యను సతీమణి వలన బాపినీడు, అంకన్న, సొబ్బినీడు, అక్కయ్యయను నల్గురు కుమాళ్లు గల్గిరట. వీరల తర్వాత చరిత్రము తెలియరాదు. మాఘమాహాత్మ్యము గ్రంథకర్త కమ్మవారి నా కాలానుసరణముగ విష్ణుమూర్తి పాదముల యందు జనించిన వారని యీ క్రింది పద్యమున వ్రాసియున్నాడు.

"చ॥ హరిపద సంభవుల్ బుధ హి - తాతిశయుల్ కమలాశ్రయుల్ శుభా
చ(రు)లును పుణ్యజీవనులు - సత్పథ వర్తులు లోకపావనుల్
సరస కవి ప్రజా స్పదులు - చారు గభీరులు నై వియన్నదీ
స్థిర గతులైన వారి నుతి - జేసెద కమ్మ కులాగ్రగణ్యులన్॥"

ఈ కాలమునకు విస్తరిల్లిన వైష్ణవ మత ప్రాబల్యమే దీనికి కారణ మన వచ్చును.

---

# 5. విజయనగర సామ్రాజ్యపు కమ్మ సామంతులు

శ్రీ వీరప్రతాపరుద్ర రాజ్యము భగ్నమైనపిమ్మట హరిహరరాయలు, బుక్కరాయలు నను కాకతీయ సేనానులు దక్షిణమునకు వచ్చి కంపిలి ప్రాంత పాలకులైరి. మహమ్మదీయ నవాబు వారిని జయించి, మరల హరిహరరాయలనే కంపిలి గవర్నరుగా నియమించెను. 1336 వరకు యిట్లు ఆతడు పాలించుచు వచ్చెను.

అంతవరకు మహమ్మదీయులకు లోబడి, కంపిలి గవర్నరుగా నుండి, ముస్లిముడై క్రీ. శ. 1336 ప్రాంతమున విజయనగరమున హిందూరాజ్యమును హరిహరరాయలు స్వతంత్రముగా స్థాపించెను. బుక్కరాయలీతనికి తోడయ్యెను. విద్యారణ్యులవారి మంత్రిత్వము వల్లనిది సమర్ధనీయముగా వృద్ధినొందు చుండెను. హరిహరుడు తిరిగి హిందూమతమును స్వీకరించెను. హరిహరబుక్క రాయలులు సంగముని వంశీకులగుటచే సంగమవంశీకులని ప్రసిద్ధిజెందిరి. మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలప్రకారము(జియాబర్నీ) బుక్కరాయలు ముసునూరి కాపయనాయకుని బంధువైనందున నాతనికి యుద్ధములందు తఱచు సాయ పడుచువచ్చెను. హరిహరరాయలు 1336-54 సం॥ల మధ్య పాలించి చనిపోగా, బుక్కరాయలు 1356—77 మధ్య విజయనగరమున బాలించెను. ఈతడు ఆంధ్రహరివంశమును రచించిన నాచన సోమనాథకవీంద్రుని కగ్రహారమునిచ్చి పోషించుచువచ్చెను. మధుర, తిరుచునాపల్లి రాజ్యములు మహమ్మదీయపరము కాగా, నితడు తన కుమారుడగు కంపరాయలను బంపి వానిని జయించెను. కుమారకంపరాయల భార్య గంగాదేవి యావిజయములను మధురా విజయమను సంస్కృతకావ్యమున జక్కగా వర్ణించి, తన సంస్కృత భాషావైదుష్యమును వెల్లడించెను. సాయణాచార్యు లీయనమంత్రి. ఈ సాయణాచార్యులు వేదభాష్య ములనురచించెను. ఈ బుక్కరాయలతర్వాత రెండవహరిహరరాయలు సింహాసన మెక్కెను. ఆతడు 1404 వరకును భాలించెను. రాజమండ్రి పాలకుడగు

కాటయవేమారెడ్డికి తన కుమార్తె ల్లాంబ నిచ్చి పరిణయ మొనర్చెను. ఈయన కమ్మశాఖీయుడైనందుననే రెడ్లతో బంధుత్వ మొనర్చెనని, ముసునూరి కాపయ బంధుగుడని దీనివల్ల ధృవపడుచున్నది. ఈతని కుమారుడు విరూపాక్షరాయలు పక్షమున రెండవ బుక్కరాయలు 1404–1406 మధ్య, 2 సం॥లు మాత్రము పాలించెను.

తర్వాత దేవరాయలు పాలనకువచ్చి 1406–1422 మధ్య 16 సం॥లు పాలించెను. బహమనీసుల్తాను ఫిరోజిషాతో నీతడు యుద్ధములు సల్పుచుండెను. కొండవీటి పాలకుడగు పెదకోమటి వేమారెడ్డితో గూడ చేయుచుండెను. 1419 ప్రాంతమున నీతడాయిర్వురు రాజుల నోడించి పానుగల్లు, నల్లగొండ, ఉదయగిరి ప్రాంతము లాక్రమించెను. ఈయన తుంగభద్ర కానకట్టనుకట్టించి, విజయనగర ప్రాకారములను బలిష్ఠముచేసెను. 15 మైళ్ళ కొండను తొలిచి కాలువల ద్వారా విజయనగరమునకు నీటిసౌకర్యము గల్గించెను. ఈయన మంత్రులలోని సిద్దన విక్రమార్కచరిత్రను జక్కనకవిచే వ్రాయించి కృతినొందెను.

ఈయన తర్వాత రామచంద్రరాయలు సింహాసనమెక్కగా తమ్ముడగు విజయరాయ లాతనిని పదభ్రష్టునిజేసి 4 సం॥గులు మాత్రము పాలించెను.ఆతని పాలనము 1426 తో ముగిసెను. విజయదేవరాయల కుమారుడైన రెండవ దేవ రాయ లనబడు ప్రౌఢ దేవరాయలు 1426లో రాజ్యమునకు వచ్చెను. ఈయన చాల ప్రతిభాశాలి. విదేశస్థులీతని రాజ్యమును మెచ్చుకొనిరి. రాజమండ్రి రెడ్డి రాజులు, క్విలన్, పెగు, టెనాసిరిం, జాఫ్నా దేశము లీయనకు లోబడి కప్ప ములు చెల్లించుచుండెను.

ఈయన వద్ద 2 లక్షల కాల్బలము, 80 వేలు గుర్రపురౌతులు, 60 వేల విలుకాండ్రు, 2 వేల ముస్లిములు సైన్యములో నుండెడివారు. బహమనీలతో నితడు రణములు సల్పుచుండెను. ఈయన వీరశైవుడయ్యును జైన, ముస్లిము, హిందూమతములను సమానముగా నాదరించెను. ఈతడు పండితకవియు, కవి పోషకుడునై యుండెను. డిండిమభట్టీయన యాస్థానకవియైనను ఆతనిని వాదములో నోడించిన శ్రీనాధునకు తన ముత్యాలశాలలో కనకాభిషేక మొనర్చి యీతడు సన్మాన మొనరించెను.

పర్యాచక్రవర్తి రాయబారి 'అబ్దుల్ రజాక్' యీయన దర్బారుననుండెను. విజయనగరపు చుట్టుకొలత 60 మైళ్ళు. ఈయనకు 12 వేల భోగభార్యలుండిరి. సప్తప్రాకారములు నగరముననుండెను. ఈయనరాజ్యములో 300 రేవుపట్టణము లుండెనట. అందుచే వ్యాపారము బాగుగా జరుగుచుండెను.

ఇట్టి ప్రతిభావంతమైన రాజ్యమున కమ్మవారు కొందరు సామంతులుగా జేరిరి. కొందరు సైనికాధికారులైరి. వారి వివరములరయుదము. ఇతడు శ్రీశైల ప్రాంతము జయించి యచట రావెళ్ళవారనే కమ్మవారిని పాలింప నియోగించెను.

ఆ ల మ ం ద ల వా రు

## ఆలమందల నూకయదేవ చోడరాజు

ఆలమందలవారు తెలుగు చోడ శాఖీయులుగ గన్పడుచున్నారు. ఆల మందల నూకయదేవచోడరాజు శా. శ. 1320 వ సం॥ర ప్రాంతములో కనుపర్తి ప్రాంతమున నొక పాలకుడుగా నున్నట్లూహించుట కవకాశము గలుగుచున్నది. ఈయనకు వీరఅవుకు భూదేవచోడరాజను కుమారుడుండెను. ఈయన చోడశబ్ద మును వాడుకొనుచు శాసనము లిఖించెను.

## ఆలమందల వీరఅవుకు భూదేవ చోడరాజు

ఆలమందల నూకయదేవచోడరాజు కుమారుడగు నీతడు శా.శ. 1348వ సం॥ర ప్రాంతీయుడు. ఈయనకు "త్రిభువనాఖిరుద్రుల వెన్నుసంటెఱ" మున్నగు బిరుదులు గలవు. ఈయన శా. శ. 1348 వ సం॥ర కనుపర్తిలో భూదాన మిచ్చుచూ నొక శాసనము వ్రాయించి ఖ్యాతి జెందెను. ఆ ప్రాంతము నతడు తన తండ్రి యనంతరము పాలించినట్లు కన్పడును*1. ఈతడు విజయనగర బుక్కరాయల సామంతుడు.

## ఆలమందల గంగయదేవ చోడరాజు

శా. శ. 1350 వ సం॥న నితడు ఒంగోలు తాలూకా నాగులపాటి ప్రాంత మును పాలించుచు వచ్చెను. ఈయన తండ్రిపేరు అనపోతయదేవచోడరాజు. ఈయన తాత తిరుమలరాయడు. ముత్తవ పెద్దమ్మదేవి. ఈయనతల్లి చెన్నమదేవి

*1. No. 0/56.

ఈయన తన తల్లిదండ్రులకును, తాత ముత్తవల పుణ్యమునకై నాగుల పాటిలోని దేవ, బ్రాహ్మణ, జంగాలకు గల వృత్తిపన్ను మినహాయించుచు శా. శ. 1350 వ సం॥ములో నొక ధర్మశాసనమును వ్రాయించి ప్రసిద్ధి వహించెను *1.

## కొత్త బొమ్మయనాయకుడు

ఈయన 1427 సం॥ర ప్రాంతీయుడు. దేవరాయలవద్ద నితడు మహా సామంతాధిపతిగా నుండెను. ఈయన తిరుచునాపల్లి ప్రాంతమును పాలించెను. కన్ననూరులో నీయన శాసనమున్నది. అల గప్పెరుమాళ్ళ దేవళము పాడుబడి యుండగా దాని నతడు పునరుద్ధరించి, యొక గ్రామమును దానమిచ్చి పూజలు జరుగునట్లు చేసెను. ఈయనయు భార్యయు కలిసి గుఱ్ఱముపై స్వారిజేయు చున్నట్లు చెక్కబడిన రాతి విగ్రహమొకటి యిచటి వీరదేవళమున నున్నది. (**No.** 143 **of** 35-36) ఆప్రాంతమునందే యీతని తాలూకు శిధిల భవనము లున్నవి.

## పెమ్మసాని వారు

పెమ్మసానివారు ముసళ్ళ లేక ముసునూళ్ళ గోత్రస్థులుగ కమ్మవారిలో నున్నారు. వీరి వృత్తాంతము ప్రౌఢదేవరాయల కాలమునుండి మాత్రమే తెలియు చున్నది. వీరు కమ్మవారిలో మొదట సామాన్యగృహస్థులుగా నుండిరనియు, వీరి పూర్వనామము ఆలంవారనియు, మొదటి తిమ్మనాయని తండ్రి ఆలం వెంకటపతి నాయడనియు, నాతని తలిదండ్రులు చిన్నతనమున చనిపోగా, పెమ్మసాని యను బోనకత్తెవలన పెంచబడినందున, నతనికి పెమ్మసాని తిమ్మా నాయడని పేరు వచ్చినట్లును, యీయన మొదట పావురేళ్ళకడ నున్నందున, పావురేళ్ళ తిమ్మానాయడనికూడ వ్యవహరించినట్లును, స్థానిక చరిత్రములందు గలదు *2.

---

*1. **N. I.** 0/805.

*2. భారతి శుక్లసంపుటము

## పెమ్మసాని తిమ్మానాయుడు - గండికోట పాలన

క్రీ. శ. 1431వ సం॥ర ప్రాంతమున నితనికి యాడకి పరగణా పాలనాధికారము ప్రౌఢదేవరాయలచే నొసంగబడినట్లు స్థానిక చరిత్రలు తెలుపుచున్నవి. ఈ ప్రౌఢదేవరాయ లొనరించిన యనేక యుద్ధములలో నితడు పాల్గొని తన శౌర్యమును జూపినందులకు మెచ్చుకొని తర్వాత గండికోటపాలన మొసంగినట్లు కనబడును. ప్రౌఢదేవరాయలు అహమదుషా పాలించు కల్బర్గుకోట పట్టుకొనుటకై వెడలిన 1422 స॥పు దండయాత్రలో గండికోటనుండి పెమ్మసాని తిమ్మనాయకుడు 8,000 సైన్యముతో వెడలినట్లు గుమ్మనాయక పాళెగాళ్ళ చరిత్రవల్ల దెలియుచున్నది *1. ఈయన గండికోటలో జిల్లేళ్ళ చలపతిరాజు కట్టించిన కోటను మరల గట్టించెను. కాని యిది పూర్తియగు నంతలోనే యీతడు కాలధర్మము నొందినట్లు కన్పడును. యాడకిలోగూడ నితడొక కిల్లాను గట్టించెను. ఈయన తల్లి వెంకటమ్మ. ఈమె పేరిట తిమ్మానాయుడు వెంకటాపుర మను గ్రామమును గట్టించి, యచట నొక బావిని త్రవ్వించెను. ఈయన గుత్తి, గండికోట సీమలను రాయలకు సామంతుడుగా బాలించుచువచ్చెను. యాడకి కోట కట్టుటకై త్రవ్వుచుండగా నీయనకు వీరభద్ర, గణపతిలింగవిగ్రహములు దొరకెననియు, వాని నన్నిటికి దేవాలయములు కట్టించెననియు యాడకి కైఫీయతులో నున్నది. ఇదిగాక నీయన ఆంజనేయాలయమొకటి నిర్మించి, బావిని త్రవ్వించెను. చక్రాపురమను గ్రామమునుగూడ కట్టించెను. మహాభాష్యం మహాదేవభట్టను శాస్త్రజ్ఞుని కొడుకు చెన్నమరాజీయనకు మంత్రిగా నుండెను.

పెమ్మసాని వారి రాజ్యము క్రమముగా నభివృద్ధి యయ్యెను. వీరి రాజ్యమున నెల్లూరు, గుంటూరు, అనంతపురము, కృష్ణా మండలములలో చాల భాగ ముండెననియు, వీరు రాయలకు తొమ్మిదిలక్షల రూప్యములు కప్పము చెల్లించుచు వచ్చిరనియు, వీరి రాజ్యాదాయము మొత్తము 25 లక్షల రూప్యము లనియు, వీరి క్రింద 25 వేల కాల్బలమును, 15 వేల అశ్విక దళమును, 40 గజములు నుండెడివనియు, నీ వంశీకులకు 'ఆదివీర' యను బిరుదము గలదనియు శ్రీ మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు వ్రాయుచున్నారు *2. ఈ పెమ్మసానివారి

---

*1. Q.J.M. S, XXX, No. 2. P. 186.

*2. పెమ్మసానివారి చరిత్రము.

పేరిట స్వంత మాడలు, టూకలు వేయించి చలామణి చేయుచు వచ్చినట్లు గూడ లోకలు రికార్డులలోఁ గలదు. ఈ నాణెములకు వారి యిలవేల్పగు వీర భద్రుని పేరొక వైపున నాగరలిపిలో వ్రాయించి, వెంకటరమణ ప్రతిమ యొకవైపున నుండునట్లుగా మాడలు టూకలు రస్సాలు వేయించి వారి రాజ్యములో నడచునట్లు చేసిరని స్థానిక చరిత్రలు తెలుపుచున్నవి. ఈ పెమ్మ సానివారు విజయనగర రాజ్యమున పాళెగాండ్రలో ప్రసిద్ధిగలవారు. వీరు విజయ నగర పట్టణమునకు సపరివారులై వెడలినపు డచట నివశించుటకు 1,240 కుంటల వైశాల్యముగల ప్రదేశముండెనని "విజయనగర సామ్రాజ్యపు" అను ప్రాచీనకడిత పుస్తకమువల్ల విదితమగుచున్నది. వీరికి మొదట గండికోట, గుత్తిరాజ్యములు మాత్రమే స్వాధీనములో నున్నట్లును, క్రమముగా వృద్ధియగు చుండినట్లును, గ్రహింపవచ్చును. 1454 సం॥లో నితడు కోడూరను గ్రామ మును అగ్రహారముగా పునరుద్ధరించెనని లోకలురికార్డు వాల్యూం 36లో చెప్ప బడినది. ఈ క్రింది చాటువీయన పేరిట రచింపబడినట్లే తోచుచున్నది.

"ఉ॥ చాలు గుణాలు మౌళి గడి - సంగడీ రాజులు గొల్వ రంతహో
హాలహలోగ్రఫాల దహ - నార్చుల యంతటి ధాటివాఁడు నా
యేలిక వెంకటాద్రి ధర - జీశుని తిమ్మఁడు పెమ్మసాని భూ
పాలుఁడు హెచ్చు ధాత్రిఁ గల - పార్థివు లెల్లరు లొచ్చు వారికిన్॥"

ఇది యొకవేళ వెంకటపతి రాయలవారి కాలములోని తిమ్మనృపాలుని కన్వయింపదగునేమో తెలియకున్నది. తిమ్మానాయనికి వీర తిమ్మానాయ డను కుమారు డున్నట్లు కొన్ని స్థానిక చరిత్రములును, రామలింగనాయడను కుమారు డుండి నట్లు తాడిపత్రి చరిత్రమును దెలుపుచున్నవి. చాటుపద్యములు రామ లింగవిభుని తండ్రి చెన్నవిభుడని పేర్కొనుచున్నవి. వీనినన్నిటిని సమన్వ యించుటకు దగిన చారిత్రక సామగ్రి గన్పడకున్నది. సమకాలికములగు చాటు వులనే మన మిచట విశ్వసించినచో, నీ తిమ్మానాయని కుమారుడు వీర తిమ్మా నాయడనియు, నితడు మల్లికార్జునరాయల కాలములో గుత్తి, గండికోట రాజ్య ములు పాలించుచుండెననియు విశ్వసింపవచ్చును. ఈ యిమ్మడి తిమ్మా నాయకుడు 1465లో యిమ్మనూరి మృత్యుంజయశాస్త్రికి గొందెపల్లె అగ్రహారము నిచ్చెను. ఈయన కాలములో మల్లెలలోని మాదిగలు దారిదోపిడుల నొనర్చుచు జిర్రపల్లె వగైరా గ్రామములలో ననేక హింసా కార్యము లొనరించుచుండగా,

వాండ్ల నందరిని ఆబాల వృద్ధులు సహా జంపించి ప్రజలకు భద్రము గల్గించెను. ఈ వంశములో తర్వాత ప్రసిద్ధికి వచ్చిన పాలకుడు రామలింగ నృపాలుడు. మల్లికార్జునరాయలు తర్వాత విరూపాక్ష, రెండవ ప్రౌఢదేవరాయలు 1487 వరకు పాలించిరి. తర్వాత సాళువ నరసింహరాయలు రాజ్యమాక్రమించి 1493 వరకు పాలించెను.

## పెమ్మసాని రామలింగనృపాలుడు

పైన నుడివిన తిమ్మానాయని తర్వాత నీ రామలింగ నృపాలుని చరిత్ర మనకు లభ్యపడుచున్నది. కాని మధ్యచరిత్రము తెలియుటలేదు. రామలింగ నృపాలుని తండ్రిపేరు చెన్నవిభుడని చాటు పద్యముల వల్ల దెలియుచున్నది. ఈయనకు పెదతిమ్మానాయడను సోదరుడు గూడ నున్నట్లు కన్పడును. వీరిరువు రును సాళువ వీరనరసింహరాయలయొక్కయు, శ్రీకృష్ణదేవరాయల వారి యొక్కయు సామంతులుగానుండిరి. పైన నుడివిన వీరతిమ్మానాయనికి చెన్న విభుడను కుమారుడుండి యాయనకు నిర్వురు జనించిరా యని యూహించుట కవకాశ మేర్పడుచున్నది చెన్నవిభుడు సాళువ నరసింహ,వీరనరసింహరాయల కాలములో నుండియుండును. ఈ చెన్నాయని కాలములో కరమతి వీరాబత్తుడు వగైరాలకు కొన్ని మాన్యము లొసంగబడెనని యది పెరుసోముల గ్రామములో జరిగినట్లు లోకలు రికార్డు 56 వాల్యూములో చెప్పబడినది.

రామలింగనృపాలుడు కృష్ణదేవరాయలవద్ద 80 వేల సేన కధ్యక్షుడుగా నుండెను*1. ఆ కాలమున కల్బర్గు రాజధానిగా యేదుల్ ఖానను మహమ్మదీయుడు పాలించుచుండెను. రాయలు కల్బర్గు మీదికి దండయాత్ర వెడలిన సమయమున నాతనికి గోల్కొండ ప్రభువగు కుతుబనముల్కను అహమ్మదునగర ప్రభువగు నిజాముశాహయును యేదుల్ ఖానునకు తోడ్పడవచ్చిరి, అందుచే నా యుద్ధము మిక్కిలి భయంకరమైన దయ్యెను. ఆఘోర యుద్ధమున జయాపజయములు సందిగ్ధముగా నుండెను. ఆక్లిష్టసమయమున యోధాగ్రేసరుడగు రామలింగనృపతి సింగపు బిల్లవలె రణరంగ మధ్యమునకు 10 వేల సైన్యముతో జొచ్చి, సాహస

*1. భారతి శుక్లసంపుటము పుట 624 & ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపు III

ముతో తురుష్కసేనం జొరబడి, వారి డేరీజు త్రాళ్ళు తెగగోసి, యా యుద్ధమున ననేకులను సంహరించి, తుదకు జయలక్ష్మి రాయలను వరించు నట్లొనరించెనట *1. అప్పుడు రాయలు మిక్కిలి కొనియాడి యనేక బహుమానము లొసంగెను. ఈ యుద్ధము 'కృష్ణరాయవిజయ' మను గ్రంథమున జక్కగా వర్ణింపబడియున్నది. తుకలు యుద్ధమునకు వచ్చు వార్త రాయలు సభలో తెలిపినపుడీ వీరాగ్రేసరుని చర్య యిట్లుండెనట.

"మ॥ విని యా భూవరకోటిలోన ఘన దో - ర్వీర్య ప్రతాపుండు బం
ధు నృపాల ప్రబలుండు యుద్ధముల యం - దున్ స్వామి కార్యంబులం
దున యజ్ఞుండగు పెమ్మసాని కుల చం - ద్రుండైన యా రామలిం
గ నృపాలాగ్రణి వల్కె సంగర కళా - కౌతూహ లాయత్తుఁడై.

చ॥ తురకలనంగ నెంత వటు - దోర్బల లీల వధింతు వారలన్
గురుతు పతం గుడార్లు దెగ - గోసెద బౌజులలో మెలంగెదన్
నరపతి చంద్ర యెంతయు ఘ - నంబుగ దేవరవారి సొమ్ము ది
న్న ఋణము దీర్చుకోఁ గలిఁగె-నన్ గృపజూఁడు మటంచు బల్కెఁగన్."

ఈయన పరాక్రమ మా యుద్ధరంగమున నిట్లు జూపబడెనట.

"మ॥ అనుచుం బల్లెము గేలఁ బూనుకొని శౌ - ర్యారూఢులౌ కమ్మవా
ర్వెనువెంటం బదివేలు బల్లెములతో - విఖ్యాత శౌర్యోన్నతిం
జనుదేరం ఘన సింహరావ మలరం - దత్సైన్యముం జొచ్చి హె
చ్చిన ధైర్యంబున బారసీక తతులం - జెండాడె నుద్దండుఁడై.

మ॥ మొనకు న్వచ్చిన విచ్చు కత్తులసివే - ముస్తీదు మేల్ రౌతులన్
దునుమాడంగను గ్గల్గి పార్శ్వముల యం - దుం గ్రమ్ము నశ్వమ్ములన్
దన బల్లెమ్మున గ్రుమ్ము క్రమ్మఱచు వె - న్కల్ దారసిల్ జోదులన్
గని దూరంబుఁ దొలంగఁ జేయుఁ బటుదో-ర్గర్వం బఖర్వంబుగన్."

ఇట్టి యుద్ధమున బదివేలమంది కమ్మయోధుల సహాయమున నీ శూరశిఖామణి యద్భుత పరాక్రమము గన్పరచి యనేక సైనికుల పారద్రోలి, ముగ్గురు

---

*1. భారతి రజతసంపుటము పుట. 624, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపు III

వజీర్లను సంహరించెను. ఈ యోధాగ్రేసరుడు జూటూరు, పెదకంటి, బేతము చెర్ల ప్రాంతములలో జరిగిన యుద్ధములలోగూడ దన పరాక్రమము గన్పరిచెను. ఇతడు చింతలగుంట రఘుపతిరాజు, సలకం తిమ్మరాజు, సహజియ్యాఖా నను వైరి వీరుల జయించి, బేతంచెర్లకోట నేలమట్టు నాశనమొనర్చెను. ఈవిషయము లీక్రింది చాటుపద్యము స్పష్టపరచుచున్నది.

"సీ॥ జూటూరి ముందర-దూరత్వ మేర్పడ । రణభూమిలో సల్కా-రాజు గెలిచి
కోరి బేతముచెర్ల-కోట ధూళిగఁజేసి । చింతగుం ట్రఘుపతి-పంత మణఁచి
పెడకంటి కయ్యాన-భీకరంబుగ నీవు । వెండియు సలకము-విభుని దోలి
సాహసుండైనట్టి-సహజియ్య ఖానుని । నదలించి యాదవు-నంత లోన

గీ॥ ద్రిమ్మరైనట్టి సకలము-తిమ్మ విభుని । ద్రుంచి రాయల బట్టాన-నుంచితౌర
పృధుల గెల్పుల సురతాన-పెమ్మసాని।చెన్నవిభు రామలింగతే-జః పతంగ"

రామలింగ నృపాలుడు తన పేరిట తాడిపత్రిలో రామలింగేశ్వరాలయ మొకటి కట్టించెను. తాడిపత్రు బస్తీని రాయలవారి యనుమతితో వృద్ధిజేసి కట్టించెను. ఈయన పేరిట రామలింగనాయని పల్లె యొకటి గూడ నిర్మింపబడెను. ఈపల్లె యిపుడు తాడిపత్రికి నాలుగు క్రోసుల దూరమున నున్నది. ఈయన కట్టించిన రామలింగేశ్వరాలయమునకు ప్రక్కగా నిత డొక మామిడివనము వేయించెను. సర్కారుద్రవ్యముతో నీ దేవునకు నిత్యనైవేద్య పూజాపునస్కార ములకును, ఉత్సవాదులకును యేర్పాటొనరించెను. ఇంతేగాక నితడు యఱ్ఱమల కొండ బుగ్గపద్ద వోబులేశ్వరాలయ మొకటి గట్టించెనట. ఈయనకు రాజగోపాలమ్మ, గోవిందమ్మ యను నిర్వురు కుమార్తె లున్నట్లు గన్పడుచున్నది. రామలింగానాయడు నిట్టూరులో కొంత భూమి పుబ్బళిగగా నిచ్చెను *.

రాజగోపాలమ్మ రామలింగానాయని పల్లెలో గోపాలస్వామియాలయ మొకటి కట్టించి దానె కెనిమిది తూములభూమి నిచ్చెనట. గోవిందమ్మ యొక పల్లెనునిర్మించి యచట యాంజనేయాలయమునుగట్టించి, యచట నొక చెఱువును త్రవ్వించి, చలివేంద్ర నేర్పాటొనరించెనట। ఆమె కట్టించిన పల్లెకు

* L. R Vol. 12

పట్రకేతయపల్లె యని పేరు వచ్చెను. పట్రకేతయ యనువాని నచట వ్యవహార పరీక్షలకు నియమించుటచే నాపేరువచ్చెను. ఈ రామలింగనృపతి కృష్ణదేవ రాయల తర్వాతగూడ జీవించియున్నట్లు కన్పడును. ఆతని తర్వాతనే సలకము తిమ్మరాజు రాజ్యాధిపత్యమునకై తగవులాడగా చివరకు సంహరింపబడెను. ఈయన బోడియమ్మనూరులో శావర్సి తిమ్మన్న, నరసప్పన్న యను బ్రాహ్మణులకు కొంత భూమి నొసంగెను.

## పెమ్మసాని పెదతిమ్మానాయడు

ఈయన రామలింగ నృపాలుని కుమారుడైనదియు, సోదరుడైనదియు నిర్ణయించుటకు వీలుగాలేదు. చాటువులలో నితడు సోదరుడనియు, తాడిపత్రి మున్నగు కయిఫీయితులలో కుమారుడనియు నున్నది. ఈతడుగూడ వీరనరసింహరాయలయొక్కయు, కృష్ణదేవరాయల యొక్కయు కాలములోనివాడే. ఈయన కాలములో జరిగిన యుద్ధములలో నితడు దస్తూరిఖా నను తురుష్కుని సంహరించినట్లొక చాటువువల్ల దెలియుచున్నది. ఈయనకు నారసింహనృపాలుడు, బలిచిన్ననాయకుడు. చినతిమ్మభూపతి యను మువ్వురు కుమాళ్ళున్నట్లు గొన్ని చాటు పద్యములనుబట్టి నిర్ధారణయగుచున్నది. ఇందు నరసింహనాయడను పేరు తన యేలికయగు వీర నరసింహరాయల పేరిట బెట్టినట్లు కన్పడును. ఈయన యుద్ధపరాక్రమమును గుఱించి యొక చాటు విట్లున్నది.

మ॥ అబిసీ తొండములున్ ఫరంగుల తలల్ — హామీరురెట్టల్ గరీ
బుబొరల్ మన్నెదొరల్ బడామునలిమాన్ — పొట్టల్ తెగన్ గండికో
టబయళ్ళన్ పెందరావు బాణహరి గొం — డల్ గూలినట్లొప్పె నీ
ప్రబలోద్ధాటిని పెమ్మసాని పెద తి -- మ్మా ! రాజకంఠీరవా !

ఈతడు తాడిపత్రిలో చింతల రాయలస్వామి కోవెలను గట్టించి, దానిలో శిల్పశాస్త్ర ప్రకారము గర్భగృహ, సుకనాసిక, మండిలె, మధ్యరంగ, ఆస్థాన మంటప, సౌఖాంతరాళ, గోపుర, ప్రాకార, స్థూపికా, పవనాలయ, యాగశాల, కళ్యాణమండప, ఆళ్వారాదిమంటప, శయనాలయ, గరుడమంటప, హనుమాన్ మంటప, వరాహమంటపములును; శ్రీ భాగవత, రామాయణ, అష్టదిక్పాలకాది చిత్రప్రతిమలలో కట్టించి, ఘండా తిరుమలయ్య, రామాయణం రామా

చార్యు లనే యర్చకులను తాడిపత్రి తిరువెంగళాచార్యుల నాచార్యులుగాను యేర్పాటుచేసి, దేవళమువద్ద నొక కోనేరు త్రవ్వించి, దేవుని కనేక యుత్స వాదుల నేర్పాటుగావించినట్లు తాడిపత్రి కయిఫీయతు తెలుపుచున్నది *1. శక 1431లో తిమ్మానాయడు పులిమళ్ళ గ్రామమున దేవునికి గోపుర ప్రాకారాదులు కట్టించి, 3 గ్రామములను దేవునికి ధారవోసెను *2.

ఈయన కాలములో మాగాణి భూములు వృద్ధి చేయబడెను. తాడిపత్రిలో నీయన తన బందుగు డగు ఉద్దండ నాయని పరిపాలనకు నియమించి గండి కోటలో తా నుండి పాలించుచువచ్చెను. గండికోట యీాయన కాలములోమఱల బలపఱుపబడెను. ఉద్దండనాయనవారీయన తరపున పెన్నబడి మాగాణి విచా రించుచుండెను. ఇతడు మడవంక యను పొలమును దన తల్లి పేర నేర్పఱచి దానికి గడ్డకాల్వ త్రవ్వించెను. ఈ కాల్వకు రిమ్మానాయని కాల్వయని పేరు వచ్చెను. ఈ ముమ్మడి తిమ్మానాయడు పెదపుద్దెల, చినదుద్దెల గ్రామములో మూడవవంతు భూమి నచటి దేవతాయుత్సవముల కొనంగెను. పెమ్మసానిపాలన కాలమంతయు నివి జరుపబడుతూవచ్చెను *3.

ఈయనవద్ద యేనుగుల చెన్నానాయు డను బంధువుడుండెను. ఈయన గాండ్లపాడు అనే గ్రాపమును గట్టించి, బక్క చెన్నారాయణస్వామికి

*1. తాడిపత్రిపాలన వీరిక్రింద నున్నను, మొత్తముమీద గుత్తిరాజ్య మంతయు సాళువ తిమ్మయ్య, గోవిందయ్యలకు నాయంకరముక్రింద యివ్వబడి నట్లును. ఆ నాయంకరము శా. శ. ౧౪౨౭—౧౪౩౫ సం॥ల మధ్య అమలులో నున్నట్లును, తాడిపత్రి శాసనములు తెలుపుచున్నవి. (**S. I. I. Vol; IV. Nos.** 800, 802, & 803) ఈ నాయంకరము వీరనరసింహరాయలు, కృష్ణదేవ రాయలు, అచ్యుతరాయలు ముప్వుర కాలములలో అమలునందుండెను. అందుచే పెమ్మసానివారు యీ ప్రభువుల సేనాదిపతుల హోదాలోనే తాడిపత్రిని (గుత్తి రాజ్యము) పాలించియుందురు. గండికోట, యాడకి పరగణాలు వీరి నాయం కరము క్రింద నున్నట్లు గన్పడును.

*2. **L. R. Vol.** 44.

*3. **L. R. Vol** 7.

దారుమంటపము గట్టించి ప్రతిష్ఠించెను. ఈ మంటపము లోగడనుడివిన చెన్నవిభుని పేరిట (రామలింగనాయని తండ్రి) గట్టింపబడియుండును. ఈయన కాలములో తాడిపత్రిలో యేటి అవతల నాలుగు కపిల బావులు త్రవ్వింపబడెను. వీనివల్ల గూడ మాగాణి వృద్ధిచేయబడెను. తాడిపత్రికి కోసుదూరములో చల్లావారిపల్లె యొకటి కట్టింపబడెను. ఈ పల్లెలో చల్లావారనే కమ్మవారు నివసించుటచేనా పేరు వచ్చెను.

ఈయనకు శానమ్మయను తోబుట్టువు కలదు. ఈమె సాయపనేని వెంకటపతిని పెండ్లాడెను. మిక్కిలినేని నలచెన్నానాయుడు కట్టించిన పల్లెవద్ద నామె యొక చెఱువును త్రవ్వించెను. దానిలో జమ్ము విస్తారముగ పెరిగి యాపల్లెకు జంబులపాడను పేరు గల్గెను.

ఈయన వజ్రగిరికొండమీద నృసింహస్వామి యాలయమొకటి కట్టించెను. ఇదిగాక తాడిపత్రికి మూడుక్రోసుల దూరమున నొక చెఱువును గ్రామమును కట్టించెనుగాని యీ చెఱువులో నీళ్ళు నిలవనందున వోడు తిమ్మనాయని చెర్వు అని పేరువచ్చెను. ఈ పెదతిమ్మానాయనినే అక్కభూపాలుడనికూడ పిలుచుచున్నట్లు కన్పడును. ఈయన యొనర్చిన కార్యము లింక ననేకము లుండియుండును. గాని వానినన్నిటిని తెలుసుకొన జాలకున్నాము.

## సాళువ, తుళువ, ఆరవీటివంశ పాలనలో కమ్మవారు

సంగమ వంశీకులను తొలగించి సాళువ నరసింహరాయలు 1486 లో విజయనగర సామ్రాజ్య పాలన గైకొనెను. ఈతడు 1491 వరకు పాలించెను. ఈయన సేనాదిపతిగా నుండగా ననేక యుద్ధములందు బాల్గొని, శత్రువుల నెదిర్చి రాజ్యమును రక్షించెను. పిల్లలమర్రి పినవీరభద్రకవి రచితమగు జైమినీ భారతమున కితడు కృతి భర్తయై కవిపోషకుడయ్యెను. రామాభ్యుదయమను కావ్యమునకు కర్తయయ్యెను. ఈయన తర్వాత ఇమ్మడి నరసింహరాయలు 1505 వరకు పాలించెను. ఈతని మంత్రిని వధించి, ఇతనిని పెనుగొండలో బంధించి తుళువ వంశ నరసనాయకుడు పాలింపజొచ్చెను. పిమ్మట నతని కుమారుడు వీరనరసింహరాయలు 1505లో ఇమ్మడి నరసింహరాయలను జంపి సింహాసనమెక్కెను. ఈతడు 1509లో చనిపోయెను. తర్వాత శ్రీ కృష్ణదేవరాయలు రాజ్యాధిపతియయ్యెను.

కృష్ణరాయల కాలములో రాజ్యమన్ని ప్రక్కల విస్తరించెను. అష్టదిగ్గజములనబడు కవులను పోషించుచు, తాను స్వయముగ పండితకవిగా పేరంది ఆముక్తమాల్యదను రచించెను. పెద్దనాది కవీంద్రులచే మనుచరిత్రాది ప్రబందములను వ్రాయించి, కొన్నిటికి కృతిభర్తయయ్యెను. ఈయన రసజ్ఞతకు, ఔదార్యాదులకు తలలూచి కవులేగాక, పలువురు సామంతులు, సైన్యాధికారులు, తదితరులీయన కొలువు నభిలషించిరి. కమ్మవారిలోని పెమ్మసాని, రావిళ్ల, సూర్యదేవర, చిరుమామిళ్ల, వాసిరెడ్డి, సాయపనేని మున్నగువారిలో పలువురీయనవద్ద దేశరక్షణ, పాలనాకార్యముల నిర్వహించుచుండిరి. 1515లో నితడు కొండవీడు రాజ్యమాక్రమించెను. గజపతు లీయనకు లోబడిపోయిరి. ఈయన అమరేశ్వరుని సన్నిధిని తులాభారము దూగి పంచిపెట్టెను. శ్రీకాకొలను ఆంధ్ర విష్ణువును సేవించెను. ఈయన ననుసరించియే పల్వురు సామంతులు కవిపండితులను బోషించుచుండిరి. కమ్మసామంతులట్లే యొనరించిరి. కవులనేకులు వారిపై చాటువులను రచించిరి. ఈ మహారాజు సంస్కృతమున జాంబవతీ కళ్యాణమును గూడ రచించెను. కృష్ణదేవరాయలవద్ద పెమ్మసాని రామలింగానాయడొక సేనాదిపతి. ఆయన చరిత్ర పైన వివరించితిమి. కృష్ణరాయలు 1529 లో చనిపోగా తమ్ముడు అచ్యుతదేవరాయలు 1542 వరకు పాలించెను. తర్వాత వెంకటపతిరాయలు పాలనకు వచ్చెను. ఈతడు బాలుడగుటవల్ల తిరుమలునిచే జంపబడుట కారణముగా దర్వాత తగాదాలు హెచ్చెను. తిరుమలుని వధించి సదాశివరాయలను 1543 లో ఆరవీటి వంశపు అళియరామరాయలు పట్టాభిషిక్తుని జేసెను. అతని పక్షమున తానే బాలించుచుండెను. 1565లో తల్లికోటవద్ద పంచ నవాబులకు నీయనకు ఘోరయుద్ధము తటస్థించెను. అందీతడు వీరమరణము నొందెను. విజయనగరము లూటీకాబడెను.

తిరుమలుడు 1570 నాటికి పెనుగొండ రాజధానిగా రాజ్యమును పునః ప్రతిష్ఠించెను. ఈతడు కవిపోషకుడై వసుచరిత్ర మహాకావ్యమును కృతిబొంది యశస్వియయ్యెను. ఈతనికి యుద్ధములందొక కన్నుపోయెను.

1572—85 మధ్య నీతని కుమారుడు శ్రీ రంగ రాయలు పాలించెను. ఈయన కాలములో కొండవీడు మహమ్మదీయులగు గోల్కొండ నవాబులు ఆక్రమించిరి.

రెండవ వెంకటపతిరాయలు 1585–1614 మధ్య పాలించుచు మరల చాల సీమలను జయించెను. ఈయన నెల్లూరుకు రాజధానిని మార్చెను. ఈ కాలములో గూడ పెమ్మసానివారు విశేషముగా శ్రమించి రాజ్యరక్షణలో పాటు బడుచుండిరి.

1614–1630 మధ్య ఇమ్మడి శ్రీరంగరాయలు, 1630–1642 మధ్య ముమ్మడి వెంకటపతిరాయలును తర్వాత 1642–1680 మధ్య ముమ్మడి శ్రీరంగ రాయలును దేశమును పాలించిరి.

వీరి కాలములందలి మిగత కమ్మనాయికుల చరిత్రము దెలుసుకొందము. ఈ రాజులపాలన కాలములో 66 అందలాలెక్కి తిరుగు కమ్మవారు పరిపాలనలో పాల్గొనుచుండిరి. [L. R. 35]

## పెమ్మసాని బలి చిన్నినాయకేంద్రుడు

ఈయన పెద తిమ్మానాయని లగ్రసుతుడు. ఇతడుగూడ నొక యోధా గ్రేసరుడుగి నుండి మస్తఖానను తురుష్క సేనానితో జరిగిన యుద్ధమునదాల్గొని యాతని సేనానులను చీకాకు పరచెను. ఇంతకన్న నీయన విశేషములు తెలి యుటలేదు. ప్రాయశః యితడు మహమ్మదీయులతో జరిగిన యుద్ధములలో మర ణించి యుండును.

## పెమ్మసాని అర తిమ్మానాయడు

ఈయననే చినతిమ్మ నృపాలుడనికూడ నందురు. లక్క భూపాలుడను పేరుగల పెద తిమ్మ భూపాలున కితడు కుమారుడుగ గన్పడుచున్నాడు. పెమ్మ సానివారిలో నితడత్యంత ప్రసిద్ధ యోధాగ్రేసరుడు. ఈయనకు "హత్తుమువ్వర గండ, హాడిచేకండ బిరుద, గండికోట దుర్గాధ్యక్ష, గండరగండ, గరుడ నారాయణాంక విహార, శాత్రవ మద విఫాల, హొన్నిబ్బరగంధ, చేపట్టుగండర సూర్యభద్ర చిహ్న, గండ రాదిత్య, మన్నె మార్తాం" డాది బిరుదులు గలవు. ఈయన తల్లి మాచమమ్మ.

శ్రీకృష్ణదేవరాయలు విజయనగర రాజ్యమును 1529 వరకు బాలించిన పిమ్మటచనిపోగా, నారాజ్యపాలని యల్లుడగు అళియరామరాయల స్వాధీనములో

నుండెను. ఇతడచ్యుతరాయల పక్షమున బాలించుచుండెను. అపుడు రామరాయలకు కోటలో క్రమముగా శత్రువు లధికమైనందున నాతడొకసారి తన ప్రాణరక్షణార్థమై గండికోటకు బరుగెత్తి వచ్చెను. అప్పుడీ తిమ్మానాయడు రాయలను కంటికి రెప్పవలె గాపాడెను. అంతట రాయల శత్రువు లీతని పైకి యుద్ధమునకు రాగా, కోమలివద్ద ఘోరమైన యుద్ధము జరిగెను. దానిలో నీతడును, యీయనకు తోడ్పడవచ్చిన యితర పాలెగాండ్రును కలసి, సలకము తిమ్మరాజను శత్రువును అతని ఫౌజుతో సహా హతంచేసి, రామరాయలను తిరిగి విజయనగర సింహాసనారూఢుని జేసినందున, రాయలవారు మిక్కిలి సంతసించి అరతిమ్మా నాయనికి విశేషమైన వస్తువులు, ద్రవ్యమును బహుమాన మిచ్చినట్లు నడిమిదొడ్డిపాళెగాండ్ల కయిఫీయతు తెలుపుచున్నది. దీనిని తాడిపత్రి కయిఫీయతుగూడ ధృవపఱచు చున్నది *. కాని సలకము తిమ్మరాజును రామలింగ నృపాలుడు పారద్రోలినట్లు కొన్ని చాటువులు తెలుపుచున్నవి. ఒకవేళ నాతడు గూడ నాకాలము వరకు నుండి యుండవచ్చును.

అర తిమ్మానాయడు క్రీ. శ. 1550వ సం॥ర (సౌమ్యనామ సం॥రం)లో తాడిపత్రిలోని చింతల రాయలస్వామికి యెనుముచింతల అనే గ్రామమును దాన మిచ్చి శాసనము వ్రాయించెను. ఈయన యింకను ఖంకమల పాటిలోను, పెద్ద పొల్మిమడలోను, కనగల గూడూరిలోను, వెన్నపూసపల్లెలోను యేడు పుట్ల భూమిని దేవునకు సర్వమాన్యముగా ఖాయపఱచెను.

ఈయన తనపేరిట నొక తటాకమును త్రవ్వించెను. ఇతడొకసారి తాను కోరిన సాలెగ్రామము నీయని యొక బ్రాహ్మణుని చంపించగా, బ్రహ్మహత్యా పాతకము చుట్టుకొనె ననియు, తద్దోష పరిహారార్థము క్రీ. శ. 1552 వ సం॥లో తిమ్మానాయనిపేట యొకటి కట్టించి, దానిని బ్రాహ్మణాగ్రహారమొనర్చి యచట నొక చెర్వు కట్టించేననియు, హత్యచేయబడిన బ్రాహ్మణుని రూపమొకప్రక్కను, 'యాడకి వీరభద్ర' అనే నాగరాక్షరము లొక ప్రక్కను గల నాణెములను (రూకలు) వేయించి, తన దేశమున చలామణి చేయించుచుండెననియు తాడిపత్రి కయిఫీయతు తెలుపుచున్నది.

---

* L.R. Vol. 12, P. 213 & Vol. 39.

యాడకి పరగణా పెమ్మసానివారి ప్రధాన స్థానమగుటవల్లను, అచటి తమ కులస్వామి యగు వీరభద్రుని పేర నాణెములు తయారు చేసినట్లు కనుబడు చున్నది. ఈ యోధాగ్రేసరు డొకానొక యుద్ధములో జయించినపుడు శత్రు యోధుల నుండి యనేకములగు గుఱ్ఱములను వస్తువులను కొల్లగొని వచ్చినట్లీ క్రింది చాటువు తెలుపుచున్నది.

"సీ॥ మేలిమి తేజీలు - డాలు దమామీలు । చికిరేల గోరీలు-సింగిణీలు
బఱ్ఱాయి ధట్టీలు-కప్పురంపు సురటీలు । తులలేని నైజాలు-తోపు మీలు
బాకట్ల బల్లులు-జవ్వాది పిల్లులు । తెలిముత్తియపు పేర్లు-బలు గుడార్లు
పన్నీటి చెంబులు-పైడి కేడెంబులు । నందలంబులు జరీ-చాందినీలు

గీ॥ కొల్లగొనివచ్చె నీ మూర్త-కొంకులేక।క్షితి ప్రబణుత ధర్మ మృదుతర-
చేల భర్మ
సిద్ధ గజకర్మ పెమసాని-చిన్న తిమ్మ । వితరణ గుణేంద్ర భోగని-ర్జిత
సురేంద్ర॥"

ఈ యుద్ధములో నోడిన వారీ శూరాగ్రేసరు నీ క్రింది బిరుదావళితో ప్రార్థించిరని యొక చాటువిట్లు తెలుపుచున్నది.

"సీ॥ అభయం బొసంగుము-హత్తు మువ్వరగండ।కావుము వాడిచే-కంచ బిరుద
క్రోధింపకుము గండి-కోట దుర్గాధ్యక్ష । కరుణించు గండర-గండ బిరుద
రక్షించు గరుడ నా-రాయణాంక విహార।మనుపుము శాత్రవ-మద విఫాల
నిగ్రహింపకుము హ-న్నిబ్బరగండ చే।పట్టు గండర సూర్య-భద్ర చిహ్న

గీ॥ అనుచు నీచేతి హేతికి-నడరి రిపులు।శరణుఁబొందిరి భవదీయ-చరణములకు
ధీర పెమసాని అక్క-పా-ర్థివ కుమార।భోగ దేవేంద్ర చిన తిమ్మ
భూ-పచంద్ర॥"

## పెమ్మసాని నారసింహనృపాలుడు

ఈయన విజయనగర రాజ్యాధిపతిగా నుండిన అళియ రామరాయల కాల ములో నుండి యీతని సేనాధిపతులలో ఒకడుగ ప్రసిద్ధికి వచ్చెను. గండికోట,

తాడిపత్రి మున్నగు ప్రదేశము లీయన పాలించుచు వచ్చెను. ఈయన పరిపాలన కాలములో శా. శ. 1472, 1485 వ సం॥లలో కంచెన యెల్లప్ప, రామరాజు రామన్న మున్నగువారు తాడిపత్రిలో ధర్మశాసనములు వ్రాయించి యున్నారు. ఈయన పెదతిమ్మభూపాలుని పుత్రుడు. ఈయనకూడ మిక్కిలి పరాక్రమశాలి. జమ్ములమడుగువద్ద జరిగిన యొక యుద్ధములో నశ్వరాయడను వాని సితదు మూర్ఖుని యాతని సైన్యబలమణంచెనని యీక్రింది చాటువు తెలుపుచున్నది.

"సీ॥ రమణ మీపెదతండ్రి-రామలింగ విభుండు, ముగురు వజీర్లను-మొక్కవరచె
మీతండ్రి పెదతిమ్మ-భూతలా ధ్యక్షుండు, దస్తూరి ఖానును-మస్తణంచె
మీయన్న బలిచిన్న-రాయకేంద్రుడు మస్త, ఖానుని బలము చీ-కాకువరచె
అదివిచారించి నీ-వశ్వరాయని బల, మడచవే జమ్ముల-మడుగు బయల

గీ॥ ఆహహ నీగెల్పు నెన్నంగ-నవనిలోన, దరమె శేషునకైన ము-ష్కర తురుష్క
మస్తకన్యస్తచరణ స-మస్తశక్తి,నవబిరుద సింహ పెమసాని-నారసింహ॥"

ఈయనకు తురుష్కుల తలలపై పాదములుంచు వీరాగ్రేసరుడని యర్థము వచ్చు "ముష్కరతురుష్కమస్తకన్యస్త చరణ సమస్తశస్త" యను బిరుదున్నట్లు గూడ పై పద్యమువల్ల దెలియుచున్నది. ఈయన తండ్రియు సోదరుడును జయించిన దస్తూరిఖాను మస్తఖానను వారలను వెలుగోటి కుమారతిమ్మానాయడుగూడ జయించినట్లు వారి వంశావళిలోగూడ వ్రాయబడియున్నది. * అందుచే నీ యోధాగ్రేసరు లంద రా తురుష్కులతో నెదిర్చినట్లు రుజువువడుచున్నది. ఈ నారసింహ నృపాలుడు వెల్లలూరు గ్రామములో కొంత భూమిని చెన్నమరాజు క్రిష్ణమరాజు కొడుకు లింగమరాజను పండితునికి దారాగ్రహీత మొనర్చెను. దాని నాతడు క్రీ. శ. 1594 వ సం॥లో నచటి చింతలరాయ స్వామికి సూర్యగ్రహణ కాలమున సమర్పించినట్లు తాడిపత్రి కయిఫీయతులో నున్నది. వద్దిరేల గ్రామములో వెట్టిమాన్యములు, కొన్ని సేద్యబడి మాన్యము లాయనచే నొసగబడెను. (L. R Vol 20)

---

* "ధరయెల్ల నెఱుంగం-గదస్తురఖానుని, జెండవె గండర గండ బిరుద। భళిర । వెలుగోటి తిమ్మభూ-పతి కుమార । మతిఫణీశ కుమార తిమ్మక్షితీశ॥"

## పెమ్మసాని పెద తిమ్మానాయుడు, చిన తిమ్మానాయుడు

వీ రిర్వురును పెమ్మసాని నారసింహ నృపాలుని కుమాళ్ళుగా గన్పడు చున్నారు. వీ రాయన యనంతరము క్రీ॥ శ. 1584—1641 సం॥ల మధ్య పెనుగొండ రాజధానిగా బాలించిన, రెండవ వెంకటపతి రాయలకు సమకాలికు లైయుండి, యాయనవద్ద సేనాధిపతులుగను, సామంత నృపాలురుగను ఉన్నట్లు గన్పడుచున్నది. వీరు గండికోట సీమను యాడకి పరగణాను పాలించుచు ననేక రణరంగములలో రాయలవారికి సాయపడి, యనేక బిరుదులు, బహుమానములు పొందుచు వచ్చిరి. వీరి శూరత్వమునకు మెచ్చుకొని వెంకటపతిరాయలు వీరికి "గరుడ నారాయణ బిరుద ధ్వజమును, బంగారు పువ్వుల చంద్రికావి పావడయు, తురాయి, యేనుగు, హయరత్నము, వీరపులహరి ఘనకంఠమాలిక, తాళిచౌకట్లు, ముత్యాల కడియములు, పల్లకి" యిత్యాదు లొసంగినట్లు చారుచంద్రోదయములో వర్ణింపబడి యున్నది *. ఈ గ్రంధమును వీరి యాస్థాన మంత్రియు, కవీశ్వరుడు నగు చెన్నమరాజు శేషమంత్రి కొడుకు చెన్నమరాజను నతడు వ్రాసెను. దానిలో నతడు పెదతిమ్మ భూపాలుని మంత్రినని చెప్పుకొనుచు నాతని వైభవము నిట్లు నుడువుచున్నాడు.

"సీ॥ తన లస ద్వనలక్ష్మి-తన లస ద్వనలక్ష్మి, పగిది నాశీ వైభ-వములఁబూనఁ
దనమహా యశపాళి-తనమహా యశపాళి, గతి దానవారి సం-గతి వహించ
దనకళా విభవంబు-తనకళా విభవంబు, సరస నబ్జజ పరి-స్ఫురణ నెరప
దన విగ్రహ స్ఫూర్తి-తనవిగ్రహ స్ఫూర్తి, రీతి దర్పక నిరా-కృతియొనర్ప

"*సీ॥ గరుడ నారాయణ-బిరుద ధ్వజంబు బం, గారు పువ్వుల చంద్రి-కావిపావ
డయు తురాయి గజంబు-హయరత్నమును వీర, మలహరిఘనకంఠ -
మాలికయును
తాళిచౌకట్లు ము - త్యాల కడియములు, గండ పెండేరంబు-కత్తి కుచ్చు
వెంకట పతిరాయ-విభుని చేతను దెచ్చి, పెమసాని తిమ్మ భూ-రమణ
మణికి
గీ॥ నిచ్చి తదనుజ్ఞ గైకొంటి-వెలమి నీవు, రాయద త్తంబు లైన కు-ళ్ళాయిమీది
పాగ ధవళ శంఖంబులు-పల్లకియును,దాళి చౌకట్లు చెన్నప్ర-ధానచంద్ర॥"

గీ॥ నలరు ధాత్రిని మన్నెమా-ర్తాండుఁడట్టి, గండరాదిత్య గండర-గండబిరుదు
దీపితాటోప భయదప్ర-తాప వీరఘృణికి, పెమ్మసాని తిమ్మ
భూ-మేంద్రమణికి

గీ॥ మంత్రివై నీవు చెన్నయ-మంత్రిచంద్ర, ప్రణుతి కెక్కితి వఖిలభూ
-పాలసభల
క్షితి హరిచశ్చంద్రునకు సత్య-కీర్తిసరణి, దరణి ధర గర్వ భేధికి-
గురునికరణి॥".

వెంకటపతి రాయలవాడ తిమ్మభూపతికి బహుమానముగ బంపిన వస్తువులలో కుళ్ళాయిమీదపాగ, ధవళశంఖములు, పల్లకి, తాళిచౌకట్లును తన మంత్రిసత్తముడగు చెన్నమరాజున కొసంగి గౌరవించెను. ఈ మంత్రివర్యుడు తాడిపత్రిలో నొక గోపాలకృష్ణాలయమును గట్టించి, యా దేవునకు కిరీటపీతాంబరముల నొసంగెను.

మఱియు యాడకి గ్రామమున కోనే రొకటి త్రవ్వించియు, వన మొకటి వేయించియు, దన తల్లి పేరిట సర్వమాంబాపురమను నగ్రహారమును యేర్పాటొనరించియు బ్రసిద్ధి వహించినట్లు తన గ్రంధమునందు జెప్పుకొనెను.

చిన తిమ్మానాయని శాసనములు క్రి. శ. 1578 వ సం॥ము నుండియు నున్నట్లు తాడిపత్రి కయిఫీతు చెప్పుచున్నది. పెద తిమ్మానాయనితో కలిసియు, నాతని తర్వాతను చిన తిమ్మానాయడు గండికోట దుర్గాధ్యక్షుడుగా 36 సం॥లు నున్నట్లు తెలియుచున్నది. ఈ చిన తిమ్మానాయని యాస్థాన కవీశ్వరుడగు చిత్ర కవి అనంత కవి తాను రచించిన 'ఇందుమతీ పరిణయము' అను ప్రబంధములో చిన తిమ్మానాయడు గండికోట దుర్గాధ్యక్షుడని యీ క్రింది పద్యమున బేర్కొని యున్నాడు.

"సీ॥ శ్రీ హనుమద్వర-శ్రీ లబ్ధ సుకవిత్వ। చతురుండ లక్షణ-సార సంగ్ర
హం బొనరించి యు-ద్యత్కీర్తి బ్రఖ్యాతుఁ।డగు చిత్రకవి పెద్ద నార్యసుతుఁడ
విష్ణుచిత్తీ యాది-వివిధ కావ్యార్థముల్।దెలిసి వక్కాణించు-ధీర నుతుఁడ
గండికోటాఖ్య దు-ర్గ స్థలాధ్యక్షుఁడై।పృధివిమతుకు నెక్కు-పెమ్మసాని

గీ॥ చిన్న తిమ్మక్షమాపాల-శేఖరుండు । గారవింపఁగ బహుమాన- గౌరవమున
మనిన ధన్యుండ సభ్య స-మ్మత గుణైక।గరిమ వెలయు ననంతాఖ్య -
కవివరుండ॥"

ఈ చిన్న తిమ్మనృపాలుఁడు బీదసాదలకు వివాహకార్యము లనేకము లుచితముగా జేయుచుండెననియు, మిక్కిలి దాత యనియు సాంఘిక లోపము లను గొన్నిటిని సంస్కరించి యశఃకాముడయ్యెననియు గండికోట ప్రాంతముల జెప్పుదురు. ఈ పెమ్మసానివారి కిప్పటి కాప్రాంతములలో సభలయందు ప్రథమ తాంబూల గౌరవ మిచ్చుచుందురు. చిన్న తిమ్మభూపతి క్రీ. శ. 1579 వ సం॥లో తాడిపత్రిలోని చింతలరాయల స్వామి వారికి ముప్పాతికపుట్టి భూమి నొసంగి, క్రీ. శ. 1585 వ సం॥లో నైవేద్యముల గొన్ని యేర్పాటులను గావించి, క్రీ. శ. 1593 వ సం.లో చినతాడిపత్రి చేనుగూడ నొసంగి శాసన ములు వ్రాయించి పేరొందెను. ఇంతేగాక నితడు రంగస్వామి దేవాలయమునకు తుంట యను గ్రామమును ధారాగ్రహీత మొనర్చినట్లు కనుపడును *. వీనినిబట్టి గండికోటపాలనము తల్లికోట యుద్ధానంతరముగూడ పెమ్మసాని వంశీయులే చేయుచున్నట్లు స్పష్టపడుచున్నది. వీరికి దూపాటిసీమ ప్రభువులగు సాయపనేని వారు ముఖ్య బంధువులు.

క్రీ. శ. 1586 వ సం॥ము దాపులో గోల్కొండ నవాబగు మహమ్మదు కూలీ కుతుబ్షా గండికోట నాక్రమించుటకై తనమంత్రియగు అమీరుల్ ముల్కును సైన్యముతోపంపి జయించి, యచట సంజరుఖాన్ అనువానిని నిల్పెనని ఫెరిస్టా వ్రాసియున్నాడు. కాని యీ ఆక్రమణ చిరకాలము నిలువలేదు. వెంకటపతి రాయల వారీ వృత్తాంత మెఱిగి పెనుగొండనుండి సైన్యసమేతుడై వచ్చి యుద్ధము సాగించి, సంజరుఖానునకు సహాయముగా గోల్కొండ నవాబుచే పంపబడిన మూర్తజాఖాను, రుస్తుంఖానను వీరాగ్రేసరులనుగూడ పెన్నారునదివద్ద ఘోర యుద్ధములోజయించి మహమ్మదీయ సైన్యమును ముక్కలుముక్కలుగా నరికివేసి గండికోటను స్వాధీనపఱచుకొనెనట. మఱల నచట పెమ్మసానివారినే పాలకు లుగా నుంచినట్లు కన్పడుచున్నది. పెదతిమ్మభూపతి జయించెనని చెప్పబడిన

---

*తాడిపత్రి కయిఫీతు (L.I.R.)

యుద్ధములలో నిదియొకటి యనవచ్చును. ఈ గండికోటయేగాక యాయుద్ధములలో కృష్ణ సరిహద్దువరకు గల రాజ్యమంతయు వెంకటపతి రాయలకు వశమయ్యెనట.

## పెమ్మసాని పెద వీర నృపాలుడు

ఈయన క్రీ.శ. 1560–94 మధ్య ప్రాంతీయుడు. ఈ పెమ్మసాని వంశములో గండికోటను పాలించిన వారియం దొకడుగా గన్పడుచున్నాడు. ఈయన మొదటి శ్రీరంగరాయల వెంకటపతి రాయల సామంతుడు గావచ్చును. వాసు చంద్రోదయములో నీ యోధాగ్రేసరు డిట్లు వర్ణింపబడియున్నాడు.

చ॥ విడువక పెమ్మసాని పెద – వీర నృపాలుని యందలంబుపై
నడచు నుదార ఘోర మద – నాగముచే పిడియమ్ము కొద్ది యె
క్కుడువడి గ్రుద్ది పోఁ దటమె – కొంచక లింగయ మంత్రి సింహ్వా మిం
పడరెడు వేడ్క రాయలవు – రా యన చా మిడిగేసి వెంగటన్.

ఈయన యాడకిలోనుండి పాలించుచు వచ్చెను. (**L. R. Vol.**56)

ఇందుదాహరింపబడిన లింగయ మంత్రి శాసనమొకటి క్రీ. శ 1594 వ సం॥ము నాటిది (శా.శ. 151౦వ సం॥ర) తాడిపత్రిలో కనబడుచున్నదని తాడిపత్రి కయిఫీయతులో వ్రాయబడినది. ఆ శాసనములో నతడు పెమ్మసాని నారసింహనృపాలునివద్ద ధారా గ్రహీతముగా పొందిన కొంతభూమిని సూర్యగ్రహణ కాలమున చింతలరాయస్వామి కిచ్చినట్లు వ్రాయబడినది. అందుచే నీ పెద వీర నృపాలుడుగూడ నాతని సమకాలికు డని ధృవపడుచున్నది. ఇట్టి పరాక్రమ కంఠీరవుని కాలమునకు విజయనగర సామ్రాజ్యము పతనమై కొంతభాగము తురుష్కాధీనమై యుండెను. తల్లికోటవద్ద క్రీ. శ. 1565 వ సం॥న జరిగిన యుద్ధములో మహాప్రళయముగా వచ్చి పడెన లక్షలకొలది మహమ్మదీయుల ధాక కాగజాలక విజయనగర రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట, నీ పెదవీర నృపాలుడు సపరివారముగా దక్షిణదేశమునకు వలస పోవలసివచ్చెను. మధురరాజ్యమప్పుడు విజయనగర రాజుల బంధువులే పాలించుచుండిరి. అప్పుడచట విశ్వనాధనాయకుడు రాజుగా నుండెను. ఈతడు క్రీ.శ. 1550–65 మధ్య కాలమున కార్యకర్తగా పాలించెను.

వీరప్పనాయ డందుచే విశ్వనాధనాయకుని 1360నుండి కుమారకృష్ణప్ప లేక కృష్ణప్ప కడకేగి, యాతనిక్రింద నుండిన డెబ్బదిరెండు పాళెగాండ్రలో నొక ప్రధాన పాళెగాడుగా జేరెను. ఐన నీతనికి ఆ నాయకుడు సమాన గౌరవముల నిచ్చుచు వచ్చెను. ఈయనకు తిరునల్వేలి జిల్లాలోని కురివికుల మను జాగీరు నొసంగెను. అచట నంతకు పూర్వము కురవి తలయవన్ అనువాతడు దాని పాలకుడుగా నుండెను. ఆతడు దానిని యిచ్ఛాపూర్వకముగ స్వాధీనము జేయనందున నచటగూడ నొక చిన్న యుద్ధము జరుగవలసివచ్చెను. దానిలో వీరప్పనాయడు జయమొంది విశ్వనాధ నాయకుని యాజ్ఞాప్రకారము కురివి కులమును స్వాధీనపరచుకొనెను.

విశ్వనాధ నాయకుని రాజ్యమునందు కురివికులము, ఇలైయరసనందల్ పరగణాలే మిక్కిలి ప్రాముఖ్యములైనవి ఈ విషయము లైలరుదొర వ్రాసిన మ్యాన్యూలులోనున్నది. పెమ్మసానివారచట పాళెగాండ్రుగా నుండి మధుర, తిరుచునాపల్లి, రాజుల కనేక విధముల సాయపడుచుండిరి. తిరుచునాపల్లి రాజ్యమునకు కేరళ రాష్ట్రము స్వాధీనమగుటలో వీరి సాయ మత్యావశ్యకముగ నుండెను.

మధుర తిరుచునాపల్లి రాజ్యములు తర్వాత చాల కాలము నిలువలేదు. అవి యన్యాక్రాంతమయ్యెను. క్రమముగా నీ రాజ్యము యీస్టిండియా కంపెనీ వారి పరమగుటయు తటస్థించెను. అప్పుడు పెమ్మసాని వారి జాగీరు జమీందారీగా మారెను. ఈ పెమ్మసాని వంశమును గురించి మధుర తిరుచునాపల్లి రాజు యొక్క మంత్రియగు విజయమీనాక్షినాయ డను నతడు యీస్టిండియా కంపెనీ వారికిచ్చిన లిఖితపూర్వక ప్రకటనలో నిట్లున్నది.

"రోయరుల (రాయలు) యేలుబడి కాలమున పెమ్మసాని వంశపూర్వీకులు గండికోటకు పరిపాలకులై యుండిరి. ఆ స్థలము క్షీణించిన తర్వాత వారు మా రాష్ట్రములకు వచ్చి మధుర, తిరుచునాపల్లి రాజగు విశ్వనాధనాయకుని నాశ్రయించి కురువికులము జహగీరును బడసిరి. అది మొదలు విశ్వనాధనాయకుని పాలిత రాజ్యములోని కురువికులపు పాలకులగు ఈ పెమ్మసానివారు తప్ప తక్కిన పాళెగాండ్రందఱును రాజదర్శనమున కెప్పుడైన పోయినపుడు బంగారుతోగాని వెండితోగాని చేసిన పుష్పమును, ఒక పట్టు పుట్టమును రాజ

సన్నిధినుంచి రాజు పాదములపై వ్రాలి తమ విధేయతను జూపుచు, మరియూ ద్వారముగ కొలదిదూరమున చేతులు మోడ్చి నిలుచుండుట యాచారముగ నుండెను.

ఇక పెమ్మసాని నాయంక్లు ఎప్పుడైన రాజదర్శనమునకు వచ్చిరని యెఱిగినతక్షణమే విశ్వనాథనాయకుడు స్వయముగ వారి నెదుర్కొని హస్తసంచలనమున స్వాగతమొసంగి సమానపీఠమిచ్చి గౌరవించెడు మర్యాదకలిగియుండెను." ఈ యపూర్వ గౌరవమే పెమ్మసానివారి పలుకుబడిని, గౌరవమును ప్రజ్ఞావిశేషములను దెలుపుటకు జాలియున్నది.

ఇక గండికోటను గురించి తెలుసుకొందము. గండికోటకు పెమ్మసాని చినతిమ్మనృపాలుడే చివరిపాలకుడందురు *. క్రీ.శ. 1616—72 సం॥ల మధ్య పాలించిన గోల్కొండ సుల్తాను అబ్దుల్లా యనువాడు తీవ్రమైన ముట్టడి సాగించి, చివరకు తంత్రముచేతనే క్రీ శ. 1652వ సం॥ము ఆగష్టు 25 వ తేదీని సంపూర్ణముగా పెమ్మసానివారినుండి స్వాధీన పఱచుకొనినట్లు "ఢీవ్‌నాట్" పరిశోధకుని యభిప్రాయముగనున్నది. కృష్ణ నదీ హస్తువరకు వెంకటపతిరాయల రాజ్యముగా నుండినట్లు లోగడ తెలిపితిమి. క్రీ.శ. 1643 వ సం॥లో మూడవ శ్రీరంగరాయల కాలమున గోల్కొండసుల్తాను ఉదయగిరిప్రాంతమునకు దండెత్తి వచ్చినపుడు బీజపూరు సుల్తానును శ్రీరంగరాయలునుగలిసి యోడింపగా మరలిపోయెను. 1649వ సం॥ర దాపులో రాయల రాజ్యము కొంత యాక్రమింపబడగా, నతడు శ్రీరంగ పట్టణమునకును రాజధాని మార్చికట్లుకప్పడును, గాని క్రీ. శ. 1659వ సం॥లో రాయలు పెనుగొండనుగూడ జయించి తీసికొనెను. ఈ మూడవ శ్రీరంగరాయల యంత్యకాలములోనే గండికోట తుదకుమహమ్మదీయ పరమై యుండును. ఈ రీతిగ గండికోట పాలనము కమ్మవారి హస్తముల నుండి జారిపోయెను.

## ఉద్దండ నాయడు

ఈతడు పెమ్మసాని రామలింగనాయని బంధువులలో నొకడైయుండి 16వ శతాబ్దిని పేరొందినవాడు. రామలింగ నృపాలుడు తాడిపత్రిలో గట్టించిన

* తాడిపత్రి కయిఫీయతు.

కోటయందు కొంతకాలముండినపిదప పెద తిమ్మానాయడు గండికోటసీమ వ్యవహర్తయైనప్పుడు, తాడిపత్రి కోటలో నీ ఉద్దండనాయడు వ్యవహారములను జూచుచు ప్రఖ్యాతి వహించినట్లు తాడిపత్రి కయిఫీయతు తెలుపుచున్నది. ఈయన యచటి పెన్నబడి మాగాణిభూములను విచారించుచు వచ్చెను.

## యేనుగుల చన్నానాయుడు

ఈయన పెమ్మసాని పెద తిమ్మానాయని బంధువులలో నొకడు. అందుచే దాదాపు క్రీ. శ. 1530వ సం॥ర ప్రాంతీయుడనవచ్చును. ఈయన తాడిపత్రికి రెండుక్రోసుల దూరములో గాండ్లపాదను గ్రామమును గట్టించుటయేగాక యచట బక్కచన్నారాయణస్వామి దేవళమును తిమ్మానాయని తండ్రి పేరిట కాబోలు కట్టించినట్లు కనబడును. చల్లావారు అనే కమ్మవారు వ్యవసాయము చేయుచోట నితడొక పల్లెను గట్టించెను. అది చల్లావారి పల్లె యని ప్రసిద్ధికి వచ్చెను.

## మిక్కిలినేని నల చెన్నునాయుడు

పెమ్మసానివారి బంధుగులలో నొకడగునితడు 16వ శతాబ్దమున తాడిపత్రిలో ప్రసిద్ధి వహించెను. తాడిపత్రికి సమీపమున నితడొక పల్లెను గట్టించెను. ఆ పల్లె ప్రక్కనే తూర్పునాయని వారి సోదరియగు శానమ్మ యొక్క చెఱువును త్రవ్వించెను. అచట జమ్ము విస్తారముగా పెరుగుటచే నా పల్లెకు జంబులపాడను పేరు వచ్చెను.

## కిలారి తల్లయ్య

ఈయన శా. శ. 1466వ సం॥ర ప్రాంతీయుడు. ఈయన తండ్రి పేరు కొండమనాయడు. ఈతడు కావలి తాలూకా రావులగుంట, వక్కెలగుంటలకు అధిపతిగా నున్నట్లు కన్పడుచున్నది. ఈయన యచ్చటిదేవునకు రావులగుంటలో 4 గొర్లచేనును, వక్కెలగుంటలో 5 గొర్లచేనును దానమిచ్చి శాసనము వ్రాయించి కీర్తి వహించెను *.

---

* N. I. K. 25

## రావెళ్ళవారు

రావెళ్ళ వంశీకులు కమ్మవారిలో మిక్కిలి ప్రసిద్ధికి వచ్చిన శూరవంశము వారు. వీరి విషయము 13వ శతాబ్దమునుండియు వినబడుచున్నది. క్రీ. శ. 1257వ సం॥ నాటికి పాలించుచుండిన చాళుక్య చక్రవర్తియగు మూడవ రాజరాజు కాలమున నొక రావెళ్ళనాయకుడున్నట్లొక శాసనము వచించుచున్నది *. తరు వాత వీరి వృత్తాంతము కాలగర్భమున బడిపోయి మనకు తెలియకున్నను, వీరచ్చటచ్చట సేనాధిపతులుగ కాలము జరపుకొన్నట్లే తోచుచున్నది. వీరికి గల 'చలమర్తిగండ' బిరుదమునుబట్టి వీరు దుర్జయాన్వయులలోని వారని ప్రథమ భాగమున జెప్పియున్నాము. వీరి విజయనగర రాజగు మొదటి బుక్కరాయల కాలములో 1364 నుండి శ్రీశైలము, దూపాటిసీమల కధిపతులుగా నుండిరి. (**Mac Man** 15–6–19)

## రావెళ్ళ వీరమల్లభూపతి

ఈయన విజయనగర రాజ్యపాలకు డగు సాళువ నరసింహరాయలవద్ద మొదట నొక సేనాధిపతిగానుండి ప్రసిద్ధికివచ్చెను. ఈ మల్లనృపాలుడు గుడిపాటి కోటవద్ద రాయలకును మహమ్మదీయ ప్రభువగు కుతుబుశాహకును జరిగిన యుద్ధములో తన యద్భుత పరాక్రమమును గన్పరచి రాయలవారిచే ననేక బిరుదులను సంపాదించుటయేగాక "రాజహృదయభల్ల ప్రతాపప్రభావుండ"ని ప్రత్యేకము శ్లాఘింపబడుచు వచ్చెను. రావెళ్ళవారి చారిత్రక వృత్తాంతమంతయు జక్కగా వివరించిన సౌగంధిక ప్రసవాపహరణ మను గ్రంథమున రత్నాకరం గోపాలకవి యీ మల్లభూపతి నిట్లు వర్ణించి యున్నాడు.

"ఆ కమ్మవంశ సు-ధాంభోధి యందు, రాకానిశాకరు-రమణ జెన్నొంది
యనుప మాటోప సా-హసవిక్రమార్కు, డనుచు రాయకుమారు -
లభినుతింపఁగను
విమతరాడ్హృదయద మై-విస్మయం బొగడుచు, గొమరొందు గుడిపాటి- కోట చెంగటను

* N. I. S. 6.

కుతలాదితతులెల్ల-గొనియాడి మెచ్చ, కుతుబు శాహబలంబు-ఘోరించి నరికి
బెల్లుగా రాయల-చే హెచ్చు బిరుదు, లెల్ల గైకొని మదా-హిత రాజహృదయ
భల్ల ప్రతాప ప్ర-భావుండనంగ, మల్లభూరమణుఁడు-మహికీర్తి నింద
వినుతులు గాంచు రా-వెళ వీరమల్ల, జననాథచంద్ర వం-శంబున నలరి."

ఇందలి కుతుబుశాహ బహమనీ సుల్తాను సామంతుడుగ బనిచేసిన కూలీ కుతుబ్ ముల్క్ అను నతడే యనియు, నితడు క్రీ. శ. 1495 వ సం॥ము మొదలు 1512 వరకు నాతని సామంతుడుగా నుండి తర్వాత బహమనీసుల్తానును ధిక్కరించి కుతుబుశాహయను నామమున స్వతంత్రుడై గోల్కొండ నవాబని పేరొందినవాడనియు జరిత్రజ్ఞులు గుర్తించుచున్నారు *. అందుచే నీ మల్లభూపాలుడు క్రీ. శ. 1495 వ సం॥రం ప్రాంతీయు డనవచ్చును. ఆకాలమున నరసింహరాయలకును బీజపూరు, బీదరు, గోల్కొండ నవాబులకును ఘోర యుద్ధములు జరుగుచువచ్చెను. ఇవి క్రీ శ. 1485, 1493 వ సం॥లలోను తర్వాతను ఉండెను. అందులో నీ వీరాగ్రేసరుడు పాల్గొని సేనాధిపతిగా నుండి తన శౌర్యమును ప్రకటించెను. ఈయనకు కొండభూపతి యను సోదరు డొక డున్నట్లును, ఆతడే కారణముననో దమ యాస్థానభట్టున కొసగబడిన మాన్యమును గైకొనగా, రాయల సంస్థానమున సామంతనృపాలురమీద భట్టురాజు లందఱు పద్యములు కైవారము చేయుచుండు కాలమున నా భట్టు మల్లభూపాలునిపై పద్యములు చదువకుండుట గనిపెట్టి రాయ లడుగగా దాని కాతడు

"ఆ॥ తోడఁబుట్టినట్టి-తొయ్యలి మనువిచ్చి. వయసురాగ దాని-వలఁచినట్లు
ప్రథమమందు నిచ్చి-రావెలకొండయ, కమతమందుఁ జేను-కలుపుకొనియె."

అని చదివినట్లును, దానిపై రాయ లట్లు చేయవచ్చునా యని మల్లనృపాలుని మందలించుచుండగా, నా తమ్ముడైన నట్లు చేయునాయని యితడుపల్కగా, నభిమానశూరు డగు నా కొండయ వెంటనే తన కరవాలమున నాత్మహత్య గావించుకొన్నట్లుగా నొక కథ ప్రచారమునందున్నది. కాని దీనిని నమ్ముటకితరాధారములు గన్పడకపోగా, నాపేరు గల తమ్ముడు మల్లభూపాలునకున్నట్లు గూడ సౌగంధిక ప్రసవాపహరణమున వర్ణింపబడియుండలేదు. అందుచే నీకథ

* ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక: సంపు. 15. సం. 6.

విశ్వసింప వలనగాకున్నది. ఈ మల్లభూపతి పెదారికట్ల రాజదానిగ జేసికొని పాలించినట్లు చెప్పుదురు. ఈ వంశీకులకు బసవశంకర బెక్కెము గలదు. ఈయన తురుష్కులతో నొనర్చిన యొక యుద్ధమున జయము గైకొని వచ్చుచుండగా నొక భట్టు రాయలతో నిట్లు విన్నవించెనట.

ఉ॥ అల్లవె కమ్మ మూకలఁట - నావల రావెళ చంద్రుఁడౌ
మల్లయ భూప దుర్భర స - మగ్రిబలంబులు మండలాగ్రముల్
ఝుల్లపు టీబెలున్ బసవ - శంకరు బెక్కెము భూరి వీర భూ
వల్లభ మల్లిఖార్జునుఁడు వాఁడె సుమీ జగదేకవీరుఁడున్.

ఈయన శౌర్యమును కన్నులార గాంచినవారిని వీరమల్ల భూపతి యని పిలుచుచుండగా తుద కదియే నాతని పేరయ్యెను. ఈ పేరుననే యనేక చాటువులు దొరకుచున్నవి. ఈక్రింది యెత్తుగీత చరణములు కొన్ని పద్యములలో గలవు.

"సమరరఘురామ రావెళ్ళ - సార్వభౌమ । వైరిహృద్భల్ల యుద్దండ - వీరమల్ల". గ్రంథ విస్తరభీతి నాచాటువుల నిచట నుదాహరించుటలేదు. చాటుపద్య మణీమంజరి చూడుడు.

రావెళ్ళవారు విజయనగర రాజ్యములోని పాళెగాండ్రలో నొకరు. వీరు రాజధానికి సపరివారులై వెడలినపు డచట మకాము చేయుటకై 1260 కుంటల వైశాల్య ప్రదేశముండెనని 'విజయనగర సామ్రాజ్యపు' అను ప్రాచీన కడిత పుస్తకమువల్ల విదితమగు చున్నది *1. ఈ మల్లభూపాలుడు నరసింహరాయల తర్వాత వీర నరసింహరాయల యొక్కయు, కృష్ణదేవరాయల యొక్కయు కాలములోనున్నట్లే కనఁబడుచున్నాడు. పోర్చుగీసు వ్రాతకాడగు న్యూనిజ ననుస

---

రావెళ్ళవారు పచ్చగుళ్ళపాడు రాజదానిగ జేసికొని ఆలంగీరుపాదుషా కాలములో పాలించుచుండి రని కొచ్చెర్లకోట స్థలపురాణములో చెప్పబడినది. **See N I.**

*1. భారతి శుక్లసంపుటము, పుట 623.

రించి సీవెలను గ్రంథకర్త వ్రాసిన "Forgotten Empire" అను ఆంగ్ల గ్రంథములో కృష్ణదేవరాయల సామంతులలో నొక మల్లపనాయకుని బేర్కొనుచు నాతనిక్రిందనున్న రాజ్యాదాయము 13,000 వరహాలనియు, నాతనిక్రింద 6,000 కాల్బలమును, 400 గుఱ్ఱములును ఉండెడివనియు రాయలవారి కతడు 1/3 రాజ్యాదాయమును కప్పముక్రింద చెల్లించుచుండెననియు వ్రాసియున్నాడు *1. ఆ మల్లపనాయకుడు మన వీరమల్లభూపతియేగాని యన్యుడుగాడని చెప్ప వచ్చును. ఈ మల్లిఖార్జునునకు తిప్పనృపాలుడను కొమారుడు జన్మించెను. మల్లిఖార్జునుడు కృష్ణదేవరాయలకు 3 సం॥లకు ముందే ననగా క్రీ. శ. 1527వ సం॥లో చనిపోయెనట *2. ఈ మల్లిఖార్జునునివంటి మహావీర పురుషులు సైన్యాధిపతులుగా నుండుటవల్లనే హిందూరాజ్యము మహమ్మదీయ దండయాత్రలకు లెక్కచేయక స్థిరముగానుండి కృష్ణదేవరాయల రాజ్యమునకు భద్రత యుండెను.

## రావెళ్ళ తిప్పభూపాలుడు

ఈతడుగూడ వీరనరసింహరాయల కాలములోను కృష్ణదేవరాయల కాలములోను సేనాధిపతిగా బేరందెను. వీరనరసింహరాయలకును, గజపతులకును జరిగిన యుద్ధములలో నీతడు చూపిన పరాక్రమమునకును మెచ్చుకొని రాయలీయన కనేక బిరుదులను, ధ్వజములను, పట్టుగొడుగులు, అందలములు, పాలకులు, హారములు పంచమహాశబ్దగౌరవము, వన్నెవన్నెల గుడారములు, గుఱ్ఱములు, యేనుగులు మున్నగు రాజలాంఛనము లన్నిటిని పారితోషికముగా నొసంగెనట. ఈ విషయము సౌగంధిక ప్రసవాపహరణ మిట్లు చెప్పుచున్నది.

"ధీరత రావెళ్ళ-తిప్పభూవిభుడు, హేరాళముగ ధాత్రి-నేలుచు నుండి
భుజ బలోద్దండుఁడై-పొదలుచు వచ్చి, గజపతి దళముల-గదిసి చెండాడి
వికలంబుగా జేసి-వెన్గొట్టి తరిమి, అకలంక బిరుదుధ్వ-జావళుల్పట్టు

*1 J A.H.R S Vol IV చూడుడు

*2. వాసిరెడ్డి మల్లిఖార్జున ప్రభువునకును హైదరుజంగునకును జరిగిన యుద్ధమున నొక రావెళ్ళ వీరమల్లానాయడు చనిపోయినట్లు వాసిరెడ్డి వంశచరిత్ర తెలుపుచున్నది. అతఁడీయనయే యగునేమో !

గొడుగు లందలములు-గొనటు వల్లకులు, బెడిదంపు పేరులు,-పెద్దబూరగలు
వన్నెవన్నె గుడార్లు-వాజులు కరులు, చెన్నొందఁ గైకొని-సిరులచే వెలసి
తనకీర్తి సకల ది-క్తటములనించి, జనపాలు రెన్న రాజ్యము చేయుచుండె.

పురుషోత్తమ గజపతి వీరనరసింహరాయల కాలములోను ప్రతాపరుద్ర గజపతి కృష్ణదేవరాయల కాలములోను ప్రత్యర్థులుగా నున్నందున నీ తిప్ప నృపాలు డోడించిన సైన్యమిందెవ్వరిదో తెలియుటకు వీలు లేకున్నది. కాని కృష్ణరాయలు కళింగ దండయాత్రకు (1513—15) వెడలినప్పుడు గజపతి దళములతో సమరరంగమున బోరాడినవారిలో నీ రావెలవారుగూడ నున్నట్లు కుమారధూర్జటి రచించిన కృష్ణరాయ విజయమునం దీక్రింది పద్యమున గలదు.

ఉ॥ రీవిగనౌకు వారును గ-డింది రహీన్ వెలుగోటివార లా
రావెలవారు గూడుకొని - రాత్రి పగల్ చతురంగ సేనతో
నేవఁగ జూచినం దెలియ-నెంతయు శక్యముగాని దుర్గమా
దూవర మౌళి గాంచి యొక పూటనె దీసెదనంచు నుగ్రుడై.

తిప్ప భూపతికి పెదమాంబ యను సతీమణి యందు అయ్యప్ప రాజు, వెంకటాద్రి యను నిర్వురు వీరాగ్రేసరు లుదయించిరి. ఇందలి వెంకటాద్రి విషయము మనకు చరిత్ర ప్రసిద్ధిగాలేదు.

## రావెళ్ళ అయ్యపరాజు

ఈ రావెళ్ళ అయ్యపరాజు మిక్కిలి శూరాగ్రేసరు డని చెప్పవచ్చును. ఈయనకు పాపరాజను పేరుగూడ కలదు. ఈయనకు లక్ష్మమాంబ యను భార్యయును, తిప్పభూపాలు డను కుమారుడు నుండిరి. ఈయనగూడ సాళువ వీరనరసింహరాయల కాలములోను, కృష్ణదేవరాయల కాలములోను సేనాధిపతిగా నున్నట్లు కన్పడుచున్నది. ఈతడు 1506 ప్రాంతమున కందనవోలు (కర్నూలు) వద్ద జరిగిన యుద్ధములో బాల్గొని కోటను పట్టుకొనెనట. ఈకందనవోలు కోటను బట్టుకొనునపుడు అళియ రామరాయల తాత యగు రామరాజుగూడ నరసింహరాయల సామంతుడుగా నుండి యాయుద్ధమునదన పరాక్రమమునుజూపి యుండెను. ఈ విషయము పద్యబాలభాగవతము, ద్విపదబాలభాగవతము,

రామరాజీయము, వసుచరిత్రము లందు వర్ణింపబడి యున్నది *. అందుచే నీ కర్నూలు యుద్ధము చారిత్రాత్మక ప్రసిద్ధిగలది. దీనిలో అయ్యపరాజు చూపిన పరాక్రమమును గుఱించి సౌగంధిక ప్రసవాపహరణమున నిట్లున్నది.

"అరయ నా యిరువురి-యం దగ్రజుండు।పరమపావనుఁడయ్య-పక్ష్మాతలేంద్రు
సతి శీలవతి లక్ష్మ-మాంబిక యందు । సుతుని శ్రీ తిప్ప వ-సుంధరాధిపుని
గని పెంచి సకల భూ-కాంతులు గొలువ । పనువడ తనయుని-పట్టంబు గట్టి
అతి ముదంబున దాల్చి-యలరబటించి । హగలు గగ్గోలురా-జ వజీరుఁడనుచు
ముగ్గురుడు నేదార్లు-మొగి సన్నుతింప । దాపురే మా యయ్య-భళిభళి యనుచు
గోపాలరాజు బే-ర్కొని చూచి మెచ్చ । యళుకు జొక్కును లేక-అహవభూమి
తెలుఁగు బిజ్జలుమాడ్కి-తెగుపతోఁ జొచ్చి । మొనసి కందనవోలు-ముందరియెల్ల
మునుమున్నె విడిపించి-మోహరంబైన । బలుదునేదారుల-భంజించి వైచి
పొలుపొంద గండేభ-ముల నుగ్గుజేసి । పొదలు గరీజుల-పొంగణగించి
యెదురు పరాణీల-నెల మట్టాడి ! చెలరేగి యలసి వ-జీరుల జిదిమి
కల దక్కిణీల చీ-కాకు గావించి । డేరీజు రాళ్ళన్ని-తెగ నరికించి
కోరి బండారముల్-కొల్లలాడించి । తనపేట వారి కం-దనవోలి కోట
యనురాగమున జొచ్చి-యా రాజుచేత । మెచ్చులు గైకొని-మేదినీపతుల
నిచ్చ మెచ్చులు చూచి-నృపులలో నితఁడె । గెలుపుల రాజని-కీర్తించి పొగడ
విలసిల్లి రణకేళి-విహరించె నెలమి."

ఈ కర్నూలు యుద్ధమున 70 వేల ఆశ్విక సైన్యములతో మహమ్మదీయ సైన్య మెదిరించినను, దానిని పారద్రోలి రని బాలభాగవతములోని యీ క్రింది పద్యము నుడువుచున్నది.

---

* "రామ నృపాలుండు రాజేంద్రుఁ డౌదవె ..................
నెందు నెన్నఁగజాలు-నిద్ధశౌర్యమున, గండనవోలి దు-ర్గంబులో నుండి
వీరులు డెబ్బది-వేవు రాశ్వికులు, చేరి కొల్వంగ వ-చ్చిన సవానెదిరి
కలనంది పంచటం-గాళంబువేసి, గెలిచె సచ్చరితంబు-గీర్తింప. దరమె.
ద్విపద బాలభాగవతము.
"అసఘతర కందవోలి మ-హాపురీ ని,శాంతుఁడగు రామమేదినీ - కాంతుఁ
డలయ" వసుచరిత్ర.

"గబ్బిల్ డెబ్బదివేవు రాశ్శికులు వే। దప్పున్ గొల్చెఁగాఁ గిన్క బె
న్నబ్బల్ గప్పఁగ గండపోలు కొను పే। దప్పెం బట్టుముట్టిన్ సవా
బిబ్బి నుబ్బఁగించి తోలె సరిరా। ప్పిముంచు లంకాసర
ణ్యాబ్బంద్రాధుఁడు బుక్క భూవిభుని రా। మాధీశుఁ బాహాయనన్॥"

ఈయన తర్వాత నితని కుమారుడగు తిప్పభూపతి II రాయల సామంత పాలకులలో నొకడుగా ప్రసిద్ధికి వచ్చెను.

## రావెళ్ళ తిప్ప భూపాలుడు II

ఈ తిప్పనృపాలుని కాలములో గూడ యాదవాని దుర్గమును ఓడిగి పట్టుకొనుటకై తురుష్కులు ప్రయత్నించినట్లు కన్పడును. రాయల పక్షమున నితడప్పుడు సాహసించి తన పరాక్రమమును జూపి, వారి నోడించి జయలక్ష్మిని చూరగొనెను. ఈ విషయము సౌగంధిక ప్రసవాప హరణములో నిట్లు వర్ణింప బడియున్నది.

"అతని తనూభవుం-డగు తిప్పనృపతి।తురుష్క పతులు మి-న్నుముట్టఁగా నెంచి
ధరణి పేరైన యా-దవాని దుర్గంబు। ముట్టడించి యగ్గా-మూకలాడెంచి
తగుపటీరుల మనె-దాపుల జంపి। సాగను నుప్పొంగ-సేసిన ప్ర...
కలహా లెగాంధ్ర చీ-కాకుగాఁ దరిమి।చెలరేగి జయలక్ష్మి-చేకొని వచ్చి
చల్లఁగా సల హరి-శ్చంద్రునిలీల। నెల్ల మహీస్థలి-నేలుచు నుండె".

ఈయనకు వెంగమాంబ యను సతిమణివలన లింగనృపాలుడు జన్మించెను. ఈతడు పాల్గొనిన అదవాని దుర్గ యుద్ధములో అళియ రామరాయల (కృష్ణదేవరాయల అల్లుడు) తండ్రియగు తిమ్మరాజు గూడ పాల్గొని సాధించినట్లు బాలభాగవతములో వ్రాయబడి యుండుటవల్ల, నాతని కీ తిప్పభూపాలుడు సహాయుడై యుండునని చరిత్రకారులలో నొకరగు శ్రీ కె. ఈశ్వరదత్తుగా రభిప్రాయ పడుచున్నారు *1. అళియ రామరాయలు పాల్గొనినట్లుగూడ వసు చరిత్రమున గలదు *2. అందుచే నీయుద్ధము ప్రసిద్ధిగలది.

---

*1. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సంపు-25—6 సం॥

*2. "సీ॥ పట్టాభిషేక విపర్యయంబున ప్రోలు, వెపలి ప్రియానుజాత
వెంటనడువఁ।జిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండ సాంద్ర
హరిద్వీపేంద్ర నాదవని జెందె॥" వసుచరిత్రము.

ఈరామరాయలకు "ఆదవేని దుర్గాపహారుడ"ను బిరుదున్నట్లును, దాని నాతడు గెల్చినట్లును రామరాజీయములో గూడ వ్రాయబడియున్నది. ఇట్టి మహా యోధులకు రణరంగమైన ఆదవాని (ఆదోని)లో తన పరాక్రమమును గన్పరచి యితడు ప్రభువుల మన్ననల నందెననుట స్పష్ట పడుచున్నది.

## రావెళ్ళ లింగ భూపాలుడు

రెండవ తిప్పనృపాలుని పుత్రుడగు నీతడు చాల ధర్మాత్ముడని పేరు గెందెను. ఈయన భార్యపేరు సిద్దాంబ. ఈమె సత్రావుల వర్వత్తాలను ప్రసిద్ధ కమ్మవంశజుని కుమార్తె. ఈ లింగ నృపాలునికి కొండభూపతి, అయ్యపరాజను కుమారులు జనించి ప్రసిద్ధికి వచ్చిరి. ఈయన క్రీ. శ. 1510 వ సం॥ర ప్రాంతీయుడుగా గన్పడుచున్నాడు. ఈయన శౌర్య విశేషములు తెలియుట లేదు.

## రావెళ్ళ కొండ భూపాలుడు

రావెళ్ళ లింగనృపాలుని పుత్రులలో నొకడగు నీయన మిక్కిలి పరాక్రమశాలిగా గన్పడు చున్నాడు. ఈయన కనేక బిరుదములను రాయ లొసంగెను. అవి యన్నియు నాతని యుద్ధయాత్రలకు మెచ్చుకొని యొసగబడినవిగనే గన్పట్టును. సౌగంధిక ప్రసవాపహరణమున నితని బిరుదములన్నియు నీక్రింది రీతిని వ్రాయబడినవి.

"ఆ కుమారుల లోన-నహిత రాజన్య, భీకర శౌర్యుండు-భీమ బలుండు
బలభేది విభవుండు-పట్ట పెనుగంటి, బల శిలాటంక ఘం-భత్పాండ్య రాజ్య
పుర హలకలోల-భువన భేతాళ, పరసైన్య భైరవ-భళ్ళాణ రాయ
గండోగ్ర జగనొబ్బ-గండ ప్రచండ, గండర గండ వి-ఖ్యాత కేళాది
రాయ చౌరాశి దు-ర్గ విభాళ చటుల, గాయ గోవాళ ర-క్తచ్ఛత్ర బసవ
శంకర నిశ్శంక-శౌర్య హం వీర, కంకణ హస్త సం-గడి రక్షపాల
శత్రు మహీనాధ-సముదయాకార, చిత్రితాంగద భీమ-సింహ తలాట
నర శౌర్య ముఖ్య నా-నాభవ్య బిరుద, భరితుండు కొండభూ-పాల శేఖరుఁడు".

దీనినిబట్టి పాండ్యదేశమునకు రాయలతో యుద్ధయాత్ర నొనర్చి యచట ప్రశంసింప దగినట్లుగా నితడు చూపిన పరాక్రమమునకు మెచ్చుకొని రాయలు

భేతాళ బిరుద మిచ్చినట్లు కన్పడును. ఏదులశాహియను మహమ్మదీయ పాలకుడు (బీజపూరు సుల్తాను) మానవపురి కడకు వచ్చి ముట్టడించి నప్పుడీ కొండపభూపతి చాల పరాక్రమమును జూపినట్లు సౌగంధిక ప్రసవాప హరణములోని యీ క్రింది భాగము తెలుపుచున్నది.

"పొదలుచు మానవ-పురి చెంతఁజేరి, పదరు నేదులశాహి-బలముల మీద
తేజీని చేసల్ల-ధేయని నూకి, యాజి రంగము జొచ్చి-యహిత సైన్యములఁ
గకవికల్ గావించి-గద్దించి నరకి, ప్రకటించి తనపేరు-వాసి పోనీక
ఉడుటు రేవంతుల-నౌరయు వజీర్ల, పొదలు దునేదార-పుడమిపైఁ గూల్చి
హత్తి వెంబడి వచ్చు-నవనీశు లెల్ల, తత్తరంబున వెన్క-దండముల్ వెట్ట
నిరుమొనల్ నఱకిన నేదిక్కు గన్న, ధర దొలి యాడెడు-తలలు పైనెగసి
పడెడి కండలుబెట్టువారు రక్తములు, పొడియైన యెముకలు- పొలియురాహుతులు
గలిగి యుప్పెడు మహా కదన రంగమున, నఱకు బెళ్కునులేక-అని జేయువేళ
వేయారు వెడగాడి-వీపున వెడలు, గాయముల్ మణి పద-కంబులు గాగ
వెక్కసంబున మొన-విరిగిన యలుగు, లక్కసంబున తార-హారముల్గాగ
పెనగొని మెదవ్రేలు,ప్రేవుల సొబగు, తనర నుత్తర జన్నిదంబులు గాగ".

అళియరామరాయల తండ్రిగూడ నీయుద్ధములో నున్నట్లు బాలభాగవతమున గలదు *. ఇట్టి వీరాగ్రేసరుడు రణభూమికి వెడలునప్పుడు పెండ్లికొడుకు వలెనే యీ క్రింది వైభవముతో బోవుచు వచ్చెనట.

"బలువిడి చతురంగ-బలముల తోడ, వలనొప్పు బహు వైభవంబుల తోడ
కర వర దీప్తుల-కరవాలు బూని, సరిలేని చికిలి వ-చ్చల బాకు బట్టి
కరకు కెంపుల బాషి-కంబు ధరించి, తరలక కరవీర-దామముల్ దాల్చి
సిరిగల్లు రత్నాల-సింహలలాట, బిరుదాంకములు జాల-పెంపొంద జవన

* "రాజచంద్రుఁడు రామరాజు తిమ్మయ్య............
కడిమియై మానువ—కదరణక్షోణి, గడుసరి నేదుల ఖాను జయించె
విక్రమంబున నాద—వేని దుర్గంబు, విక్రాంతు లెన్నవే—వేగ సాధించి
...............మానువకడ నవాబుని పోరనుబరా
జయము నొందించెనే—శౌర్యశాలి". పద్యబాలభాగవతము.

తురగంబుపైనెక్కి—తోరంపు వేడ్క, సరసులు వీరసే—నలు జల్లుచుండ
గొప్ప మెట్టని పట్టు—గొడుగుల నీడ, నొప్పు చుండురు కావి—యుల్లెడకిరించ
చెలువొందు జయలక్ష్మి—చేకొనువరకు,కులుకుచుజనుపెండ్లి-కొడుకుచందమున".

రాయలు బీజపూరుపై ముట్టడిని 1512-20 సం॥లలో నొనర్చి యుండుట వల్ల నీ సుమ్యకాలముననే కొండభూపతి పాల్గొనిన మానపపురి యుద్ధము జరిగి యుండును.

## రావెళ్ళ అయ్యప నాయకుడు II

ఈయన కొండనృపాలుని సోదరుడు. ఇతనికి "సాహస విక్రమార్కుడు, వరవీరకోలాహలుడు, చెంచుమంచూరకారుడు" మున్నగు బిరుదములు గలవు. వీనిని బట్టియే యీ వీరాగ్రేసరుని శౌర్యమును గ్రహింపవచ్చును. ఈయన భార్య పేరు వెంగమాంబ. ఈమె యందితనికి కొండ భూపాలుడు జన్మించెను.

ఈ అయ్యపనాయడు అళియ రామరాయల కాలములోనివాడైయుండి యాయనక్రింద నొక పాలకుడుగా నున్నట్లు, క్రింది ద్విపదవల్ల తెలియుచున్నది.

"బలియుఁడౌ కొండభూ—పాల సోదరుఁడు।విలసితసాహస-విక్రమార్కుండు
గురుతర వర వీర—కోలాహలుండు।వరభవ్య గాంగేయ—వర్ణ కేతనము
నరసుతుఁ డయ్య ప—నాయకేంద్రుండు।రాజిల్ల వెలయు—కర్ణాటశ్రీరామ
రాజదత్తకిరీట—రమ్య భూషణుఁడు।మనసి జాకృతి చెంచు—మల చూరకాఁడు".

దీనిని బట్టి అయ్యపనాయడు క్రీ. శ. 1542--65 సం॥ల మధ్య కాలపు వీరపురుషుడని గ్రహింపవచ్చును.

## తిరుమణికోటపాలన—రావెళ్ళ లింగ నృపాలుడు II

ఈయన రావెళ్ళకొండ భూపాలుని పుత్రుడు. తండ్రి తాతలవలెనేయితడు మిక్కిలి కీర్తి నొందినవాడు. ఇతడు కవీశ్వరుల నాదరించెను. ఈయన సాయపనాయని అనంత నృపాలునికి శ్రీరంగమాంబ యందు జనించిన భాస్కరాంబ యను సతీమణిని వివాహమయ్యెను. ఈతడు తిరుమణికోట రాజధానిగపాలించుచు వచ్చెను. అప్పుడబ్దులో షాధుషాహ తన సైన్యముతో కోటను బట్టుకొన రాగా,

నాతని ససైన్యముగ జయించి, దళవాయి యగు వెంకటరాయల వారి మెప్పొంది, పెనుగొండకు పై దీలసు లీసికొని వెళ్ళు త్రోవలో దయదలచి వారలను విడిచి రక్షించిన ట్లీతడు కృతినొందిన సౌగంధిక ప్రసవాపహరణ గ్రంథముననే తద్గ్రంథకర్త యగు రత్నాకరం గోపాలకవి యిట్లు వర్ణించుచున్నాడు.

తిరుమణి కోటలో-స్థిరముగ నిలచి । పరవీర దుర్గముల్ - పట్టణంబులును
నదలించి బెదరింప-నావార్తదెలసి । పొదలు సుల్తాని య-బ్దులు పాదుశాహ
చతురంగబలములు సంరంభులగుచు । ధృతిమీరగా నలు - దిక్కులఁగ్రమ్మి
యుదయాస్త మయముల-నురిమినలంగ । ఎదిరించి నరికి మ-హోగ్రశౌర్యమున
దాబాలఁపైబడి - డాగులు చేసి । జీబులు బలసిన - సేనల దునిమి
మన్నీలదొరల సా-మంతుల దునిమి । వన్నెకునెక్కు రే-వంతుల దునిమి
యాలంబులో జొచ్చి - యఖిల శాత్రవుల । దోలి పెన్గొండకు-దోవలు చూపి
కురువీర బలముల - గూల్చిన యట్టి । నరుఁడీ విభుండని-నరనాథు లెంచ
గదిసిన శత్రువుల్ - గళవళ మంద । జెదరి పోవఁగలేక - జేతులు మొగిచి
కావుము బసవశం - కర బిరుదాంక । ప్రోవుము బెళగంటి - పురిశిలాటంక
శరణు గండర గండ - శత్రువిభాళ । కరుణించి రక్షించు - గాయగోవాళ
కీర్తించెదెము మిమ్ము - కేళాదిరాయ । యర్థుల మన్నింపు - మర్థి వేడెదము
అని వేడుకొనిన - దయా దృష్టిజూచి । తనర వేడ్కర దర్మ - ధార వట్టించి
సమరంబు చాలించి - చయ్యన మరలి ...........॥".

ఈయన బిరుదావళి యంతయు పై పద్యములందు స్పష్టముగనున్నది. ఇందు గొన్ని బిరుదులు పారంపర్యముగను, మరికొన్ని నూతనముగను వచ్చినట్లు కన్పడుచున్నవి. ఈయనకు రామభద్రనృపాలుడను కుమారుడు జనించెను.

ఈయన యొనర్చిన యుద్ధకార్యములకు మెచ్చుకొని నరపతియనేక రత్నభూషణములను, కరితురంగాదులను బహూకరించెననియు, సింగురాజుత్తమ గుఱ్ఱముల బూన్చిన శకట మిచ్చెననియు, సౌరాష్ట్ర నృపాలుడొక రత్నహారము నిచ్చెననియు సౌగంధిక ప్రసవాప హరణములోని యీ క్రింది ద్విపద భాగము వల్ల దెలియగలదు.

"నరపతి దత్తనా — నారత్నభూష, కరి తురంగ శతాంగ — మనబాగ్యు పేర
సింధు రాజార్పిత — సింధురచిత్ర, సైంధవ బందుర — స్యందను పేర
సౌరాష్ట్ర నృపదత్త — సలలితరత్న, హారునిపేర దీ — నావను పేర॥"

ఈయనకు గల బిరుదులలో అశ్వరేవంత, రణధీరమంటా నిరాతంక మల్ల, ప్రణుత సింహలలాట, పరబలభీమ, చలమర్తివరగండ, అదవనిదుర్గ గర్వవిభాళ, హత్తుమువ్వర గండ, సూర్యాక్ష శౌర్య, గగ్గోలురాయ, మున్నగు నవి గూడ కానవచ్చుచున్నవి.

ఈతడు జయించిన అబ్దుల్ పాదుషాహసైన్యము గోల్కొండ రాజ్యమును క్రీ. శ. 1611—72 సం॥ల మధ్య పాలించిన అబ్దుల్లా కుతుబ్షా యను వానిదేగాని వేరుగాదు. వెంకటపతిరాయలవారి కాలములోనే యీ యుద్ధము జరిగియుండుట వల్ల నిది క్రీ. శ. 1611—14 సం॥ల మధ్య జరిగి యుండె ననవచ్చును. అందు చేతనీతడు దాదాపు క్రీ. శ. 1586—1614వ సం॥ల మధ్యప్రాంతమున వీరవిహారము సలిపిన యోధాగ్రేసరుడనియు దలపవచ్చును ఈ వీరాగ్రేసరుడు కవితా పోషకుడై సౌగంధిక ప్రసవాప హరణమను గ్రంథమును రచింప జేయనిచో నీ రావెళ్ళవారి చరిత్రము మనకగమ్య గోచరమై యుండును. ఈయన యాస్థానమున రత్నాకరం గోపాలకృష్ణకవి యను నతడాస్థాన కవీశ్వరుడుగా నుండెను. ఆతడే యీ గ్రంథమును రచించి యీ నృపాలునకు కృతినొసంగెను.

## రావెళ్ళ కొండ భూపాలుడు II

ఈయన రావెళ్ళ రెండవ అయ్యపనాయకుని కుమారుడు. ఇతడు చాల దయాశాలి యని కీర్తి వహించెను. యుద్ధములలో తారసిల్లి పారిపోవు శత్రు రాజులనుకూడ నీతడు తగిన మర్యాద మన్ననల జేయుచు కీర్తి వహించెనట. ఈయనకు రామభద్ర నృపాలుడు, తిమ్మభూపతి యను నిర్వురు కుమాళ్లు జనించిరి.

## రావెళ్ళ రామభద్ర నృపతి

రెండవ కొండనృపాలుని పుత్రుడగు నీతడు చాలధర్మాత్ముడనియు దన తల్లిదండ్రుల యొక్కయు తాతల యొక్కయు కీర్తి నినుమడింప జేసినట్లుగా వర్ణింపబడి యున్నాడు, గాని యీతని చారిత్రక విశేషములు దెలియుటలేదు.

## రావెళ్ళ తిమ్మ భూపాలుడు

ఈయన రామభద్ర నృపతికి సోదరుడు. ఈయనకు చౌషష్టి విద్యల యందు ప్రవీణత గలదనియు, మిక్కిలి వీరాగ్రేసరుడనియు సౌగంధికప్రసవాప హరణములోని యీ క్రింది ద్విపదవల్ల తెలియుచున్నది.

"ఆరామభద్ర నా-యక సహోదరుడు, సార బలోద్దండ-సాహసాంకుండు
హారచౌషష్టి వి - ద్యా ప్రవీణుండు, ఘోర మహారి సం-కుల ఖేదనుండు
ధీయుండు తిమ్మ ధా - త్రీ కళత్రుండు, ధాయుచే వెలసె స-త్కృపులు నుతింప॥"

ఈయన పెనుగొండ రాజధానిగా నేలిన శ్రీరంగరాయల సామంతుడై యుండును.

## ఉదయగిరిపాలన—రావెల కోనేటి చినతిమ్మానాయుడు

ఈయన ఉదయగిరిసీమ పాలకుడుగా శా. శ. 1504వ (క్రీ. శ. 1582వ) సం॥ర ప్రాంతములో నుండెను. ఈయన తండ్రి పేరు తిరుమలయ్య. తాత రావెలకొంటి నాయకుడు. ఈతడు కోవూరు తాలూకా విడవలూరు గ్రామములో పోలేరమ్మమిట్టపై వ్రాయించిన శాసనమును బట్టి చూడగా, నితడు నూటుకుంటల భూమిని దానమొనర్చినట్లు కనుపడును *1. ఈయన తండ్రి తాతలు కూడ ఉదయగిరిసీమను పాలించుచు వచ్చినట్లు తోచుచున్నది. ఇతడుగూడ మొదటి శ్రీరంగరాయల సామంతుడై యుండును.

## పొదిలిసీమపాలన—రావెల తిరుమలనాయనింగారు

ఈయన క్రీ. శ. 1575 వ సం॥ర ప్రాంతములో పొదిలిసీమలో నొక పాలకుడుగా నుండెను. ఈయన తండ్రిపేరు తిప్పానాయనింగారు. ఈ తిప్పా నాయనింగారు మఱియొక తిప్పానాయని కుమారుడు. ఈయన వ్రాయించిన శాసన మొకటి నెల్లూరిజిల్లా ఈగలపాడు గ్రామములో నున్నది. ఈయనగూడ శ్రీరంగరాయల సామంతుడుగా గన్పడుచున్నాడు. ఈయన తండ్రి తాతలుగూడ పొదిలిసీమను పాలించుచు వచ్చిరి. ఈయనకు పొదిల, తుమ్మలూరు గ్రామము

*1. N 1, n/124.

లలో నాయంకర మున్నట్లితడు వ్రాయించిన శాసనములో వ్రాయబడినది. అందుచే నిత డాకాలమున నొక సేనాధిపతి యని తలపవచ్చును. ఈయన సేనాధిపతిగా నుండుటయేగాక, నచ్చటి శ్రీ సంగమేశ్వరస్వామికి లనకు చెల్లుబడి యగుచుండిన నాయంకరములోని పుట్టెడు భూమిని దానమిచ్చి ఖ్యాతి గాంచెను *1.

## రావెళ్ళ ముద్దునాయకేంద్రుడు

ఈయన రావెళ్ళ లింగభూపాలుని సోదరుడు. ఇతడు కోటపాటి మాకావనీంద్రుని కొమార్తె యగు తిరుమలాంబను వివాహమాడెను. ఈతడును, యీతని మామగారగు మాకరాజును తంజావూరు పాలకుడగు రఘునాథ నాయకునకును గొబ్బూరి జగ్గరాజునకును తోపూరువద్ద క్రీ. శ. 1616 వ సం॥లో జరిగిన యుద్ధములో జగ్గరాజు పక్షమున నిలిచి యుద్ధమొనర్చి చివరకు యుద్ధమున నోడి పారిపోయినట్లు కనబడుచున్నది. రఘునాథాభ్యుదయ నాటకములో "పారె మాకల వెంటబడి మాకరాజు" అని వ్రాయబడినది. ఇట్టే యీ ముద్దునాయకుడను మూదన్నగూడ పారిపోయెనని వ్రాయబడినది. ఈ విషయము తంజావూరు ఆంధ్రనాయక చరిత్రలోనున్నది. ఈయనకు వెంగభూపాలు డను కుమారుడు జన్మించెను.

## రావెళ్ళ వెంగభూపాలుడు

ముద్దునాయకేంద్రుని పుత్రుడగు నీ వెంగభూపాలుడు వెంకటపతినాయకుని గూడ ప్రసిద్ధినందెను. ఈయన చౌషష్టి విద్యలయందు ప్రవీణుడు. ఈయన పెనుగొండ రాజధానిగా నేలిన రెండవ వెంకటపతిరాయల సామంతులలో నొకడుగా గన్పడుచున్నాడు. ఈయన దేవతాభక్తి తత్పరుడు. ఈయనవద్ద రావుల వెంగళప్పయను నత డొక సామంతుడుగా నుండెను. వీరన్న కనుపూరను గ్రామము నితడు రావుల వెంగళప్పకు అమరం క్రింద నియ్యగా, నతడా గ్రామ సుంకముల నచటి శ్రీ విశ్వేశ్వరస్వామికి దానమిచ్చి శా. శ. 1538 వ సం॥లో శాసనము వ్రాయించెను *. ఈతడుగూడ తన తండ్రితోపాటు తోపూరు

---

*1. N I. P/19

* N. I. n/130.

యుద్ధమున బాల్గొని రఘునాథనాయకుని సైన్యములచే నోడింపబడెనని విజయ నగర చరిత్రాధారములను గ్రంథము (పుటలు 249—290) వల్ల దెలియు చున్నది.

## రావెల వెలిగొండ వెంకటాద్రి

ఈయనగూడ నొక యోధాగ్రేసరుడు. క్రీ. శ. 1616 వ సం॥ర ప్రాంతీ యుడు. తంజావూరు నాయకరాజులు పాలించిన కాలములో నిత డొక యుద్ధ మున మట్ల అనంతభూపాలు నెదిర్చి తన పరాక్రమమును గన్పరచి తుద కారణ రంగమున వీరస్వర్గ మలంకరించినట్లు విజయనగర చరిత్రాధారము లను గ్రంథము (పుటలు 240—290) వల్ల దెలియుచున్నది.

## రావెళ్ళ పాపారాయనింగారు.

ఈయన క్రీ. శ. 1660 వ సం॥ర ప్రాంతీయుడు. ఆ కాలమునను నారికట్లసముతు మహమ్మదీయ పాలనక్రిందికి వచ్చెను. అప్పుడు గోల్కొం డను నవాబు అబ్దుల్లాకుతుబ్షా యను నతడు పాలించు చుండెను. అతని తాబే దారులలో నొకడగు హజరత్ షేకు నాంకానుసాహెదా రికట్ల ప్రాంతమునకు పాలకుడయ్యెను. అతని వద్ద నీ రావెళ్ళ పాపారాయనింగా రొక యిజారా దారుగా పేరు వహించి యా సమితిలోని బడుగులేరను గ్రామమును కొని యందలి 45 కుచ్చెళ్ళ భూమి నొక కంద్రెకగాజేసి, దానికి పట్టాభిరామపురమని పేరుబెట్టి, అగ్రహారముజేసి, దానిని శా. శ. 1582 వ సం॥లో చంద్రగ్రహణ కాలమున శ్రీవేంకటాచలపతిస్వామి కర్పించి శాసనము వ్రాయించి కీర్తిజెందెను.

## రావులవారు — రావుల వెంగళప్ప

వల్లుట్ల గోత్రికులగు రావెళ్ళవారి వృత్తాంత మింతవరకు దెలుపబడినది. రావులవారను పేరుగలవారు లోకపాలగోత్రికులుగా కమ్మవారిలో ప్రసిద్ధికి వచ్చిరి. క్రీ. శ. 1617 వ సం॥ర ప్రాంతములో రావుల వెంగళప్ప యను నతడీవంశమున ప్రసిద్ధికివచ్చి రావెల వెంకటపతినాయనింగారికి సామంతుడుగా నుండెను. ఈ వెంగళప్ప తండ్రిపేరు వెంకటప్ప. రాత వెంగళప్ప. రావెల వెంకటపతినాయనింగారీయనకు నెల్లూరిజిల్లాలోని వీరన్నకనుపూరను

గ్రామమును అమరంగా నొసంగెను. ఇతడా గ్రామపాలకత్వము వహించుటయే గాక శా. శ. 1538 వ సం॥లో నా గ్రామసుంకముల నచటి విశ్వేశ్వర స్వామికి దానమిచ్చి యొక శాసనము వ్రాయించి కీర్తివహించెను.

## సర్వేపల్లిసీమపాలన – రావెళ్ల వేంకటాద్రి.

ఈయన క్రీ. శ. 1645 వ సం॥ర ప్రాంతపువాడు. ఇతడు రావెళ్ళ ముద్దుకృష్ణప్పనాయనింగారికి సామంతుడుగా పనిచేయు చుండెను. అందుచే నీయనకు నెల్లూరి జిల్లాలోని సర్వేపల్లిసీమ యందలి కోడూరు గ్రామము సమర ముగానొసంగబడెను. ఈతడా గ్రామమున నొక ధర్మ చెఱువును త్రవ్వించి శాస నము వ్రాయించి ప్రసిద్ధికి వచ్చెను*1. ఇంక నీతని శాసనములు నారికేళ్ళపల్లి, మడపనూరను గ్రామములలో గలవు.

## నల్లా గురవయ్య.

ఈయన శా. శ. 1539 వ సం॥ర ప్రాంతీయుడగు ప్రసిద్ధపురుషుడు. ఈయిన వేలూరువద్ద గల బావాజికొండపై గల దేవాలయములలో గొన్ని దాన ములొసర్చి నాలుగు తెలుగు శాసనములు వ్రాయించెను. ఆ శాసనములన్నియు శిథిలావస్థలో నున్నందున నత డెట్టికార్యము లొనర్చెనో తెలియుటకు వీలు లేకున్నది. ఈ శాసనములు పింగళి సంవత్సరము శా. శ. 1539 వ సం॥లో వ్రాయబడినవి*2. రాయవేలూరులో నితడు ప్రసిద్ధుడుగా నున్నట్లు పై శాసన ములను బట్టి మనము గ్రహింపవచ్చును.

## కొండవీడు పాలకుడు వాసిరెడ్డి మల్లికార్జునుడు.

కొండవీటిసీమను కృష్ణదేవరాయల కాలములో పాలించినది వాసిరెడ్డి మల్లప్రభువు. కృష్ణాతీరమున కొండవీటిలో నితడొక దక్షుడైన పాలకుడుగా చాటువులందున్నది. ఈయన పాలించు ప్రదేశమును మహమ్మదీయు లాక్ర మించుటకురాగా, (అచ్యుత) రాయలవారు రావెళ్ళ వీరమల్లానాయని సైన్యము లతో బంపిరి గాని యా యుద్ధములో నతడు చనిపోవుటయు, నీతడును, మహమ్మ

---

*1. N 1. n/33 *2. S 1. 1 Vol. 1. పుట 76.

దీయ సేనాధిపతియగు హైదరుజంగునుగూడ మరణించుటయు సంభవించెనట. 1529 ప్రాంతమున నీయుద్ధము కుతుబ్షా సైనికులకు వీరికి జరిగియుండును *.

## దూపాటిసీమ పాలన

## సాయపనేని సాయపనాయడు, వెంకటాద్రిలు.

ఈ సీమలో 533 గ్రామము లుండెనని లోకలురికార్డు వాల్యూం 33 ని బట్టి తెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు పాలించు కాలములో నీసీమను సాయపనేని సాయపనాయడు పాలించెను. ఇతడు 20 సం॥లు పాలించినట్లు చెప్పబడినది. గాని ఈతని కాలవిశేషములు తెలియవు. విజయనగరపు యుద్ధపాళెములు 77లో సాయపనేనివారి దొకటి. దీనికి 280 గుంటల వైశాల్యము గల ప్రదేశము కేటాయింపబడియుండేది.

1564 ప్రాంతమున అళియరామరాయలు విజయనగర సామ్రాజ్యాధీశ్వరుడైయుండగా నీసీమను సాయపనేని గంగపనాయడు పాలించుచుండెను. దాదాపు 1589 నుండి యీయన కుమారుడగు వేంకటాద్రి రెండవ వేంకటపతి రాయలవారి సామంతుడుగా పాలించెను. ఈ కాలపు విశేషములు తెలియవు.

## సూర్యదేవరవారు

సూర్యదేవరవారు క్రీ.శ. 1500 ప్రాంతము నుండియు పులువర్రుసీమ 50 గ్రామములకుపాలకులుగా నున్నట్లు కనబడుచున్నది. ఇది ఇప్పటి రేవల్లెతాలూకాలోనిది. వీరు తెలుగుచోడశాఖీయులని లోగడ దెలిపితిమి. ఈవంశీయులకు "ఒరయూరి పురవిహార, ఒరయూరి శ్రీపాదపద్మారాధక, పులియతలాటరాయ, గండభేరుండ, పులియమార్కోలుగండ, గండరగండ, కరవాలభైరవ, రాజీవచూఱకార, విశాఖపట్టణ తలగుండుగండర, కటకహన్నిబ్బరగండ, సప్తదివిచూఱకార, కదనప్రసంగ" మున్నగు బిరుదములున్నట్లు కొన్ని చాటువులు తెలుపుచున్నవి. వీరికి వెండికోర తాంబూలమును, పమిడికోరశాసయు, కనకదండ అందలము, హనుమంతుని ధ్వజమును గల్గియుండు మర్యాద యుండెడిదట.

---

* వాసిరెడ్డి వంశ చరిత్రము.

వీరిది వివృర్ల గోత్రము. పులివఱ్ఱుసీమ వీరి పాలనములో వృద్ధినొందెను. ఇది సముతు అని లోకలురికార్డు నుడువుచున్నది.

## సూర్యదేవర తిమ్మనృపాలుడు.

ఈతడు పులివఱ్ఱుసీమనేల్చుచు నందు రాచూరు, పేటేరుకోటలనుగట్టించినట్లు చాటువులు తెలుపుచున్నవి *1. ఈయన కుమారుడగు ముసలయ నాయకుడు కృష్ణదేవరాయలు గజపతులతో బోరాడిన కాలములో జరిగిన ఆరట్లకోట యుద్ధములో బాల్గొనినట్లొకచాటువు చెప్పుచుండుటవల్ల నితడు దాదాపు క్రీ. శ. 1490వ సం॥ర ప్రాంతీయుడని చెప్పవచ్చును*2. ఈ వంశీకులలో గొందఱు వీరాగ్రేసరులు అత్తలూరు బయలున జరిపిన యుద్ధములో గజపతుల యేనుగులతో దలపడి పోరిరనియు, నాపోరాటము యేడుపగళ్ళు జరిగెననియు, నందు జయించినందుననే పైన నుడివిన మర్యాదలు శ్రీకృష్ణదేవరాయ లొసంగినట్టును వారి ప్రాశస్తివలన దెలియబడుచున్నది. వీరి బిరుదములలో 'విశాఖపట్టణ తలగుండు గండర" యుండుటచే* వీరు గజపతితో బోరాడుటకై యా ప్రాంతముల కేగినట్లు స్పష్టపడుచున్నది. తిమ్మనృపాలుడుగూడ పైయుద్ధములలో నుండి యుండును. ఈయనకు యెఱ్ఱనృపాలుడు, ముసలయనాయకుడను నిర్వురు కుమాళ్ళు గలరు. కొందఱు యెఱ్ఱభూపాలు డీతని సోదరుడని తలంచుచున్నారు. తిమ్మనృపాలుడు వీరనరసింహదేవరాయల సామంతుడై యుండును. ఈయన పైబిరుదుల గొన్నింటిని వహించినట్లు కనబడుచున్నది.

## సూర్యదేవర యెఱ్ఱనృపాలుడు

తిమ్మభూపతి తర్వాత పులివర్తిసీమ కితడే పాలకుడయ్యెను. ఆయన వలెనే యీతడుగూడ మిక్కిలి పరాక్రమశాలియై యుండెను. ఈయన తిమ్మనృపాలుడు ధరించిన బిరుదుల నన్నింటిని ధరించెను. ఈ వంశీకులకుగల

---

*1. "పులివర్తిసీమకు -భూపతిత్వమునంది । మేటి వదాన్యులై మించినారు"
పేటేరు రాచూరు - కోటలు గట్టించి । శత్రురాజులచేత-శరణు గాంచు.

*2. "గండరగండ నీ-ఘని తురంగమునెక్కి । ఆరట్లకోట పో-రాడునాడు."

*ఈ వంశప్రాశస్తికి కమ్మ మహారాజు పత్రిక 2-4-37 చూడుడు.

బిరుదులలో "నడుమ నీ పెక్కండ్రునాయకుల నక్కొత్తురగండ, మహిమతో ఘోడికరవాల భైరవ, దుష్టగోపగోగులమారిమర్దన, దర్పితారాతిధూమకేతి, హిత హేతి" మున్నగునవిగూడ గలవట.

ఈయన పేరిట గల యొక చాటు వీక్రింది విధమున నున్నది :

"సీ॥ కల్పాంతరస్థాయి - గండభేరుండాంక, పటుఖర కరవాల - భైరవాంక
కుశలంబు విప్పర్ల-గోత్రాబ్ధి హిమధామ, శ్రీలందు-పులియామా-ర్కొలుగండ
వినుత సత్కీర్తిచే- వెలయు గండరగండ. శుభమస్తు రాజీవ-చూఱకార
కొమరొప్ప నభిమాన - ఘోడియ బిరుదాంక, లాలిత పులియతలాటరాయ
గీ॥ అనుచు నిన్నును భాషింతు-రర్థివరులు, పటువచోరూఢి నఖిలభూ-పాల సభల
భూరిగుణహార యొరయూరి - పురవిహార, భళిర సూర్యదేవర తిమ్మ -
ప్రభునియెఱ్ఱి."

## సూర్యదేవర ముసలయనాయకుడు

ఈయన సూర్యదేవర తిమ్మనృపాలుని పుత్రుడు. ఎఱ్ఱనృపాలుని యనంతర మితడు పులివర్తిసీమకు పాలకుడయ్యెను. ఇతడు ఆరట్ల కోటవద్ద జరిగిన యుద్ధములో బాల్గొని శత్రువులను బారద్రోలి తనః పరాక్రమమును గను పఱచెనని యీక్రింది చాటుపద్యము తెలుపుచున్నది.

"సీ॥ గండరగండ నీ-మనతురంగమునెక్కి, ఆరట్లకోట పో-రాడునాఁడు
కరవాల భైరవ-కైవాలు ఝుళిపింప, భీతిని పగతురు - బెదిరి చనిరి
పులియతలాటంక , జెలఁగి బల్లెంబెత్త, శరణంచు రిపులు హ-స్తమ్ము లెత్త
విప్పర్ల సింహంబు - విల్లు చేబూనిన, నరివర్గములగుండె-లదరుచుండు.
గీ॥ నేర్చిననారలో కాకున్న-నిన్ను గదిసి, భుజసమగ్రత నెదిరించి-పోరదరమె
ప్రధననిశ్శంక సూర్యదే-వరశశాంక, తిమ్మభూపాల సత్పుత్ర-ధీపవిత్ర
నయ గుణోపేంద్ర ముసలయ - నాయకేంద్ర."

ఈ తిమ్మ భూపాలుడును, యెఱ్ఱనృపతి వహించిన బిరుదముల నన్నింటిని ధరించెను. ఈయన కృష్ణదేవరాయల పాలన కాలములోనివాడుగా గన్పడు చున్నాడు. అందుచే నితడు క్రీ. శ. 1520 వ సం॥ర ప్రాంతమువాడన

వచ్చును. ఈయన యుద్ధమొనర్చిన ఆరట్లకోట యుద్ధము గజపతులకును, కృష్ణదేవరాయలకును జరిగినదై యున్నది. (L. R. 3 — ఆరట్లకోట కయఫీతు) అల్లసాని పెద్దనమహాకవి రచితమైన యొక చాటువుసంగూడ నీ యుద్ధమును గురించిన ప్రశంస గలదు. ఆ పద్యమిట్లున్నది.

"సీ॥ రాయరావుతుగండ - రాచయేనుఁగువచ్చి, యారట్లకోట గో - రాడునాఁడు
సంపెట నరపాల - సార్వభౌముఁడు వచ్చి, సింహాద్రిజయశిల-జేర్చునాఁడు
వెలగోలు సింహంబు - చేరి దిక్కృతిఁగంచు, తల్పులగరుల డీ-కొల్పునాఁడు
మనతర నిర్భర-గంధపెండెర మిచ్చి, కూతురాయలకును-గూర్చునాఁడు

గీ॥ ఒడ లెఱుంగవొ చచ్చితో - యుర్విలేవొ, చేరజాలక, తలచెడి-జీర్ణమైతొ
కన్నడంబెట్టు సొచ్చెదు-గజపతీంద్ర, తెఱచి నిలు కుక్కసొచ్చిన - తెఱఁగు
దోప".

ఈ వంశీకుల తర్వాత విషయము కొంతకాలము వరకు దెలియుటలేదు. కాని లోకలు రికార్డు, సంపుటము 41 పుట 471లో నీ వంశములోని నరసింహ నృపాలుడు (చివరివాడు) పులిపట్టు సముతు 50 గ్రామములకు చౌదరీ తనము చేయుచూ వచ్చినట్లుగలదు. లోకల్ రికార్డును విశ్వసించినచో, మొగలు ప్రభుత్వ కాలములో నేర్పడిన చౌదరితనము దాదాపు క్రీ. శ. 1600 వ సం॥ర ప్రాంతముదై యుండి యా శతాబ్దినే యీ నృపాలుని పాలన జరిగియుండును.

క్రీ. శ. 1600వ సంవత్సరము నాటికీ పులివట్టుసీమ రాచూరుకోట సహా వెలమ ప్రభువులకు జేరిపోయినట్లు కనబడుచున్నది. ఇది 1565 తర్వాత నయ్యెను. ఈ రాచూరుకోటలో సూర్యదేవరవారి బురుజొకటి యుండెననియు, దానినిటీవల ప్రాంత జమీందారులు త్రవ్వించి వేసినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1690 వ సం॥లో ఔరంగజేబు చక్రవర్తి ఢిల్లీసామ్రాజ్యమును బాలించుచుండగా, హైదరాబాదులో నాతని సేనాధిపతులగు రోహల్లాఖాను, ఖసరత్ ఖానను వారలు మూర్తి జాన్నగ రనబడు కొండవీటిసీమ పాలనమంతయు వెలమప్రభువగు మాణిక్యారావు రామారావుగారి కొసంగినట్లొక ఫర్మానా యుండెనని కృష్ణాజిల్లా మ్యాన్యూలులో గలదు. అందుచే సూర్యదేవర ప్రభువులపాలన మీ పులివట్టు సీమలో తళ్ళికోట యుద్ధానంతరం ముగిసెననవచ్చును (L. R. Vol. V). కాని

కృష్ణాజిల్లా మ్యాన్యూలులో కృష్ణదేవరాయల కాలమునుండియు మాణిక్యారావు వంశీకులే పాలించుచున్నారని చెప్పుచున్నట్లు వ్రాయబడినది. ఇది పైన నుడివిన చరిత్రకు భిన్నముగ నుండుటచే విశ్వసించుటకు వీలుగాదు. దీనిని మాణిక్యరావు తిరుమలనాయనికి కుతుబ్షా యిచ్చినట్లున్నది. (రేపల్లి కైఫీతు. **L. R. Vol. V**), ఇది 1565 తర్వాతయే.

## కొందరు ప్రముఖులు

ఏనుగుల చన్నానాయఁడు : పెమ్మసాని తిమ్మనాయని బంధుగుఁడు. 1530 ప్రాంతీయుఁడు. ఇతఁడు గాండ్లపాడనే గ్రామం కట్టించి, యొక దేవళము నిర్మించెను. వల్లావారిపల్లె యొకటిగూడ నిర్మించెను. (తాడిపత్రి కైఫీయతు).

కిలారి తల్లయ్య : 1544 ప్రాంతీయుఁడు. కావలితాలూకా వక్కిలగుంట, రావులగుంటలకు అధికారి. అచటి దేవునకు రెండుగ్రామములు కలిసి 10 గొర్ల చేను దానమిచ్చి పేరొందెను. (**N. I. K.** 25)

## అమ్మనబ్రోలుసీమ పాలన

సూరనాయని తిమ్మరుసయ్య : 1511 ప్రాంతీయుఁడు. అమ్మనబ్రోలు సీమలో కొచ్చర్లకోట, గోనుగుంట్ల మున్నగు గ్రామము లీయన నాయంకరము క్రింద నుండెను. ఇతఁడిచట పాలకుఁడు. కృష్ణదేవరాయల కాలమువాఁడు. గోనుగుంటలో అమరేశ్వరస్వామికి భూదానమిచ్చి శాసనము వ్రాయించెను *1.

కూరపాటి గోపినీఁడు : 1553 ప్రాంతీయుఁడు. పలనాఁడు తాలూకా దుర్గి వాస్తవ్యుఁడు. తండ్రి మాదయ్య. ఇతఁడచటి వంకేశ్వరాలయ స్తంభములను పునర్నిర్మించి పేరొందెను *2. ఈతఁడచట పద్యశాసనము లిఖించెను.

కూరపాటి అయ్యపనాయఁడు : కృష్ణదేవరాయల పాళెగాండ్లలోనొకఁడు. ఇతఁడు పరివారముతో వచ్చినపుడు రాజధానిలో నుండుటకు 310 కుంటల ప్రదేశ ముండెను. ఈతని విశేషములు దెలియవు. యుద్ధములలో నితఁడుగూడ పాల్గొని యుండును.

---

*1. **N.I.G.** 46. *2. శాసన పద్యమంజరి.

చల్లా వీరమనాయడు : సాళువ నరసింహరాయల పాలనలో నాతని సామంతులలోని జగతాపి కంచిరాజువద్ద నొక యధికారిగా నుండి 1456 లో అచటి చెన్నరాయస్వామికి భూదానమిచ్చెను *1.

యెనుముల తిమ్మానాయడు · 1517 ప్రాంతీయుడు. తండ్రి పేరు నారప్ప నాయడు. పగడాలకోటదగ్గిర హనుమంతాలయమున నొక శాసనము వ్రాసెను. బెజవాడ మల్లికార్జునస్వామికి భూదానమిచ్చెను. పగడాల దేవుని భూములను సర్వమాన్యముచేసెను. తెనాలి తాలూకా లంగిలకుదుదు గ్రామంలో గోపీనాధ స్వామికి భూదానమిచ్చి శాసనము వ్రాసెను. ఇతడు శ్రీ కృష్ణదేవరాయల కార్య కర్తలలో నొకడుగా గన్పడుచున్నాడు *2.

పదలవాడ రామానాయడు : 1521 ప్రాంతీయుడు. వేల్పూరు వాస్తవ్యుడు. అచటి రామేశ్వరునకు ఆలయము కట్టించి కొంత భూమినిచ్చి శాసనము వ్రాసెను *3.

లన్నమనేని చినతిమ్మయ్య : మోసల గ్రామములో కేరపరపు కోట గోపాలస్వామి కితడు భూదానమిచ్చి 1521వ సం॥లో పేర్గాంచెను *4.

ఉప్పలపాటి తిమ్మానాయడు : 1530 ప్రాంతీయుడు. ఇతడుభట్టిప్రోలు ప్రాంతమున నొక యధికారిగానుండి యా సంవత్సర మొక దాన శాసనము వ్రాసెను *5.

చిరుమామిళ్ళ పెద్దననృపాలుడు : ఈయన శ్రీ కృష్ణదేవరాయల వద్ద గజసైన్యాధికారిగా నుండి యాయనచే మన్ననలందుచు వచ్చెను. ఈ విషయ మీ వంశములోని పాపయ్య వ్రాయించిన శకుంతలా పరిణయములో నీ క్రింది పద్యములలో చెప్పబడినది.

కం॥ పెద్దనగారావేలుపు - బెద్దనగారాతిభాతి ధృతవైభవుఁడై
పెద్దనగారాశూరుల - పెద్దనఁగారాచ మెచ్చ బిరుదముదెచ్చెన్

---

*1. L R. Vol. 18 *2. L.R. Vol 15 of 16 & A.R. No. 634 of ?1
*3 A R,No. 573 of 15. *4 L R. Vol. 12. *5 L R. Vol 14.

ఉ॥ సన్నుత కృష్ణరాయ నృపసత్తము చిత్తము రాఁజరించుచున్
మన్ననమీరి భూరి బహుమానముగా గజరాజరాజిఁ గై
కొన్న ఘనుండు పైడికులగోత్ర పవిత్రచరిత్రుడౌర పె
ద్దన్న సిరుల్ పరుల్ పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగన్.

ఈయన యౌదార్య పరాక్రమాదులు కవి యిట్లు వర్ణించుచున్నాడు.

సీ॥ మహిమ నేటూరి యిమ్మడి తిర్మలకుమార సింగరార్యుల ప్రియశిష్యుడగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనశక్తి గల్గి శౌర్యౌదార్య కలితుడగుచు
రాయల రాజకార్యములందు నిరతుఁడై ప్రాజ్యసామ్రాజ్య సంభరితుడగుచు
ధనధాన్యకటకమై తనయిల్లు వర్ధిల్ల ధాత్రీసురాత్రాణ దక్షుఁడగుచు

గీ॥ నవని తవణించె రవణిహృద్యానవద్య పద్య గద్యావళీస్తవ్య భవ్య నవ్య
కావ్యసంభావ్య భీమసంగ్రామ విజయ బిరుదుఁడగు చిరుమామిళ్ళ పెద్దశౌరి

ఈయన కుమారుడు తిమ్మనృపాలుడు. ఈయనగూడ పరాక్రమవంతుడు. శకుంతలాపరిణయమున నీతడిట్లు చెప్పబడినాడు.

"ధరాధరాధరాహివర్య ధైర్యధుర్యవిట్కుర
స్ఫురత్తశ త్తశప్రభా ప్రధూతశాతహేతిచే
విరోధిరాడ్విరోధి రాజి వీర్రిల హోశిసల్పనౌ
స్థిరామరామరాగుఁడైన తిమ్మభూవిభుండనిన్".

ఈ వంశీకులు వాసిరెడ్డి ప్రభువులకు బంధువులై కొండవీటిసీమలోనుండిరి.

పెమ్మసాని కొండయ్యనాయడు : 1587 ప్రాంతీయుడు. ఉప్పలపాటి పాలకుడు. అచటి పిడికిటి మాదినేడనే కమ్మకులస్థుడు చెరువు త్రవ్వించగా దానికి గొంత భూదానమిచ్చెను. ఈయన తండ్రి పెగతినీడు.

పిడికిటి మాదినీడు : ఉప్పలపాటి వాస్తవ్యుడు. తండ్రిముమ్మయ్య. తాత మాదినేడు. మాదినేడు చెరువును త్రవ్వించి శాసనము వ్రాయించెను *1.

గింజపల్లి అన్నమనాయడు, అబ్బినాయడులు : గుంటూరు జిల్లాలోని ప్రత్తిపాడు వాస్తవ్యులు. 1528 ప్రాంతీయులు. వీరితండ్రి పోలినీడు.

---

*1. A.R. No 341 of 32-33.

అన్నమనాయడచట గండేశ్వరదేవాలయము గట్టించగా సోదరుడు ముఖమంటపము గట్టించెను. అది దానోజను సుతారి కట్టెను *1.

రావి కొండానాయనింగారు, రామినాయనింగారు : ఒంగోలు ప్రాంత పాలకులు. సదాశివరాయల కాలములో వీరు ఒంగోలు ప్రాంతమున అధికారులుగానుండి, పొందూరు గ్రామ మచటి తిరువెంగళదేవునికి దానమిచ్చి శాసనము లిఖించిరి. ఈ దానము తాళ్ళపాక తిరుమలయ్యగారికి పుణ్యముసకై చేసిరి. ఈతడు వీరికి గురువుగా కనబడుచున్నాడు *2.

గోళ్ళ చినరామ, పెదరామనృపాలుడు : సన్నెనందల్, చంద్రగిరి పాలకులు. వీరిద్దరును అచ్యుత దేవరాయల కాలములోని సామంతులు. సన్నెనందల్ పురాధ్యక్షులు. తిరుప్పత్తూరుసీమ వీరి పాలనలో నుండెను. పెదరామప్ప యొకగ్రామము దేవునికిచ్చెను. వీరికి 'ఉపనూరిసింహ, కొదమనాయంకరగండ, స్వామిద్రోహరగండ' బిరుదములున్నవి. పచ్చకప్పు రపు తిరువెంగళకవి యను భట్రాజుచే వీరు 'చొక్కనాథచరిత్ర' మను ద్విపద కావ్యమును రచింపజేసిరి. దీనికి పెదరాము నృపాలుడు కృతిభర్తయయ్యెను. ఇది యేడాశ్వాసముల గ్రంధము. ఇందలి చిన రామప్పయు, పెదతిమ్మప్పయను వారలు చంద్రగిరి రాజ్యపాలకులుగా తర్వాత నియోగింపబడగా వారచట తిరుపతి వెంకటేశ్వరస్వామికి 15 వేల ఫణములను తిరువీధి యుత్సవములకై యొసంగి శాసనము వ్రాయించిరి. ఇది 31-12-1540 తేదీ జరిగెను *3. చొక్కనాథ చరిత్ర మిటీవల ప్రకటితమయ్యెను. అందలి యీ క్రింది భాగములు గమనీయములు.

"అరుణాచలేంద్ర పూజామోదవిభవ, దరమించు సన్నెనందలి పురాధ్యక్ష
ప్రియబంధువనచైత్ర పిప్పాలగోత్ర, దయ సత్య దాక్షిణ్య ధర్మస్వరూప
తగమించు వ్యాసతీర్థ ప్రియశిష్య, సుగుణాఢ్య పరసతీసోదరచరిత
అయతోన్నతశౌర్యు డచ్యుతదేవ, రాయప్రతాప కార్యధురంధరుండ
అంచిత కొదమనాయంకరగండ, మించివర్తించు స్వామిద్రోహగండ
చేకొన్న నుపనూరి సింహధ్వజాంక, వాకిట చిన్న భూవరసహితుండ

*1. A.R. No. 142 & 143 of 17 & L.R. Vol. 15. *2. N I.O/113.

*3. A.R.T.T.P. 244 & భారతి విరోధి సం॥ర ఆషాఢము.

బసవభూవర తపఃఫల సత్కుమార, పసుపగద్దెసె కమ్మవంశ వర్ధనుత
బాగొప్ప దివ్యమాంబాదలిగర్భ, సాగరసంభవ సంపూర్ణచంద్ర
చిరకీర్తియుతుఁడైన పెన్నరామప్ప, పురుషరత్నంబని పొగడంగ వెలసి
లలితకీర్త్యభిరామ నామన్యహోమ, పెదతిప్ప పెదరాజ విభవపుత్రాఖ్య
నరనాథ శ్రీచొక్కనామ సత్కృపను, దరయేలుమా చంద్రతారార్కముగను".

పెదరామనృపతికి "అచ్యుతదేవరాయ లప్రతాప దక్షిణ బాహుదండాంకుడ"ను బిరుదుగూడ యున్నది.

గ్రంథకర్త తాతయగు పచ్చకప్పురపు తిమ్మరాజును అతని సోదరుడగు అయ్యలరాజును విద్యావిశారదులై యుండి ప్రౌఢదేవరాయలచేత పచ్చకప్పురపు రాజని పేరొందిరట. తిమ్మరాజునకు తిప్పరాజును అతనికి గ్రంథకర్తయు జనించిరి.

## కొందరు కార్యకర్తలు

కమ్మవారిలో నీక్రింది కార్యకర్తలాకాలమున నుండిరి.

పచ్చా నైనారయ్య : 1536సం॥ర ప్రాంతీయుడు. అచ్యుతరాయల కాలములో పెద్దవటంసీమ పాలకుడగు సలకరాజు పినతిరుమలయ్య దేవరాజువద్ద నుండిన యొక కార్యకర్త. పాణ్యంలో మల్లిఖార్జునస్వామి యాలయమువద్ద యజ్ఞశాలామండపము, ధ్వజస్తంభము నిర్మాణమొనర్చి బంగారుపూత వేయించెను. గుండ్లమడ అగ్రహారములోని దేవాలయమువద్ద నొక ధ్వజము వేయించెను.
(L. R. Vol. 6)

గొడుగు భూమానాయుడు : 1520 ప్రాంతీయుడు. శ్రీకృష్ణదేవరాయలకు శ్వేతచ్ఛత్రముబట్టు నొక యుద్యోగి. భూమేపల్లిని యేకభోగ సర్వమాన్యముగా నిచ్చి పేరొందెను.

(కవిజీవితములు)

గొడుగు పాపినాయుడు : 1538 ప్రాంతీయుడు. అచ్యుతదేవరాయల సామంతుడగు సలకరాజు పెదతిరుమలయ్య దేవరాజు కార్యకర్త. చెన్నూరిసీమ పాలకత్వము సల్పెను. 'స్వామిద్రోహరగండ' బిరుదము కలవాడు. నములుపాకలో కేశవాలయము నిర్మించి బావి, వనములువేయించి, యల్లమాంబాపురి నిర్మించి పేరొందెను. (R. L Vol. 14)

వేముల చన్నమయ్య సదాశివరాయల కాలములోనుండిన మహామండలేశ్వర తిమ్మరాజు కొడుకు పాపతిమ్మరాజువద్ద కార్యకర్త. తండ్రి వరదరాజు. తాత చెన్నమయ్య. ముత్తాత కూర్మయ్య. 1551 సం॥లో గుండ్లకుంట గ్రామములో నొక భూదానమిచ్చెను.

**(A. R. No. 360 of 32 33)**

దేవాభక్తుని కొండయ్య : 1553 ప్రాంతీయుడు. చేబ్రోలు వాస్తవ్యుడు. అచటి యధికారి. ఇతడచట కుమారస్వామి దేవళము కట్టించి పేరొందెను*1.

యేనుగుల కేశవనాయుడు : 1557 సం॥ర ప్రాంతీయుడు. సదాశివరాయలవారి కాలమున గుత్తిసీమపాలకుడైన మహామండలేశ్వర రామరాజ తిరుమల దేవరాజయ్యవద్ద కార్యకర్త. తండ్రి తిమ్మనాయుడు. కోడూరిలోని చెన్నరాయస్వామి కితడొక దానమిచ్చినట్లు కనబడుచున్నది. (**L. R. Vol.** 37)

అబ్బినేని వెంకన్న : క్రీ. శ. 1548 సం॥ర ప్రాంతీయుడు. మహామండలేశ్వర రామరాజు తిమ్మయదేవరాజు (ఉదయగిరి) కార్యకర్తలలో నొకడుగా నీతడు ప్రసిద్ధివహించెను. గూడూరు తాలూకా కృష్ణాపట్టణమున నీయన శాసనమొకటి కలదు.

సుంకర చెన్నరసు, పీతాంబరయ్యలు : చెన్నరసు సదాశివరాయల కాలములో ఆదవేని పాలకుడగు సిద్ధిరాజు శ్రీరంగరాయలవద్ద కెరబెళగుంట సుంకాధికారి. అచటి రాజరాజేశ్వరదేవుని అమృతపడికు దానమొసంగెను. పీతాంబరయ్యగూడ యాదేవునికి నందదీపారాధనకు నూనెకై దానమిచ్చెను. వీరివ్వురును 1560 ప్రాంతీయులు. (**L. R. Vol.** 23)

కంబాలపాటి మాదానాయుడు : యెర్రగుడి గ్రామ వాస్తవ్యుడు. 1565 లో నచటి రామేశ్వరస్వామి కితడు భూదానమిచ్చెను. (**L.R.Vol.** 41)

పెందోటిపాలకుడు - రావెళ్ళ ముద్దుకృష్ణమనాయడు : ఈయన 1550 ప్రాంతీయుడు - పెందోటి ప్రాంత పాలకుడు - ఈయనవద్ద నియోగి బొప్పూడి

---

*1. **S. I. I Vol. VI, No.** 105

వీరమరసు ఉండి పెందోటి గ్రామ చెఱువు కుంటలు నిర్ణయించినట్లు L.R. 36 లో చెప్పబడినది. ఈయన పాలనా విశేషములు తెలియవు.

ఈ రీతిగా కమ్మరాష్ట్రములో మొదట కాపురముండిన కమ్మవారు క్రమ క్రమముగా విజయనగర రాజ్యములో దక్షిణ సముద్రము వరకును ఉద్యోగులు గను, రైతువర్గమువారుగను, సైనికులుగను వెడలి స్థావరము లేర్పరచుకొనిరి.

## కొచ్చెర్లకోటసీమపాలన - శ్రీగిరిమండలము.

రావెళ్ళ మల్లానాయడు : ఈ కమ్మనృపాలుడు 1662 ప్రాంతీయుడు- వీరప్రతాప రాయదేవరాయల సామంతుడుగా నితడు కొచ్చెర్లకోట సీమను పాలించుచువచ్చెను. ఈతడు ఆసీమలోని సింగరికొండ, బత్తెపాడు, అనే గ్రామాలు చెన్నరాయస్వామికి భూదానమిచ్చెను. ఈయన శ్రీగిరిమండల పాలకుడుగా చెప్పబడెను.
(A. R. Nos. 423 of 23, 285 of 1905 & L. R Vol. 13 P. 215)

## దూపాటిసీమపాలన.

సాయపనేని గంగప్పనాయడు : ఈతడు రెండవ వెంకటపతిరాయల వారి సామంతుడుగా దూపాటిసీమను 1614 ప్రాంతమున నేలెను. ఇతడు వేంకటాద్రి సుతుడు - గంగయ్య పౌత్రుడు. ఈయన త్రిపురాంతకదేవునికి ఆనంద సం॥రం (1614)లో గార్లదిన్నె, గుర్రపుశాల, చెన్నరాయనిపల్లె మున్నగు 4 గ్రామములను దానమిచ్చి శాసనములు వ్రాయించెను*. 1624 సం॥రంలో వీరరామదేవరాయల సామంతుడుగా సాయపనేని తిమ్మానాయడచట నుండెడివాడు. ఈతని యనుమతితో నాగిశెట్టి యనువాడు సిద్ధాపురమున గొన్ని దేవరలనుప్రతిష్ఠించి కొన్నిమాన్యములిచ్చెను. (L.R.Vol. 15; P.321)

## ఇతర ప్రముఖులు.

రావూరి చెన్నప్ప : 1574 ప్రాంతీయుడు - తండ్రి తిమ్మానాయడు. ఈవూరులో దేవునికి గొంత భూమినిచ్చి పేరొందెను. (A. R No. 533 of 14) రావూరి వెంకటాద్రినాయడు 1638 లోపసవేములలో పట్టాభిరామేశ్వరస్వామికి

---

* A. R. No. 286 of 1905 & L. R. Vol. 47.

గొంత భూమి నిచ్చెను*1. వీరిర్వురును రాయిపనేనివారి బంధుగులు. రావులనాయుడను సతడచ్యుతదేవరాయల కాలములో చెన్నూరు సీమ పాలకు డయ్యెను. (No. 303 of 35-36)

పరుచూరి పాపానాయనింగారు : పెమ్మసాని తిమ్మానాయనింగారి పౌత్రుడు, క్రోసూరు గ్రామమున నధికారము నల్పుచు నొక సంత కట్టించి, కవుళ్ళు నిర్ణయించి శాసనము వ్రాసెను*4.

గంగినేని లింగమనీడు : కొత్రపాడు కాపురస్థుడు. కాలము తెలియదు. అవట నొక చెర్వు గట్టించి ప్రసిద్ధి జెందెను. (A. R. No. 280 of 32-33)

గూడూరి చెన్నమనాయడు : సదాశివరాయల కాలములో కర్నూలుసీమ పాలించిన వెంకటాద్రి దేవరాజువద్ద కార్యకర్త. 1575 లో కొందరు శిల్పులకు భూదానమిచ్చి శాసనము వ్రాసెను. (L. R. Vol. X)

యలవర్తి కొండప్ప : 1603 ప్రాంతీయుడు - తండ్రి బసివినేని - తాత తిప్పనేని. వేముల కోటలో నితడొక చెర్వుతవ్వించి శాసనమువ్రాసెను. (L R. Vol. XIII)

భండారం నాగినేని : 1609 ప్రాంతీయుడు. వెంకటపతిరాయల వారి బొక్కసం కార్యకర్త, పురటూరులో దేవునికి మంటపము కట్టించి, శిల్పికి కొంత భూమి మాన్యముగా నిచ్చెను (L. R. Vol 10)

దేవినేని కొండయ్య : 1576 ప్రాంతీయుడు. లక్కమాంబాపురమను గ్రామములో అంకాళమ్మ గుడి కట్టించి పేరొందెను. [L.R. Vol. 14]

## ఉపసంహారము

ఈ విధముగా వెంకటపతిరాయల కాలమువరకు కమ్మవారు వివిధ ప్రదేశములలో బాలించి తమ ధర్మకార్యము లొనర్చుచు, యుద్ధములందు పాల్గొనుచు ప్రసిద్ధి వహించిరి. కొండవీడు సీమ మరల 1623 ప్రాంతమున అబ్దుల్లాకుతుబ్షా

*, A. R. No. 313 of 30. *2 A. R. No. 282/32-33.

ఆక్రమింపగల్గెను. ఇది వెంకటపతిరాయల పాలన తర్వాత జరిగెను. 1649 నాటికి పెనుగొండ గూడ ఆక్రమించెను. దీనిని తిరిగి 1659లో శ్రీరంగరాయలు మరల గెల్చుకొనెను కాని గండికోట వరకు మహమ్మదీయులే ఆక్రమించిరి. గండికోటను 1652లో మోసముచే మహమ్మదీయు లాక్రమించిరి. అపుడచట పాలించుచుండిన పెమ్మసాని తిమ్మానాయనికి గుత్తిసీమ యిచ్చెదమని నమ్మించి, సేనలతో కోటనుండి బయటికి వచ్చిన తర్వాత హనుమనగుత్తి యనే ఒక గ్రామమే యిస్తామనగా దానిని తీసుకొనక నతడు ధర్మవరము ప్రాంతమునకు వెళ్ళిపోయెను *. ఈ విషయము మరియొక అధ్యాయమున జదువుదము. ఈ విజయనగర సామ్రాజ్యమున రాయలవారివలెనే కమ్మవారును దేవబ్రాహ్మణు లను, కవులను పోషించిరి. చెర్వులు త్రవ్వించిరి. మహమ్మదీయులతో అవసర మైనపుడెల్ల పోరాడుచు, దేశమును రక్షించిరి. ధైర్యముతో వలసలకు వెడలి వ్యవసాయమునుగూడ వృద్ధిజేసిరి. నేడు 1 లక్షమంది కమ్మవారు రామ్నాడు, తిరునెల్వేలి జిల్లాలలో నుండుట కిదియే కారణము. యుద్ధములుగూడ కొంతవరకు కారణమయ్యెను.

## సింహళద్వీప యుద్ధము - కమ్మవారు పాల్గొనుట మధురరాజ్య సామంతులు

కమ్మవారు దక్షిణమున కేగిన కొలదిని తంజావూరు నాయక రాజుల క్రిందను, మధుర రాజుల క్రిందను కొందరు సామంతులుగా మెలగిరి. పెమ్మసాని పెదవీరపనాయడు మధురరాజ్యమున జేరినట్లు లోగడ చెప్పబడినది. 1564-72 సం॥ల మధ్య మధుర రాజ్యమునకు కప్పము చెల్లించుచుండిన సింహళద్వీప రాజగు తంబిచ్చినాయుడు కప్పమును దిరస్కరించి స్వతంత్రుడు కాదలంచగా, నొక దండయాత్ర కేశవప్పనాయని యాధ్వర్యమున వెడలెను. దానిలో మధురరాజు పెద కృష్ణప్పనాయని క్రింద సర్దారులుగా నుండిన కమ్మవారు 1] రావిళ్ళ రమణప్పనాయుడు, 2] పెమ్మసాని రుద్రప్పనాయడు, 3] పచ్చా కస్తూరినాయడు, 4] నాదిళ్ళ నారణప్ప నాయుడు, 5] రావుల వెంకట్రామనాయుడు యింకా 22 గురు యితర సరదార్లతోను, వారి పరివారము

*. రావెలపాటి కైఫీయతు.

తోను వెడలి జయించివచ్చి, మధుర రాజుచే ననేక బహుమాన గౌరవములను బొందిరి *1. మధుర తంజావూరు రాజులకు తగాదా లేర్పడినపుడు, సమాధానముగా బరిష్కరించిన రావెళ్ళవారి కిప్పురును గొన్ని గ్రామముల నియ్యగా, నవి తిరునెల్వేలి జిల్లాలోని పగుటవల్లి, రావెళ్ళవారచ్చట కేగిరి. వారక్కడ నిప్పటికి జమీందారులుగా నున్నారు. ఇందులో తిరుకొట్టుపల్లి, కోవిలాడికోట, తంజావూరు జిల్లా గ్రామాలు కొన్ని, ఇలయరసనందల్, ఇంకను తిరునెల్వేలి లోని 18 గ్రామములు కలవు *2. ఇవి జమీలెత్తివేయ బడువరకు వారి యాధీనములో నున్నవి.

చోడి లలగాద్రినాయుడు · ఈయన 1671 సం॥ర ప్రాంతీయుడు. మధుర రాజ్యమును విశ్వనాథ చొక్కనాథ నాయకుడు పాలించు కాలములో నుండిన యొక సామంతుడు. శ్రీరంగములోని దేవుని కితడు కొంత భూమిని దానమిచ్చి పేరొందెను. ఈయన తండ్రి కాపనాయకుడు. తాత లలగాద్రి నాయకుడు. చోడెవారిప్పుడు గూడ కమ్మవారిలో కలరు. [No. 103 of 38].

## దూపాటిసీమలో మరికొందరు పాలకులు, సాయపనేనివారు

ఈ సీమలో పాలించుచువచ్చిన సాయపొన్వయ రంగనాథ తనూజుడును, మల్లవిభుని పౌత్రుడును, గంగయ్య ప్రపౌత్రుడు నగు వెంకటాద్రి పండిత కవిగా వన్నెకెక్కి, సకలసంజీవనమను ప్రబంధమును ప్రౌఢముగా రచించి పేరొందెను. ఈయన భార్య వెంకటాంబ. ఈమె పెమ్మసాని తిమ్మనృపాలుని సోదరి. ఈయన పెదతండ్రియగు వెంకటపతికి పద్మాంబయందు జనించిన గోవిందాంబ పెమ్మసాని పెదతిమ్మ శౌరిని పెండ్లాడెను. తాతయగు మల్లవిభుని కుమార్తె వెంకటాంబ మరియొక పెమ్మసాని పెదతిమ్మశౌరికి భార్యయయ్యెను. మల్లవిభునికి గల ముప్వురు భార్యలలో గోవిందాంబ పెమ్మసాని రామలింగనాయనికుమార్తెగా

*1. మధుర త్రిశిరపుర రాజుల చరిత్ర అను సింహళ ద్వీప కైఫీతు, D 2653రు గ్రంధము—మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంధాలయము.

*2. The Chiefs, Nobles & Zamindars of India (A. Vadivel Modaliyar)

గానబడుచున్నది. వెంకటపతి కుమార్తె వెంగాంబ పెమ్మసాని అక్కాయమ్మతి భార్యకాగా, వారికి పెమ్మసాని చినతిమ్మశౌరి జనించెను. వీరందరు 16 వ శతాబ్దివారు. పెమ్మసానివారికి సాయపనేని వారికి గల బంధుత్వము పై గ్రంధములలో చెప్పబడినవి. వెంకటాద్రి నాయని [గ్రంధకర్త] పెదతండ్రి వెంకటగిరి పెమ్మసానివారిలోని సేనాంబను పెండ్లాడి, గండికోటలో నొక దేవళము మాధవ కృష్ణమూర్తికి కట్టించెను. ఈతనినే గాబోలు అప్పకవి తన గ్రంధమున బేర్కొని యాతడు దేవాగ్రహారము నిచ్చెనని వ్రాసెను. ఈ మాదాల గోత్రజులలో శక. 1450లో నరసింగరాయ కొడుకు శ్రీ రంగరాజ నాయుడు శ్రీరంగనాధునికొక దానమిచ్చెను(**Nos.** 32 **of** 38-39). వీనిని ఒట్టి సాయపనేనివారు వరుసగానే సీమను పాలించుచువచ్చినట్లుకనబడును. గ్రంధకర్త తాత మల్లవిభున కైదుగురు కుమాళ్లుండిరి. వారు వరుసగా వెంకటపతి, వెంకట కృష్ణ, వెంకటగిరి, కోనేటి ప్రభువు, రంగభూపతి ననువారు. వీరి వంశమింకను సకల జన సంజీవనములలో వర్ణింపబడినది.

# 6. మహమ్మదీయ పాలనలోని కమ్మ సేనానులు

గోల్కొండరాజధానిగా ఆంధ్రదేశపుటుత్తరభాగము1495నుండి బహమనీ సుల్తానును 1512నుండి 1543వరకు సుల్తాన్‌కూలీకుతుబ్షాయుయేలుచు, 1516-29 మధ్య శ్రీకృష్ణదేవరాయలకు లోబడియు, తర్వాత స్వతంత్రముగను పాలించిరి. తర్వాత1550వరకు జామ్షీదు కులీకుతుబ్షాయును, తర్వాతకొన్నినెలలు సుబాన్ కుతుబ్షాయును, తర్వాత1580వరకు ఇబ్రహీంకుతుబ్షాయును, తర్వాత1611వరకు మహమ్మదు కూలీకుతుబ్షాయు, తర్వాత మహమ్మదు కుతుబ్షా 1626 వరకును, పిమ్మట అబ్దుల్లా కుతుబ్షా నవాబై 1672 వరకును, తర్వాత అబుహసాన్ కుతుబ్షాయను తానీషా 1687 వరకు పాలించియుండిరి. తానీషా రాజ్యమా సంవత్సరము ఔరంగజేబు చక్రవర్తి జయించి యచట అసఫ్‌జాను పాలకునిగా నుంచెను. ఔరంగజేబు చనిపోయిన తర్వాత కొంతకాలమునకు అనగా 1724 నుండి యతడు స్వతంత్రుడయ్యెను. 1614 వరకు నీ మహమ్మదీయ నవాబులకు విజయనగర రాజులకు జరిగిన యుద్ధ విశేషములు అందు కమ్మవారు పాల్గొనిన రీతులు లోగడ చెప్పబడినవి. 1578-86 సం॥ల మధ్య కొండవీటి సీమ నవాబుల పాలనలో నుండెను. తర్వాత నది వెంకటపతిరాయల వశమై మరల 1614 వరకు ఆయన పాలనలోనుండెను. 1591 నుండి 1601 వరకు గోల్కొండ నవాబులకును, గజపతిరాజులలోని ముకుందదేవు- హరిశ్చంద్ర దేవు, విద్యాధరదేవులకు యుద్ధములు జరిగి ఆకాలములో కొండపల్లి కొండవీడు సీమలు గజపతుల పాలనలోనికి వచ్చెను. 1601 లో వీరిని గోల్కొండ నవాబు జయించెను గాని 1626 వరకు కొండవీడు స్వాధీనము కాలేదు. 1626 ప్రాంతమున కొండవీడు సీమను, దూపాటిసీమను, 1643 లో ఉదయగిరి సీమను గోల్కొండ నవాబు ఆక్రమించెను. 1649 లో పెనుగొండ వరకు నున్న సీమలన్నింటినీ జయించగా, గండికోట రాజ్యముగూడ వారికి లోబడెను. అట్లే దూపాటిసీమ, కొండవీడు సీమలలోని కమ్మపాలకులు వారికి లోబడిరి. 1652 వరకు గండికోట సీమ నవాబులకు లోబడి కమ్మవారు

పాలించుచున్నను, సంపూర్ణముగా దానిని ఆ సంవత్సరమే తీసుకొనిరి. ఈ కాలములో పాలించిన కమ్మసామంతుల చరిత్రమును తెలుసుకొందము.

## దూపాటిసీమ*

### సాయపనేని గంగపనాయడు, వెంకటాద్రి.

ఈ రాజ్యమును సాయపనేని గంగపనాయడు, అబ్దుల్లా కుతుబ్షా సామంతుడుగా 1626 నుండి 1630 ప్రాంతము వరకు పాలించెను. ఆత్మకూరు, సిద్ధాపురం, దూపాటిసీమ, కంభం తాలూకాలకు మన్నెకావలిరుసుము హక్కు నితడుసంపాదించెను. ఈయన తర్వాత కుమారుడు వెంకటాద్రి పాలించుచు తన సీమలోననేక దేవాలయములు, చెర్వులునిర్మించెను. దద్దనాల పట్టణమునునిర్మించెను. అందులో 500 కోమటి యిండ్లు, 500 మార్వాడీ యిండ్లు, 60 అండలా లెక్క ప్రభువుల యిండ్లు, 11 ఘటాల యేనుగశాలలు నిర్మించెను. ఈయన సోదరి అక్కమ్మ యొక దేవళము గట్టించెను.

### సాయపనేని వెంకటపతి, సిద్ధప్పలు.

వెంకటాద్రి 1630 ప్రాంతమున చనిపోగా, నాతని కుమాళ్ళు వీరిద్వరు దూపాటిసీమను 1643 వరకు పాలించిరి. శ్రీశైలమున లోహవిక్రయులకు పన్నును వీరు తొలగించిరి. (A. R 46 of 15)

### సాయపనేని రంగప్ప, తిమ్మానాయుడులు.

వీరి కాలములో దర్శి, పెళ్ళూరి పాడిసీమలుగూడ నవాబుచే నీయబడెను. వీరు 1677 వరకును పాలించుచు, బ్రాహ్మణాగ్రహారములనిచ్చి పేరొందిరి. వీరు తానీషా పాలనలోని వారగుటవల్లనే యట్లిచ్చుట కవకాశము గల్గెను.

వీరి కుమాళ్లు పెదవెంకటాద్రి, చినవెంకటాద్రి నృపాలుర కాలములో 15 పరగణాలపై మన్నెకావలి రుసుములు నూటికి 3 తీసుకొనే హక్కు సంపాదించిరి. వీరివద్ద 5 వేల గుర్రములు, 12 వేల ఫౌజు ఉండెడిది. అందుచే జాగీరుదార్లను సతాయించి, రుసుములు వసూలుచేసి, నవాబుకు పంపుచుండిరి. యర్రగొండపాలెంలో చినవెంకటాద్రి నూతన భవనము గట్టించెను. వీరిలో

* ఈ చరిత్ర **L.R. Vols.** 13, 47 **&** 38 బట్టి వ్రాయబడినది.

చినవెంకటాద్రి రుసుముల వసూలుకై తన దండుతో పోయిన సమయములో పఖురుల్లాయను దోపిడిదారు, అమీరు, గోల్కొండ నవాబుపై కక్షబూని యుండి దద్దనాలపై ముట్టడిసల్పి యచటి యుద్ధములో పెదవెంకటాద్రి మొదలగు ననేక వీరులను సంహరించి, పట్టణమంతయు దోచి, 96 లక్షల రూపాయల ఖజానా హరింపగా, నచటి మానవతులగు కోటలోని స్త్రీలందరు అగ్నిప్రవేశమైపోయిరి. చినవెంకటాద్రి వచ్చిచూచి, విరక్తిచే నాత్మహత్య చేసుకొనెను. ఈతనికి జనించిన పసికూన యొక దాసిమూలమున కొండవీటి సీమలో పెరిగెను.

సాయపనేని మల్లిఖార్జునుడు వెద్దవాడైన పిమ్మట నవాబువద్దకేగి, అప్పటికి పాలనకువచ్చిన కుమ్రుద్దిన్ అసఫ్‌జాకు చెప్పుకొని, వినుకొండ దుర్గాల యాధిపత్యము సంపాదించెను. ఈసీమలో 225 గ్రామములు మాత్రమే యుండెను. ఈతడు పాలించుచుండగా 1723 సం॥లో ఢిల్లీ రాజ్యములో అరాజకముగా నుండి, విభురాం అను మరొక దోపిడీదారు యర్రగొండ పాలెముపై ముట్టడిసల్పి, మల్లిఖార్జునుని యుద్ధములో చంపెను. గ్రామమును తగల బెట్టించి, యచటి పురుషులను, స్త్రీలను జెరబెట్టెనట. ఈరీతిగా సాయపనేనివారి రాజ్యము రెండవసారి నశించెను.

తర్వాత కొంతకాలమునకు 1725 ప్రాంతమున యీ వంశీకులలో చెన్నప్ప, పురుషోత్తమనాయుడు అనువారు గోల్కొండకుబోయి నవాబుకు నివేదించుకొని మరల దూపాటిసీమలో 58 గ్రామములకు, కొచ్చెర్లకోటసీమలో 10 లేక 20 గ్రామములకు ఫర్మానా సంపాదించిరి. చెన్నప్ప మిర్యంపల్లెలో నొక నూతన గృహము నిర్మించెను 1731 సం॥లో చెన్నప్ప చనిపోయెను. ఆతని తర్వాత పురుషోత్తముని కుమారుడు అంబానాయుడు దూపాటిసీమ నేలెను. అంబానాయుడు తన సోదరుడు చెన్నప్ప కుమాళ్ళు సుబ్బానాయుడు, నారాయణప్పలకు భాగమియ్యక, కంభంఫౌజుదారులతో కుట్రసల్పి, వారిని మంచిమాటలతో ఖైదుచేయగా, నందే వారు మరణించిరి. వీరు పేష్వా బాలాజీ వాజీరావు సాయముగోరిరి గాని ఆతని సాయమువచ్చులోపలనే మరణించిరి. అంబానాయుడు 1751 లో చనిపోయెను. తర్వాత శేషాచలంనాయుడు, మల్లికార్జుననాయుడు లాసీమను నవాబు ఆజ్ఞలపై పాలించిరి. వీరాకాలములో 632 వరహాలు పేష్కషు చెల్లించుచుండిరి. మల్లికార్జునుడు 1795 లోను, శేషాచలంనాయుడు 1801 లోను చనిపోయిరి. శేషాచలంనాయుడు పాలించు

చుండగా జల్లివాండ్లనే బోయలు గ్రామములు దోచుచున్నందున శిస్తులు వసూలు కాలేదు. ఇంతలో నీరాజ్యముపై యధికారముగూడ నైజాము నవాబు యీస్టిండియా కంపెనీకిచ్చెను..

## గండికోట రాజ్యము *1

గోల్కొండనవాబగు అబ్దుల్లాకుతుబ్షా తల్లికోటయుద్ధానంతరమిచట పెమ్మసాని తిమ్మానాయనిని గండికోట పాలకునిగా నియమించి కడపసుబాలోజేర్చెను. ఈతడు పూర్వపాలకుల వంశీకుడుగాక, వేరొక శాఖీయుడు. ఈయన తండ్రి అంకప్ప, తాత గిరియప్ప. ముత్తాత వెంకటపతినాయడు. ఈయన కాలములో 1644 లో తిరుమలబుక్కపట్నం తాతాచార్యులనే గురువుకు కొన్ని హక్కులనిచ్చెను. హరిసేన, గురుసేన, మంత్రకానికె, గుడికట్నం, బసివి ముద్ర, తప్పు, వొప్పు, దండన, ఖండన్న పద్దు, పావాడం హక్కులను తన దేశములోనిచ్చెను. ఆ కాలములో నీసీమ 4లక్షల యాదాయము వచ్చెడిదట. దీనికోటలో 31 ఫిరంగులుండెను. ఇచటనుండి నిత్యము సవాశేరు వజ్రము లెగుమతియయ్యెడివి. ఇతడు యఱ్ఱగుడిలో నొక కోట గట్టించెను. శ్రోత్రియముకట్టిస అగ్రహారమొకటి గురువునకిచ్చెను. ఈయనకాలములో కనుసాలులు బొమ్మలాట లాడువారు. బలిజలు మరికొన్ని ఆటలు, జాతివార్తల దెల్పుచుండిరి. ఇతడొక చెరువు తీగెలచేరు వద్ద కట్టించెను. నరిమెట్లగ్రామము నంబులకు దానమిచ్చెను*2. ఈ రాజ్యములో వజ్రపుగనులవల్ల మంచి ఆదాయము వచ్చుచుండెను. 4 వేల సైన్యమాకాలములో నీయనవద్దయుండెను.

1652లో మీర్ జుమ్లా యీ రాజ్యములోనుండిన వజ్రపుగనులు మొదలైనవానిచే ఆకర్షింపబడి, దీనిని సంపూర్ణముగా స్వాధీనపరచుకొనెను. ఇతడు కొన్నాళ్ళు ముట్టడిచేసి చివరకు తిమ్మనాయని యుద్ధములో జయించుట కష్టమని తలంచి, మోసముచే గుత్తిదుర్గపాలన మిచ్చెదనని నమ్మించి, దుర్గము వెలుపలకు సైన్యముతో రమ్మని, చివరకు మోసపుచ్చి కోట స్వాధీనపరచు

*1. ఈచరిత్ర L.R. Vol. 12, 15, 16, 35, 37 & 47 బట్టి వ్రాయబడెను.

*2. A. R, No. 431 of 21.

కొనెను. చేయునది లేక తిమ్మానాయడు ఆతడిచ్చిన హనుమనగుత్తిగ్రామము గైకొనక దర్మపురిప్రాంతమునకు వెడలిపోయెను. తరువాత కొన్ని రాగివిగ్రహములు మీరుజుమ్లా కరిగించి, దేవాలయములను ధ్వంసముజేసెను. మీర్ జుమ్లా వెంటనే దుర్గములోని దేవాలయములందలి రాగి విగ్రహాలన్నిటిని కరిగించి కొన్ని ఫిరంగులను చేయుటకై నియమించెను. గాని యందలి మాధవస్వామి మున్నగు విగ్రహములు యెంతప్రయత్నించినా కరుగనందున నాపని విఫలము కాగా, నిందేదో మంత్రతంత్రము లున్నవని యర్చకులనుగూడ బాధించెనట. కాని ప్రయోజనము లేకపోయెను. ఈతడు దేవాలయములన్నిటి నీరీతిగా పాడు బెట్టించెను. పెమ్మసానివారు వెడలిపోగానే హిందూమతమున కీరీతిని దిక్కులేకపోయెను.

కొన్ని దేవాలయవిగ్రహములు, ఆభరణాలు, శాసనాలు మొదలైనవి తిమ్మానాయడు బయటికి వచ్చుముందు రాజు చెర్వులో భూస్థాపితముజేసెను*1. అందువల్లనే గండికోటలో పెమ్మసానివారి శాసనములులేవు. ఎప్పుడైన దొరక వచ్చును. ఈయనవద్ద దొడ్లేటి రంగనాధునిగారొక కార్యకర్తగానుండెను*2.

## కొండవీటిసీమ పాలన – చౌదరీపదవులు *3.

1579లో గోల్కొండ నవాబు ఇబ్రహీంకుతుబ్షా కొండవీడుసీమవశపరచుకొన్నప్పుడు రాయరావను మహారాష్ట్రసేనానిని పాలకునిగా నియమింపగా, నతడు 497గ్రామములను 14 సముతులుగాజేసి, వానికి చౌదర్లను నియమించెను. దేశపాంఢ్యాలు, దేశముఖులు, మన్నెవారు, చౌదర్లు అనే పాలకుల నేర్పరచెను. ఇంకా బారాముసద్దీలపాలనమని 12 రకాల ఉద్యోగుల నియమించెను. ఈ సముతులకు కమ్మవారినే నియమించినట్లు కనబడును. నాదేండ్ల సముతుకు సల్లబోతువారిని, పొన్నూరు సముతుకు అలపర్తివారిని, చేబ్రోలుసముతుకు దేవభక్తునివారిని, సంతరావూరు సముతుకు మానంవారిని, పులివర్తిసముతుకు సూర్యదేవర, వేములపల్లి, కొసరాజువార్లను, రావిపూడి సముతుకు వడ్లమూడివారిని చౌదర్లుగా నేర్పాటుచేసెను. వాసిరెడ్డివారు కొన్నిచోట్ల చౌదరులుగా నుండిరి

1 C. R. Vol. 12, 15, 35, 37, & 57, 46. 2. A. R No. 303 or 32-33, 3. L. R Vol. 3, 5, 12, 14, 19, 39, 41, 50 & 56.

ఈ పద్ధతులే తర్వాతగూడ అమలులోనుండి, కమ్మవారు చౌదరిపదవ మప్పటి నుండి వాడుచువచ్చిరి. గ్రామపెత్తనదారు లేక పన్ను వసూలుదారునుగూడ చౌదరులనిరి. ఈ కొండవీటిసీమలో 1581-1598 మధ్య అమీన్‌ముల్కును అమలుదారుండి ప్రజలను నానావిధముల బాధించుచు, దేవాలయముల బడగొట్టుచు, అనేక పన్నులను వేయుచుండగా, నల్లమోతు తిమ్మనాయడొక గొప్ప సమ్మెను జేయించి, నవాబువద్దకుబోయి చెప్పుకోగా, నతడు శిఖవసుఖానుదను మరొక అమలుదారుని పంపెను. 1697లో నల్లమోతు రమణప్ప నాదెండ్ల సముతు చౌదరిగా పనిచేసెను. నల్లబోతు యెల్లమనీ డొకకాలమున (1600-90 మధ్య నెప్పుడో) చౌదరిగానుండెను.

మేడూరిసీమకు మేలిమిచౌదరియు, తర్వాత యలమంచి రామినీడును, చౌదరీపదవులలో గోల్కొండనవాబుచే నియమించబడిరి. వీరు 1598 ప్రాంతీయులు కావచ్చును.

## కొచ్చెర్లకోటసీమ, సర్వేపల్లిసీమల పాలన.

1710 ప్రాంతమున రావెళ్ళ వెంకటాద్రి కొచ్చెర్లకోటసీమను పాలించెను. ఇతడు కొచెర్లకోట గ్రామము తన బందుగు లారుగురికి జాగీరుగానిచ్చెను*. ఈయన తర్వాత కుమారుడు మల్లానాయడు పాలించెను. ఇతడు సౌగంధిక పుష్పాపహరణమను గ్రంథము వ్రాయించెనట*2. ఈ సీమను 1751లో తిరు వెంగళప్ప పాలించెను. ఇతని తర్వాత 1764 ప్రాంతమున మల్లానాయని కొడుకు ఉద్దండ మల్లానాయడు పాలించెను. ఈస్టిండియా కంపెనీ వచ్చిన పిమ్మట నీసీమను తీసుకొని, ఆరికట్ల సీమను మాత్రమే ఈ వంశీకులకు యిచ్చిరట. సర్వేపల్లి సీమను రావెల ముద్దుకిృష్టప్ప నాయనింగారు 11, 1712 ప్రాంతమున పాలించెను. ఈయన కాలములో నీయన సామంతులు మదమనూరు, నారికేళపల్లి గ్రామములలో చెరువులు త్రవ్వించి శాసనములు లిఖించిరి.

(N. I. G. 52)

## రావెళ్ళ ముద్దుకృష్ణప్పపాలుడు.

ఈ రావెళ్ళ వంశీకులను గురించి చెప్పెడి యీక్రింది చాటువు గమనింపదగినది.

---

*1. N. I. *2. నానారాజన్య విఖ్యాత జనచరిత్ర.

"కెరలి ముప్పదిరెండు గెలుపులు గెలిచె నా వీరమలన్న యుర్వీశ్వరుండు
బిరుదు కస్తురిరంగ ధరణీశు నోడించెనౌర కోనేటి తిమ్మప్పశౌరి
గెలిచె వజ్రాల జుమ్మలపడక్కబెళ్ళ మీతాల కొండప్రభు ధార్మికుండు
వికటంపు ప్రాకులు ప్రకటించి పడద్రొబ్బె మీతండ్రి వెంకట ఝ్మాతలేంద్రు
డిందరికి మించి మీవంశ మెసకమెసఁగ
వెలయుజేసితి రావిళ్ళ కులపవిత్ర
'గాయగోవాళ' 'బల్లరగండ' బిరుద
సాహసమృగేంద్ర! ముద్దుకృష్ణ క్షితీంద్ర.

## రొంపిచర్ల దుర్గము,

ఈ దుర్గమును అబ్దుల్లాకుతుబ్షా పాలనలో మేదరమెట్ట నరసింహనాయడు పాలించెను. ఇతని సామంతుడొకడు గుండ్లపల్లిలో వీరభద్ర, ఆంజనేయాలయములు, తోటయొకటి నిర్మించి శాసనము వ్రాసెను. ఈతడు 1629 ప్రాంతీయుడు. 1766లో నీవంశములోని నరహరినాయుడు చింతపల్లి సంస్థాన జమీందారు వాసిరెడ్డి రామన్న బహదరుగారివద్ద సర్దారుగా పనిజేయుచుండెను. ఆయనవద్ద 50 మంది పరివారముండెను. నరహరినాయుని పూర్వీకులు అద్దంకి పేరులో మందపాటివారి సర్దారులుగా నుండెడివారట.

**(A. R. 77 of 32-33 & L. R. Vol. 57)**

## పొత్తపి, పులుగులనాడుల పాలన — దివాన్‌గిరులు *1

ఈ సీమలు 1753 ప్రాంతమున మట్ల వెంకట్రామ రాజుగారి పాలనలో నుండెను. అచట 3 వేల సైన్యముండెను. ఈ సైన్యాధిపతిగా కమ్మవారిలోని చుండూరి ముసలినాయడు పనిజేసెను. ఈ సీమలుగూడ కడవ సుబేలో జేరియుండెను. 1753లో వేములవారి కోటమీదకు నవాబు మశీదుఖాను ఉత్తరవు ప్రకారం వెళ్ళి, కోట స్వాధీనపరచుకొని వచ్చినందుల కాతనికి 5 గ్రామముల జాగీరయ్యెను. చివరకు ఈ ముసలి నాయనికి, వెంకట్రామ రాజుగారికి సరిపడక, ముసలినాయడు మహారాష్ట్రి బలవంతరావు సైన్యములో తన ఫౌజుతో కలిసెను. వెంకట్రామ రాజువద్ద ఆ ముసలినాయని తమ్ముడు చక్రవప్పనాయడు

---

*1. L.R. Vols. Nos. 17 & 22ను బట్టి.

దివానయ్యెను. ముసలినాయడు కొంత కాలము బలవంతరావు క్రిందను, తర్వాత వెంకటగిరి సంస్థానములోను పనిచేసెను. అప్పుడీతడు దేవులపల్లి జాగీరు పొందెను. పొదిలె, మార్కాపురం సీమలు జూపల్లెవారి నుండి తప్పించి వెంకటగిరిలో జేర్పించెను. బలవంతరావువద్ద నున్నపుడు సిద్ధవటంకోట, కడపరాజా, మరి కొన్ని జమీలను జయించి లూటీచేసెను. ఇట్లుండగా వెంకట్రాజుకు, బలవంత రావుకు కడప నవాబుకు సంధికుదిరెను. ముసిలి నాయడు వెంకట్రామరాజు కొలువులోనికి తిరిగివచ్చెను. తర్వాత సరవర్ ఖానును, నోసం సంస్థానాధిపతి కలిసి గ్రామములు దోచుట కారంభింపగా, కడప నవాబు ఆనతిని ముసిలి నాయడు, తన సేనతో వెడలిజయించిరాగా, నతడు నాగసానిపల్లెజాగీరిచ్చెను. 1768లో తిపిరెడ్డిపల్లె సంస్థానీకుడు తిరుగబడగా, ఆతనిని జయించెను. ఇతడు ఈదెమార్పూరులో నొక చింతవనము వేయించెను - (L.R. 44) 1769 లో నితడు చనిపోయెను. చక్రప్పనాయడు తన పేరిట నొకపేటను, తండ్రి సరప్ప నాయని పేరిట యొక పేటను కట్టించి పేరొందెను. తర్వాత చుండూరి సర్వప్ప నాయడు II, దివానయ్యెను. మట్ల అప్పయరాజువద్ద నట్లుండెను ఆతడు 1782 లో లరణివద్ద హైదరుదండుతో బోయినప్పుడు అప్పయరాజు చనిపోగా, నాతని మైనరు కుమారుని పక్షమున సర్వప్ప సంస్థానము పాలించెను. ఆతని తమ్ముడు జంగమనాయడు చిత్వేలి తాలూకా దివానయ్యెను. జంగమనాయడు వెంకట్రామ రాజు II, పక్షమున చక్కగా పాలించెను. కాని నాటి పరిస్థితులలో యెవరు పేష్కషు యెక్కువ చెల్లించిన వారికే యిచ్చునట్టి చందూలాల్ సుబేదారు, చర్య కారణముగా, 1800లో రాజ్యము తొలగించి వెంకట్రామ రాజుగారిని యీస్టిండియా కంపెనీ కప్పగించెను. అంతటితో యీ సీమల జమీ, దివానుగిరు లదృశ్యమయ్యెను. [L.R. Vol. 5, 17 & 22]

## చెరుకు నారసింహనాయడు, అహోబలనాయడులు

వీరు కలురాయిపాడు మొదలగు గ్రామముల జమీ 1770 ప్రాంతమున సంపాదించి పాలించుచువచ్చిరి. వీరికి కడప సుబేదారేల జమీనిచ్చెనో తెలియదు [L.R. Vol. 36]. 1600 దాదాపు మొదలు 1800 సం॥ వరకు కమ్మవా రనేక చోట్లకుబోయి పల్లెలను గ్రామములను గట్టికొని వ్యవసాయము దేశమున వృద్ధిజేసినట్లు లోకలు రికార్డులు తెలుపుచున్నవి.

## నందిగామపరగణా - వాసిరెడ్డివారు *1

ఈ వంశములో సదాశివనాయుడు 1550-81 ప్రాంతమున నుండెను. ఈయన కొండవీటిసీమలో గొంత యధికారము గోల్కొండ నవాబగు ఇబ్రహీం కుతుబ్షావద్ద పొందినట్లు చెప్పవచ్చును. ఇతని మునిమనుమలలో గంగినీడు, మోపులూరునను, మాదినీడు తాడిగిరిలోను, వెంకటాద్రి పల్లగిరిలోను, గుర్వినీడు పోపూరిలోను, చినవెంకటాద్రి నందిగామలోను చౌదరీ తనము జేయుచుండినట్లు వంశచరిత్రలో చెప్పబడినది. మరియొక మాదినీడు తర్వాత కాలములో అత్మకూరు, నిడుమ్రోలు చౌదరి యయ్యెను. వీరపనీడు కొడుకు లింగనీడు తాడికొండ వంటు చౌదరి యయ్యెను. వీరందరును 1600-70 మధ్యవారైయుందురు. 1660లో వాసిరెడ్డి వీరప్పనాయుడు గోల్కొండ నవాబు అబ్దుల్లా కుతుబ్షా వద్ద దేశముఖి సనదును నందిగామ పరగణాకు సంపాదించెను. తదాది జమీలను తీసుకొను వరకు యీ సీమ వంశీకుల క్రిందనే యున్నది. 1686 లో దీనిని వీరప్ప కుమారులు భాగించుకొని, రాఘవయ్య రాఘవపురమునను, రామయ్య మాగల్లులోను, చంద్రమౌళి చింతలపాటిలోను ఉండి పాలించిరి*2. వీరు మరల ఔరంగజేబు చక్రవర్తివద్ద దీనిని దృఢపరచుకొనిరి. 1678లో రామనృపాలుడు నందిగామ శివాలయమునకు మంటపము గట్టించెను [A.R No. 252 of 24].

## చింతపల్లి వంటు జమీ - వాసిరెడ్డి చినపద్మనాభనృపతి

1685 ప్రాంతమున నీ వంశములో చినపద్మనాభ నాయడు ప్రసిద్ధికివచ్చి, శూరాగ్రేసరుడై తానీషా నవాబువద్ద 500 గ్రామములపై యధికారము సంపాదించెను. నందిగామ, కమ్మంమెట్టు, వినుకొండ, కొండవీడు, సంతరావూరు, కూచిపూడి, రాయపూడి, పెనుగంచిప్రోలు, బేతవోలు పరగణాలందు కలవు. ఈతడు చింతపల్లిలో కోటగట్టి, తానచ్చట నుండి పాలించెను. ఇతడు బ్రాహ్మణ సత్కారములు, దేవపూజలు హెచ్చుగా సల్పుచుండెను. మానూరి వెంకన్న గారి జమీ గ్రామాలు 9 యితడు కొనెను *3. 1710 ప్రాంతమున నితడు చనిపోయెను. ఈయన సోదరుడగు రామలింగన్న గుంటూరులో అగ్రహారము

---

*1. వాసిరెడ్డి వంశచరిత్రనుబట్టి వ్రాసినది. *2. **Krishna District Manual.**
*3. **L R. Vol. 3.**

గట్టించి 30 కుచ్చెళ్ళ భూమి బ్రాహ్మణులకిచ్చెను *1. ఈయన తర్వాత బుచ్చి రాఘవరాయడు, పెదనరసన్న, చిన నరసన్న, చిన రామలింగన్న నాయడులు పాలించిరి. వీరి కాలములోనే మంచాలగ్రామ మగ్రహారముజేసిరి*2. నరసన్న, చినరామలింగ నృపాలుర కాలమున 1748లో వెలమవారికి, వీరికి సరిహద్దుల గ్రామాల తగాదావచ్చి యొక యుద్ధము జరిగెను. అందు వెలమ వారోడిపోయిరి. వెలమ జమీందారు పాతూరుపట్టణాధికారియగు మల్రాజు సూర భూపాలుడు; నరసభూపతి బేతవోలులోను, రామలింగన్నగారు పులిచింతల గ్రామంలోను బ్రాహ్మణాగ్రహారములుగా భూములనిచ్చిరి*3. పాకాలపాడులో దేవాలయము చినరామలింగనాయని మంత్రి బాగుజేయించెను *4. దివి రమణ కవి, శృంగారధామమను గ్రంధ మాయన ప్రేరణ, సాయములతో రచించెను. రామలింగనాయడు 10 లేక 12 సం॥లు పాలించెను. 1761 లో వాసిరెడ్డి నాగన్ననాయడు సంస్థాన పాలకుడై, షాఆలం చక్రవర్తివద్ద ఒక సనదును తన పరగణాల కన్నిటికిని పాలనాదికారముతో పొందెను. చింతలపాటి వంటి జమీ వాసిరెడ్డి చంద్రమౌళి 1686 నుండి పాలించుచు, ఆతని తర్వాత కుమారుడు రాఘవరాయడు, తర్వాత రాజమౌళియు 1714 వరకు పాలించిరి. రాజమౌళి మునియేరు కాల్వల త్రవ్వించెను. తర్వాత చంద్రమౌళి, లక్ష్మీపతులు పాలించిరి. 1745లో యీ జమీ భాగము రామలింగనాయని కప్పగింపబడెను. దీనిని ముక్త్యాల సంస్థానమని గూడ పిలుచుచుండిరి.

## అసఫ్‌జా వంశీకుల పాలన

గోల్కొండలో పాలించుచువచ్చిన కుమ్రుద్దిన్ అసఫ్‌జా 1748 లో మరణించెను. ఆతని వంశీకులగు మీర్జషా, నాజరు, సంబత్ జంగులకు రాజ్యాధికారముపై తగాదా వచ్చెను. ఫ్రెంచి సైన్యాధికారి డూప్లే సాయముతో మీర్జ షాజంగు నవాబయ్యెను. ఆ నవాబు ఫ్రెంచి వారి కుత్తర సర్కార్లను, దక్షిణ సముద్రము వరకు దివాన్‌గిరి పాలనగూడ నొసంగెను. అందుచే కమ్మ జమీందారులుగూడ ఫ్రెంచివారికిలోబడిరి. మీర్జషాజంగు 1751లో కర్నూలు నవాబుచే

*1. కొండవీటి సామ్రాజ్యము & Oriental Library Book No 15-5-29

*2 L R. Vol 12 *3. L.R Vol 5 & 12.

*4. A-R No 326 of 32-33.

హత్యకాబడిన పిమ్మట తమ్ముడు సలబత్ జంగు నవాబయ్యెను. ఈతడు 1761 వరకు నేలెను. ఈతని కాలములో గూడ ఫ్రెంచి పాలన యుండెను. తర్వాత మీర్ నైజాం అలీ నవాబయ్యెను. 1754 నుండి కొంతభాగ ముత్తర సర్కార్లు యీస్టిండియా కంపెనీవారు నవాబు నుండి గ్రహించిరి. 1759 - 63 మధ్య హుసేన్ ఆలీ స్వాధీనములో కొంత యుండెను. 1764 లో నవిగూడ కంపెనీవారు తీసుకొనిరి. 1788 నాటికి గుంటూరు సర్కారుగూడ వశపరచు కొనిరి. ఈ కాలములో ఢిల్లీ చక్రవర్తులలోగూడ మార్పులు వచ్చెను. ఔరంగ జేబు చక్రవర్తి 1708లో చనిపోయిన పిమ్మట వచ్చిన బహాదర్ షా 1712 లో చనిపోయెను. తర్వాత వచ్చిన జహాందరుషా 11 మాసములే పాలించెను. ఫరుక్ సియారు 1719 వరకు పాలించిన తర్వాత సయ్యదు సోదరు లిద్వరను నిల్పిరిగాని వారుగూడ చంపబడుటచే 1719లో మహమ్మదుషా చక్రవర్తియై1748 వరకు పాలించెను. ఈతని కాలములోనే అసఫ్‌జా గోల్కొండలో స్వతంత్రు డయ్యెను. తర్వాత అహమ్మదుషా చక్రవర్తియై 1754 వరకు, తర్వాత రెండవ అలంగీరు పాదుషా 1759 వరకు తర్వాత షాఆలం చక్రవర్తియు పాలనకు వచ్చిరి. ఈతనిని నామకా చక్రవర్తినిచేసి కంపెనీ గవర్నరు జనరలు దాదాపు పాలనాధికార మంతయు స్వీకరించెను. మనదేశ పరిస్థితులు యిట్లుండగా, నీ సంస్థానమును 1745నుండి పెదరామలింగనాయడు 1763వరకు పాలించెను*1. సోదరుడగు వీరనృపాలుని, నాగ నృపాలుని పుత్రుడు జగ్గభూపతి చంపించెను. దీనికి కారణము సంస్థానాధిపత్యము తగాదాయే. 1763లో రామలింగ నాయని తర్వాత జగ్గభూపతి పాలకుడయ్యెను. దీనికి గోల్కొండ నవాబు నైజాం అలీఖాన్ సోదరుడగు బసలత్ జంగు [ఇతడే యీసీమల అధికారి] కు యిష్టములేక, తనవద్దనున్న ఫ్రెంచి సైన్యములనుబంపి యీతనిజంపి, చింతపల్లి కోటను బట్టుకొని, తాను నియమించిన రాజమౌళికి 1771లో స్వాధీనపరచెను. జగ్గనృపాలుని భార్య అచ్చమాంబ భర్తతో సహగమన మొనర్చెను. రాజమౌళికి సంతానము లేక తర్వాత చంద్రమౌళి జమీందారయ్యెను. రాజమౌళి సోదరుడగు రాఘవయ్య అప్పుడు 1791 సం॥లో వచ్చిన క్షామములో దీనులను రక్షించి పేరొందెను *2. 1770లో యీ జమీ జప్తు అయి తిరిగి 1772 లో నందిగామ

*1. L.R. Vols. 5, 14 of 57 & Krishna District Manual.

*2. కృష్ణామాహాత్మ్యము.

పరగణా వీరికి తిరిగి యియ్యబడెను. 1777 లో రామనృపాలుడు బసలత్ జంగుతో సంధిపడి తిరిగి చింతపల్లి వంటుకోట సంస్థానాధికారమును బొందెను. రామనృపాలుడు మైలవరం జమీ కలుపుకొన యత్నించి, బందరు కౌన్సిలువారి చర్యలవల్ల ఆపివేసెను *1. ఇతడు దేవబ్రాహ్మణులకు మాన్యము లిచ్చెను. దావులూరు, వేమూరు, సిరిపురం, యద్దనపూడి గ్రామములందివి యొసగబడెను *2. ఇతడు తనపేర నొక పేటను గట్టించెను. సైన్యాధికారము గల్గియుండిన యర్రంపల్లి వారికా రాజ్యములో నొక మొఖాసా ఉండెను *3. 1778లో నితడు చనిపోయెను.

1782 ప్రాంతమున నందిగామ పరగణాయును, చింతపల్లి కోటయు జగ్గ నృపాలుని పుత్రుడగు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయడు, బహదర్ మన్నె సుల్తాను స్వాధీనపరచుకొని పాలింపజొచ్చెను. కాని ఈయన చరిత్ర ముందధ్యాయమున చెప్పబడును. చంద్రమౌళిని, నాగనృపాలుని వెంకటాద్రినాయడు ఖైదులోనుంచి తర్వాత వదలివేసెను. 1801 సంllలో ముక్త్యాల వంటు చంద్రమౌళికి బందరు కలెక్టరు బలవంతముగా వెంకటాద్రినాయనిచే నిప్పించెను. 1797లో చంద్రమౌళి అమరేశ్వరస్వామికి 60 యకరముల యీనాము నొసంగి పేరొందెను.

ఈ వంశములోని వెంకటాద్రి కుమారుడు చంద్రమౌళి **II**, అహల్యా సంక్రందన విలాసమను గ్రంధమును వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్య కవిచే వ్రాయించి కృతిభర్తయయ్యెను. ఇతడు కొంతకాలము నిర్బంధమున నుండి బయటకు వచ్చెను. ఈ వంశీకులుగూడ నేటికి కొంత జమీ పెన్షను అనుభవించుచున్నారు. వాసుదేవ చూడా మాణిక్య ప్రసాదుగారిప్పటి పెన్షనరులలో నొకరు. వీరు మొదట పెదపాలెం వాస్తవ్యులుగా నుండి తర్వాత బందరులోనుండి యిటీవల చనిపోయిరి. ఇట్లే మరికొందరున్నారు. ఈ జమీపై గోల్కొండ నవాబు అధికారము లన్నియు 1788 నుండి యీస్టిండియాకంపెనీకి సంక్రమించెను. ఆ చరిత్ర మరొక అధ్యాయమున చదివెదము.

## వెలిసేటివారు ♦.

వీరిలో మల్లిఖార్జునదొర 1660-87 మధ్య నెప్పుడో కళింగ దేశమునకు బోయి, యచ్చటి విజయనగరరాజు (వెంకటపతి లేక ఆనందరాజు) అనుమతిపై

*1. Krishna District Manual. *2. L.R. Vols. 5, 14, 39 of 59.
*3 L.R. Vol. 57 — P. 161, 162. ♦ 182వ పేజి చూడుడు.

బంటుపల్లిని గట్టించెను. ఆతడచట నొక సైన్యాధికారిగా నుండెను. ఈయన మల్లిఖార్జునాలయము మొకటి నిర్మించెను. ఈతని కుమాళ్ళలో రెండవ తిరపతి దొర 1687-1712 మధ్యయుండి నడిపల్లిగ్రామం నిర్మించెను. ఇతడుగూడ సైన్యములో నుండెను. ఈయన కుమారుడగు చినకూర్మరాయు డత్యంత ప్రసిద్ధుడై 1712-57 మధ్య సేనాధిపతియయ్యెను. పెదవిజయరామరాజు (బొబ్బిలి యుద్ధములో చనిపోయినాడు) వద్ద ఆకాలములో బొట్ల గురప్పదొరయు నితడు నుండి బాదుర్లాఖాను. జాఫరల్లీ మొదలగు సర్ లస్కరులు గోల్కొండ నవాబు ఆజ్ఞపై శ్రీకాకుళము కోట ప్రాంతమును వశమొనర్చుకొనుటకై వచ్చినపుడు, మొదట ఓడిపోయినను, మరల విజృంభించి యా సేనాధిపతుల నోడించి, విజయ నగర రాజుచే యనేక యీనాములు మన్ననల నందెను.

గురప్పదొర యాయుద్ధములలో చనిపోయెను. ఈ కూర్మరాయడు విజయనగరరాజునకు అనేక జమీనులనుండి పన్నులను వసూలుచేయుటకై తిరుగుచుండెను. ఈవంశములో తర్వాతవచ్చిన కామసరాయడు, కృష్ణరాయడు ననువారు సైన్యాధికారులై యనేక యుద్ధములలో విజయనగరరాజుల పక్షమున బనిచేయుచు, ఫ్రెంచివారిని వెడలగొట్టి, ఇంగ్లీషువారికి సహాయము చేయుటకై పాల్గొనుచుండిరి *. తర్వాత 1790—1815 మధ్య పాలనకువచ్చిన

*. ధర్మనందనవిలాసములోని యీక్రింది పద్యములు గమనార్హములు :

"అనుపమ సత్య శౌచ విజయాంకుడు కామయ యుద్ధవేదికిన్
దన భుజసత్వముంకువయొనర్చి యశోధవళాంబర స్ఫురత్
ఘనపథకాయమానము ప్రతాపమరాత్రికరూపమై దగన్
గొనియె జయేందిరన్ దిశలు గోరిక ముత్తైపు సేసఁజల్లఁగన్."

"ముష్కర పాదుషా లష్కరులకు మిత్తి, చెలుకారునే వీరు చేతికత్తి
పాదుషాహివజీరు ఫౌజులతలమేకు, చెలువారునే వీరు చేతిబాకు
గడిదేశ దుర్గాధికారుల పెనుమారి, చెలువారునే వీరు చేతిసూరి
యుత్కళదేశాధియోధ కల్పాంతంబు, చెలువారునే వీరు చేతికుంత

మతడు రాజాధిరాజ మాన్యప్రతాప
రాజపూజిత బిరుద విరాజితుండు
సీతమాంబోదరాంభోధి శీతభానుఁ
డాయత యశోధనుఁడు కూర్మయాఖ్య ఘనుఁడు."

నారాయణ గజపతికాలములో నీవంశములో గురురాయడు ప్రసిద్ధసేనానిగా నుండెను. ఈయన ధర్మనందనవిలాస మను ప్రబంధము కాళ్ళకూరి గౌరీ కాంతకవిచే వ్రాయించి కృతిభర్తయయ్యెను. ఇప్పటికి వంశీకులా ప్రాంతము లందున్నారు. 18వ శతాబ్దిని బొమ్మినేనివారు కొమ్మినేనివారుగూడ సీతా నగరమున సేనానులుగా నున్నారు.

## మరికొందరు ప్రముఖులు.

మేదరమెట్ల గోపన్ననాయడు : 1808 ప్రాంతీయుడు. కొప్పఱు కాపురస్తుడు. ఇతడు అచట గోపాలస్వామిని ప్రతిష్ఠించెను. ఈయన వాసిరెడ్డి రామన్న జమీందారువద్ద సర్దారుగా నుండెను. (**L. R. Vol.** 57 & 60)

మేదరమెట్ల పెద్దమ్మ ; 1672 ప్రాంతమున దర్శితాలూకా, కల్లూరిలో నామె యొక చెర్వును త్రవ్వించి ప్రసిద్ధికెక్కెను. (**N. I D.** 31)

కొమ్మినేని గురవప్ప : 1729 ప్రాంతీయుడు. తండ్రి కొండప్ప. ఈయనకుగల యైదుగురు కుమాళ్ళు వెంకన్న, గంగన, పాపన, పోతన, చిన పాపనలు కలిసి దొండపాడులో నా సం॥రము చెరువు త్రవ్వించిరి. 1734 లో నీవంశములోని బసవన్న కొడుకు గంగన సీతారామస్వామి యాలయమును అనంతవరమున గట్టించెను. ఈ వంశీకులు గజముఖోపాఖ్యాన మను గ్రంథము వ్రాయించిరి. అది యిప్పుడు దొరుకుటలేదు. (**A R.** 72 **of** 17)

నల్లా శ్రీరామనాయడు : 1729 ప్రాంతీయుడు. చెంగల్పట్టుజిల్లా జయపురం ప్రాంతమున మన్నెకావలి రుసుముల హక్కు సంపాదించిన యుద్యోగి. పళయశివరామ గ్రామములోని లక్ష్మీనృసింహాలయమునకు భూదానమిచ్చి యశస్వి యయ్యెను. (**A. R.** 219 **of** 22.)

## దేవరకోట సంస్థానము*.

దీనికి చల్లపల్లి ముఖ్యస్థానము. దీనిలో 100 గ్రామములున్నవి. యేర్ల గడ్డ గురువారాయుడు దీనిని 1576 సం॥లో సంపాదించి తరువాత గోల్కొండ నవాబగు అబ్దుల్లాకుతుబ్షాకు సామంతుడయ్యెను. ఈయన 1607 లేక 1627

---

*. Krishna Dt. **Manual** స్వారాజ్య విఖ్యాతజనచరిత్ర.

వరకు పాలించినపిమ్మట నాయన కుమాళ్ళలో తిరుమలనీడు దేశముఖియై దీనిని 1665 వరకు పాలించెనట. తర్వాత నతని సోదరుడగు గంగినీడు 1682 వరకు రానీషానవాబు సామంతుడుగా పాలించెను. పిమ్మట నతని తమ్ముడు కంచినీడు 1695 వరకు నేలెను. ఈతడు చాల ధర్మాత్ముడని చాటువులలో నుతింపబడినాడు. గోల్కొండరాజ్యమిప్పటికి ఔరంగజేబు చక్రవర్తికి లోబడెను. కంచినీడున కైదుగురు పుత్రులుండిరి. పాపినీడు, నాగినీడు, రామినీడు, గంగినీడు, వీరపనీడనువారలు. మొదటి ముప్వురు సంస్థానమును 1698 వరకు పాలించిరి. తర్వాత గంగినీడు పాలించెను. ఇతడు 1708లో చనిపోగా, జ్యేష్ఠపుత్రుడు నాగన్న సంస్థానాధికారియయ్యెను. తర్వాత 1710లో అంకినీడు వచ్చి 1723 వరకు సంస్థానపాలన మొనర్చెను. ఈయనకు ముప్వురు పుత్రులుండిరి.

1723 లో వెంకట్రామనాయడు పాలకుడయ్యెను. దీనిని తర్వాత వచ్చిన హనుమన్న పాలించాడని 1732లో అసఫ్‌జానవాబీయనను తొలగించి ఫౌజుదారు పాలనలో నుంచెను. 1735 లో నాగేశ్వరుడు పాలకుడయ్యెను. తర్వాత1745 వరకు 10 సం॥లు నాగేశ్వరుడు పాలించెను. ఈ కాలములలో పేరొనర్చిన కార్యములు తెలియుటలేదు. 1751లో దీనిని సలబత్‌జంగ్ ఫ్రెంచివారికియ్యగా యచట పాలకుడగు కోదండరామదేశాహి కొండవీడు సీమకు వెళ్ళిపోయెను. ఈ జమీందారప్పుడు కొంత పెన్‌షన్ పొందుచువచ్చెను. 1759 లో ఫ్రెంచి యధికారముపోయి, యీస్టిండియా కంపెనీ పాలన వచ్చెను. 1765లో కోదండరామనాయడు జనరల్ కోయిలాండును ఏలూరులో దర్శించి తిరిగి సంస్థాన పాలన సంపాదించెను. బసలత్ జంగు కాలములో అములుదారు అలీఖానుకు యీయనకు తగాదాలు వచ్చి జూపరల్లీబేగును పంపి అములుదారు గ్రామాలు దోపించగా, తుదకు రాజీపడి, కంపెనీవారికి యిచ్చివేసెనట. అప్పటికి 16 వేల వరహాలు లేక రూపాయలు పేష్కషు ఉండగా 40 వేలకు పెంచబడెను. 1782 లో కళ్ళేపల్లి గ్రామములోని దేవాలయ మితడు బాగుచేయించెను *1. 1791 లో నితడు చనిపోగా రెండవ వెంకట్రామనాయడు పాలన మొదలుపెట్టెను. 1792 నుండి నాగేశ్వరనాయుడు పాలించుచు 1796 లో కళ్ళేపల్లి అగస్త్యేశ్వరస్వామి యాలయమున గోపురము కట్టించెను *2. ఈయన తర్వాత రెండవ అంకినీడు

*1. S.I.I. Vol VI. No. 83. *2. S.I.I. Vol. VI. No. 79.

పాలనకు 1798లో వచ్చి వల్లపల్లికోటలో నొక సౌధము నిర్మించి, శివగంగలో నొక మహిషాసురమర్దనిదేవిని ప్రతిష్ఠించి కొన్ని భూములనిచ్చి పేరొందెను *1. ఈయనకు పునహాలోని పీష్వా "శ్రీమంతు" బిరుదమొసంగెను. షాఆలంచక్రవర్తి "రాజాబహద్దర్, జుబ్దాతుల్ ఎక్రాన్" అను బిరుదులిచ్చెను. ఈయన సంస్థానములో కాసుల పురుషోత్తముడనే భట్టుకవి యుండి, 2 శతకములు దేవున్నమీద రచించెను. ఈయనమీద చాటువుల జెప్పెను. 1816లో నీయన సంస్థాన పాలనను చేయలేక సర్కారువశము జేసెను. అందుచే కోర్టు ఆఫ్‌వార్డ్సు క్రిందికి వచ్చెను. ఈ సంస్థానమునకు 85 వేల రూపాయల పేష్కషు కట్టబడుచుండెను.

## పులివర్తి సీమ.

1560 ప్రాంతమున దీనిని సూర్యదేవర పెదనారసింహ, చిననారసింహ నాయడులు పాలించిరి. 1579 నుండి యీ సీమలో మాణిక్యారావుగారికి మన్నె వారు పదవినిచ్చి సూర్యదేవరవారికి చౌదరీ తనమును రాయరావను మహారాష్ట్ర సేనాపతి [కుతుబ్షా సామంతుడు] యొసంగియుండెను. సూర్యదేవరవారు రాచూరుకోట వశ మొనర్పనందున మోసముచే మాణిక్యరావు కైకొనెను *2. ఈ వంశమువారింకను గుంటూరు జిల్లాయందున్నారు.

## చిరుమామిళ్ళ నాయుడమ్మ — కోదండరామ, రామనాయుడులు.

వీరు 1760 ప్రాంతీయులు, వాసిరెడ్డి పెదపద్మనాభుని కుమార్తెయగు రమణమ్మ వీరి తల్లియగుటవల్ల, వాసిరెడ్డివారి రాజబంధువులైయుండి, వారిపద్ద సైన్యములలోనుండి అపుడు జరిగిన యుద్ధములందు పాల్గొనుచుండిరి. ఈ వంశములో తర్వాత వచ్చిన పాపయ్య 'శకుంతలాపరిణయ' మను గ్రంథమును వ్రాయించి ప్రసిద్ధి కెక్కెను [వావిళ్ళ ప్రచురణ]. ఇవి బేతపూడి కృష్ణయ్యచే రచింపబడెను. ఈ వంశములోని వెంకటపతిగూడ 1748 ప్రాంతమున జరిగిన వెలమ కమ్మవారి యుద్ధములో పాల్గొనెను.

## మేడూరిసీమ — కొనేరు రామచంద్రుడు.

1698 సం॥లో నీయనయు, వెలమ జమీందారు వెల్లంకి గోపాలరావు, వరికొండ విస్సంరాజులు కలిసి ఔరంగజేబు చక్రవర్తి వద్ద మేడూరిసీమ, జమల

1. A R. Vol. 401 & 403 of 32 - 33.  *2. L.R Vol 4 I. P. 477.

వాయి పరగణాలకు సమిష్టి దేశపాండ్యసనదునుబొంది యచట తమయధికారము చలాయించిరి. రామచంద్రుడు దేశపాండ్య చౌదరీతనములు నిర్వహించి యుండును. [నానారాజ్య విఖ్యాత జనచరిత్ర Vol. I]

## కల్దిండి సీమ.

దీనిని దాదాపు 18శతాబ్దిలో కామినేని పెదభోగినీడుపాలించెను. ఈయన పెద్దింటి అప్పలాచార్య శిష్యుడనియు 'గండభేరుండ, దానరాధేయాది' బిరుదములు గలవాడనియు, చాటువులందున్నది. తండ్రి గురవయ్య. చినభోగినీడు గూడ దాతగా పేరొందెను. ఈతడీవంశములోనివాడే *1.

## మరికొందరు ప్రముఖులు.

విప్పర్ల పెదరామన్న : ఇతని కాల నిర్ణయము తెలియదు. చౌడమ్మపల్లె గట్టించి బోయరాజులు దోపిడికిరాగా, వారినీతడు జయించి పారదోలెనట. 300 మంది అట్లు దొంగలువచ్చినను యెదిరించి తరిమివైచెను. ఈయన 18వ శతాబ్దివాడై యుండును *2.

మల్లంపల్లి నారప్ప : ఈయన 1715 ప్రాంతీయుడు. యలవర్రులోని వేణుగోపాలాలయము తిరిగి కట్టించి, యితడు పేరొందెను.
(L.R. Vol. 5 P. 366.)

దావులూరి పాపినీడు : 1702లో నితడు యింటూరులో శివాలయము గట్టించి, జమిందారుచే కొంతభూమినిప్పించి పేరొందిన ప్రముఖుడు.
(L. R. Vol. 57 P. 91).

సర్రాజు కోదండయ్య : ఈయన 1747లో మార్కాపురం చెన్నకేశవస్వామి రథము బాగుచేయించెను. (L.R. Vol. 38).

మండువ అయ్యన్ననాయడు : సూరవరం వాస్తవ్యుడు. 1750లో నచటి చెన్నకేశవస్వామి దేవళము నితడు తిరిగి కట్టించెను. దీనికి

---

*1. & 2. చాటువులు, చాటుపద్య మణిమంజరి & కమ్మవారి చాటువులు.

వాసిరెడ్డి జమీందారు యీనామిచ్చెను. మండువవంశీకులు తంజావూరు రఘునాథనాయకుని సైన్యములో నుండినట్లు రఘునాథాభ్యుదయ నాటకముననున్నది.
(L R. Vol 50)

యడ్లపాటి వెంకట్రామయ్య: ఈయన 1798లో బొడపాడులోని సోమేశ్వరాలయము తిరిగి కట్టించి, పూజాదుల నేర్పరచెను.
(L.R. Vol. 50)

సర్దార్లు బొల్లేపల్లి తిరువెంగళప్ప నాయడు, బత్తిని శింగరప్ప, నరసన్న నాయడులు: వీరు 1766 ప్రాంతీయులు. వాసిరెడ్డి రామన్న బహదరు జమిందారుగారి వద్ద వీరు సర్దారులుగానుండి గ్రామాలలో కలతలు లేకుండ జూచుచుండిరి. వీరికి కొప్పురు గ్రామము స్థావరముగా నుండెను. [L.R. Vol. 57 పుట 66] శింగరప్ప, నరసన్న నాయడులు పూర్వం అద్దంకి పాలకులగు మందపాటివారివద్ద నుద్యోగులుగా నుండిరట.

గార్లపాటి లక్ష్మీనారాయణ, సుబ్బయ్యలు: వీరు 1766 ప్రాంతీయులు. వీరి తండ్రి శేషాచలం కట్టించిన సీతారామాలయము శిధిలముకాగా పునఃకట్టించిరి. [A.R No. 27 of 29].

చల్లా వెంకటపతి నాయడు: 1770 ప్రాంతీయుడు. కొప్పర్తి, గోళ్ళపల్లి, అప్పరాజుపల్లె మన్నెకావలి రుసుములహక్కు నితడు పొంది పరిపాలించెను. [L.R. Vol. 37].

కమ్మ బుచ్చన్న: జూలకల్లు వాస్తవ్యుడు. 1789 ప్రాంతీయుడు. ఇతడచట నొక చెర్వు, బావి త్రవ్వించుటయేగాక గోపాలస్వామి యాలయమును తిరిగి కట్టించి, విఘ్నేశ్వరాలయము నూతనముగా నిర్మించి పేరొందెను. ఆ గ్రామమప్పుడు మల్రాజు గుండారాయ-శింగారగు వెలమ జమీందారునిది.
(A.R. No. 294 of 30).

నెల్లూరి పాపినీడు: ఇతడు 1623 ప్రాంతీయుడు. అబ్దుల్లాకుతుబ్షా పాలించుకాలములో నాతని పుణ్యముకైయితడు, మరికొందరుకలసి అత్తలూరులో చెర్వును బాగుచేయించి పేరొందిరి. [A.R. No. 273 of 34-35].

## ఉపసంహారము.

ఈ రీతిగా కమ్మవారు మహమ్మదీయ పాలనలో గొన్ని యధికారము లచ్చటచ్చట సంపాదించి నిర్వర్తించుచువచ్చిరి. మిగతవారు వ్యవసాయవృత్తిలో నుండిరి. 1652 ప్రాంతమునుండి దేవాలయములు మహమ్మదీయులు, వారి చేతి క్రింది ఫ్రెంచి సైనికులు నాశనముచేయుచు వచ్చిరి. ఒక్క తానీషాకాలములో మాత్రమది ఆపివేయబడెను. గాని మరల 1687 నుండియు ప్రారంభమయ్యెను. 1707లో ఔరంగజేబు చక్రవర్తి చనిపోవువేళ క్రౌర్యము లయమునందెను. ఆతడు చనిపోయిన తర్వాత మరల వాని నెచ్చటివారచట బాగుచేసుకొనగా, జమీందార్లీనాములిచ్చి పోషించుచువచ్చిరి. ఈయుద్యమములో కమ్మసామంతులు, యితర కమ్మ ప్రముఖులుగూడ ముందుసకువచ్చి సాగించినట్లు పై చరిత్రలు తెలుపుచున్నవి. ఈ మహమ్మదీయపాలనలో విద్యాభివృద్ధికుంటుపడెను. గ్రంధ రచనలు కానరావు. 1800 తర్వాతనే మరల నవి కనబడుచున్నవి. రైతులు చాలమంది మహమ్మదీయ రాజ్యములో పన్నులు పగైరా బాధలు పడలేక వలసల కేగుచువచ్చిరి. 1593 నుండి యిట్టివి కలవని మంగళగిరి శాసనమును బట్టి నుడువవచ్చును. ఈ కాలములో నింక ననేక కమ్మ సామంతు లుండవచ్చును. కాని వారి చరిత్రలు కాలగర్భమున లీనమైనవి. లోగడ నుడివినవారు గాక ఒక చాటుపద్య మీ క్రింది కమ్మసామంతులు నరపతి, గజపతి, అశ్వపతుల వద్ద నుండి అందలాలు, పాలకీలనెక్కు ప్రభువులుగా వర్ణించినది. తాడిపత్రిలో రాయల వంశీకుల పాలనలో 66 అందలాలెక్కు కమ్మప్రభువు లుండెడివారట.

"కాజ తిమ్మనీడు, ఎలమంచి పర్వతాలు, కోనేరు వెంకటాద్రి, రేగుల అంకినీడు, పిన్నమనేని అనంతనాథుడు, బాష్టి జగ్గనీడు, పర్వతనేని జగ్గనీడు, కొమ్మినేని వెంకటాద్రి, కొడాలి పేర్నీడు, మండవ గంగినీడు, దాసరి వెంగన్న, వెల్లంకి బసివినీడు, కర్లపూడి యెర్రయ, ముల్లంకి మూర్తినీడు, తమ్మారెడ్డి అంకినీడు, చలసాని సోమినీడు, బొప్పన హరినీడు, లింగము పుల్లయ్య, వీరపనేని వెంకటాద్రి, మాగంటి నాయుడమ్మ, కలగర నరసన్న, వీరందరు శత్రువుల జయించి, పణ్యంబు సంతరించి, రాజ్యభారము వహించి, హితుల బోషించి, పల్లకీలలో దిరుగుచు వైభవముతోనుండిన కమ్మచౌదరులట. కమ్మవారు దేవ బ్రాహ్మణుల బోషించుటలో నీకాలమునగూడ మిక్కిలి పేరొందిరి.

(కమ్మవారి చాటువులు).

## మఱికొందరు కమ్మవారు.

పెమ్మసాని కుమారతిమ్మానాయడు : ఈతడు 1675 ప్రాంతీయుడు. చెంగల్పట్టు జిల్లాలో నితడు గోల్కొండ నవాబు అబ్దుల్లాకుతుబ్షా సామంతుడుగా నుండెను. తిరునిన్ రాయూరులో గొన్ని పన్నులను చెర్వు నిర్మాణమునకై విధించుచు నొక శాసనము లిఖించెను.

(A R No 177 of 37—38).

ధూళిపాళ్ళ గోపన్న : ఇతడు 1729 ప్రాంతీయుడు. దర్శి తాలూకా రాజంపల్లిలో గోపాలస్వామికి దేవాలయము కట్టించి, ఈయనశాసనము వేయించెను. ఈయన తండ్రి గురువన్న, తాత అక్కన్న.

వక్కలగడ్డ వీరప్ప : 1750 ప్రాంతం గ్రామాల యిజారా దార్లలో నితడొకడు. ఇతడు కొన్ని గ్రామాలు కవులునకు తీసుకొనుచు పేరొందెను. (L R Vol 10).

దొప్పలపూడి రమణప్ప : ఈయన 1687 ప్రాంతీయుడు. గుంటూరు సముతులోని అడుసుపల్లె గ్రామంలో వేణుగోపాలాలయము నితడు కట్టించెను. ఈయన యీదేవునకు, అర్చకులకు 6 కుచ్చెళ్ళ భూమినిచ్చెను. కుచ్చెల యనగా దాదాపు 24 యకరములు. (L.R. Vol. 3)

సాగి రఘునాధయ్య : 1619 ప్రాంతీయుడు. ఇతడు వప్పిచెర్లలో హనుమంతాలయమువద్ద మంటపము గట్టించెను. (A. R No. 566 of 1910).

విప్పర్తి మల్లినీడు, వెంకటాద్రి, గంగన్ననాయడులు : వీరల తండ్రి తిమ్మానాయడు. 1648 ప్రాంతీయులు. వీరు చువ్వ గ్రామంలో గోపాలరాయస్వామి ఆలయం తిరిగి కట్టించి పేరొందిరి.

(A R No. 15 of 29-30)

కూచి వెంకటగిరి, వెంకటాద్రి, వెంకటపతినాయడులు : వీరు 1676 ప్రాంతీయులు. బ్రాహ్మణభక్తులు. వీరు కొన్ని గ్రామములు గుత్తకు తీసుకొనుచుండిరి. అందులో వెలిపుట్లగ్రామం బ్రాహ్మణులకు దానమిచ్చి పేరొందిరి. (L. R Vol 14—57).

అద్రగడ బుచ్చన్న : ఈయన 1687 ప్రాంతీయుడు. అడుసుపల్లె వాస్తవ్యుడు. ఇతడు అచట వీరభద్రాలయము గట్టించి పేరొందెను. (L. R. Vol. 3).

దేవినేని బసవన్ననాయుడు : 1699 ప్రాంతీయుడు. ఈయన బాపట్ల తాలూకా దండమూడిలో రామలింగేశ్వరాలయము కట్టింపగా, దానిని తర్వాత మహమ్మదీయులు శిధిలమొనర్చిరి. వెల్లంకి బసవన్న తిరిగి దానిని క్రోధన సం॥లో నిర్మించెను. (L. R. Vol. 60)

శాఖమూరి వెంకటనారసింహుడు : తండ్రి రఘునాయక ప్రభువు ఈ వెంకట నారసింహుడు కొన్ని యుద్ధములలో పాల్గొనుచు వచ్చె ననియు, మన్నె రాజనియు నీతనిపేరిట చాటువులు తెలుపుచున్నవి గాని వివరములు కనబడవు. శాకమూరివారు కొందరు 1616లో జరిగిన తోపూరు యుద్ధములో గొబ్బూరి జగ్గరాజు పక్షమున నిలిచి, తంజావూరు రాజగు రఘునాథ రాజుగారితో జరిగిన యుద్ధమున బారిపోయినట్లును, వెలుగోటి మేచభూపతివారిని బారద్రోలినట్లును, వెలుగోటివారి వంశావళి దెలుపుచున్నది. 1622 ప్రాంతమున శాకమూరి అనంతప్ప ఉదయగిరిలో నొక గ్రామపెద్ద. నవాబు కరిణీకం మాన్యమిచ్చుచు వ్రాసిన యొక శాసనములో నితనిపేరున్నది (N I. 4/16). ఈ వంశీకులు తర్వాతకాలములో వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువువద్ద సేనాధిపతులుగా మెలంగినట్లు కలదు.

## కమ్మవారి వలసలు.

15 వ శతాబ్దిలో మాహమ్మదీయపాలన జరుగుచుండగా మంగళగిరి ప్రాంతమునుండి యితరచోట్లకు జనులు వలసలకేగుచు వచ్చిరి. ఇట్టివారిలో కమ్మవారుగూడ జేరియుండిరి. ముఖ్యముగా 17, 18 శతాబ్దులలో నీవలసలు కమ్మవారిలో హెచ్చుగా గనబడుచున్నవి. వీరు రాయలసీమ ప్రాంతములకేగి దాదాపు 50 గ్రామములు నూతనముగా నేర్పరచుకొని యచట భూములను సంపాదించుకొని నూతనముగా వ్యవసాయము వృద్ధిజేసిరి. ఈవిషయములు ఆయాగ్రామ లోకలురికార్డులలో కనబడుచున్నవి. విజయనగర సామ్రాజ్య కాలములో యిచ్ఛాపూర్వకముగా సైనికులుగా, ఉద్యోగులుగా, రైతులుగా, దక్షిణసముద్రమువరకు వలసకేగుటను అలవాటుపడిన కమ్మవారు 17, 18, 19

శతాబ్దులలో విరివిగా వలసలు సాగించినట్లు కనబడుచున్నది. బహుశా వర్షములు లేక కాలమానము బాగుగాలేకపోవుటవల్లగూడ నిట్లు జరిగియుండును.(**L. R. Vol.** 10, 11,17, 19, 20, 35, 39, 41, 5, 15, 36, 44, 48, 50, & 56.)హెచ్చుకవుళ్ళబాధలు, శిస్తుల తీసివేతలు లేకుండుటగూడ కారణము.

## కోయంబత్తూరువారు కమ్మ - సతీరంగమ్మ యుదంతము.

మహమ్మదీయపాలనలో కొందరు ఢిల్లీచక్రవర్తుల సామంతులుగాగూడ నుండిరట. అట్టివారిలో కాకర్ల వెంకటపతినాయడొకడు. ఒకనాడు ఢిల్లీ నవాబు (పేరు తెలియదు) వెంకటపతినాయని కుమార్తె సత్తిపేరమ్మ సౌంద ర్యమును గురించి విని మోహపరవశుడై యామెను పెండ్లాడగోరెనట. గాని మతాంతరుడగు నితని కిచ్చుటకు వెంకటపతినాయని కిష్టములేకుండెను. రాజా రాచకొండల గోవిందప్పనాయడు అపుడు కర్మగిరియనుచోట నొక పాలకుడుగా నుండెను. ఈ కమ్మవంశీకు లాకాలములో ఓరుగంటిశక్తి రేణుకాదేవిని పూజించువారట.

నవాబు తప్పనిసరిగా పేరమ్మను వివాహమాడగోరగా, వెంకటపతి, ఆతని బంధువులుసహా లోపల యిష్టములేక మోసముచే నవాబును నిరాదరించ దలపెట్టిరి. ఒకనాటి సుముహూర్తమునకు దర్లిరమ్మని వెంకటపతినాయడు నవాబునకుజెప్పి, యాలోపలనే దమ వర్గమంతయు పెన్నానదిదాటి దక్షిణదేశ మునకు బారిపోయిరి. వారి నివాసగృహమధ్యమున నొక కుక్కనుమాత్ర ముంచిరి. నవాబు వచ్చిచూచి రోషముతో వెడలిపోయెను. ఈకథ యెప్పుడు జరిగెనో తెలియుటలేదు. ప్రాయశః 14, 19, శతాబ్దములమధ్యలోనైయుండును.

బలభద్రరామయ్యం వెంకటపతినాయడులు, గోవిందప్పనాయడు మొద లగు వారందరు కోయంబత్తూరు ప్రాంతములకు వలసపోయిరి. వీరాప్రాంతము నకుపోయి భూములుకొని కంబలిమెట్ట, ఊంజపాలెం, కొండయంపాళియం, పెరుందొర యనే గ్రామములను కట్టుకొని వసించుచు వ్యవసాయము చేసుకొని జీవింపనారంభించిరి. వీరందరును యిక్ష్వాకువంశీకులగు ప్రతాపరుద్రుని వంశ ములోని వారని "సతీరంగమ్మ" చరిత్రనుబట్టి ద్రావిడ కమ్మ పురాణమును బట్టి తెలియుచున్నది.

ఇట్లు వలసకేగిన కమ్మవారిలో తర్వాత నంబూరి కొండమనాయడు, అయ్యపనాయడు, వేణుగోపాలస్వామినాయడు, రంగప్ప, వెంకటాద్రి రామిచా

యడు, నల్లమనాయడు, ఉబ్బట్ల కులశేఖరనాయడు, దుగ్గెన సారప్పనాయడు, పేరినాయడు, పేపళ్ళ రంగనాయడు, ఉబ్బట్ల కస్తూరినాయడు మొదలగువారు ఆ ప్రాంతములో ప్రసిద్ధులుగానుండిరి. కొండపనాయనికి 12 గ్రామములపై యధికారముండెనట. కొండపనాయని కూతురు రంగమ్మ చిన్నతనమునుండి భగవద్భక్తిపరాయణయై యుండి దుగ్గెన పేరినాయనిని పెండ్లాడెను. అతడు కొంచెము పిచ్చివాడుగా నుండెను. రంగమ్మ తల్లియగు మంగమ్మ పిల్లను ప్రసవించి చనిపోగా తండ్రి కోనమ్మను వివాహమాడెను. ఆమె రంగమ్మను నానాహింసలబెట్టి తండ్రికాబాధలు తెలియనీయదయ్యెను. రంగమ్మ తండ్రి కేకపుత్రికయై మొదటమిక్కిలి గారాబముతో పెంపబడినను, సవతితల్లి కాలమున నెన్ని కష్టములు గల్గినను, సహించి, తండ్రికిసైతము చెప్పక పతిభక్తితో నుండెను. చివరకామె పతి పేరినాయడు చనిపోగా నామె యాతనితో సహగమన మొనర్చెను. ఈమె తన మహత్వమును అందరికి కనుబరచగా, బంధువులందరామె పేర నొక గుడిగట్టించి, యేటేట యుత్సవములు జరిగించుచున్నారు. ఆమె భక్తులకు కోరికలను దీర్చుచు ప్రసిద్ధివహించెను. ఆమె చరిత్రయంతయు నరవములో బుఱ్ఱకథగా నాప్రాంతములందు కథకులు చెప్పుచున్నారు. తెనుగులోనిది సతీరంగమ్మ చరితగా ప్రకటింపబడియున్నది.

## 19 వ శతాబ్దిని కమ్మవారిస్థితి

ఈ శతాబ్దినాటికి కమ్మవారు ఆయాజిల్లాలలో స్థిరనివాసము లేర్పాటు చేసుకొనిరి. ప్రతిజిల్లాలోను కొన్ని కమ్మవంశములు ప్రఖ్యాతికివచ్చెను. వారి యండదండలను తక్కినవారుగూడ నివసింపదొడగిరి. ఇట్లున్నవారిలో—

గుంటూరుజిల్లాయందు : ముఖ్యముగ వాసిరెడ్డి, చావ, చిరుమామిళ్ళ, సాయావనేని, కొసరాజు, సూర్యదేవర, వెన్నం, దేవినేని, కొత్త, సుంకర, వరుచూరి, జాగర్లమూడి, యేర్లగడ్డ, కొత్తపల్లి, మల్లిపెద్ది, పొతకమూరి, కోగంటి, శాఖమూరి, దేవభక్తుని, కోట, పాములపాటి, మల్లెల మున్నగు వంశములును;

కృష్ణాజిల్లాలోఅడుసుమల్లి, బొప్పన, కాజ, యేర్లగడ్డ, వీరపనేని, పర్వతనేని, త్రిపురనేని, లింగం, కోనేరు, గద్దె, కంఠపనేని, కోవెలమూడి మున్నగు వంశములును;

గోదావరిజిల్లాలో : ముళ్ళపూడి, బలుసు, చిట్టూరి, కరుటూరి, దేవరపల్లి నెక్కంటి, కలగర, బిక్కని, నీరుకొండ, మల్లిన, పెండ్యాల, అల్లూరి, చోడె, బోళ్ళ మున్నగు వంశములును;

చిత్తూరుజిల్లాలో : బొల్లిని, చుండూరు, దావులూరు, పరుచూరు మున్నగు వంశీకులును;

బళ్ళారిజిల్లాలో : ముండ్లూరి, చెరుకూరి మున్నగు వంశములును;

నెల్లూరిజిల్లాలో : రావెళ్ళ, రావుల, మేదరమెట్ట, పెమ్మసాని మున్నగు వంశములును;

కోయంబత్తూరుజిల్లాలో . కాకర్ల, దుగ్గెన, నంబూరి, ఉబ్బట్ల, పేపళ్ళ, రాచకొండల మున్నగు వంశములును;

రామ్నాడు, తిరునెల్వేలి జిల్లాలలో : పెమ్మసాని, బెల్లం, రావెళ్ళ, కొత్తపల్లి, కొత్త, కొండపల్లి మున్నగు వంశములు;

మధురజిల్లాలో : గుంటూరు మున్నగు వంశములును;

అనంతపురంజిల్లాలో : పత్తిపాటి, మలినేని, ఏరువ మొదలగు వంశములును;

శ్రీకాకుళం, విశాఖపట్టణ జిల్లాలలో : వెలిసేటి, కొమ్మినేని, మేదరమెట్ట, చొట్ల, బొమ్మినేని, యరమనేడి, గురాల, గోపిన, మన్నె మున్నగు వంశములును;

యన్లే మరికొన్ని జిల్లాలలో మరికొందరును (వారి పేర్లిపుడు లభ్యము కాలేదు) మిక్కిలి ప్రసిద్ధులుగా నుండి, స్థానికముగా పలుకుబడి, పేరుగలవారగుటయే గాక నాయాచోట్ల కొందరుదాతలు పెక్కు ధర్మకార్యము లొనరించుచు వచ్చినట్లు కనబడును.

---

# 7. బ్రిటిషు పాలనలోను, తర్వాతను గల కమ్మవారు.

1750 సం॥లో గోల్కొండ నవాబు మీర్జఫాజంగు ఖాను రాజ్యమునకు వచ్చుటలో సాయపడినందుల కుత్తరసర్కార్లను ఫ్రెంచివారికి పాలించనిచ్చెను. 1752-53సం॥లోను తర్వాతనుమరికొన్ని యీబడెను. ఈకాలములోగూడ చందోలువంటి కొన్ని హిందూదేవళములు నాశనమయ్యెను. 1757లో బొబ్బిలి కోటను నాశనముచేసిరి. తర్వాత విజయనగర సీతారామగజపతి మొదలగువారు ఫ్రెంచివారిని తొలగించి, యీస్టిండియాకంపెనీపాలన తెచ్చుటకై వారికి కొన్ని యుద్ధములందు సాయపడిరి. 1764లో సర్కార్లపై యధికారమును నిజామల్లీ ఖాన్ నవాబునుండి కంపెనీవారుపొందిరి. ఈస్థితిలో 1787లో కమ్మవారుకొందరు చెంగల్పట్టుజిల్లాకు వలసపోయిరి. విజయనగరపు విజయరామరాజు క్రిందను, తర్వాతవచ్చిన గజపతులక్రిందను కొందరు కమ్మవారు సేనాధిపతులుగా నుండిరి. 1788వరకు గుంటూరు సర్కారుమాత్రము సలబతుజంగు తనసోదరుడగు బసలతు జంగున కిచ్చెను. తర్వాత నిది కంపెనీవారిక్రిందికివచ్చెను. కంపెనీవారి పాలన లోను, తర్వాతను 832, 1877, 1891 లలో ఆంధ్రదేశమున గొప్పకరవులు వచ్చెను. 1832 నాటి నందనకఱవు చాల తీవ్రముగా నుండుటచే గుంటూరు జిల్లాలో 1½లక్షల జన మాకలికి తాళలేక చనిపోయిరి. అపుడు దోపిడు లనేకము జరిగెనట. ఇది చూచిన పిమ్మట కంపెనీవారు కొంత పెట్టుబడిపెట్టి కృష్ణా, గోదావరీ నదులకు ఆనకట్టలను సర్ ఆర్థర్ కాటన్ దొర యింజనీయ రాధ్వర్యమున 1852-55 సం॥ల మధ్య నిర్మించిరి.

తర్వాత కరవులున్నను తీవ్రముగాలేవు. కంపెనీవారి యక్రమపాలన, సొమ్ముదుబారాలు, ప్రజల కష్టాలు, ఉత్తరదేశమున సిపాయి పితూరీలు కారణ ముగా యిండియారాజ్యము విక్టోరియారాణి వశమొనర్చుకొనెను. తదాది ఆమె ప్రతినిధులు, గవర్నరులు 5సం॥లకొకసారిమారుచు, అనేకులు మనరాష్ట్రములను

పాలించుచువచ్చిరి. ఆ చక్రవర్తిని తర్వాత నామె సంతతివారే వరుసగా మన దేశ చక్రవర్తులైరి.*.

1802 నుండి దేశముఖులు, జమీందార్లవద్దనుండి సైన్యములను, ఆయుధములను తొలగించి కంపెనీవారు తమ స్వంత సైన్యములతో దేశరక్షణ చేయుచుండిరి. అదాలతు, సుప్రీంకోర్టు లేర్పరచి, జిల్లాకలెక్టరులను నియమించి ప్రజలకు న్యాయము కలుగజేసిరి. హైకోర్టు, జిల్లాకోర్టు లేర్పడువరకు నివియే పనిజేసెను. 1802 నుండి యనేక రిగ్యులేషనులు, చట్టములు నేర్పడెను. మన్రోగారు వచించిన రైతువారిపద్ధతి అమలునకువచ్చెను. ఈ బ్రిటిషువారి పాలనము 1947 వరకు జరిగి దేశము స్వతంత్రమయ్యెను. బ్రిటిషుపాలనలో నూతనజమీలేర్పడుటను ప్రోత్సహించెను. అందుచే పారంపర్యాజమీలేకాక, నూతనజమీలుగూడ కమ్మవారిలో కొందరు సంపాదించిరి. ఈజమీలు మహమ్మదీయపాలనలో శాశ్వతమైనవి కాకున్నను, పరిపాలనాసౌకర్యమునకై బ్రిటిషువారు వీనిని శాశ్వతపరచిరిగాని వీనిలో పూర్వమువలె న్యాయవిచారణ, సైనికపోషణ, దేశరక్షణ బాధ్యతలు జమీందార్లకు లేకుండజేసిరి.

1852లో-మదరాసు విశ్వవిద్యాలయమును, 1923లో ఆంధ్ర విశ్వవిద్యాలయమును వెలసినవి. తక్కినవారివలెనే వానియందనేకులు కమ్మవిద్యార్థులు చదివి పట్టములనుబొంది, దేశసేవాపరాయణులై, యుద్యోగములను స్వీకరించి ప్రభుత్వముక్రింద నమ్మకముతో పనిచేయసాగిరి. ఇకనీకాలపు కమ్మసామంతులను, వారిచరిత్రలను తెలుసుకొందము. జాతీయకాంగ్రెసు దేశములో నేర్పడినపుడు బొంబాయికాంగ్రెసునకు ఆంధ్రప్రతినిధిగా 1885లో కమ్మవారిలోని పల్లెవాయి రంగవ్వనాయడుగారు వెళ్ళియుండిరి. ఈయన మదరాసునందలి స్థానిక సంస్థలలో ప్రముఖమెంబరుగా నుండెను.

## చింతపల్లి వంటు, నందిగామపరగణా జమీలు.
## వాసిరెడ్డి వెంకటాద్రి నృపాలుడు*

1783 సం॥ యీ జమీలు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నృపాలుడు ఆక్రమించినట్లు లోగడ తెలిపితిమి. ఈతడు కమ్మవారిలో నత్యంత ప్రసిద్ధపాలకుడు.

---

* సప్తమ యెడ్వర్డు, పంచమజార్జి, ఆరవ జార్జి మొదలగువారు.

* **Krishna Dt. Manual**, వాసిరెడ్డి వంశచరిత్ర **Local Records** 3, 5, 7, 12, 14, 39, 57, 50, 59.

ఈయన 1761లో జన్మించెను. ఈయన 552 గ్రామములను పాలించెను. మొదటగోల్కొండనవాబు సలబత్ జంగుసోదరుడగు బసలత్ జంగునకును,తర్వాత యీస్టిండియాకంపెనీ, మద్రాసుశాఖకునులోబడి సంస్థానపాలనగావించెను. ఈయన చాలా ధర్మాత్ముడు. అనేక పండితులను, కవులను, బ్రాహ్మణులను, దేవాలయములను పోషించెను. చాలాదేవాలయములను పూర్వము శిథిలమైనవానిని నిర్మించెను. తనసీమలలోఅనేకచోట్లదేవాలయముల కీనాములిచ్చెను. బ్రాహ్మణులకు66 గ్రామములంద్రగహారభూములేర్పరిచెను. ఇతడుఒకసారి బంగారుతోను, రెండుసార్లువెండితోను, తులాభారములతూగి పంచిపెట్టెను. ఈయనతండ్రిపేర జగ్గయ్యపేట, తల్లిపేర అచ్చమ్మపేట, తనపేర రాజాపేట, నాయనిపేటలనుగట్టించెను. ఈయనకనేక బిరుదావళి కలదు. ఈయనవద్ద 3 వేల సైన్యముండెను. 1802 నుండి యీజమిదారుల పలుకుబడి తగ్గిపోవలెనని కంపెనీవారు వారిసైన్యములను తగ్గించునట్లు చేసిరి. ఈయన దోపిడిగాండ్రగు చెంచులను 150 మందిని చంపించెను. ఈయనకు నైజాము 'మన్నె సుల్తాను మన్సబ్‌దార్' బిరుదు నిచ్చెను. ఈయన గ్రామములు మొత్తముగా ఇజారాకు ఇచ్చుచుండెను. కొత్త సంగన్నగారీ యిజారాదారులలో నొకడు. ఈయనకాలములో 1816లో పిండారీ దండొకటి పన్నుకొరకై వచ్చి గ్రామములనుదోచి, నానాబాధలుపెట్టి, కన్యలను కూడా చెరబెట్టుచుండిరి. అప్పటికి సైన్యములు లేనందున, యెట్లో కష్టపడి అమరావతికి వచ్చినపుడు పారద్రోలించెను. ఈయన మొదట లక్ష్మీపురమను చింతపల్లికోటలోను, తర్వాత 1796 నుండి అమరావతికోటలోను ఉండెను. కవులనేకులు ఈయనపేర చాటువులు వ్రాసిరి. ఈయన దానధర్మములకు మితిలేదు. ఈయనకుగల ఇర్వురుభార్యలకు సంతానములేక, ఇద్దరు కుమాళ్ళను పెంపు దీసుకొని వారికి జమీ భాగించి చేబ్రోలు, అమరావతి, ఖండములేర్పరచి 1816 లో చనిపోయెను. కాని యివి అమలులోకి రానీయక జ్యేష్ఠపుత్రుడు జగన్నాధబాబు ఆక్రమించెను. ద్వితీయుడు రామనాధబాబు వ్యాజ్యము వేసెను.

ఈయనవద్ద శాఖమూరివారు కొందరు సేనాధిపతులుగా పనిచేయుచుండిరి. కొచ్చెర్ల గ్రామము వారికి జాగిరుగా ఉండెను. ఈయన సకాలములో పేష్కషు చెల్లించుచు నట్లే రైతులవద్ద వసూలుచేయుటలో నిష్కర్షగానుండెను. ఇతడు కాశీ రామేశ్వరాది యాత్రలు గావించెను. బేతవోలు, జగ్గన్నపేట, చేబ్రోలు, మంగళగిరి, అమరావతి మొదలగుచోట్ల ననేక దేవుళ్ళకు యీయన

భూములిచ్చి పేరొందెను. ఈయనవద్ద జంపాల అయ్యన్నగారును, తరువాత సబ్నివీసు అంతనపంతులు, కొమ్రరాజు నాగేశుడు, పొత్తూరి కాళిదాసులు మంత్రులుగా నుండిరి. ఈయన జరుపుకొన్న తులాభారయుత్సవ మొకటి 1806 లో జరిగినట్లీ క్రింద చాటువువల్ల గ్రహింపవచ్చును.

"మ॥ క్షయ సంవత్సర మాఘశుద్ధ శుభపంచ ద్వాదశీ
జీవవా । రయుత శ్రేష్ఠ పునర్వసుప్రవరుఘష సద్రాశిం దులాభార మే
నయసూరుండమ । రావతీపురములో నందూగి నానార్థసం
చయ హర్షాప్తిధనంబొసంగె గవులెంచన్వేంక టాద్రీంద్రు
రీ । తి యనంగా దగి వాసిరెడ్డి కులమున్ దేజంబు జెన్నొందఁగన్॥"

ఈయన 108 దేవాలయముల వద్ద యిత్తడి ధ్వజస్తంభములను వేయించెనట. 1214 ఫసలీలో యీయన 22 గ్రామములను విక్రయించుకొనెను. బాపట్లలోని భావనారాయణస్వామికి 1803 లో కొన్ని భూములను కొని ఇచ్చెను. 1193 ఫసలీలో గుంటూరు రామచంద్రపురం అగ్రహారములోని మల్లేశ్వరస్వామికి కొంత భూమినిచ్చెను. పీష్వాబాజీరావు నితడు దర్శించి, కానుకలిచ్చి బిరుదములొందెను. చేబ్రోలులో చతుర్ముఖాలయమును గట్టించెను. లోకలు రికార్డులలో 30 గ్రామములలో నీయన యిచ్చిన యినాములు వగైరా వివరములు కనపడుచున్నవి. ఈ లెక్కకురాని గ్రామములెన్నో వున్నవి. ఈయన నైజాము వారికి 2 లక్షల నజరు చెల్లించుచు వచ్చెను. కృష్ణాజిల్లాలో 204 గ్రామాలు, గుంటూరుజిల్లాలో 344 గ్రామాలు, రాజమండ్రి జిల్లాలో 4 మొత్తం 552 గ్రామములు యీయనపాలనలో నుండెను.

## వాసిరెడ్డి జగన్నాథబాబు, రామనాథబాబులు *.

1816 నుండి చింతపల్లి వంటు జగన్నాథబాబు పాలించెను. ఈకాలము నాటికి జమిందార్లకు శిస్తువసూళ్ళ తప్ప మిగతా అధికారములు లేవు. మిలిటరీ వగైరా అంతా కంపెనీవారు తగ్గించిరి. జమిందారులు శిస్తుడబ్బులు వసూలు చేసుకొని, పేష్కషు చెల్లించి, మిగతా అనుభవించు భోగపరాయణులైరి. జగన్నాథబాబు తన యాస్థానకవి ములుగు పాపయారాధ్యునిచే దేవీభాగవతము, వేమనారాధ్య చరిత్ర, ఘూర్జర చరిత్ర మొదలగు గ్రంథములను వ్రాయించెను. సంగమేశ్వరకవిచే అహల్యాసంక్రందన విలాసము కూడా వ్రాయించెను. దివి

* Krishna District Manual.

సీమలోని లంకలను క్రొత్తపల్లి అప్పయ్య అనే కమ్మసామంతునకు ఇతడు కవులునకిచ్చుచుండెను*. రామనాధబాబు జమీభాగమునకై వేసిన వ్యాజ్యము పరిష్కారముకాకముందే 1825 లో జగన్నాధబాబు సంతానహీనుడై మరణించెను. ఈయన భార్య రంగమ్మ చావ లక్ష్మీపతిని దత్తునిగా స్వీకరించెను. 1827 లో ఈదత్తుని ప్రొవిన్సియల్ కోర్టువారు రద్దుచేసిరి గాని 1832 సాదరు కోర్టువారు జగన్నాధ, రామనాధ, బాబు లిర్వురు అవిభక్త దత్త పుత్రులుగా భావించి, రామనాధబాబుకు సంస్థాన అధికారము నిర్ణయించిరిగాని యింతలోనే దీని పేష్కషు క్షామములు కారణమువ చెల్లింపబడనందున కంపెనీవారు 1844 లో వేలమువేసి తామే తీసుకొని, జమిందారు కుటుంబపోషణకు ప్రతి నెల వెయ్యి రూపాయలు అలవెన్సు మంజూరుచేసిరి. ప్రివికౌన్సిలులో అప్పీలుపైని వెంకటాద్రినాయుడు రెండవదత్తు చేసుకొనుట అశాస్త్రీయమని భావించి, జగన్నాధబాబుకే రాజ్యాధికారము నిర్ణయించి, చావలక్ష్మీపతిని ఆయన దత్తపుత్రునిగా తీర్పుచెప్పిరి. తద్వంశీకులకే యిపుడు జమీ అలవెన్సులు నెలకు వెయ్యి రూపాయలు ముట్టుచున్నవి. లక్ష్మీపతి తర్వాత లక్ష్మీనరసింహనాయడు, తర్వాత యిపుడు హరిహరప్రసాదును దత్తపుత్రులుగా వచ్చి యీ అలవెన్సులు పొందుచున్నారు. 1843లో జగన్నాధబాబు భార్య అచ్చమ్మ 3 దేవాలయములను, 1844 లో నొక మంటపమును చింతపల్లిలో కట్టించి పేరొందెను.

(A. R. No. 185 & 186 of 17)

1832 లో వచ్చిన క్షామంలో గుంటూరుజిల్లాలో 1½ లక్షల జనం చనిపోయిరి. దోపిడీలు జరిగెను. అందుచే జమీందారులు నిస్సహాయులుకాగా, జమీలను నామకా విక్రయిమునకు కంపెనీవారు వానిని కాజేసిరి. ఈవంశములో నాయుడమ్మయను నతడు 18 వ శతాబ్ది చివర శూరాగ్రేసరుడై నైజాముసేనల తుపాకులకు గురిఅయ్యెను. వారిసేనలో చాలామందిని హతముచేసినట్లును, సైనికులకు పురములు దోచినందున యీ వైరమేర్పడినట్లును, చింతపల్లిలో గల యొక శాసనమువల్ల తెలియుచున్నది. (A. R. No. 279 of 34,35)

హరిహర ప్రసాదునకు, శ్రీరామభాను ప్రసాదు, వెంకట నృసింహరావు, విజయభూప, బాలశంకర ప్రసాదను పుత్రులు కలిగి యీ జమీకి వారసులైరి.

---

* నానారాజన్య విఖ్యాత జన చరిత్ర.

ఇప్పుడిదికూడా తక్కినవానివలె సర్కారులో కలిసినది. 1832 నుండి యీ జమీందారులు అమరేశ్వరస్వామికి జరిపే వుత్సవాలు ఆగిపోగా హైదరాబాదు గవర్నమెంటు తరఫున మంత్రి చందూలాల్‌గారు దంతెల బోరగ్రహార మిచ్చెను. దీనివల్ల ఏటేటా వెయ్యిరూపాయలు వచ్చుచుండెను. దానిని మార్చి తర్వాత దెందుకూరులో 500 యకరము లిచ్చిరట.

## ముక్త్యాల యెస్టేటు.

దీనినే చింతలపాటి పంటు జమీ అనెదరు. వాసిరెడ్డి చినవెంకటాద్రి నాయని పుత్రుడగు భవానీ ముక్తేశ్వరనాయడు ఆయన అనంతరము 1824 ప్రాంతమునుండి యీ యెస్టేటు పాలించెను. తండ్రి దెచ్చిన యభియోగము లలో 1816 లోనే యీ పంటు యెస్టేటు వీరికి స్థిరపడెను. చిన వెంకటాద్రి నాయుడు విద్వజ్జనుల నాదరించెను. కృష్ణామహాత్మ్యమను గ్రంధమును వ్రాయించి, దానికి కృతిభర్తయయ్యెను. ఈకవి తాతంభట్టు గురుమూర్తిశాస్త్రికి కుచ్చెలభూమినిచ్చెను. వేదాద్రిలో కృష్ణకు సోపానములను ముక్త్యాల దేవునికి వేదాద్రిదేవునికి అనేక స్వాస్థ్యములను నిర్మించెను. శ్రీభవానీముక్తీశ్వరప్రసాదు పాలనకు వచ్చిన తరువాత చింతపల్లి పంటు బాకీకొరకై దీనినికూడా సర్కారు వారు జప్తుచేసిరి. తర్వాత దీనిని విడదీసి 1862 సం॥లో ప్రత్యేక జమీచేసి 17500 రూపాయలు పేష్కషు నిర్ణయించిరి. ఈతడు కవి పోషకుడై కొప్పు రాజు సుబ్బరాయకవిచే శ్రీ కాంచీ మాహాత్మ్యమును వ్రాయించెను. వేదాద్రి నృసింహస్వామికి ధ్వజమెత్తించెను. శ్రీరంగం, తిరుపతి, కంచి, దేవుళ్ళకు వార్షికముల నిచ్చెను. పుణ్యక్షేత్రముల నన్నింటిని కాశీ రామేశ్వర పర్యంతం దర్శించెను. శంకరాచార్యమఠమునకు గొంత భూదానమిచ్చెను. అమరవాది రామయ్య అను మఠాక కవిచే ద్రౌపదీ పరిణయమను, 8 అశ్వాసముల పద్య కావ్యము వ్రాయించెను. మన్రోగారి రైతువారీపద్ధతి ఈయన కాలములో అమలుకు వచ్చెను.

## ఉమామహేశ్వర ప్రసాదనాయడు

ఈయన చింతలపాటిలో గుడిగోపురములను నిర్మించెను. ముక్త్యాలలో దేవుళ్ళకు 2 ధ్వజ స్తంభములను వేయించెను. ఈయనకు సంతానము లేక తమ్ముడగు వెంకటాద్రి పుత్రుడు చంద్రమౌళిని దత్తుచేసుకొనెను. వెంకటాద్రి పోపూరులో శివాలయ నిర్మాణ మొనర్చెను. ఈ వెంకటాద్రి ద్వితీయ పుత్రుడు

దుర్గాసదాశివేశ్వర ప్రసాదుగారు జయంతిపుర రాజాగా పేరొంది 1937లోశాసన సభ్యులై ప్రజాసేవ సల్పెను. చంద్రమౌళేశ్వరనాయుడు పాలనకు రాగానే నృశింహస్వామి దేవళ శిఖరము కట్టించి, శతశిల్పి సూలులపాటి నరసింహం చౌదరిచే సర్వాంగ కవచము చేయించి, శివాలయమునకు గోపుర, శిఖర, ధ్వజ స్తంభములను హనుమదేవాలయమున మంటపమును నిర్మించెను. కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిగారిచే ఆంధ్రమహాభారతము సంస్కృతమునకు సరియైన తెలుగుగా కొంతవరకు వ్రాయించెను. ఈ యెస్టేటులో 7 చెర్వులుగలవు. వీని వల్ల పల్లపు సాగవుతున్నది. 1924 నుండి 1937 వరకు వీని కాల్వల మరమ్మతులకు 50 వేలు వ్యయపరచెను. తన తండ్రి తాతలు వ్రాయించిన గ్రంథములను యితడు ముద్రింపజేసెను. ఇతడొక వైద్యశాఖ నేర్పాటు చేసెను ఈయనకు రామకృష్ణ మహేశ్వర ప్రసాదనాయుడు జనించి, పెద్దవాడై తండ్రి వలెనే కీర్తి చెందుచున్నాడు. ఈ జమీకూడా తక్కినవానివలె యిపుడు రద్దయి పోయినది. ఆచంట లక్ష్మీపతిగారి ఆయుర్వేద దర్శనమును, కవిరాజ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణమును, వారి యౌదార్యముననే ప్రకటింపబడినవి. చిరుమామిళ్ళవారు చాలామంది యీ వంశీకులకు రాజబంధువులుగా నుండి రాచకార్యములందు తోడ్పడుచుండిరి. (శకుంతలాపరిణయం)

## దేవరకోట సంస్థానము

1819లో రెండవ అంకినీడు చనిపోగా, నాతని దత్త పుత్రుడు దుర్గా ప్రసాదనాయుడు సంస్థానపాలకుడై జమీ యితని మైనారిటీలో కోర్టు ఆఫ్ వార్డ్సు క్రింద నుండగా, 1831 నాటికి పాలన గైకొనెను. 1833 సంస్థానము పేష్కషు కట్టలేక, జప్తు అగుటయు 1835లో నిత డకాలమరణము జెందుటయు జరిగెను. ఈయన దత్తపుత్రుడు మూడవ అంకినీడు మైనరైనందున తిరిగికోర్టు ఆఫ్ వార్డ్సు వారే జమీ పాలన గైకొనిరి. 1851లో ఈయన పాలనకు వచ్చెను. ఈయన కాలములో 1864లో బందరు గాలివాన యను పేరుగల ఉప్పెన రాగా రైతుల కనుకూలమైన వీసపడిపద్ధతిని శిస్తులను వసూలుచేసెనట. ఇతడు తోటలు వేయించి వ్యవసాయము వృద్ధిజేసెను. కోటలోను, పళ్ళెపల్లిలోను, గృహ మరమ్మతుల జేయించెను.

కొంతకాలము సంస్కృతపాఠశాల పెట్టించెను. ఈయన తర్వాత1876లో మల్లికార్జున ప్రసాదనాయుడు జమీపాలకుడయ్యెను. ఈతని సోదరుడు

దుర్గాప్రసాదు, వెంకట్రామలింగనాయడులకు సంస్థానపాలనలేకుండా మనోవర్తిని కోర్టువారిప్పించిరి. ఈయన బందరు పురమందిర నిర్మాణమునకు సప్తమ ఎడ్వర్డు చక్రవర్తి జ్ఞాపకచిహ్నమునకు గొంతసొమ్ము దానమిచ్చెను. సంస్థాన ప్రజలకు మందులను చేయించి ఉచితముగా నిచ్చెడివాడు. సంగీతము, ఫోటోలు తీయుట, వ్యాయామ పాఠశాలలలో నీయన కుత్సాహముండి ప్రోత్సహించెడివాడు. 1921లో నీయన పాలన బాగులేదని కుమారుని అర్జీపై కోర్టు ఆఫ్ వార్డ్సువారు జమీ తీసుకొనిరి. ఆ సం॥లో నతడు చనిపోయెను. తర్వాత నాలుగవ అంకినీడు బి. ఏ. గారు జమిందారయ్యెను. ఈయన పాలనకు వచ్చినపుడు 50 వేల శిస్తు మాపుజేసెను. 7 వేల రూపాయలు నవుకర్లకుయిచ్చెను. సుశీల నాటకమునకు కృతిభర్తయయ్యెను. కమ్మ మహాజన సంఘమునకు, ఏలూరు పశువుల నీటికుండికి సహాయమిచ్చెను. కృష్ణ కరకట్ట తెగినపుడు రైతులకు సహాయపడెను. ఈయన తన రెండవ కుమారునికొరకై ముంజులూరు, పెనమకూరు సంస్థానము 6 గ్రామములుకొనెను. ఇతడు 1927లో చనిపోయెను.

తర్వాత శివరామప్రసాదు పాలకుడయ్యెను. ఈయన పాలనకు వచ్చినపుడు అనేక సంస్థలకు, పండితులకు, కవులకు ధర్మములిచ్చెను. ఈయన ఆంధ్ర విశ్వవిద్యాలయమున 8 వేల రూప్యములిచ్చి తనపేర నొక ఉపకార వేతన మేర్పరచెను. జిల్లాబోర్డు అధ్యక్షుడుగా ఎన్నుకోబడి ప్రజాసేవ చేసెను. మదరాసు శాసనసభ్యుడుగాకొంతకాలముండెను. చల్లపల్లిలో నొక హైస్కూలును ఈయన నడుపుచున్నాడు. అభినవతిక్కన, తుమ్మల శీతారామమూర్తి గారిచే రాష్ట్రగానము కృతిబొందెను. ఇంక నిట్లే కొన్నిటిని పొందెను. ఈ జమీ పేష్కషు 1924లో 78 వేలు పైగా వున్నది. ఇది యిప్పుడు సర్కారుచే తక్కినవానివలే రద్దుకాబడి, పరిహారమీయ బడినది. ఈ జమీలో శ్రీ బంపాల వెంకటేశం చౌదరి, గోగినేని లక్ష్మినరసయ్య చౌదరీలు దివానులుగా పనిజేసెరి. మరికొందరుగూడా యట్లొనరించిరి.

## కురుపికులము జమీ *

దీనిని సంపాదించిన పెమ్మసాని పెదవీరప్పనాయని తర్వాత 22 పురుషాంతరములు జరిగిన పిమ్మట 23 వ వాడగు నందస్వామిదొర 1870 ప్రాంతములో

* The Chiefs, Nobles & Zamindars of India.

పాలనకు వచ్చెను. ఈ వంశావళి లోకలు రికార్డులలో నున్నదిగాని వారి విశేషములు తెలియవు. 1564–72 మధ్య నీవంశములో రుద్రప్పనాయడు సింహళ ద్వీపయుద్ధమున బాల్గొనిన విషయము లోగడ చెప్పడమైనది. 1877 నాటికి యీ జమీలో కొండలరాయస్వామి పాలనవచ్చెను. ఆయనకు ఢిల్లీలో జరిగిన రాజ్యసభలో నొక యోగ్యతాపత్ర మీయబడెను. రాజభక్తి బీదలయెడ ధర్మబుద్ధికి సంతోషించి యిది యొసంగబడెను. ఈ జమీ అవిభక్తమనియు, సోదరులు పోషకభృతి కర్హులనియు నొక వ్యాజ్యములో హైకోర్టు నిర్ణయించెను. ఈయన కుమారుడు తిమ్మనందస్వామి వైరాగ్యపరుడు, మతధర్మాసక్తుడై వ్యవహార దూరుడై చనిపోగా, అతని కొడుకు 1892 లో కొండల రామస్వామినాయుడు జమీందారయ్యెను. ఈయనకు 1911లో ఢిల్లీ దర్బారులో నొక యోగ్యతాపత్ర మిచ్చి గౌరవించిరి. 1914లో కపిలేశ్వరపుర కమ్మ మహాజన సభకితడధ్యక్షుడయ్యెను. 1928, 29లో కోయిల్ పట్టి తాలూకా బోర్డు వైస్‌ప్రెసిడెంటుగా పనిచేసెను. యూనియన్ చైర్మన్‌గాను, జిల్లాబోర్డు సభ్యుడుగాను ఉండి ప్రజా సేవనొనర్చెను. ఈయనకు సంగీతములో మంచి ప్రవేశముండెను. తమిళ భాష వచ్చును. 1939లో నీయన యేకైక పుత్రికను రంగాపురం జమీందారు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి కుమారుడు సుబ్రహ్మణ్యంకు యిచ్చి పరిణయ మొనర్చెను. ఈయన సంస్థానములో 5 చెర్వులున్నవిగాని మరమ్మతులలోలేవు. ఇటీవల నీతడు చనిపోయెను.

## ఇలయరస నందల్ సంస్థానము, పార్టు I.

1564–72 మధ్య సింహళద్వీప యుద్ధములో నీ సంస్థాన పాలక వంశీయులలోని రావెళ్ళ రమణప్పనాయడు పాల్గొనినట్లు లోగడ చదివితిమి. 1748లో నీ జాగీరు చందాసాహెబ్ కాలమునుండి పేష్కషు కట్టు జమీయయ్యెను. దీనిలో 1572–1812 వరకు గల పాలకులపేర్లు తెలియవు. 1810లో నీ సంస్థానము రెండుగా భాగింపబడెను. అపుడు రావెళ్ళ పెద్దకస్తూరిరంగ అప్పలస్వామి గారి పాలనలోనుండెను. తర్వాత నిది అవిభక్త జమీగా నిర్ణయింపబడెను. 1864–69 మధ్య రావెళ్ళ వెంకటరంగ అప్పాస్వామినాయుడు పాలించెను. ఈయనకాలములోనైన నగరమను మెట్టను నూతనముగాకొని సంస్థానమునకు జేర్చెను. 1869–1900 మధ్య కస్తూరిరంగ అప్పాస్వామినాయుడు II పాలిం

చెను. 4 భాషలలో నితడు ప్రవీణుడు. 1877లో ఢిల్లీ రాజసభలో నీయనకొక యోగ్యతాపత్రము రాజభక్తికి, దయాధర్మగుణ చిహ్నమునకు యిచ్చిరి. ఈయన తర్వాత వెంకటరంగ అప్పస్వామి జమీందారయ్యెను. తండ్రివలె నితడు సంస్కృతాంధ్ర, ద్రావిడ భాషలలో ప్రవీణుడు. తాలూకా జిల్లా బోర్డులలో మెంబరుగా నుండెను. 1921 ప్రాంతమున నితడు చనిపోగా అప్పాస్వామి నాయడు పాలకుడయ్యెను. కాని ఈయన మైనారిటీలో జమీ కోర్టు ఆఫ్ వార్డ్సు పాలనలోనుండి 1933లో తాను స్వయముగా తీసుకొనెను. ఈ జమీలో 10 చెరువులున్నవి. ఇంతవరకు జమీపాలకు డీయనయే. ఈ సంస్థానము కూడా నిపుడు రద్దుకాబడినది.

## సెవ్వాల్ పట్టి సంస్థానము.

1803 సం॥లో యీస్టిండియా కంపెనీవద్ద బెల్లం సామినాయుడు గారు దీనిని విక్రయించుకొనిరి. ఇందులో 26 గ్రామములున్నవి. ఇవి తిరునల్వేలి, రామనాడు జిల్లాలలో నున్నవి. దీనిలో 18 వేల జనసంఖ్యయున్నది. ఈయన పూర్వీకులు విజయనగర రాజ్యమున గొప్ప హోదాలోనుండిరని వంశీయులు చెప్పుచున్నారు. కాని ఆధారములు దొరకలేదు. ఈ వంశములో అక్కప నాయడు 1623—59 మధ్య మధురరాజ్య పాలకుడుగా నుండిన తిరుమలనాయ కుని కత్యంత ఆప్తుడట. రాజ్యాంగ సలహాదారట. ఈయన సత్తూరులో విష్ణ్వా లయమున కొక మంటపము గట్టించి, యేటేటా రథోత్సవము చేయించెడివాడట.

సామినాయడు **1**. పాళెగాళ్ళందరికి తన సహాయ మవసరమయినట్లు ప్రవ ర్తించెను. విట్టయపురం, పాంచలం కురిచి పాళెగాళ్ళ తగాదాలు మాన్పి రాజీ చేయగల్గెను. ఈయన కొత్తపల్లివారి పిల్లను పెండ్లాడెను. 1805లో నితడు చనిపోగా నీయన కుమారుడు రెండవ సామినాయకర్ జమిందారయ్యెను. ఇత డనేక పాళెములు కట్టించెను. 25 సం॥లు సంస్థానము పాలించి 1831లో చని పోయెను. 1832లో నీయనకుమారుడు సుబ్బానాయకర్ జమిందారయ్యెను. గుర్రపు స్వారిలో నితడు ప్రవీణుడు. తెలుగు, ద్రావిడ భాషలు నేర్చెను. సంస్థా నమున నితడు తోటలు వృద్ధిజేసెను. చెరువులు మరమ్మత్తులు జేయించెను. పుర నిర్మాణం జేసెను. నూతనభవన మొకటి కట్టించెను. ఆళ్వారు తిరునగర దేవాలయ ధర్మకర్తయై చక్కగా పాలించెను. ఈయన 1853 లో చనిపోగా, మైనరు కుమాళ్ళ కాలములో కోర్టు ఆఫ్ వార్డ్సు జమీ కైకొనెను.

రెండవ సుబ్బానాయడు 186- లో పరిపాలన గైకొనెను. తోటలను వృద్ధి జేసెను. జిల్లాబోర్డు మెంబరుగా చాలాకాలముండెను. 1877లో విక్టోరియారాణి ఢిల్లీ దర్బారు జరిపించెను. దానిలో నీయనకొక యోగ్యతాపత్రమిచ్చిరి. రాజభక్తికి, దాన దయాపరతంత్రల కిది లభించెను. ఈతడు విల్లిపుత్తూరుహైస్కూలునకు సహాయము జేసెను. కొన్ని భవనములు జిల్లా డివిజన్ స్థానములలో సంపాదించెను. ఈయనకూడా కొత్తపల్లివారి కన్యనే పెండ్లాడెను. 1897 లో నీయనకుమారుడు మూడవ సుబ్బనాయకర్ పాలనకువచ్చెను. ఈయనకు గుర్రపుస్వారి, వ్యవసాయము, చారిత్రక విషయములు, వ్యాయామము, శాకాహారనియమము, వేదకాలపు ఏక జాతీయతలయం దభిమానమున్నది. మదరాసు ఆక్టు 9 **of** 1930లో నీ జమీగా అవిభాజ్య సంస్థానము శాసించిరి. ఈయన 1920 లో జరిగిన ప్రథమ దక్షిణదేశ కమ్మమహాజనసభాధ్యక్షుడయ్యెను. ఈయన జిల్లాబోర్డు ఉపాధ్యక్షుడుగను, తాలూకా బోర్డు మెంబరుగను కొంతకాలముండెను. ఈయనకు 1920లో జన్మించిన హరిశ్చంద్రనాయడను కుమారుడు తండ్రిగారికి తోడు నీడగా నున్నాడు.

## కపిళేశ్వరపురం, కేసనకుర్రు జమీలు.

బలుసు పెద సర్వారాయుడుగారు దీనిని 1818లో సంపాదించిరి. కపిళేశ్వరపురమునకు 6 శివారు లంకలున్నవి. ఈయన బ్రాహ్మణులకు, భట్టులకు, భూములు, గోవులు, మొదలగు దానములనేక మిచ్చుచువచ్చెను. ఒక తటాకము నిర్మించెను. ఈయన 1847లో చనిపోగా బుచ్చి కృష్ణయ్యగారను కుమారుడు పాలనకు వచ్చెను. 1852లో నితడు 6 గ్రామములు కలిగిన కేసనకుర్రు సంస్థానమును దంతులూరి బుచ్చి కృష్ణరాజుగారి వద్దనుంచి విక్రయించుకొనెను. ఈ రెండు జమీలను చక్కగా పాలించుచు, నితడు బ్రాహ్మణులకు సమారాధనలు గావించుచు, వర్షాశనములనిచ్చుచు, దేవతారాధనలు జేయుచు పేరొంది, 1853లో చనిపోయెను. తర్వాత నితని సోదరుడగు పట్టాభిరామయ్యగారు పాలనకు వచ్చి, పండిత గోష్ఠిలోను, సత్కాలక్షేపము లందు నిమగ్నుడై, దైవభక్తిపరుడై 1866 వరకు పాలించెను. 1866లో బుచ్చి సర్వారాయుడుగారు పాలనకు వచ్చెను. ఈయన 3సం॥లు మాత్రమే పాలించి హఠాత్తుగా చనిపోగా, సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సుకు జేరెను. 1866లో నీ జమీ సర్వారాయుడుగారి

భార్య రామలక్ష్మమ్మగారికి వశమయ్యెను. 40 వేల రూపాయలతో ఈమె గొప్ప సత్రమును కట్టించెను. ఈమె మైనారిటిలోనే భర్త చనిపోయి, కుమాళ్ళులేనం దున వారసులు సంస్థాన హక్కుకై దావావేసిరిగాని దీనిలో నామెకు దత్తతాధి కారమును ప్రీవీ కౌన్సిలులో ఖాయపరచిరి. ఈమె దత్తపుత్రుడు పట్టాభిరామయ్య యిర్వురు కుమాళ్ళను గాంచి 1896లో చనిపోయెను. ఈ బిడ్డల మైనారిటీలో కూడా రామలక్ష్మమ్మగారే జమీ పాలించెను. 1906లో నీమె చనిపోగా, మను మడగు బుచ్చి సర్వారాయుడు బహదూర్ II గారు జమీందారయ్యెను. కాని ఈయన మైనారిటీలో తల్లి జానకమ్మగారు పాలించెను. 1908 నుండి యీయన జమీపాలన గైకొనెను. 1913 లో నీయన కపిళేశ్వరపురమున సెకండరీ హైస్కూలు స్థాపించి, 10 వేల ధనముతో జిల్లా బోర్డునకు యిచ్చెను. ఒక రోడ్డును వేయించెను. ఇంపీరియల్ అగ్రికల్చరల్ రీసర్చి సొసైటి మెంబరుగా నుండెను. ఈయన రాధామాధవము, ఆంధ్రకవితరంగణి (చాగంటి శేషయ్య గారిది) సుగ్రీవ విజయమనే గ్రంధములను ముద్రింప జేసెను. హసన్‌బాద గ్రామమును నూతనముగా నితడు సంపాదించెను. ఈయన జిల్లాబోర్డు అధ్యక్షుడుగా, స్పెషల్ ఆఫీసరుగాను ప్రజాసేవసల్పెను. 1945లో నీయనకు బ్రిటిషు ప్రభుత్వమువారు రావుబహద్దూర్ బిరుదు నిచ్చి గౌరవించిరి. వీరి కుమాళ్ళలో ప్రభాకర పట్టాభిరామారావుగారు కొంత కాలము ఆంధ్ర విశ్వవిద్యా లయ సిండికేట్ సభ్యుడుగానుండి 1952లో మదరాసు రాష్ట్ర మంత్రులలో నొక్కడై, 1953లో ఆంధ్రరాష్ట్ర మంత్రులలో నొక్కడుగా దీసుకొనబడి ప్రజాసేవలో కీర్తి జెందుచున్నాడు. 1958లో మరల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రులలో నొకడయ్యెను. ఈయన విద్యాశాఖను పాలించుచున్నాడు. ఈయన కాలములో రాష్ట్రమున సాహిత్య అకాడమీ, సంగీత అకాడమీ, ప్రభుత్వముచే వాచక పుస్తక ప్రచురణ సంస్థలేర్పడి పనిజేయుచున్నవి.

## ఉండ్రాజవరం జమీ.

పేరుగన్న కమ్మవంశపు కమ్మదనము, నెమ్మది, సిరిసంపదలుపాడి పంటలు కోకొల్లలుగా గల భూస్వామి శ్రీ ముళ్ళపూడి తిమ్మన్నగారు. తణుకున కాయన తలమానికము. కావున ఆయూరి మునసబుగిరీ తనంతతాను తిమ్మన్న గారిని చేపట్టెను.

19 వ శతాబ్దములో బ్రిటీషువారి హయాము, 'ఆరుపూవులు మూడు కాయలు'గా ఉన్నరోజులవి. శ్రీ తిమ్మన్నగారు బొరతనమువారి మన్ననలకు పాత్రమై జమీందారీ గ్రామములను ఆర్జించి జమీందారు డయ్యేను. కయ్యమునకు నెయ్యమునకు సమత పలయును కాన శ్రీతిమ్మన్నగారు జమీందారీ సంబంధము లందసాగెను.

పశ్చిమ గోదావరి జిల్లాలోని దొమ్మేరులో శ్రీ పెంహ్యాలరాయడుగారు పేరుమోసిన జమీందారు. తిమ్మన్నగారు తన సోదరి అచ్చాయమ్మగారిని రాయడుగారికి అర్ధాంగిని జేసెను. తన పుత్రిక బులి అచ్చాయమ్మగారిని రాయడుగారి పుత్రుడు అచ్యుతరామయ్యగారికి సహధర్మచారిణిని చేసెను. తిమ్మన్నగారి భార్య ఆర్య చరిత్రయగు ఆశాలమ్మగారు. ఆమె కడుపు ఫలింప లేదు. సంతతి లేమికి తిమ్మన్నగారి నెమ్మది ఉమ్మలిక చెందినది. కులీనతకు పేరు పడిన పెండ్యాలవారి దౌహిత్రుడగు వేంకటరాయడుగారిని దత్తునిగా స్వీక రించి వంశము తరింపజేసికొనెను.

శ్రీ పెండ్యాల అచ్యుతరామయ్యగారి పుత్రికారత్నమును శ్రీమతి అక్కమాంబను తనకు కోడలుగా గ్రహించెను. అక్కమాంబా వేంకటరాయల దాంపత్యము పార్వతీ పరమేశ్వరుల దాంపత్యమువలె పరమ పవిత్రమై విలసిల్లినది.

రాయడుగారు తల్లి దండ్రులు గీసిన గీటుదాటని కర్మఠుడు తిమ్మన్న గారు స్వప్నమందైన దత్త పుత్రశోక మెఱుగడు.

రాయడుగారు కణ్ణును తొణ్ణును (ఆవులు) నమ్మి భూదేవిని సేవించి పట్టినదెల్ల బంగారము గావించెను. 'పొలము పండవలె కడుపు పండవలె' నన్న సామెత ఆయన యెడ అక్షరాల సార్ధకమైనది. పొలము ఫలించెను. కడుపును ఫలించెను. ఆఱుగురు కూతులు 'ఒకేయొక' పుత్రుడు. అతడే శ్రీతిమ్మరాజు. దత్తపుత్రుని వలన తిమ్మన్నగారి వంశము తామరతంపరయైనది.

రాయని యింట ఎల్లప్పుడు వసంత సంపద విలసిల్లుచుండెను. కడుపు పంటతోపాటు పొలముపంటలు ఇనుమడించుటచే రాయనియింట ధనము మూలుగ సాగెను. ఉంద్రాజవరం, లింగాల, త్యాజంపూడి అను గ్రామములు విలిచి జమీందారుడయ్యేను. రాయడుగారికి దొమ్మేరు జమీందారు శ్రీపెండ్యాల

అచ్యుతరామయ్యగారు ఒకవంక మేనమామ, తన సోదరి బులి అచ్చాయ్యమ్మ ఆయన కిల్లాలు కావుటచే బావ, మరొకవంక పిల్లనిచ్చినమామ. బావయు-సోదరియు కాలగతిచే దిగవంతులైరి. వారి కుమారుడు వేంకటకృష్ణారావు ముక్కుపచ్చలారనివాడు. గంపంత సిరిగలవాడు. కావున రాయడుగారు ఆబిడ్డ ఆస్తిపాస్తులకు తాను ఏలికయై పెంపొందించి తన జ్యేష్ఠ పుత్రిక అనంత లక్ష్మీదేవిని ఆకుమార జమీందారునకిచ్చి పరిణయము చేసెను.

వేంకట కృష్ణారావు పదునేడేండ్లు నిండకమునుపే అనంతలక్ష్మి కుంకుమ రేఖను తుడిచివైచెను. రాయడుగారి జీవితవృక్షశాఖపై ఒక చిచ్చులపిడుగు పడెను. కష్టములలో మహాత్ముల మనస్సులు వజ్రములకంటె కఠినములగును కావున రాయడుగారు ధైర్యమువహించి నిడదవోలు పల్లమ్మగారి దత్తుడును తన రెండవ యల్లుడునగు శ్రీనిడదవోలు వేంకటరామయ్యగారి కుమారుడు శ్రీరామచంద్ర వేకంటకృష్ణ రంగారావును అనంతలక్షిదేవికి దత్తునిగానొసంగెను.

నాల్గవ కుమార్తె శ్రీమతి బులి నారాయణమ్మను తన మేనల్లుడగు యల మర్తి సత్యనారాయణగారికిచ్చి యిల్లిడ వెట్టుకొనెను. మిగిలిన నలువురుసుతలను శ్రీ చిట్టూరివారి కోడండ్రను జేసెను. రెండవ పుత్రిక శ్రీమతి నారాయణమ్మను ముక్కామల వాస్తవ్యులు శ్రీ చిట్టూరి శ్రీరాములుగారి (జనకతండ్రి) కుమార్డు శ్రీ వేంకటరామయ్యగారికిని; మూడవపుత్రిక శ్రీమతి అచ్చాయమ్మను తణుకు వాస్తవ్యులు శ్రీ చిట్టూరి సుబ్బారాయుడుగారి పుత్రులు శ్రీ యింద్రయ్య (గ్రామ మునసబు) గారికి; పంచమ పుత్రిక శ్రీమతి శ్రీలక్ష్మిని కూళ్ళ కాపురస్తులు శ్రీ చిట్టూరి నరసింహముగారి పుత్రులు శ్రీ వేంకటలక్షీ సరస్వతీ ప్రసన్నరావు గారికిని; ఆరవ పుత్రిక శ్రీమతి లక్ష్మీదేవిని కూళ్ళ కాపురస్తులు శ్రీ జానకి రామయ్యగారి పుత్రులు శ్రీభువనైకరావుగారికిని యిచ్చి వివాహములు గావించిరి. ఉభయ గోదావరి మండలములలోని చిట్టూరివారు వెలనాటిరాజులయొద్ద, కాకతీయులవద్ద, గోల్కొండ నవాబుల దగ్గఱ దండనాయకులుగా ఉండి పౌరుష ప్రతాపములు చూపి రాజభక్తులై పేరెన్నికగాంచినారు.

శ్రీ ముళ్ళపూడి శ్రీచిట్టూరివారి బాంధవ్యములు తరతరములు పడుగు పేకలుగా పెనవేసికొని యున్నవి. శ్రీరాయడుగారి ముద్దుల కొడుకు శ్రీతిమ్మ రాజుగారి ప్రియురాలు శ్రీమతి వేంకటరమణమ్మ. ఆమె ఆభిజాత్యమునకు

పేరుపడ్డ శ్రీ బోళ్ళ సుబ్బారాయడుగారి పుత్రికామతల్లి. ఈ సంబంధముచే కపిలేశ్వరపుర జమీందారులు శ్రీ బుచ్చి సర్వారాయడుగారు; ఆంధ్రవిశ్వకళా పరిషత్ (మాజీ) ఉపాధ్యాయులు ప్రవాసిరెడ్డి శ్రీకృష్ణగారు వీరికి బంధువులు. శ్రీతిమ్మరాజుగారు స్కూలు ఫైనలు చదువుచుండగా గాంధి మహాత్ముని అసహాయోద్యమము ఆరంభమయ్యెను. మహాత్ముని శంఖారావము శ్రీ తిమ్మరాజు గారిని స్వాతంత్ర్యయోధుని గావించెను. ఇంగ్లీషు విద్యకు స్వస్తిచెప్పి ఆయన తణుకు జాతీయ పాఠశాలలో ప్రప్రథమ విద్యార్థిగా గణనకెక్కెను.

## శ్రీ తిమ్మరాజుగారు.

శ్రీ తిమ్మరాజుగారు వెంకటరమణమ్మయందు ప్రమతి లచ్చాయమ్మ, శ్రీ హరిశ్చంద్రప్రసాదు అను పుత్రికాపుత్రులను గాంచెను. బహుశ్రుతుడైన శ్రీ తిమ్మరాజుగారు చాణక్యనీతి ఆలంబనముగా రాజకీయరంగమున యోధుడై నిలిచెను. అపజయమెఱుగని వీరుడై 1923 నుండి 1927 వఱకు తాలూకాబోర్డు వైసు ప్రసిడెంటుగను; 1927-1934వఱకు తాలూకాబోర్డు ప్రసిడెంటుగను; 1927-1942వఱకు జిల్లాబోర్డుమెంబరుగను ప్రజాసేవ చేసెను. 1934నుండి 1953వఱకు తణుకుపంచాయతీబోర్డునకుఅధ్యక్షుడై తణుకును అనేకవిధముల లభివృద్ధిచేసెను.

కాంగ్రెస్సే శ్రీ తిమ్మరాజుగారి రాజకీయపక్షము. విద్యసార్వజనీనమై ఉన్నతస్థాయిని వృద్ధిగాంచుట ఆయన అభిమతము. ఉపాధ్యాయు లాయనకు కూర్చువారు. కవి పండితులు ఆయనకు తోడు నీడలు. చరిత్ర ఆయనకు ప్రియతమ విద్య. ఆంధ్రాంగ్ల హిందీ గ్రంథములాయన ప్రాణమిత్రములు. ఈ భాషలలో ఎన్నియో ఉత్తమకావ్యములను గ్రంథములను చేకూర్చి పెద్ద గ్రంథాలయము నెలకొల్పినారు. ఉత్తమ కావ్యములను ప్రకటించుటకై రాయల ముద్రణాలయము నెలకొల్పినారు. నరేంద్రనాధ సాహిత్యమండలిని స్థాపించినారు. సర్వతోముఖమైన సాహిత్య వికాసమునకు బాసటయై నిలిచినారు. తమ సాహిత్యమండలిలో సంస్కృతాంధ్రములకు జయపురసంస్థానాస్థానకవులును ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక సభ్యులునగు శ్రీపండిత పెన్మెత్స సత్యనారాయణరాజుగారిని; సరస్వతీ కంఠాభరణ శ్రీవేదుల సూర్యనారాయణశర్మగారిని అధిపతులును గావించుకొనెను. ఆంగ్లమునకు శ్రీనాదెళ్ళ కృష్ణమూర్తిగారిని; హిందీకి శ్రీవడ్లమాని సోమశేఖరముగారిని అధ్యక్షులుగా చేకొనెను.

శ్రీ తిమ్మరాజుగారు సప్తసంతానములలో భిలముగాని సత్కృతులను గూడ గాంచెను. పండిత సత్యనారాయణరాజుగారి రాజానందము అను అలంకార కృతికి, శ్రీ సూర్యనారాయణశర్మగారి రైతురాయడు, నరేంద్రుడు, బుద్ధగీత, ఆర్యచాణక్యుడు, కాకతీయ చరిత్రలకు అధినాయకుడు అయ్యెను.

నిరాడంబర జీవియగు శ్రీ తిమ్మరాజుగారికి విధివశమున ప్రధమ కళత్ర వియోగము కలిగెను. పిమ్మట శ్రీ తిమ్మరాజుగారు శ్రీమతి కమలాదేవీ ద్వితీయుడయ్యెను. శ్రీమతి కమలాదేవి ఇంటూరు గుంటూరుజిల్లా శ్రీకాట్రగడ్డ శ్రీరాములునాయుడుగారి పుత్రికారత్నము. విదుషీమణి. శ్రీమతి కమలాదేవి దేవేరి యగుటతో ఆమె పినతల్లి భర్తయు చల్లపల్లి జమీందారులగు శ్రీఅంకినీడు ప్రసాదుగారు, ఆమెకు మరొక పినతల్లి భర్తయగు శ్రీకాట్రగడ్డ గోపాలకృష్ణయ్యగారు, ఆమెకు ఇంకొక పినతల్లి భర్తయగు వదాన్యశేఖరుడు గుంటూరుజిల్లా బోర్డు ప్రెసిడెంటు ఎమ్. ఎల్. సి., యగు శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరియు, ఆమె మాతామహుడు మదరాసు వాస్తవ్యులు నౌకావ్యాపారియగు శ్రీ గడ్డిపాటి వీరయ్యనాయడుగారు మున్నగువారెందరో మహామహులు శ్రీ తిమ్మరాజుగారికి బంధువులైనారు.

శ్రీమతి కమలాదేవియందు శ్రీ తిమ్మరాజుగారు ముగ్గురుకుమార్తెలను ఒక కుమారుని గాంచెను. పాపము ఆ కుమారుడు నరేంద్రనాధుడు. ఋషివాలీ విద్యార్థిగా ఉన్నపుడే కమలాదేవి తిమ్మరాజుల కడుపున చిచ్చుపెట్టి దివంగతుడయ్యెను. అతని పేరు శాశ్వతమగుటకే నరేంద్రనాధ సాహిత్యమండలి వెలసినది.

## శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి.

ఇది శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి అధ్యక్షమున మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారి చేతిచలువచే అవతరించినది. కొమ్ములు తిరిగిన కవి పండితులగు [1] శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రి, [2] శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి, [3] శ్రీ వేదుల రామశాస్త్రి, [4] శ్రీ కాశీ కృష్ణాచార్యులు, [5] శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, [6] శ్రీ

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, [7] శ్రీ ఏటుకూరి నరసయ్య. [8] శ్రీతుమ్మల సీతారామమూర్తిచౌదరి, [9] డాక్టరు దివాకర్ల వేంకటావధాని, మున్నగు వారి నైందఱనో నరేంద్రనాధ సాహిత్యమండలి పక్షమున శ్రీ తిమ్మరాజుగారు సన్మానించినారు. నాట్యకళా పరిషత్తును ఆహ్వానించి మహావైభవముగా సత్కరించినారు. శ్రీ నరేంద్రుని పేరుతో తణుకు బహుళార్థసాధక పాఠశాలలో రు. 20,000 లు వెచ్చించి యింజనీరింగు భవనము నొకదానిని నిర్మించినారు.

శ్రీ తిమ్మరాజుగారి ప్రథమకళత్రము పుత్రులగు హరిశ్చంద్ర ప్రసాదుగారికి శ్రీ రంగారావుగారి సోదరియగు చంద్రమతిదేవిని ఒచ్చి పరిణయము గావింపబడెను.

శ్రీ హరిశ్చంద్రప్రసాద్ స్కూలు ఫైనలుతో చదువుచాలించి తాతగారగు శ్రీరాయడుగారి అడుగు జాడలలో మెలగి ఆయన స్థాపించిన రైసుమిల్లులతో తృప్తిగాంచక ఏబదిలక్షల రూపాయల పెట్టుబడితో ఆంధ్రా సుగర్సు మిల్లును; లక్కవరం ఒక్సైర్సెల్సు మిల్లును, కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీని, పెక్కు చిన్న పరిశ్రమలను స్థాపించి వినయ భూషణుడై, రాజసభాసభ్యుడై పేరుగాంచుచుండుటయేకాదు తన పరిశ్రమల స్థాపనకు అండదండయై ప్రోత్సాహకుడైన తన బావ కీ. శే. శ్రీ పెండ్యాల శ్రీరామకృష్ణ రంగారావు జ్ఞాపకార్థము కాకినాడలో రంగరాయ మెడికల్ కాలేజీకి భూరివిరాళ మొసగెను. శ్రీ తిమ్మరాజుగారు అల్లుడు శ్రీ రంగారావుగారు, కుమారుడు శ్రీ ప్రసాద్‌గారు సభ్యులుగా శ్రీ ముళ్ళపూడి వెంకట్రాయడు మెమోరియల్ ఎడ్యుకేషనల్, మెడికల్ ట్రస్టులు అను ధర్మ సంస్థలను నెలకొలిపి తద్వారా శ్రీ వెంకట్రాయ మెమోరియల్ పోలీ టెక్నిక్ నెలయించిరి. అనతి కాలములో శ్రీ తిమ్మరాజుగారి ప్రధమ భార్య వేంకటరమణమ్మగారిపేర ఇరవైఐదు లక్షల రూపాయల విరాళముతో వైద్యాలయము నిర్మించుటకై శంఖుస్థాపన జరిపించినారు. ఇండస్ట్రియల్ స్కూలు, ఇంజనీరింగు కాలేజీలుకూడ అనతికాలములో స్థాపింపనున్నారు.

ఏవంవిధ గుణగణ వరిష్ఠులైన శ్రీ తిమ్మరాజుగారి పెద్దయల్లుడగు శ్రీ రంగారావుగారికి ఏనమండుగురు కూతులు; శ్రీ వెంకట్రాయుడు, నరేంద్రనాథ్

చౌదరి, వెంకటకృష్ణరావు, అచ్యుతరామయ్య అను నలుగురు కొడుకులు. శ్రీరంగారావుగారి పెద్దకుమార్తె శ్రీమతి అక్కమాంబను శ్రీ జాగర్లమూడి చౌదరి గారి పుత్రుడు శ్రీ హరిహరప్రసాద్‌గారికి, రెండవయామె శ్రీమతి వెంకటరమణ మ్మను శ్రీ బోళ్ళ వీరవెంకన్నగారి కుమారుడు ఆంధ్రా సుగర్స్ టెక్నికల్ ఎడ్వైజర్ శ్రీ బుల్లి రామయ్యగారికి, మూడవయామె శ్రీమతి రామలక్ష్మిని కోయంబత్తూరు మిల్లు యజమానులు శ్రీ రంగస్వామినాయుడుగారి కుమారుడు యతిరాజులుగారికి, నాల్గవ యామె శ్రీమతి అనంతలక్ష్మిని రాయఘడ కాలు శ్రీ నూతక్కి రామశేషయ్యగారి మాజీ యమ్. పి. కుమారుడు పద్మశ్రీ భాను ప్రసాదుగారికి ఇచ్చి వివాహము చేసిరి. తన కుమారుడు శ్రీ ప్రసాదుగారి ప్రథమ పుత్రిక శ్రీమతి వెంకటరమణమ్మను శ్రీ రంగారావుగారి తమ్ముడు శ్రీ ముత్తయ్యగారి కిచ్చి పరిణయము చేసిరి. దక్షిణాంధ్ర దేశములో వాసికెక్కిన కమ్మనాయకు లెందఱో శ్రీ తిమ్మరాజుగారి బంధువులగుట వారి కౌలీనమును గూర్చి వేఱె వక్కాణింప నక్కఱలేదు.

శ్రీ తిమ్మరాజు, శ్రీ హరిశ్చంద్రప్రసాద్ గార్లు చిరకాలమునుంచి తణుకు పౌరులకుచేసిన సేవ నభినందించుచూ వీరికి 1958 జూన్ 18వ తేదీలో పుర ప్రజలు అఖండ సన్మానము గావించినారు.

## రెడ్డిగూడెం, రంగాపురం జమీ.

దీనిని అడుసుమల్లి గోపాలకృష్ణయ్యగారు నూతనముగా సంపాదించి జమీం దారుడయ్యెను. ఈయన కృష్ణాజిల్లాలో రాజకీయముగా, నితరముచ గొప్ప పేరు ప్రతిష్టలు గలవారు. ఈయన యాధ్వర్యమువల్లనే వుయ్యూరులో పంచ దార ఫ్యాక్టరీ, ఇంజనీరింగు కళాశాలలేర్పడెను. శ్రీ వెలగపూడి రామకృష్ణయ్య ఐ. సి. యస్. గారీయన అల్లుడు. గోపాలకృష్ణయ్యగారు వ్యవసాయము వృద్ధి జేసెను. ఫ్యాక్టరీలనునిర్మించెను. ఈయనకు సుబ్రహ్మణ్యం, విశ్వేశ్వరరావను తనయులు గలరు. సుబ్రహ్మణ్యంగారు కురువికులం జమీందారు కుమార్తెను పెండ్లియాడెను. 1933లో గోపాలకృష్ణయ్యగారుచనిపోయిరి. ఈయన స్వగ్రామ ములో దేవాలయములను నిర్మించి, వానికి కొన్ని భూములనిచ్చి పేరొందెను.

## శ్రీ ముళ్ళపూడివారి వంశ వృక్షము



## కాటూరి జమీ

దీనిని యార్లగడ్డ రంగనాయకులుగారు 1922లో సంపాదించిరి. వీరి తండ్రి రామయ్యగారు, తాత తిరుపతిరాయుడు. వీరందరును కారంచేడులోని ప్రసిద్ధులు. ఈ జమీలో 3 గ్రామములున్నవి. తిరుపతిరాయుడుగారు 1878లో నొక సత్రమును గట్టించి, అన్నదానము గావించెను. ఆయన కుమారుడు రామయ్యగారు 2 ఓడలను కొని వ్యాపారముచేసి ద్రవ్యసంపాదన మొనర్చెను. రంగనాయకులుగారీ వ్యాపారము వృద్ధిజేసి మరల 4 ఓడలను నిర్మించెను. శ్రీధనలక్ష్మి, శ్రీభాగ్యలక్ష్మి, శ్రీ రాజ్యలక్ష్మి, శ్రీ సీతాలక్ష్మియని వాని పేర్లు. 1920లో నితడు సూపర్ టాక్సు 87,500 రూపాయలు చెల్లించెను. 1921 లో తమ మొదటి యోడకు షష్టిపూర్తిజేసి, పండిత సత్కారము లొనరించెనట. ఢిల్లీ స్టేటు కౌన్సిలు సభ్యుడుగా కొంతకాలం పనిజేసెను. పరుచూరులో రామన్న గారి పేరట లక్ష రూపాయలతో నొక హైస్కూలును స్థాపించెను. ఒక ఓడను కారంచేడు మిడిల్ స్కూలునకు దానమిచ్చి యశస్వియయ్యెను. ఈయన జమీకి 2 వేల రూపాయలు పేష్కషు ఉన్నది. ఇదిగూడ తక్కిన వానివలె ఇటీవల రద్దు అయినది. ఈయన కుమారులు తిరుపతిరాయుడు, రామనాధ బాబుగార్లు యిప్పుడు తండ్రిగారితో పాటు ప్రసిద్ధులుగా నుండి, అనేక ధర్మకార్యము లొనర్చుచు వ్యాపారములు సాగించుచున్నారు. వీరు తండ్రినెలకొల్పిన నిధినుండి లక్షల కొలది దానములిచ్చి ఇటీవల చనిపోయిరి.

## వేలుపుచర్ల మొఖాసా.

దీనిలో కొంత మానం వెంకట్రామయ్య చౌదరి, బి. ఏ., బి. ఎల్., గారి పూర్వులు సంపాదించిరి. మిగతా భాగము యీయన సంపాదించెను. ఈయన కాకరాల వంశమునుండి దత్తుడుగా వెళ్ళెనట.

## సూరేపల్లి మొఖాసా.

1924లో మాదల వెంకయ్య, శేషయ్య చౌదరిగార్లు దీనిని సంపాదించిరి. వీరి తండ్రి సకళయ్యగారు. సకళయ్యగారు చిన్న చిన్న దేవాలయములను, కుమ్మాళ్ళ ధర్మచెరువు, బావులను త్రవ్వించి ప్రసిద్ధిగనిరి. వీరికి చక్కపల్లి మున్నగు గ్రామములలో 1500 ఎకరముల భూమిగలదు. ఇట్లే రామన్నగూడెం

మొఖాసా లింగం నాగభూషణముగారును, కొణికి గ్రామము మొఖాసా యల మంచి సూర్యనారాయణ, పిచ్చయ్య గార్లను సంపాదించి పేరొందిరి.

## చెరుకూరు సంస్థానము.

1913లో దీనిని రాజా యార్లగడ్డ మల్లిఖార్జుననాయుడు చల్లపల్లి జమీం దారుగారు కొని కుమార్తెయగు వాసిరెడ్డి త్రిపురసుందరమ్మగారి కిచ్చిరి. ఈమె భర్త వాసిరెడ్డి చూడామాణిక్యప్రసాదరావు నాయుడుగారు. ఈయన బందరు వెంకటేశ్వరాలయ పరిపాలన కర్త. ఈయన తండ్రి వాసిరెడ్డి వెంకయ్యగారు. నూతక్కి శక్తీశ్వరస్వామికి కొన్ని వాహనములు చేయించి, ఒక చెరువు త్రవ్వి టకై కొంత సొమ్మిచ్చి పేరొందెనట. ఈయన కాలములో వెంకటేశ్వరాలయ మునకు బందరులో గోపుర నిర్మాణమయ్యెను. ఈయన వాసిరెడ్డి సంస్థాన పెన్ష నర్లలో నొకడని లోగడ తెలిపితిమి. ఈయన ఇటీవలనే చనిపోయెను. ఈ జమీకూడా యిపుడు రద్దయినది.

కొందరు ప్రముఖులు : మద్దినేని నరసింహదాసు — 1888 ప్రాంతీయుడు. నరసరావుపేట తాలూకా యనమదల వాస్తవ్యుడు. అచట సీతా రామస్వామికి విగ్రహమును జేయించి 3 ఎకరములను దానమిచ్చిన భక్తుడు.

**(A R. No 416 of 16)**

గుట్లపల్లి వెంకయ్యనాయుడు : 1874 ప్రాంతీయుడు. పల్నాటి తాలూకా అడిగొప్పుల వాస్తవ్యుడు. తండ్రి వెంగళప్పనాయుడు. తాత గంగానాయుడు. ఇతడచట నొక భావిని గట్టించి పేరొందెను.

**(A R. No. 288 of 30)**

శాఖమూరి వెంకయ్యనాయుడు : కొచ్చెర్ల మొఖాసాదారు, వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువునకు అల్లుడు - సేనాధిపతి 1800 ప్రాంతీయుడు. 1750 ప్రాంతమున నీశాఖమూరి వారిలో రమణప్ప పౌత్రపినాటి సీమపాలకుడగు మట్ల పెద్దవెంకట్రామ రాజుగారివద్ద నొకకట్టుబడి నాయకుడు(**Police Officer**) గా నుండి తన సిబ్బందితో దేశరక్షణ చేయుచుండెను. ఈయనకచట గొంత భూమి నిచ్చిరి. (**L. R. Vols.** 17).

చిరుమామిళ్ళ వెంకటపతి : 1748 ప్రాంతీయుడు వాసిరెడ్డి జమిందార్ల బంధువు. ఇతడు పాతూరు పట్టణాధిపతి మల్రాజ సూరానాయనింగారికి వాసిరెడి

నరసయ్య చినరామలింగ నృపాలురకు జరిగిన యుద్ధములో పాల్గొని జయమొందెను. ఈవంశములో లక్ష్మమ్మ యనునామె తన ప్రతివ్రతా మహత్యము కల్గియుండియు, భర్తచే ననాలోచితముగ చంపబడి చివర కిపుడొక దేవతగా కొల్వబడుచున్నది. ఈమెది లింగాపురం, చిరుమామిళ్ళ హనుమంతను నతడు చింతలాత్మకూరులో సంజీయరామస్వామి దేవళము గట్టించి శాసనము వ్రాసెను. గాని ఇతని కాలము తెలియదు. ఇతని తండ్రి గోపన్న. (**N. I. R.** 9)

చావ వెంకయ్య : చందర్లపాటి వాస్తవ్యుడు, 1800 ప్రాంతీయుడు. ఈయన కుమార్తె వెరెర్రమాంబను వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువు వివాహమాడెను. ఈ వెంకటాద్రి ప్రభువు కుమారుడు జగన్నాధబాబుగూడ చావవారి కన్య రంగమాంబను పెండ్లాడెను. వెంకటాద్రి ప్రభువు తండ్రి జగ్గయ్యగారుకూడా చావ చంద్రయ్యగారి కుమార్తె అచ్చమ్మను పెండ్లాడెను. చావ వారిట్లా రాజబంధువులుగా ప్రసిద్ధికెక్కిరి.

రావిపాటివారు : వీరు కలవచర్ల, రాజారం, దంగేరు మున్నగు ప్రాంతములందున్నారు. వీరి మూలపురుషుడు గంగినీడు. 1775-1800 మధ్యనుండిన నరసయ్యగారు దంగేరులో విష్ణ్వాలయమును, బుల్లి రామయ్యగారు సత్యదేవుని యాలయమును గట్టించి పేరొందిరి. 1806 వ్యయ సం॥లో వెంగన్న కొడుకు శంభయ్యగారు మదనగోపాలస్వామికి ధ్వజస్తంభము వేయించియు, వైద్యవిద్యలో నారితేరి బీదల కుచితముగా మందుల నిచ్చియు ఖ్యాతిజెందెను. 1927 ప్రాంతమున నీ వంశీయులలో శ్రీ వీర్రాజు కవియై వీరి వంశ చరిత్రను రచించెను. ఇట్లే కమ్మవారిలో నొక్కొకచోట నొక్కొక్క గృహనామస్తులు ప్రసిద్ధిగానుండి, యచట తమశక్తికొలది దానధర్మములను గావించుచున్నారు. గాని వారి విషయములు లభ్యమగుటలేదు.

చిట్టూరువారు : కాటవరం జమిందారగు చిట్టూరి బాపినీడుగారి వంశములో ప్రసిద్ధుడు. ఈయన కూళ్ళగ్రామ వాస్తవ్యుడు. ఈయన చిట్టూరు, రావిపాటి, దేవరపల్లి, వారలకు బంధువు. శ్రీ చిట్టూరి భువనైకరాయుని పత్ని వీరభద్రమ్మ కూళ్ళలో స్వామికి ధ్వజస్తంభమెత్తించి పామర్రులో పట్టాభిరామునకు సర్వాంగ కవచము సమర్పించియు, అన్నసత్ర మేర్పరచియు పేరుగాంచెను. ఈమె దేవరపల్లి వంశములోని వెంకటప్పగారి కుమార్తె. 1914-లో

చిట్టూరి వెంకటకృష్ణ నరసింహరాయుడు దేవాలయ మంటపమును, పార్వతీయా లయమునకు గోపురప్రాకారములను గట్టించి పేరొందెను.

దేవరపల్లివారు : వీరు తూర్పు గోదావరిజిల్లా పామర్రులో ప్రసిద్ధులుగ నున్నారు. వీరిలో దేవరపల్లి వెంకప్పగారు మిక్కిలి ప్రసిద్ధులై వారి వంశ చరిత్రను వ్రాయించి కృతినొంది, దేవరపల్లి వెంకటరత్నంగారు ప్రోత్స హించగా ప్రకటించిరి ఆధ్యాత్మిక విదులు. ఇటీవల ఈ పామర్రు వాస్తవ్యులు చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మీనారాయణగారిని శ్రీ దేవరపల్లి చంద్రయ్యకవిని సత్కరించి తమకుగల విద్యాభిమానము వెల్లడించిరి. దేవరపల్లి పెదబాపన్న గారొక చెరువును వృద్ధిజేసిరి. మల్లేశ్వరాలయమును బాగుచేసిరి. చినవీరన్న గ్రామ కచేరి కట్టించెను. వెంకప్పగారి ప్రయత్నమువల్ల పామర్రులో కాల్వల మీద రెండు వంతెన లేర్పడెను.

శ్రీ నందిగాము శీతారామయ్య : వేలుపెన్ను, కవి, ఈయన శ్రీరామ శతకాది గ్రంథములను రచించెను.

శ్రీ కరుటూరి బాపినీడు : ఈయన 18వ శతాబ్దమున నుండెను. దువ్వ ముతా గ్రామముల కీయన జమిందారు అధికారిగా నుండెనట. పామర్రులో నీ వంశీకులుండిరి. దేవరపల్లి సర్వప్పగారీయన సోదరిని పెండ్లాడెను. ఈయన పాలించిన దువ్వముతా పెద్దాపుర సంస్థానపు వత్సవాయి వారిదై యుండెను. ఈయన పాలనకు సంతోషించి ఈయనకు వత్సవాయ తిమ్మగజపతిగారు కుస్తగిరి బంగారపు పుష్పములు గల కైజారు బహూకరించిరి. అది ఈవంశీ యులవద్ద మన్నది. ఈయన కాలములో దేవాలయములు తటాకములు పునరుద్ధ రింపబడి గ్రామము బాగుజేయబడెనట.

కరుటూరి వీరన్న : 1927 సం॥రం పామర్రులో నీయన రామాలయ మును కట్టించి పేరొందెను.

దేవరపల్లి కామయ్య : 1860 ప్రాంతీయుడు. ఈయన పామర్రులో నొక కచేరిసావిడిని నిర్మించెను. గ్రామపెద్ద.

## కమ్మవారిలో పేరంటాండ్రు — దేవతలు

సహగమన అచారము మనదేశమున నమలులో నందున్న కాలములో కమ్మవారిలో చాలామంది స్త్రీలు దానిని అనుసరించి క్రమముగా గ్రామదేవతలుగా

మారిపోయిరి. ఇట్టివారు చాలచోట్ల నున్నను వారి సంకరిని గురించి తెలుసు కొనుట సాధ్యముగానిపని :

కాకాని తిరుపతమ్మ : (గోపయ్యభార్య) పెనుగంచిప్రోలులో నిప్లే సహగమన మొనరింపగా దర్వాత నామెపేరిట నొక గుడి కట్టబడి యామెను జనులు భక్తితో ఆరాధించుచున్నారు. ఈమెతల్లి రంగమాంబ, తండ్రి శివ సోమయ్య. ఏటేటా నచట గొప్పయుత్సవము జరుగుచు మొదట మొదట జంతు బలి యిచ్చిరిగాని యిపుడు సాత్వికపూజలే చేయుచున్నారు. పలనాటితాలూకా లింగాపురమున చిరుమామిళ్ళ లక్ష్మమ్మ భర్తచే నిరపరాధముగా చంపబడి, చివరకు కలలో తన బంధువులకు తనమహత్తును దెలుపగా, వారందరుచేరి యొక గుడికట్టించి యామెకుత్సవాదులు జరుపుచు పూజించు చున్నారు.

యలవర్తి కొండమ్మ : భర్తతో సహగమన మొనర్పగా నాపేరం టాలు పేరిట నొక గుడి కట్టించి అమర్తలూరు గ్రామమున పూజించుచున్నారు. ఈమె గడ్డిపాటివారి కుటుంబములో జన్మించి యలవర్తి వెంకయ్యకు సతిమణిగా పేరొందెను.

బొట్ల మహలక్ష్మమ్మ : యిల్లే భర్తయగు బొట్ల గురప్ప నాయుడు 18వ శతాబ్దములో జరిగిన యొక శ్రీకాకుళ ప్రాంతయుద్ధమున మరణింపగా కమ్మనిగడాం గ్రామముదగ్గర సహగమన మొనర్చి తనపతివ్రతా మహత్య మును జూపెనట. ఈమె యరమనేడివారి ఆడబడుచు. ఈమె పేరిట యేటేట పురనిర్మాణమొనర్చి యుత్సవాదులు, పూజలు, పునస్కారములు. చుట్టుప్రక్కల గ్రామస్థులు సాగించుచున్నారు. ఇట్లెందరు పేరంటాం డ్రారాధింపబడు చున్నారో తెలియదు.

పెనుమత్సయోగినిగా పేరొందిన కమ్మవారిలోని సీతమ్మయోగినియై పెక్కు వత్సరములనుండి నిరాహారియై సమాధిలోనుండి యేటేటా 1, 2, దినములు భక్తులకు దర్శనమిచ్చుచున్నది. ఈమె గండిగుంటలోని కమ్మవారి కోడలు. ఈమె 1959లో శాశ్వతసమాధినిష్ట పొందెను.

## బ్రిటిషు ప్రభుత్వము - ఆనాటి సంఘము.

విశ్వవిద్యాలయములు, కాలేజీలు, రైళ్ళు, ఆసుపత్రులు మొదలైనవి నిర్మించి యీస్టిండియా కంపెనీయు, తర్వాత బ్రిటిషుప్రభుత్వమును సర్వజను

లను సమానముగా నాదరించిరి. అప్పటివరకు కులమత స్పర్ధలతో మునిగి యున్న మనదేశస్థుల కట్టుబాట్లు సడలిపోయినవి. బ్రాహ్మణులు మాత్రమే వైదికవిద్యలు, సంస్కృతము, అప్పటికి చదివెడివారుగాని తర్వాత బాహాట ముగా నందరును చదువ మొదలిడిరి. అచ్చటచ్చట వైదిక బ్రాహ్మణులు వీనిని బ్రతిఘటించు చుండిరి. గాని వారిప్రభ క్రమముగా తగ్గినది. అన్ని వర్ణములవారును తమ యిచ్చకొలది భాషలను, విద్యలను చదువజొచ్చిరి. కమ్మవారుగూడా నట్లే సంస్కృతాంధ్రాంగ్లేయ భాషల నభ్యసింపజొచ్చిరి. ముద్రణాలయములు క్రమముగా వెలసి, జనులకు యెట్టి రహస్య గ్రంథములయి నను లభ్యముగుస్థితి వచ్చుటచే, సంకుచిత బ్రాహ్మణోద్దేశ్యములు విఫలములై సర్వజన సోదరభావము కలుగనారంభించెను. వేమనయోగి పద్యములు సర్వుల కాదరణీయ మయ్యెను. బ్రాహ్మణులలో యోగ్యులు కొందరు తమ తప్పును తెలుసుకొని యితరులకు విద్యలనుప్రసాదింప మొదలిడిరి. బ్రహ్మసమాజమువారు దీనికై గాఢమైన కృషిసలుపజొచ్చిరి. ఐనను బ్రిటీషు జనుల పలుకుబడివల ఆంధ్రులలో కొందరు క్రైస్తవమతమునందులోఁబడిరి. కమ్మవారిలో కొందరు ప్రవేశించిరి.

## భాషాపోషణ - జమీందారులు.

బ్రిటిషుపాలనలో ఆంధ్రభాషాభివృద్ధి హెచ్చుగా లేకున్నను, కమ్మ జమీందారులు కవులనాదరించి వారిచే గ్రంథములను వ్రాయించి భాషాసేవ సల్పుచువచ్చిరి. వాసిరెడ్డి వెంకటాద్రినాయడు, జగన్నాధబాబులు మున్నగు పావయ్య మున్నగువారిచేతను గ్రంథములు వ్రాయించిరి. చంద్రమౌళి వేమనా రాధ్యుల సంగమేశ్వరకవిచే వ్రాయించెను. ముక్త్యాల జమీలో చినవెంకటాద్రి నృపాలుడుతాతంభట్టుగురుమూర్తిశాస్త్రిచేతను, భవానీముక్తేశ్వరప్రసాదు కొప్పు రాజు సుబ్బరాయకవిచేతను అమరవాదిరామయ్యచేత నుఉమామహేశ్వరప్రసాదు, శ్రీపాద కృష్ణమూర్తికవిచేతను చల్లపల్లి జమీందారు యేర్లగడ్డఅంకినీడు II కాసుల పురుషోత్తమ కవిచేతను, గ్రంథరచన జేయించి వారలను పోషించుచువచ్చిరి. ఇట్లే చాల గ్రంథములను ముద్రించియు, గ్రంథమాల స్థాపించియు తణుకు జమీందారులు ప్రసిద్ధికెక్కిరి. కపిలేశ్వరపురం జమీందారు కొన్నిగ్రంథములను ముద్రించెను. ఈ వివరములన్నియు వారిచరిత్రలలో జెప్పబడినందున నిచట జెప్పుటలేదు.

## మరికొన్ని జమీలు.

బ్రిటిష్ ప్రభుత్వకాలములో కృష్ణాపురం, పెదవేగి సంస్థానమును చల్లపల్లి జమిందారును, అన్నదేవరపేట సంస్థానము అల్లూరి సూరన్నగారును, బండేపల్లి జమీ అంమూరు సుబ్బానాయుడుగారును, గంగప్పాలెం, లాల్‌పురం అగ్రహారములు కొత్త రఘురామయ్య, వెంకయ్యచౌదరిగార్లును. కొన్నిశ్రోత్రియ గ్రామములు చెంగల్పట్ జిల్లా కొత్త గురుస్వామి నాయుడుగారును, లరకాడు జమీయును,కమ్మవారు సంపాదించిరి గాని, యిందలి బండేపల్లి, గంగప్పాలెం, లాల్‌పురాలు తిరిగి విక్రయింపబడెను. వల్లపు రామన్నగూడెం మొఖాసాలింగం నాగభూషణముగారును, కొణికి మొఖాసాలో కొంత యలమంచిలి పిచ్చయ్య, సూర్యనారాయణగార్లును సంపాదించి వ్యవసాయము వృద్ధిచేయుచున్నారు. పైజమీలన్నియు నిపుడు రద్దయినవి.

## గ్రామ యిజారాలు.

కొత్త సంగన్న, భావయ్య చౌదరులు 1790 సం॥ నుండి కొత్త సంగన్న చౌదరి గ్రామయిజారాదారుగా పేరొంది చౌదరిపాలన చేయుచుండెను. రాచూరు జమీందారు భావనారాయణగారు, చింతపల్లి జమిందారు వెంకటాద్రి నాయుడు గార్ల వద్ద యిజారాదారుగా నుండి యితడు యిజారాకు చాలా గ్రామములను తీసుకొనుచుండెను. 1816 లో పిండారిదండు గ్రామములమీదపడి దోచుసమయములో వారిగ్రామమగు సంగం జాగర్లమూడికి రాకుండా తప్పించెను. 1820—28 సం॥ మధ్య నీయన జ్యేష్ఠకుమారుడు నరసయ్యచౌదరి యిజారాదారయ్యెను. తర్వాత భావయ్యచౌదరి యిజారాలు గైకొనెను, రాచూరు జమీజప్తులో నున్నపుడు జిల్లాకలెక్టరు జాన్ క్లిలఉర్‌హూష దొరవద్ద తన గ్రామమును 1234 రు॥ యేటేటా యిచ్చులాగున 5 సం॥ కవులు పొందెను. 1848లో జమీ సర్కారులో కలిసిపోగా, నీ వంశీకులు సామాన్య గ్రామ యజమానులుగా మిగిలిపోయిరి. ఇట్లాకాలములో చాలమంది గ్రామ యిజారాదార్లుండెడివారు. శ్రీ భావయ్య చౌదరి కొడుకు సంగయ్యగారు శ్రీ సంగమేశ్వరస్థల పురాణము వ్రాయించి పేరొందెను.

## కమ్మవారు క్రైస్తవులగుట.

రివరెండు ఆర్చిబిషప్ ధామస్.

* కమ్మవారు కొందరు 1800 ప్రాంతమునుండియు క్రైస్తవ మతమున జేరిరి. నరసరావుపేట తాలూకా రావిపాడులోని పోలవరపు చెన్నయ్య మొదట క్రైస్తవుడై, రివెన్యూ ఆఫీసరుద్యోగము బహుమానముగా పొందెను. క్రమక్రమముగా కమ్మవారు కొందరు ప్రవేశించిరి. ఫిరంగిపురం, ముట్లూరు, రెంటచింతల, పెదకూరపాడు, మున్నగుగ్రామములలో క్రైస్తవచర్చిలేర్పడెను. రేవేంద్రపాడులో కొందరీశతాబ్దిని చేరిరి. నరసరావుపేట తాలూకాలోని క్రైస్తవ కమ్మవారిలో నిపుడు పొతకమూరి థామస్‌గారు ప్రసిద్ధిగానున్నారు. ఈయన రోమనుకాథలిక్కు మతమున ఆర్చిబిషప్‌గా బెంగుళూరులో ప్రసిద్ధిగా నున్నారు. ఈయన 1940లో బిషపు అయ్యెను. అంతకుముందు మిషనరీగా నుండెను. ఈయన విదేశాలలో పర్యటించి, మంచి ఉపన్యాసాలిచ్చిన వక్త.

## శాసనసభలు, మంత్రులు.

బ్రిటిషు ప్రభుత్వములో 1882 నుండి స్థానికసంస్థ లేర్పడినవి. 1909 లో మింటోమార్లే సంస్కరణములు వచ్చెను. 1919 సం॥పు మాంటేగు సంస్కరణములు 1921 నుండి అమలుజరిగినవి. ఈ కాలములందు కమ్మవారీ క్రింది యున్నత గౌరవ పదవులు బ్రిటిషు ప్రభుత్వములో సంపాదింపగల్గిరి. జస్టిసుపార్టి 1916లో ఏర్పడి 1942 వరకు వృద్ధిగా నుండెను. మదరాసు శాసనసభలో జస్టిసుపార్టి ప్రముఖులు - వల్లపల్లిరాజా, అంకినీడు బహద్దూరు, జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, రావుబహద్దరు బొల్లిని మునుస్వామి నాయుడు, పాములపాటి వెంకటకృష్ణయ్య, చలసాని సత్యనారాయణ, కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య, మాగంటి శీతయ్య, బాపినీడు, కానుమల్లి సర్వారాయుడు, బిక్కిని వెంకటరత్నం, కల్లూరి చంద్రమౌళి చౌదర్లు, కోవెలమూడి గోపాల కృష్ణయ్య, బొల్లిని నారాయణస్వామి నాయుడు మున్నగువారు 1911 – 40 సం॥మధ్య కొంతకాలము సభ్యత్వము కల్గియుండి చట్ట నిర్మాణములలో సర్కా-

---

* Krishna Dt. Manual.

రునకు తోడ్పడుచుండిరి. ఇందలి బొల్లిని మునుస్వామి నాయుడుగారు ప్రధాన మంత్రియయ్యెను. ఈయన కాలములో టోలుగేట్ల సుంకములు రద్దయ్యెను. పంచాయితీలు లోకలుబోర్డులలో కలుపబడెను. పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరి జస్టిసుపార్టీ నాయకుడు(**Chief Whip**)గాపనిచేసెను. ఈయన 1930లో ఢిల్లీ శాసనసభ మెంబరయ్యెను. 1937లో మాగంటి బాపినీడుగారు పార్లమెంటు కార్యదర్శియై కాంగ్రెసు నిబంధనల ప్రకారముపనిచేసెను. యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారును, గోగినేని రంగాగారు, గద్దె రంగయ్యనాయడుగారు ఢిల్లీ స్టేటు కౌన్సిలు సభ్యులయిరి. 1946లో కాంగ్రెసు మంత్రివర్గమేర్పడినప్పుడు బిక్కిన వీరాస్వామిచౌదరి అడవులు వగైరామంత్రి యయ్యెను. 1947 సం॥రం ఆగష్టు 15 తేదీన హిందూదేశము స్వతంత్రదేశమయ్యెను.

## గవర్నర్ రాఘవేంద్రరావుగారు.

నాగపూరు రాష్ట్రశాసనసభలో ఆనరబుల్ ఈడుపుగంటి రాఘవేంద్రరావు గారు 1930 నుండి సభ్యుడై, 1930 – 33ల మధ్యను, 1937, 40 మధ్యను ప్రధానమంత్రియై పేరొందెను. ఈయన సమర్ధతను జూచి బ్రిటిషు ప్రభుత్వము 1934లో ఆక్టింగు గవర్నరుగా 4 మాసములిచ్చి గౌరవించిరి. ఆ కాలములో హిందువుల కీపదవి అరుదు. ఈయన 1890లో జన్మించెను. వీరి పూర్వీకులు కృష్ణాజిల్లా పెదమద్దాలి కాపురస్తులు. వీరి తండ్రి నాగన్ననాయుడు. విలాస్ పూరులో స్థిరపడెను. రాఘవేంద్రరావుగారు యింగ్లండులో బారిష్టరయి వచ్చి, విలాసపూర్ చైర్మన్‌గాను, మహాకోసల రాష్ట్ర సంఘాధ్యక్షుడుగాను, కొంత కాలము పనిజేసెను. 1927 నుండి శాసనసభా సభ్యత్వమందెను. 1932 లో రుణవిమోచన చట్టము నాగపూరులో నీయన కాలమునందే ప్యాసయ్యెను. దాని వల్ల రైతులకు 8 కోట్లు లాభము కలిగెను. 1939లో నీయన లండనులోని యిండియా సెక్రటరీ సలహా సభ్యుడయ్యెను.

ఈయనకు సర్ బిరుదము నిచ్చి ప్రభుత్వము సత్కరించెను. 1942సం॥ జూన్ 15వ తేదీని ఈయన చనిపోగా, యిండియా గవర్నమెంటు అసాధారణ గజెటును ప్రచురించి తమ సంతాపమును వెలిబుచ్చెను.

## ప్రధానమంత్రి రావుబహదూరు శ్రీ బొల్లిని మునుస్వామినాయుడు.

ఈయన 1885లో జన్మించెను. తండ్రి బొల్లిన బొజ్జనాయనింగారు. వేలంజేరిలో కాపురముండిరి. వీరి పూర్వీకులు కార్వేటినగరం సంస్థానములో తహశీలుదారు పదవులలో నుండిరి. 1905—1907 సంవత్సరములలో నీయన B.A.,B.L. పరీక్షలయందు జయమొందెను. 1917 నుండి చిత్తూరుజిల్లాబోర్డులో మెంబరుగా నుండెను. 1921 నుండి 1929 వరకు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా నుండి అనేక ప్రజోపయోగ కార్యములొనరించెను. ఈయన మదరాసు ప్రధాన మంత్రి అయ్యెను. అపుడు టోలుగేట్లను రద్దుచేయు శాసనమును జేయించెను. 1926లో నీయనకు రావుబహదూర్ బిరుదు ఒసంగబడెను.

## గుంటూరు మౌని గురుస్వామి నాయుడు.

మధురజిల్లా సైకరపట్టిలో గొప్పభూస్వామి. ఈయన పూర్వీకులు ఢిల్లీ చక్రవర్తివద్ద సేనాధిపతులట. వీరి పిల్లలను చక్రవర్తి సంబంధీకులు వివాహ మాడగోరగా నందులకిష్టపడక నొకనాటిరాత్రి తమ ధనసంపదలతో నా రాజ్యమును దాటి గుర్రములమీద మధుర రాజ్యము చేరిరట. 1398 సం॥లో నిప్లే అయక్కుడి జమిందారు పూర్వీకులువచ్చిరి. వీరుగూడా నప్పుడే వచ్చియుందురు.

## బ్రిటిషు ప్రభుత్వ బిరుదాంకితులు.

బ్రిటిషు ప్రభుత్వములో కమ్మవారిలో నీ క్రిందివారా యా బిరుదములతో సత్కరింపబడిరి. వారికిగల రాజభక్తికి చిహ్నముగాను, దేశసేవకు చిహ్నముగాను యివి యొసగబడెను.

రావుబహదూరు బిరుదము—దీనిని మదరాసు ప్రధనామాత్యులు శ్రీబొల్లిని మునుస్వామినాయుడు, P.S.G. కాకర్ల రంగస్వామినాయుడు, (కోయంబత్తూరు) జిల్లా జెడ్జి, చలసాని సత్యనారాయణ చౌదరి, బెజవాడ న్యాయవాది కోవెలమూడి గోపాలకృష్ణయ్యచౌదరి, తెనాలి తాలూకా బోర్డుప్రెశిడెంటు కొసరాజు రామయ్యచౌదరి, గుంటూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, బలుసు బుచ్చిసర్వారాయుడుజమిందారు, వి. గోపాలనాయుడుగార్లు పొందగల్గిరి. సర్ బిరుధమును, యీడ్పుగంటి రాఘవేంద్రరావుగారు పొందిరి. ఇక రావు

సాహే బిరుదము కృష్ణా, గుంటూరు జిల్లాలందు జంపాల వెంకటేశంచౌదరి, కంఠంని వెంకట రంగయ్యనాయుడు, వల్లభనేని బాపయ్యచౌదరి, గారపాటి ఆంజనేయచౌదరి, చింతమనేని శివరామయ్యచౌదరి, వెనిగళ్ళ హనుమంతరావు చౌదరి, దాసరి శ్రీమన్నారాయణచౌదరి, వి. కనకబాపయ్యచౌదరి, పచ్చవ పాపయ్యచౌదరి, గడ్డిపాటి బాపయ్యచౌదరి, ఏలూరులోని కలగర నాగభూషణం చౌదర్లు గొందగల్గిరి. 1946 వరకు నివి అమలులో నుండెనుగాని తర్వాత కాంగ్రెసు స్వరాజ్య ప్రభుత్వ మేర్పరచి బ్రిటిషువారిపాలనను తగ్గించిన పిమ్మటని గుర్తింపకపోయెను. వీరందరు అధికారులు, అనధికారులుగా నున్నారు.

## సైనికోద్యోగములు.

బ్రిటిషు ప్రభుత్వములో కమ్మవారిని సామాన్య వ్యవసాయక వర్గమువారు గానే భావించి మిలిటరీ వుద్యోగము లీయబడలేదు. 1914లో జర్మనీయుద్ధము వచ్చిన తరువాత కొన్ని యధికారము లీయబడెను. సైనిక వైద్యశాఖలో కొందరు తాత్కాలికముగా జేరిరి. ఇట్టివారిలో శ్రీ కొల్లూరు వెంకట్రాయుడు, కెప్టెన్ సుంకవల్లి సత్యనారాయణ, చిట్టూరి సత్యరాజు, జంపాల రామకృష్ణయ్య, నూతేటి వెంకట్రామన్ మొదలగు డాక్టర్లుండిరి. పాములపాటి లలితేంద్రనాథ చౌదరి లెఫ్టినెంటు కర్నల్ ఉద్యోగిగా తీసుకోబడెను. వీరి తండ్రియగు వెంకట కృష్ణయ్యచౌదరిగారు ఆనరరీ లెఫ్టినెంటు బిరుదాంకితులైరి. వాయువిమాన శాఖలో పైలట్ ఆఫీసరుగా రామచంద్రచౌదరి (ఒంగోలు) గారున్నారు.

## కమ్మవారిలో పేరంటాండ్రు – దేవతలు.

కన్నెగంటి గౌరమ్మ :- తెనాలి తాలూకా, నందివెలుగు గ్రామం. పొట్లూరివారి ఆడబడుచు. ఈమె భర్త కన్నెగంటి వెంకయ్యగారు చింతచెట్టు మీదనుండిపడి మరణించారు. ఆనాడు డిప్యూటి కలెక్టరువద్ద పర్మిషన్ తీసుకొని భర్తతోపాటు సహగమనం చేసింది గౌరమ్మగారు. షుమారు 1820 ప్రాంతంలో అనగా దాదాపు 180 సంవత్సరాల క్రితం జరిగిందిది. ఆమె పేరిట తెనాలి ఐతానగర్‌లో గుడికట్టి పేరంటాళ్ళ తిరునాళ్ళ మే నెలలో నిర్వహించడం ఆచారమయినది.

రావెళ్ళ తిమ్మానాయుడు — కోటసీమ.

ఈయన 1660-1770 సం॥ల మధ్య పాలకుడు. ఇతడు తన పేర తిమ్మానాయని పాలెమొకటి కట్టించి, జరుగుమల్లి గ్రామమును బసివిరెడ్డిమున్నగు తాబేదారులచే నిర్మింపజేసెను. తనసీమలో వ్యవసాయము వృద్ధిచేసెను. సంతకాళహస్తిలో ఈశ్వరదేవళము నిర్మించి యచటనొక సంత నేర్పరచెను. పచ్చగుళ్ళపాడీయన రాజధాని. ఈయన తర్వాత కుమారుడు వెంకటాద్రి పాలకుడయ్యెను. (N. I. D/35)

ముసునూరి కాపయనాయనింగారి సామంతులు :-

గురిజాల తెలుగు భూపతి త్రిపురాంతకము నందును, కాపయ పినతండ్రి కొడుకు అనపోతానాయడు రాజమహేంద్రపురి. లొమ్మేరు లందును, గురిజాల ముప్పనృపతి సబ్బినాడులోను, కోరుకొండలో కూనపనాయడును (మంచికొండ) ప్రోలయవేమారెడ్డి అద్దంకిలోను 1336-1369 మధ్యకాలములో సామంత పాలకులుగా నుండిరి.

## 8. జాతీయోద్యమము.

భారత జాతీయోద్యమము బాగా రూపురేఖలు దిద్దుకొన్నది. దానికి గాంధీగారి నాయకత్వం వన్నెవాసిని పెంచాయి. జన సామాన్యంలోకి కాంగ్రెస్ చొచ్చుకుపోయింది. రాజకీయ ఆలోచనా సరళి సామాన్యులలో సైతం తొంగి చూచింది.

ఒకవైపున రాజభక్తిపరాయణతో జస్టిస్‌పార్టివారు బ్రిటిషు ప్రభుత్వానికి అండగా ఉన్నారు. వేరొకవైపు అసంఖ్యాకంగా కమ్మవారు మహాత్మాగాంధీ నాయకత్వాన్ని బలపరిచారు. కాంగ్రెస్‌లో ఉంటి - అది ఇచ్చే పిలుపుకు అనుగుణంగా మెలిగారు. ప్రభుత్వ ధిక్కారచర్యలు, సత్యాగ్రహోద్యమంలో పాల్గొని ఆచరించారు.

1921 పన్నుల నిరాకరణోద్యమం తెలుగువారిపైదె గాఢ ప్రభావాన్ని చూపింది. ముఖ్యంగా గుంటూరుజిల్లా పెదనందిపాడు ఫిర్కా ఆనాడు యావద్భారతాన్ని ఆకర్షించింది. శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వ:

ప్రభుత్వ ధిక్కారాన్ని, పన్నుల నిరాకరణను ప్రజలు ప్రదర్శించారు. షుమారు 100 గ్రామాలవారు 1922 నాటికి ఈ ఫిర్కాలో పన్నులు కట్టడానికి నిరాకరించారు. చదువు సంధ్యలు లేని సామాన్య రైతు కుటుంబీకులు సైతం స్త్రీ, పురుష భేదంలేకుండా ఉద్యమంలో పాల్గొన్నారు. తెలుగునేల యావత్తు జాతీయోద్యమస్ఫూర్తిని ప్రదర్శించింది.

ఈ ఉద్యమం చివరికి విఫలమైనా, బ్రిటిష్ ప్రభుత్వానొక ఊపుఊపింది. జన చైతన్యాన్ని అది చవిచూడ గల్గింది.

1928 సైమన్‌కమిషన్, 1931 విదేశవస్త్ర బహిష్కరణ పికెటింగు, 1932 లో కాలేజీ చదువులకు స్వస్తి; 1941 లో వ్యష్టి సత్యాగ్రహం, 1942లో 1945 లో క్విట్ ఇండియా ఉద్యమం తదితర సంఘటనలతో కాంగ్రెస్ అవిశ్రాంతంగా పోరాడింది.

ఎవరికీ తీసిపోని విధంగా, అందరికన్నా మిన్నగా కమ్మవారు దేశభక్తిని ప్రదర్శించారు. పలు సంఘటనలలో అగ్రభాగాన నిల్చారు. లాఠీదెబ్బలు, నిర్బంధకాండలను సంతోషంగా భరించారు. దేశంకోసం జైళ్ళకేగారు. ఆస్తిపాస్తులను, కుటుంబాలను సైతం పట్టించుకోకుండా త్యాగనిరతిని చూపారు. ఖద్దరు ధారణ, స్వదేశీ ఉద్యమాభిమానం, హిందీ ప్రచారం, సాంఘికసంస్కరణ —అనాచారాల ఖండింపు, వయోజన విద్యాప్రోత్సాహానికి నడుంకట్టారు. కదురు, కవ్వం కదిలిన చోట కరువుకు తావుండదు. ఆత్మాభిమానానికి లోటుండదు. తరతరాలుగా వాటిని కదిలించడం కమ్మవారికి ఉగ్గుబాల శిక్షణే!

## కాంగ్రెసులో కమ్మవారు,

1920 లో గాంధీగారు కాంగ్రెస్ నాయకత్వాన్ని చేపట్టారు. దినదినాభివృద్ధిని అది సాధించింది. 1937 నుండి కాంగ్రెస్‌వారు శాసనసభలలో విరివిగా ప్రవేశించడానికి, రాష్ట్ర స్వపరిపాలన కొనసాగించడానికి అవకాశ మేర్పడింది.

శ్రీ గద్దె రంగయ్యనాయుడు, మాగంటి బాపినీడు, శీతయ్య, బిక్కిన వెంకటరత్నం, జయంతిపురం రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాదు, కల్లూరి చంద్రమౌళి, ఆచార్యగోగినేని రంగనాయకులు తదితరులుశాసనసభలలో చేరిరి.

శాసన సభలకు వెలుపల శ్రీశరణు రామస్వామిచౌదరి, దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య, చింతమనేని భావయ్య, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, పర్వతనేని వీరయ్య, గింజుపల్లి భావయ్యచౌదర్లు పనిచేశారు.

వీరిలో 1922 నుండి మద్రాసు ఆంధ్రకాంగ్రెసు సంఘానికి గద్దెరంగయ్య నాయుడు కార్యదర్శిగా, ఆంధ్రా కాంగ్రెసు కార్యదర్శిగా గొట్టిపాటి బ్రహ్మయ్య పనిచేసారు. 1937-39 మధ్య చింతమనేని భావయ్య ఆంధ్రాకాంగ్రెస్ సంఘ సంయుక్త కార్యదర్శిగా, బ్రహ్మయ్యగారొక సంవత్సరం అధ్యక్షులుగా పని చేసారు. 1940-53 మధ్యకాలంలో శాసన సభ్యులుగా అనేకులు పనిచేసారు. గ్రంధ విస్తరణ భీతితో వారిని ఇచ్చట పేర్కొనటం జరగలేదు. 1946 లో ఎక్కిన వీరాస్వామిగారు మంత్రిగా పనిచేసారు.

## కమ్యూనిస్టు పార్టీ

1930-32 శాసనోల్లంఘనోద్యమాన్ని గాంధీగారు అర్థాంతరంగా విరమింపజేసారు. ఏమీ సాధించకుండానే దాని విరమింప జేయటంవల్ల గాంధీ గారి చర్యను ఆనాడు జాతీయ నాయకులే విమర్శించారు. యువకులైతే తీవ్ర కోపాన్ని కూడా వ్యక్తంచేశారు. జైళ్ళకు వెళ్ళిన కాంగ్రెసులోని అతివాద భావాలుగల యువకులు తీవ్ర అసంతృప్తిని పొందారు.

1934 లో ఆచార్య రంగా ఆధ్వర్యంలో విజయవాడలో 'ఆంధ్ర సోషలిష్టు పార్టీ' స్థాపించబడినది. మూడు వందలకు పైగా యువకులు ప్రారంభ సమావేశానికి హాజరయ్యారు. కాంగ్రెస్ సభ్యులే ఇందులోకూడా సభ్యత్వానికి అర్హులు.

ఆకాలంలోనే రష్యానుండి మనదేశానికి మార్క్సిస్టు గ్రంథాలు విరివిగా ప్రవేశించాయి. యువకులు ఆ గ్రంథాలను విరివిగా అధ్యయనంచేశారు. సోషలిష్టు, కమ్యూనిష్టు భావాలు యువతరాన్ని బలంగా ఆకట్టుకున్నాయి.

కమ్యూనిష్టు భావాలతో ఉన్నవారు, కాంగ్రెసులోని అతివాదులతో కలసి 1934 విజయవాడ శ్రీ కాట్రగడ్డ నారాయణరావుగారి తోటలో ఒక సమావేశం జరిగింది. అందులో మద్దుకూరి చంద్రశేఖరరావు ప్రధానపాత్ర వహించారు. సోషలిష్టు భావ ప్రచారంపై సమాలోచనలు జరిగాయి.

1936 రాజమండ్రిలో జరిగిన 'కాంగ్రెస్‌సోషలిష్టు' సమావేశంలో చీలిక లేర్పడ్డాయి. అతివాద, మితవాద చీలికలుగా అవి ఏర్పడ్డాయి. అందులో చంద్ర రాజేశ్వరరావు తదితరులు అతివాదగ్రూపుగా ఏర్పడ్డారు. ఆ గ్రూపే క్రమంగా కమ్యూనిస్టులుగా మారారు.

కమ్యూనిస్టుపార్టీ రాజకీయ పాఠశాలలు, ప్రజాసంఘాలు, మార్క్సిస్టు సాహిత్య ప్రచురణ సంస్థలను నెలకొల్పింది. విప్లవ భావ ప్రచారానికి నడుం కట్టింది. ఆ సమయంలోనే కొమ్మారెడ్డి సత్యనారాయణ, చలసాని వాసుదేవ రావుల నాయకత్వాన ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు చారిత్రాత్మక రైతుయాత్ర నిర్వహింపబడినది.

1936 లో 40 మంది సభ్యులుగా ప్రారంభమైన రాష్ట్రపార్టీ, చంద్ర రాజేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగా ఉన్న మూడవ పార్టీ సమావేశాలనాటికి 3,250 మంది సభ్యులతో బలాన్ని, యువతరంలో పట్టును సాధించింది. వర్గరహిత సమ సమాజ నినాదానికి అంకితమై ఎంతోమంది కమ్మవారు పార్టీలో పనిచేస్తున్నారు. ప్రభుత్వ దమనకాండకు, పార్టీ నిషేధానికి సైతం వెరువక నమ్మిన ఆదర్శాల కోసం, చేరుకోవలసిన లక్ష్యాలకోసం వారు తపిస్తున్నారు.

## ఫార్వర్డు బ్లాక్.

1939 మే నెలలో కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామాచేసి సుభాస చంద్ర బోస్ దీనిని స్థాపించారు. కాంగ్రెస్‌లోనే కొనసాగిన ప్రత్యేకగ్రూప్‌ఇది. తరువాత కాంగ్రెస్ నుండి విడివడి పార్టీగా అవతరించి - తిరిగి రెండుగా చీలి, ఒకవర్గం సోషలిస్టు పార్టీలో మరొకవర్గం కాంగ్రెసులో చేరాయి.

ఇందులో అన్నే అంజయ్య, కొసరాజు అమ్మయ్య, గొట్టిపాటి సుబ్బ రాయలు, కాకాని వెంకటరత్నం తదితర కమ్మవారు పనిచేసారు.

## రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ.

**M. N** రాయ్‌చే స్థాపించబడిన ఈ పార్టీలో చింతమనేని శివరామయ్య, త్రిపురనేని గోపిచంద్, ఆవుల గోపాలకృష్ణమూర్తి, డా॥ **G. V.** కృష్ణారావు, కోగంటిరాధాకృష్ణమూర్తి, కోగంటిసుబ్రమణ్యం, రావిపూడివెంకటాద్రి తదితరులు

ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రానికై ఆందోళన చేశారు. త్యాగధనులు శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మార్పణంతోగాని అది సాధ్యపడలేదు. 1953 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఆవిర్భవించింది.

ఆంధ్రావని పరిపాలనలో కమ్మవారు విశిష్ట స్థానాలను సాధ్యమైనంతలో పొందారు. ప్రతిభ నాధారంగా అనేక పదవులను అలంకరించి, వాటికి వన్నె తెచ్చారు. ప్రజాసేవలో ప్రముఖులయ్యారు.

## ఆంధ్ర శాసన సభా స్పీకరు.

1. నల్లపాటి వెంకటరామయ్య :-

ఆంధ్ర రాష్ట్ర ప్రథమ శాసనసభా స్పీకరు (1953-55). నరసరావుపేటలో ప్రముఖ న్యాయవాది. ప్రజాసోషలిస్టుగా ప్రారంభమై ఐక్యకాంగ్రెస్‌లో ప్రముఖులుగా వ్యవహరించారు. శాసనసభా సభ్యునిగా ఎన్నికై - స్పీకరుగా సభా కార్యకలాపాలను హుందాగా నిర్వహించారు.

2. దివి కొండయ్యచౌదరి :-

ఆంధ్ర ప్రదేశ్ శాసనసభకు 1978 నుండి 81 వరకు సభాపతిగా వ్యవహరించారు. స్వతంత్ర పార్టీలో ప్రముఖులు. ఆచార్య రంగా గారితో పాటు కాంగ్రెసులో చేరారు. 1978 లో శాసనసభా సభ్యునిగా గెలుపొంది - సభాపతిగా పదవిని నిర్వహించారు. టంగుటూరి అంజయ్య మంత్రివర్గంలో రోడ్లు, భవనాల శాఖామంత్రిగా కూడా పనిచేశారు.

3. గొట్టిపాటి బ్రహ్మయ్య :-

ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్ అధ్యక్షునిగా (1964-68) వ్యవహరించారు. కాంగ్రెస్ సంస్థలో కార్యదర్శి, అధ్యక్ష వంటి కీలకస్థానాలను అధిరోహించారు. రాజకీయ ధురంధరునిగా, మృదుభాషిగా ఖ్యాతినొందిన వీరు - అందరిచే "అన్న"గా పిలిపించుకో గలిగారు.

## మంత్రి మండలుల పరిణామం.

వివిధ మంత్రి వర్గాలలో కమ్మవారు పొందిన పదవుల వివరాలు.

1. టంగుటూరి ప్రకాశం మంత్రివర్గం (1953).

1. **S. B. P. P.** రామారావు - విద్య, పరిశ్రమలు వాణిజ్యశాఖ లను నిర్వహించారు

2. బెజవాడ గోపాలరెడ్డి మంత్రివర్గం (1955).

1. కల్లూరి చంద్రమౌళి - భూమిశిస్తు, దేవాదాయశాఖలు.
5. నీరుకొండ రామారావు - వ్యవసాయం, అటవీశాఖలు.

3. 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరించింది. విస్తృత ఆంధ్రప్రదేశ్‌లో తొలి మంత్రివర్గాన్ని నీలం సంజీవరెడ్డి నాయకత్వంలో ఏర్పరచారు.

1. **S. B, P .P.** రామారావు - విద్యాశాఖను నిర్వహించారు.

4. 1957 లో తెలంగాణా ప్రాంతంలో ఎన్నికల అనంతరం నీలం సంజీవ రెడ్డి తిరిగి నాయకులయ్యారు. ఆ మంత్రివర్గంలో

1. **S. B. P.** పట్టాభి రామారావు - విద్యాశాఖను నిర్వహించారు.

5. దామోదరం సంజీవయ్య మంత్రివర్గం (1960-62).

1. **S. B. P.** పట్టాభి రామారావు - విద్యా, రవాణాశాఖలు.
2. కల్లూరి చంద్రమౌళి - దేవాదాయ, ధర్మాదాయ సహకార శాఖలను నిర్వహించారు

6. నీలం సంజీవరెడ్డి మంత్రివర్గం (1962-64).

1. యార్లగడ్డ శివరాం ప్రసాద్ - ఆరోగ్యశాఖ.
2. ఆలపాటి వెంకట్రామయ్య - పురపాలకశాఖ.

7. కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గం (1964-67).

1. యార్లగడ్డ శివరామప్రసాద్ - ఆరోగ్యశాఖ
2. ఆలపాటి వెంకట్రామయ్య - పురపాలకశాఖ.

8. కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గం (1967-69).

1. నల్లమోతు చెంచురామానాయుడు - పురపాలకశాఖ
2. వెనిగళ్ళ సత్యనారాయణరావు - ఏక్సైజ్,మధ్యనిషేదం.

9. కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గం (1969-71),

1. కాకాని వెంకటరత్నం - వ్యవసాయశాఖ

2. నల్లమోతు చెంచురామానాయుడు - పురపాలకశాఖ
3. గుర్రం చిన వెంకన్న చిన్నతరహా పరిశ్రమలు
4. పాములపాటి అంకినీడు ప్రసాద్ - వాణిజ్యం, ఎగుమతులు

10. P. V. నరసింహారావు మంత్రివర్గం (1971-72).

1. కాకాని వెంకటరత్నం - వ్యవసాయం, పశుసంవర్ధకశాఖ
2. నల్లమోతు చెంచురామానాయుడు - చేనేతశాఖ
3. కిలారు గోపాలనాయుడు - రవాణాశాఖ
4. చల్లా సుబ్బారాయుడు - పౌరసరఫరాలశాఖ

11. P. V. నరసింహారావు మంత్రివర్గం (1972-1973).

1. కాకాని వెంకడరత్నం - వ్యవసాయం, ఆరోగ్యశాఖ
2. కిలారు గోపాలనాయుడు - చిన్నతరహా, నీటిపారుదల
3. భవనం జయప్రద - విద్యుత్ శాఖ
4. చల్లా సుబ్బారాయుడు - పౌర సరఫరాలు

ప్రత్యేకాంధ్ర ఉద్యమ ఫలితంగా ఆంధ్ర ప్రాంతానికి చెందిన 12 మంది మంత్రులు రాజీనామా చేసారు. P. V. నరసింహారావు 1973 జనవరిలో 8 మంది కొత్తమంత్రులను స్వీకరించారు.

1. P. V. చౌదరి - వ్యవసాయశాఖ.

క్రొత్తవారు పదవి స్వీకరించారో లేదో (మరునాడే) 1973 జనవరి 18 నుండి డిశంబరు 9 వ తేది వరకు రాష్ట్రపతిపాలన రాష్ట్రంలో విధించబడినది.

12. జలగం వెంగళరావు మంత్రివర్గం (1973-78)

చల్లా సుబ్బారాయుడు - పురపాలకశాఖ

1974 సెప్టెంబరు మంత్రివర్గ విస్తరణలో

2. చనుమోలు వెంకట్రావు - రోడ్లు, భవనాలు

1976 జులైలో మంత్రివర్గ విస్తరణ

3. చేబ్రోలు హనుమయ్య - రవాణాశాఖ.

13. డా॥ మర్రి చెన్నారెడ్డి మంత్రివర్గం (1978-80).

1. P. V. చౌదరి - చేనేత

2. యడ్లపాటి వెంకట్రావు - ప్లానింగు, న్యాయశాఖ, కోర్టులు
3. నాదెండ్ల భాస్కరరావు - అసెంబ్లి వ్యవహారాలు, మేజర్ ఇరిగేషన్, వాణిజ్యం

14. టంగుటూరి అంజయ్య మంత్రివర్గం (1980-82).
1. P. V. చౌదరి - దేవాదాయ, ధర్మాదాయశాఖ
1 దివి కొండయ్య చౌదరి - రోడ్లు, భవనాలు
3. గోగినేని నాగేశ్వరరావు - చేనేత
4. చేబ్రోలు హనుమయ్య - మార్కెటింగు
5. పాలడుగు వెంకట్రావు - గ్రామీణ నీటిపారుదల
6. చనుమోలు వెంకట్రావు - వ్యవసాయం
7. నారా చంద్రబాబునాయుడు - గ్రంథాలయాలు, సినిమాలు.

1982 మంత్రిమండలి శాఖల మార్పులో
1. నారా చంద్రబాబునాయుడు - సినిమాటోగ్రఫీ, పూగర్భ జల సిరులు.

15. భవనం వెంకట్రామ్ మంత్రివర్గం (1982 ఫిబ్రవరి)
1. చనుమోలు వెంకట్రావు - వ్యవసాయశాఖ
2. పాలడుగు వెంకట్రావు - మార్కెటింగు
3. P. V. చౌదరి - దేవాదాయశాఖ
4. నారా చంద్రబాబునాయుడు - చిన్నతరహా, నీటిపారుదల
5. గోగినేని నాగేశ్వరరావు - వాణిజ్యం, రేవులు.

16. కోట్ల విజయభాస్కరరెడ్డి మంత్రివర్గం (1982-సెప్టెంబరు)
1. చనుమోలు వెంకట్రావు - భారీ, మధ్యతరహా నీటిపారుదల
2. పాలడుగు వెంకట్రావు - మార్కెటింగు
3. గోగినేని నాగేశ్వరరావు - దేవాదాయశాఖ
4. R. వేమన - పురపాలకశాఖ
5. నారా చంద్రబాబునాయుడు - సాంకేతికవిద్య.

1982 మార్చి 25 వ తేదిన వెండితెర వెలుపు నందమూరి తారక రామారావు 'తెలుగుదేశం' అనే ప్రాంతీయ పార్టీని నాదెండ్ల భాస్కరరావుతో

కలసి స్థాపించారు. ఆంధ్రుల ఆత్మాభిమానం నినాదంతో — స్వచ్ఛమైన పాలన ఆంధ్రులకందించే తలంపుతో పార్టీ ఏర్పడిందన్నారు. 1978-82 మధ్య కాలంలో కాంగ్రెస్ అదిష్టాన వర్గం - ఆంధ్రలో ముగ్గురు ముఖ్యమంత్రులను మార్చింది. ప్రాంతీయ పార్టీని దుమ్మెత్తిపోస్తూ 'దాన్నొక డ్రామాట్రూప్' గా కాంగ్రెస్‌వారు హేళన చేసినప్పటికీ అంతరాంతరాళంలో కొంతవణుకుకు గురయినది. నిదర్శనం 4 వ ముఖ్యమంత్రిని ఢిల్లీ అధిష్టానవర్గం ఆంధ్రులపై రుద్దటమే.

1983 జనవరి 5 వ తేదీన జరిగే ఎన్నికల నోటిఫికేషన్ అక్టోబరులో వెలువడింది. ఇతర పార్టీలతో సీట్ల సర్దుబాటు కుదరలేదు. మేనకాగాంధీ ఆధ్వర్యంలోని సంజయ్ విచారమంచ్‌కు ఐదుస్థానాలను కేటాయించి, మిగిలిన 288 సీట్లకు తెలుగుదేశం ఎన్నికలబరిలో నిల్చింది. రామారావు స్వయంగా నిర్నిద్రహారులై అన్ని నియోజకవర్గాలను అనతికాలంలో తిరిగాడు. దాదాపు 35 వేల కిలోమీటర్లు తన చైతన్యరథంపై ప్రయాణించాడు. ప్రజలను కలుసుకున్నాడు. 201 సీట్లను గెలుచుకున్నాడు. స్వతంత్రావనిలో తొలి కమ్మ ముఖ్యమంత్రిగా గద్దెనెక్కాడు. 1983 జనవరి 9 న N. T. R. మంత్రివర్గం పదవీప్రమాణ స్వీకారం చేసింది.

17. నందమూరి తారక రామారావు మంత్రివర్గం (1983-84)

1. నాదెండ్ల భాస్కరరావు - ఆర్థికశాఖ

1984 ఆగష్టు 14 న నాదెండ్ల భాస్కరరావు తన మంత్రిపదవికి రాజీనామా ఇచ్చి — తనకు 92 శాసన సభ్యుల మద్దతు ఇందిరాకాంగ్రెస్ మద్దతు ఉన్నదని గవర్నర్ రామ్‌లాల్ సహకారంతో ముఖ్యమంత్రిగా ఆగష్టు 16 న పదవీప్రమాణం స్వీకరించారు. ఇది ప్రజాస్వామ్యాన్ని ఖూనీచేయడమని — వెన్నుపోటు చర్య అని అన్ని ప్రతిపక్షాలు ప్రజాస్వామ్య పునరుద్ధరణకై ఆందోళన సాగించాయి. నెలరోజుల అనంతరం — తిరిగి N. T. R. పదవీ బాధ్యతలను స్వీకరించారు.

18. నాదెండ్ల భాస్కరరావు మంత్రివర్గం (1984-ఆగష్టు)

1. V. రాంభూపాల్‌చౌదరి - రోడ్లు, భవనాలు
2. శ్రీమతి నన్నపనేని రాజకుమారి - సాంస్కృతిక వ్యవహారాలు

19. నందమూరి తారక రామారావు మంత్రివర్గం (1984 సెప్టెంబరు)

1. అన్నాబత్తుని సత్యనారాయణ - పౌరసరఫరాలు.

20. నందమూరి తారక రామారావు మంత్రివర్గం 1985.

1. వసంత నాగేశ్వరరావు - హోంశాఖ
2. గాలి ముద్దుకృష్ణమనాయుడు - విద్యాశాఖ
3. డా॥ M. S. S. కోటేశ్వరరావు - ఆరోగ్యశాఖ.

మంత్రివర్గ విస్తరణ [illegible] 1987.

1. వసంత నాగేశ్వరరావు - వ్యవసాయం, మార్కెటింగ్
2. గాలి ముద్దుకృష్ణమనాయుడు - అడవులు
3. డా॥ కోడెల శివప్రసాద్‌రావు - హోం, వలస [illegible]
4. డా॥ దగ్గుబాటి వెంకటేశ్వరరావు - వైద్య, ఆరోగ్యసేవలు
5. తుమ్మల నాగేశ్వరరావు - చిన్న నీటివనరులు.

1989 మంత్రివర్గ పునర్నిర్మాణం.

1. శ్రీమతి యెర్నేని సీతాదేవి - విద్యా[illegible]
2. [illegible] వీరయ్యచౌదరి - రెవిన్యూ
3. గుర్రం నారాయణప్ప - పౌరసరఫరాలు.

1979 మే 9 న డా॥ చెన్నారెడ్డి తన మంత్రివర్గంలో 7 మంత్రులను తొలగించారు. వారిలో వీరమాచనేని వెంకటనారాయణ గారొకరు.

1980 ఫిబ్రవరి 9 న టంగుటూరి అంజయ్య మంత్రివర్గం నుండి 15 మందిని తొలగించారు. అందులో శ్రీమతి లక్ష్మీకాంతమ్మ మంత్రిపదవి కోల్పోయి రాష్ట్రవినియోగదారుల ఫెడరేషన్ ఛైర్మన్ స్థానాన్ని పొందారు.

పబ్లిక్ అకౌంట్స్ కమిటి ఛైర్మన్ - వేములపల్లి శ్రీకృష్ణ (1976–77)

ఎస్టిమేట్స్ కమిటీ చైర్మన్ – బొగ్గారపు సీతారామయ్య (1978)

## పార్లమెంట్

లోక్‌సభా కాంగ్రెస్ (ఐ) పార్టీ ఉపాధ్యక్షుడు - ఆచార్య N. G. రంగా కేంద్ర క్యాబినెట్‌లో మంత్రిలుగా పనిచేసినవారు.

1. కొత్త రఘురామయ్య - అనేక శాఖలు నిర్వహించారు.
2. S. B. P. పట్టాభి రామారావు - పలుశాఖలు నిర్వహించారు.
3. R. ప్రభు - ప్రస్తుతం ఎరువులశాఖ (స్టేట్ మంత్రి) నిర్వహిస్తున్నారు. తమిళనాడు నుండి ఎన్నికైన M. P. (వెలగపూడి రామకృష్ణ మనుమడు).

## జిల్లాపరిషత్‌లు.

భారత రాజ్యాంగంలో నిర్దేశిక నియమాలు విశిష్టమైనవి. సమాజ సంక్షేమానికై కేంద్ర రాష్ట్రాలకు రాజ్యాంగం ఇచ్చే ఆదేశాలివి. అందులో గాంధేయ సూత్రాలు కొన్ని ముఖ్యమైనవి. అందులో పంచాయతీరాజ్ ఒకటి. స్థానిక స్వపరిపాలన - వికేంద్రీకరణ తద్వారా ప్రజాస్వామ్య విజయానికి మార్గమౌతుందిది. ప్రజా చైతన్యం - రాజకీయ చొరవకు ఇది మూలం. 1958 లో పంచాయతీ రాజ్ వ్యవస్థను మనరాష్ట్రంలో నెలకొల్పు కోవటమైనది. దానివల్ల జిల్లా పరిషత్, పంచాయితీ సమితి, గ్రామ పంచాయతి - అనే మూడంచల విధానం అమలులోకి వచ్చింది. అంతకు క్రితం జిల్లా బోర్డులు పనిచేస్తూ ఉండేవి. వాటి అధ్యక్షులుగా అనేకమంది కమ్మవారు పనిచేశారు.

గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులుగా శ్రీ పాములపాటి వేంకటకృష్ణయ్య చౌదరి, జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, నల్లూరి రాజయ్య, కన్నెగంటి సూర్యనారాయణ, నల్లపాటి వెంకటేశ్వర్లు. బందరు జిల్లాబోర్డులో కంఠమనేని వెంకటరంగయ్య,యార్లగడ్డశివరామప్రసాద్, కాకానివెంకటరత్నం, కల్లూరుచంద్రమౌళి.

అనంతపురంలో పైడి లక్ష్మయ్యనాయుడు, తూర్పు గోదావరిలో అల్లూరి సర్వారాయ చౌదరి తదితరులెందరో జిల్లాబోర్డు అధ్యక్షులుగా పనిచేశారు ఆయా ప్రాంతాల అభివృద్ధికి, సర్వతోముఖ ప్రగతికి పాటుపడ్డారు.

1958 నుండి జిల్లా పరిషత్‌లు అమలులోకి వచ్చాయి. ఆయా జిల్లాలలో ఈక్రింది కమ్మవారు అధ్యక్షులుగా పనిచేశారు.

1. పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్.
    1. మాగంటి సీతారామదాసు
    2. అల్లూరి బాపినీడు
    3. మాగంటి రవీంద్రనాథ్ చౌదరి.

2. కృష్ణా జిల్లా పరిషత్.
   1. కాకాని వెంకటరత్నం
   2. యార్లగడ్డ శివరామప్రసాద్
   3. మాగంటి అంకినీడు
   4. పిన్నమనేని కోటేశ్వరరావు
   5. సుంకర సత్యనారాయణ
   6. పిన్నమనేని కోటేశ్వరరావు (ప్రస్తుతం)

3. ప్రకాశంజిల్లా పరిషత్.
   1. నప్పిడి వెంగయ్య
   1. పోతుల చెంచయ్య
   8. గొట్టిపాటి హనుమంతరావు
   4. గుత్తా వెంకటసుబ్బయ్య (ప్రస్తుతం)

4. గుంటూరుజిల్లా పరిషత్
   1. నక్కుర్తి రామయ్య
   2. దొడ్డపనేని ఇందిర
   3. డా॥ రాయపాటి శ్రీనివాస్ (ప్రస్తుతం)

5. ఖమ్మం జిల్లా పరిషత్
   1. చేకూరి కాశయ్య (ప్రస్తుతం)

6. తూర్పు గోదావరి
   1. S. B P. K. సత్యనారాయణరావు.

విజయవాడ నగరపాలకసంస్థ ప్రధమ అధ్యక్షులు శ్రీ T. వెంకటేశ్వరరావు.

7. చిత్తూరు - N. P. చెంగల్రాయ్ నాయుడు
   నెల్లూరు - నల్లమోతు చెంచురామానాయుడు.

## వివిధ రాజకీయపార్టీలలోని ప్రముఖులు.

ఇక్కడ సిద్ధాంత చర్చకు అవకాశం లేదు.. నేల నాలుగు చెరగుల పేర్పడిన రాజకీయ భావప్రసవంతి విజ్ఞులైన తెలుగువారిని ముంచెత్తుతుంది. ఎవరి

పరిధిలో వారు తమ తమ విశిష్టతను, రాజకీయ భావాలను వెదజల్లుతున్నారు. వివిధ రాజకీయ పార్టీలు, ఉద్యమాలలో పనిచేస్తున్న కమ్మవారిని, ముఖ్యులను మననం చేసుకోవటమే ప్రస్తుత ఉద్దేశ్యం. ఇది సమగ్రం కాదు. అందర్నీ ఉదహరించడం సాధ్యంకాని విషయం.

ఇందులో చోటుచేసుకోని ప్రముఖులు అనేకమంది ఉండవచ్చు: కావాలని వారిని పేర్కొనక పోవడం జరగలేదని-తెలియకనే ఇలా జరిగిందని గమనించ ప్రార్థన. ముఖ్యంగా వివిద రాజకీయవర్గాలను స్వల్పంగా పరిచయం చేయ టమే ఈ శీర్షిక ఉద్దేశ్యం పాఠకులు సహృదయతతో అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాము. స్వాతంత్ర్యానికి పూర్వం వివిధపార్టీలలోని కమ్మవారిగురించి కొంత ఈ అధ్యాయంలో ప్రస్తావించాం. తరువాత ఘట్టంలోని నాయకశ్రేణిని పరికించగలరు.

## భారత కమ్యూనిస్టు పార్టి

ఈ పార్టీలో ఉన్న ప్రముఖులు చంద్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్ర శేఖరరావు, వేములపల్లి శ్రీకృష్ణ, నల్లమల గిరిప్రసాద్, దాసరి నాగభూషణరావు, వల్లూరు గంగాధరరావు, కడియాల గోపాలరావు, వెల్లంకి విశ్వేశ్వరరావు, వై. వి. కృష్ణారావు, మైనేని లక్ష్మణస్వామి, చంద్ర రామలింగయ్య కనవర్తి నాగయ్య, పువ్వాడ నాగేశ్వరరావు మొదలైనవారు.

పార్టీలో మితవాద, అవకాశవాద బావాలు బలమైనస్థానం సంపాదించా యని ఒక వర్గం ఆరోపించింది. వారు 1964 జూన్ తెనాలిలో సదస్సు జరుపు కున్నారు. రివిజనిజంతో తెగతెంపులు చేసుకుంటున్నామని ప్రకటించారు. 1964 అక్టోబరు కలకత్తాలో పార్టీవేదిక నుండి "నిజమైన కమ్యూనిస్టుపార్టీమేమే" అని మాకినేని బసవపున్నయ్యగారు ప్రకటించారు. ఆ విధంగా భారత కమ్యూ నిస్టు పార్టీ నుండి మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ జనించింది.

## మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ (CPIM)

మాకినేని బసవపున్నయ్య, కొరటాల సత్యనారాయణ, లావు బాలగంగా ధరరావు, మోటూరి హనుమంతరావు, పుతుంబాక వెంకటపతి, బోడెపూడి వెంకటేశ్వరరావు, మానికొండ సుబ్బారావు, అట్లూరి శ్రీమన్నారాయణ తది తరులు ప్రముఖులు.

1968 జూన్‌లో పార్టీకి వ్యతిరేకంగా తిరుగుబాటును బహిరంగంగా కొందరు ప్రోత్సహించారు. వారిని పార్టీ బహిష్కరించింది. దేనికొరకైతే చీలామో, దాని నాచరించడం లేదని - రివిజనిజాన్నే పట్టుకొని పార్టీఅంతటంతో-దాన్ని వ్యతిరేకిస్తున్నామని చీలిపోయినవాళ్ళు ప్రకటించారు. నక్సల్‌బరీ ఉద్యమం బెంగాల్‌లో ప్రారంభమైనది. దాన్ని అనుసరిస్తూ సాయుదపోరాట వర్గాన్ని అవలంభిస్తూ నక్సలైట్ ఉద్యమం ఆంధ్రాలో వీరితో ఆరంభమైనది.

వీరి చీలికతో మార్క్సిస్టుపార్టీ తీవ్రంగా నష్టపోయింది. యువజన విద్యార్థి సంఘాలు దాదాపు పూర్తిగా ఉగ్రవాదుల వెంట వెళ్ళారు.

## భారత కమ్యూనిస్టు (మార్క్సిస్టు — లెనినిస్టు)

కొల్లా వెంకయ్య, అమరజీవి డా॥ చాగంటి భాస్కరరావు, చల్లపల్లి శ్రీనివాసరావు, మూదల నారాయణస్వామి దదితరులు.

## కృషికార్ లోక్‌పార్టీ.

1951 కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీచేసిన ఆచార్య రంగా ఎన్నికలలో ఓడిపోయారు. అనంతరం కాంగ్రెస్ నుండి విడివడి ప్రజాపార్టీని స్థాపించారు. అనతికాలంలోనే దాని స్థానంలో కృషికార్ లోక్‌పార్టీని స్థాపించారు. రాజస్థాన్, గుజరాత్‌లలోని తన అనుచరవర్గంతో తనది అఖిల భారత పార్టీగా వర్ణించారు. 1951లో ఆపార్టీ రాష్ట్రసభలు తెనాలిలో జరిగాయి. అందులో నీరుకొండ రామారావు, P. రాజగోపాలనాయుడు తదితరులు పనిచేశారు. ఆ పార్టీ కాల గర్భంలో కలసిపోయింది.

## సోషలిస్టు డెమోక్రాటిక్ పార్టీ

అనాటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డితో వచ్చిన స్పర్థవల్ల కొంతమంది కాంగ్రెస్‌వారు - అపార్టీనుండి చీలి దీనిని ఏర్పరచారు. 1959 మే తెనాలిలో ఈపార్టీ మహాసభ జరిగింది. హైదరాబాద్‌లో పార్టీబోర్డు సైతం ఏ ఇంటికీ తగిలించకముందే ఈపార్టీ అంతరించింది. ఇందులో G. C. కొండయ్య, అయినంపూడి చక్రధర్, నన్నపనేని వెంకటాద్రి, కాకాని వెంకటరత్నం, జాగర్లమూడి చంద్రమౌళి పనిచేశారు.

## స్వతంత్ర పార్టీ

అఖిల భారతస్థాయిలో కాంగ్రెస్‌నుండి చీలిన వ్యక్తులతో ఈ పార్టీ ఏర్పడినది. దీని స్థాపకులలో ఆచార్య రంగా గారొకరు. స్వల్పమైన పరిమితులు - అదిక స్వేచ్ఛ' ప్రజలకు కల్పించాలని ఈ పార్టీ కోరింది. ఇందులో గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, పి. రాజగోపాలనాయుడు, సుంకర సత్యనారాయణ, యడ్లపాటి వెంకట్రావు, జాగర్లమూడి చంద్రమౌళి పనిచేశారు. రంగాగారు ఆయనతోపాటు కొందరు కాంగ్రెస్‌లోచేరిపోయారు. మిగిలినవారు లోక్‌దళ్, అనంతరం జనతాలో కలవడంతో ఈ పార్టీ చరిత్రపుటలలో మిగిలిపోయింది.

## జనతాపార్టీ

1977 లో ఆవిర్భవించింది. శ్రీమతి గాంధీ విధించిన అత్యవసర పరిస్థితి కారణంగా ప్రతిపక్ష పార్టీలు నాలుగు ప్రజాస్వామ్య కాంగ్రెస్‌తో కలిపి ఐదుపార్టీల కలయికతో ఏర్పడి, తొలిసారిగా కేంద్రంలో కాంగ్రేసేతర పార్టీ పాలనను దేశానికి అందించినది. ఇందులో జాగర్లమూడి చంద్రమౌళి, శ్రీమతి **D.** ఇందిర, చేకూరి కాశయ్య, తుమ్మల చౌదరి, గద్దె వెంకటరత్తయ్య, వడ్డె శోభనాద్రేశ్వరరావు, **M.** వెంకయ్యనాయుడు తదితరులు పనిచేశారు.

జనతాపార్టీ చీలికతో డా॥ యలమంచిలి శివాజీ, వడ్డె శోభనాద్రేశ్వరరావు లోక్‌దళ్‌లో పనిచేశారు. ముప్పవరపు వెంకయ్యచౌదరి భారతీయ జనతా పార్టీలో పనిచేస్తున్నారు.

## కాంగ్రెస్‌పార్టీ

జాతీయోద్యమకాలం నుండి 1982 వ సం॥ వరకు ఈ పార్టీకి చెందిన అంశాలను ప్రస్తావించడం జరిగింది. మంత్రులుగా, జిల్లాపరిషత్ చైర్మన్లగా ఇందులో పనిచేసిన ప్రముఖులను ప్రస్తావించడమైనది. ఈ పార్టీ సంస్థా కాంగ్రెస్, కొత్త కాంగ్రెస్‌గా (1969) - కాంగ్రెస్ (యు), కాంగ్రెస (ఐ) గా 1978లో చీలినప్పటికీ - మిగిలిన చీలికలన్నీ దాదాపు అంతరించాయి. ఇందిరా కాంగ్రెస్‌గా తన ప్రభను - ప్రతిభను దేశంలో ఇనుమడింపచేస్తున్నది. ఇందులో ఆచార్య రంగా, తాపూరి సాంబశివరావు, రాయపాటి సాంబశివరావు, చేబ్రోలు హనుమయ్య, [illegible] వెంకటనారాయణ, నాదెండ్ల భాస్కరరావు, నన్నప

నేని రాజకుమారి, పిన్నమనేని కోటేశ్వరరావు, రాంభూపాల్ చౌదరి, N. P. చంగల్రాయనాయుడు, P. రాజగోపాలనాయుడు, దరుపూరి పుల్లయ్య తదితరులు పనిచేస్తున్నారు. తమిళనాడు నుండి ఈ పార్టీ M. P. గా ఎన్నికై కేంద్రంలో స్టేట్ హోదా మంత్రి-ఎరువుల శాఖను నిర్వహిస్తున్న R.ప్రభుకమ్మవారే! అలాగే కర్ణాటకలో కాంగ్రెస్ మంత్రివర్గంలో పనిచేసిన మాజీమంత్రి అశ్వత్థరెడ్డిగారు కూడా కమ్మవారే!

## తెలుగుదేశం

పార్టీ అవతరణను గురించి ఇంతకుపూర్వమే తెల్పటమైనది. బక్కన్నల అభ్యున్నతికి,బడుగువర్గాల శ్రేయస్సుకు,పక్కాగృహాల నిర్మాణం,కిలో రెండు రు॥ బియ్యం పథకం, సగం ధరకే జనతా దోవతి, చీరలు, త్రాగునీరు, సాగునీరు తెలుగు ఆడబడచుల సంక్షేమం-ఆస్తిలో సగంవాటా,ఉద్యోగాలలో 30%రిజర్వేషన్లు, ప్రజాస్వామ్య విజయానికి — వికేంద్రీకరణ వ్యవస్థకోసం మండలాల వ్యవస్థ, అందరికీ ఆరోగ్యం, దృశ్య ప్రసారాలద్వారా విద్యాబోధన వంటివాటిని చేపట్టి ఆరుకోట్ల ఆంధ్రుల కోసం N. T. రామారావుగారు అమలుచేస్తున్నారు. ఇందులో పర్వతనేని ఉపేంద్ర, గోరంట్ల బుచ్చయ్యచౌదరి, వడ్డే శోభనాద్రీశ్వర రావు, యలమంచిలి శివాజి, కాటూరి నారాయణస్వామి, తుమ్మల నాగేశ్వరరావు, డా॥ కాసరనేని సదాశివరావు, డా॥ కొడాలి వీరయ్యచౌదరి, డా॥ దగ్గుపాటి వెంకటేశ్వరరావు, డా॥ కోడెల శివప్రసాద్ రావు తదితరులు ప్రముఖులు.

## ప్రజాస్వామ్య తెలుగుదేశం.

1984 లో తెలుగుదేశం నుండి విడివడి కాంగ్రెస్సాయంతో నెలరోజులు ముఖ్యమంత్రిగా కొనసాగిన నాదెండ్ల భాస్కరరావు అధ్యక్షతన ప్రజాస్వామ్య తెలుగుదేశం పార్టీ జనించింది. 1984 అంతంలో జరిగిన ఎన్నికలలో 220 స్థానాలకుపోటీ చేసింది. నాదెండ్ల భాస్కరరావుతోసహా పార్టీఅభ్యర్థులందరూ ఓడిపోయారు. 1989 మే నెలలో భాస్కరరావుగారు కాంగ్రెస్‌లో చేరటంతో, ఆయన అనుచరవర్గం కూడా కాంగ్రెస్ వారయ్యారు. దానితో ఈపార్టీ అంతరించింది.

## తెలుగునాడు.

తెలుగుదేశం నాయకుడు N. T. రామారావు నియంతృత్వ విధానాలను వ్యతిరేకిస్తూ - ఆ పార్టీ ఆశయాలకోసం, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయం కోసం

ఈ పార్టీ ఏర్పడినట్లు - పార్టీ ఉపాధ్యక్షుడు వసంతనాగేశ్వరరావు ప్రకటించారు. తెలుగునాడు ప్రాంతీయపార్టీ 1989 మే, 7వ తేదిన తిరుపతిలో ఆవిర్భవించింది.

## శాసనసభ్యులు.

ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్యదేశం మనది. సమానత్వ ప్రాతిపదికపై, ఏ వివక్షతలకు ఆస్కారంలేకుండా వయోజన ఓటుహక్కును అందరికీ మన రాజ్యాంగం ప్రసాదించినది. క్రమం తప్పకుండా నిర్ణీతకాలంలో జరిగే ఎన్నికలలో ప్రజలు తను ఓట్లద్వారా తమ ప్రతినిధులను ఎన్నుకుంటారు. ఆ ప్రతినిధులు ప్రజాసేవకులు. ప్రజావిశ్వాసంతో వారిద్వారా ఎన్నుకోబడి వారికోసం తమ విధినిర్వహణను చేయాలి. స్వంతరాష్ట్రం ఏర్పడిన తరువాత తెలుగు ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకున్నారు. ప్రజా ప్రతినిధులుగా, శాసనసభ్యులుగా ప్రజాభిమానం చూరగొన్న ప్రముఖులైన కమ్మవారిని పేర్కొనటమౌతుంది.

అలపాటి వెంకట్రామయ్య, అడుసుమిల్లి సుబ్రమణ్యం, కొర్రపాటి పట్టాభిరామయ్య. కొల్లా వెంకయ్య, కొట్టా అదికేశవులునాయుడు, గంజి రామారావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, కోవి రామయ్య,చౌదరి, కరణం రంగారావు, గారపాటి సత్యనారాయణ, చిట్టూరి ఇంద్రయ్య, చిట్టూరి ప్రభాకరచౌదరి, చంద్ర రామలింగయ్య, దండమూడి దశరధరామయ్య, దర్శి లక్ష్మయ్య, నల్లమోతు చెంచురామానాయుడు, నల్లపాటి వెంకట్రామయ్య, నీరుకొండ వెంకటరామారావు, S.B.P. పట్టాభి రామారావు, మోటూరి హనుమంతరావు, మైనేని లక్ష్మణస్వామి, మండవ బాపయ్య, వేములపల్లి శ్రీకృష్ణ, వాసిరెడ్డి రామారావు, గోవాడ పరంధామయ్య, ఉవి కొండయ్యచౌదరి, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్, జాగర్లమూడి చంద్రమౌళి, పుతుంబాక శ్రీరాములు, నీరుకొండ వెంకటరత్నమ్మ మూల్పూరి రంగయ్య, యార్లగడ్డ శివరామప్రసాద్, అడుసుమిల్లి వెంకట సుబ్రమణ్యం, కాకాని వెంకటరత్నం, మాగంటి రామయ్య, జాగర్లమూడి రామకోటయ్య, నాగినేని వెంకయ్య, కల్లూరి చంద్రమౌళి, గింజుపల్లి బాపయ్య, బండ్లమూడి వెంకటశివయ్య, కొల్లా రామయ్య, నల్లబ్రోలు గోవిందరాజులు, S.P. చెంగల్రాయనాయుడు, P. రాజగోపాలనాయుడు, S.వెంకట్రామనాయుడు, గొట్టిపాటి బ్రహ్మయ్య, వెనిగళ్ళ సత్యనారాయణరావు, దాచిన సుబ్బారావు,

గోగినేని భారతీదేవి, జాస్తి సీతామహాలక్ష్మమ్మ, బిక్కిన వెంకటరత్నం, మానుకొండ సూర్యావతి, K. ఆదికేశవులునాయుడు, గుత్తా రాజారావు, గద్దె వెంకటేశ్వరరావు, ముక్కపాటి వెంకటేశ్వరరావు, పిన్నమనేని కోటేశ్వరరావు, కొరటాల సత్యనారాయణ, దొడ్డపనేని ఇందిర, గద్దె వెంకటరత్తయ్య, రావెల వెంకట్రావు, సోమేపల్లి సాంబయ్య, డా॥ రాజా కృష్ణమూర్తి, మద్దురూరి నారాయణరావు, S. P. వెంకటేశ్వరచౌదరి, B. T. L. N. చౌదరి, ముప్పల నేని శ్రీనివాసరావు, చేకూరి కాశయ్య, తిరువేదుల చంద్రశేఖరరెడ్డి, T. రాజ శేఖరరెడ్డి, ఉండవల్లి నారాయణమూర్తి, చనుమోలు వెంకట్రావు, పాలడుగు వెంకట్రావు, R. వేమన, గుర్రం చినవెంకన్న, వద్దె శోభనాద్రేశ్వరరావు, యడ్లపాటి వెంకట్రావు, గోగినేని నాగేశ్వరరావు, కరణం బలరామకృష్ణమూర్తి, గోరంట్ల బుచ్చయ్యచౌదరి, ముళ్ళపూడి వెంకటకృష్ణారావు, వసంత నాగేశ్వర రావు, దేవినేని రాజశేఖర్, రావి శోభనాద్రి, యర్నేని సీతాదేవి, కొడాలి వీరయ్య, ఆలపాటి ధర్మారావు, మాకినేని పెదరత్తయ్య, M. S. S. కోటేశ్వర రావు, డా॥ K. సదాశివరావు, గంగినేని వెంకటేశ్వరరావు, డా॥ K. శివప్రసాద్ రావు, డా॥ D. వెంకటేశ్వరరావు, డా॥ చెంచు గరటయ్య, M. వెంకయ్య నాయుడు, జి. ముద్దుకృష్ణమనాయుడు, V. రామభూపాల్ చౌదరి, ధామన్ చౌదరి, అప్పదారు వెంకటేశ్వర్లు, G. మల్లికార్జునరావు, B. రామారావు, పొనుగుపాటి కోటేశ్వరరావు, కాటూరి నారాయణస్వామి, రావిపాటి మహానంద, జాగర్లమూడి లక్ష్మీనారాయణ, S. పట్టాభి రామస్వామిచౌదరి, గద్దె బాబూరావు, సూతి వెంకటేశ్వర్లు, బొబ్బాల సత్యనారాయణ, కొమ్మినేని వెంకటేశ్వరరావు, పాటిబండ్ల రంగనాయకులు, బొల్లినేని వెంకట లక్ష్మనారాయణ, అల్లూరి బాపినీడు, P. V. చౌదరి, సూర్యదేవర వెంకట నరసింహారావు తదితరులు-

## పార్లమెంట్ సభ్యులు.

నూతక్కి రామశేషయ్య, కడియాల గోపాలరావు, కొత్త రఘురామయ్య, చాపలమడుగు రామయ్య, గోగినేని రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, చిట్టూరి సుబ్బారావు, కొల్లా వెంకయ్య, P. రాజగోపాలనాయుడు, మాగంటి అంకినీడు, పాములపాటి అంకినీడు ప్రసాద్, S. B. P. పట్టాభి రామారావు, B. బుల్లి రామయ్య, వద్దె శోభనాద్రేశ్వరరావు, కాటూరి నారాయణస్వామి,

S. P. ఝాన్సీలక్ష్మి, కాట్రగడ్డ ప్రసూన, D. నారాయణస్వామి, T. కల్పనా దేవి, కావూరి సాంబశివరావు, పుల్లయ్య, P. ఉపేంద్ర, రేణుకాచౌదరి, రాయపాటి సాంబశివరావు, అల్లూరి సర్వారాయుడు, నార్ల వెంకటేశ్వరరావు, మాకినేని బసవపున్నయ్య, అయినంపూడి చక్రధర్, మోటూరి సత్యనారాయణ, K.L.N. ప్రసాద్, కొంగర జగయ్య, యలమంచలి శివాజీ తదితరులు,

## 9. వివిధ రంగాలలో కమ్మవారు.

### చిరస్మరణీయులు

1. శ్రీ పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి :- ఆనరరీ లెఫ్టినెంట్, నిడుబ్రోలు వాస్తవ్యులు. గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. అనేక హైస్కూళ్ళు, వైద్యాలయాలు నిర్మించారు. జిల్లా విద్యా సంఘాధ్యక్షునిగా 9 సం॥ కృషిలో-విద్యాభివృద్ధికి బాటలువేశారు. యూనివర్శిటి సెనేట్ మెంబరు. 1930 లో రాష్ట్ర కౌన్సిలు సభ్యులు. 'దేశాభిమాని' పత్రిక నడిపారు. జస్టిసుపార్టీ ప్రముఖులు. సంఘాభిమాని, వక్త.

2. రావూ బహద్దరు జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి:- కారంచేడు వాస్తవ్యులు- గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులుగా, మద్రాసు శాసనసభా సభ్యునిగా ప్రజాసేవ చేశారు. కావూరు వినయాశ్రమానికి 100 ఎకరాల స్వంత భూమి గాంధీ ఆశీర్వాదాలతో ఇచ్చారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను కష్టకాలంలో ఆదుకున్నారు. శారదానికేతన్, పలు విద్యాసంస్థలకు విరాళాలిచ్చారు. గుంటూరు కమ్మ జన హాస్టలు మేడ గదులను నిర్మించారు. రాయప్రోలు, పింగళి లక్ష్మీకాంతం స్నేహితులు. తుమ్మల, శ్రీజాషువా, శ్రీఏటుకూరి, శ్రీ కొత్త సత్యనారాయణ మొ॥ కవులకు పండిత పదవులిచ్చారు. నిరతాన్నదాత. వీరి పేరిట గుంటూరులో శ్రీజాగర్లమూడి కుప్పుస్వామి కళాశాల వెలుగొందుచున్నది.

శ్రీ సూర్యదేవర రామశేషయ్య :- లాయరు. బెజవాడ తాలూకా బోర్డు అధ్యక్షులుగా, జయపూరు అసిస్టెంటు దివానుగా, ప్రజాసేవ చేశారు.

రాయగడ నుండి పార్లమెంట్ సభ్యునిగా ఎన్నికైయ్యారు. కవి-కవిపోషకులు. ప్రఖ్యాత శాస్త్రవేత్త భానుప్రసాద్ వీరి కుమారులే!

4. శ్రీ జంపాల సుబ్బారాయుడు, దుగ్గిరాల :- స్వగ్రామమున వంతెనలు, హైస్కూలు, సత్రము కట్టించెను. గొప్ప ధర్మదాత.

5. శ్రీ రావు బహద్దూరు కోవెలమూడి గోపాలకృష్ణయ్య, B.A.,BL.,:- న్యాయవాదిగా పేరుప్రతిష్టల నార్జించెను. తాలూకాబోర్డు అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా ప్రజాసేవ చేశారు. మదరాసు శాసన సభ సభ్యులు. గండికోట భవన నిర్మాణమున కీయన ప్రధానపాత్ర వహించారు.

6. శ్రీ రావు బహద్దర్ కొనరాజు రామయ్యచౌదరి :- తెనాలితాలూకా బోర్డు అధ్యక్షులుగా- తురుమెళ్ళలో ఒక హైస్కూలు, గొప్పవంతెన కట్టించెను. ఆనాడు గొప్ప ప్రజాసేవకులుగా పేరొందారు.

7. రావుసాహెబ్ కంఠంనేని వెంకట రంగయ్య :- బందరు జిల్లా బోర్డు, తాలూకా బోర్డులలో ఉండి గొప్ప ప్రజాసేవ చేసెను. కృష్ణానది కరకట్టలను ప్రమాద సమయములో బాగుచేయించి ప్రభుత్వ బంగారు పతకము పొందెను. 1726 లో బంగారు పొన్నుకర్ర, రావుసాహెబ్ బిరుదుతో ప్రభుత్వం వీరిని సత్కరించింది.

8. రావు సాహెబ్ జంపాల వెంకటేశంచౌదరి :- డిప్యూటి కలెక్టరుగా కొంతకాలం పనిచేశారు. వీరి ప్రోత్సాహ ప్రోద్భలం వల్ల గుంటూరు కమ్మ హాస్టలు నిర్మాణం జరిగింది. శ్రీ K. లక్ష్మీరఘురాం B.A. వీరి కుమార్తె - ఆమె 'ఆంధ్ర మహిళా' సంపాదకురాలు,

9. శ్రీ రామినేని కౌసలేంద్రరావు :- నాగపూర్‌లో న్యాయవాదిగా పేరువాసించి, నాగపూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేశారు. వీరు ఈడ్పుగంటి రాఘవేంద్రరావు (గాంధీటోపి గవర్నరు) గారి మేనల్లుడు.

నాగపూర్‌లో శ్రీ కాజా రామారావు పోస్ట్‌మాష్టరు జనరల్‌గా, చలసాని విశ్వనాధరావు విద్యాశాఖ డిప్యూటి డైరెక్టరుగా పేరు ప్రఖ్యాతుల నార్జించారు.

10. రావు బహద్దర్ శ్రీ చలసాని సత్యనారాయణచౌదరి B.A., B.L.:- కృష్ణా జిల్లా పెదమద్దాలి కాపురస్తులు. గుంటూరులో న్యాయవాదిగా, సబ్

జడ్జీగా క్రమంగా జిల్లాజడ్జీగా అనేక జిల్లాలలో పనిచేసి పేరు ప్రఖ్యాతులు పొందారు.

11. శ్రీ మాగంటి బాపినీడు :- అమెరికాలో M. Sc. చదివారు. 1937 లో పార్లమెంట్ కార్యదర్శిగా, మదరాసు శాసన సభ్యునిగా, కృష్ణాజిల్లా జిల్లాపరిషత్ అధ్యక్షునిగా, స్వాతంత్ర్యనంతరం పార్లమెంట్ సభ్యునిగా పలు బాధ్యతలను నిర్వహించారు. వీరి భార్య శ్రీమతి అన్నపూర్ణగారు గాంధీజీ మన్ననలను పొందిన మహిళ. ఆమె పేరిట ఒక హైస్కూలును, ఆంధ్రవిశ్వ విద్యాలయమున ఒక బహుమతిని ఏర్పరచటమైనది. ఆంధ్ర సర్వస్వమను మంచి గ్రంథానికి బాపినీడుగారు సంపాదకులు.

12. శ్రీ ఉప్పలపాటి శౌరిరాజులునాయుడు :- తంజావూరు జిల్లా నాగపట్టణ ప్రాంత నివాసి. గొప్ప భూస్వామి. న్యాయవాదిగా, జిల్లామున్సిఫ్‌గా సబ్‌జడ్జిగా పనిచేశారు. వీరి తండ్రి కోదండరామయ్య గొప్ప సత్రమును కట్టించెను. వీరి మామ బాలకృష్ణనాయుడు గొప్ప భూస్వామి. పేరున్న వ్యక్తి.

13. శ్రీ కల్లూరి చంద్రమౌళి B. Sc., :- మోపర్రు గ్రామస్థులు. అబర్డీనులో B. Sc., వ్యవసాయశాస్త్రంలో పట్టాపొందారు. కాంగ్రెస్‌లో చేరి రెండుసార్లు జైలుశిక్ష అనుభవించారు. విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులు, గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులు-మద్రాసులో లోకలు బోర్డు మంత్రిగా ఉన్నప్పుడు నూతన పంచాయితీల శాసన మేర్పరచారు. మంచి రచయిత. జీర్ణదేవాలయములను ఉద్ధరించారు. ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శిగా దేవాదాయ, ధర్మాదాయ శాఖా మంత్రిగా పనిచేశారు. గొప్ప ప్రజా సేవకులుగా పేరొందారు.

14. శ్రీ బలుసు ప్రభాకర పట్టాభిరామారావు :- కపిలేశ్వరపురం వాస్తవ్యులు. రాష్ట్ర విద్యాశాఖా మంత్రిగా సాహిత్య అకాడమీని ఏర్పరచారు. ప్రభుత్వంచే పాఠ్యపుస్తకాల ప్రచురణను చేపట్టించారు. కేంద్ర, రాష్ట్రమంత్రిగా ఎంతో సేవ చేశారు.

15. శ్రీ బక్కిన వీరాస్వామినాయుడు :- 1946 లో మదరాసు శాసన సభా సభ్యులుగా, అడవులు వగైరా మంత్రిగా పనిచేశారు. అనారోగ్య కారణం వల్ల దానికి అనతికాలంలోనే రాజీనామా ఇచ్చారు.

16. శ్రీ సాధు సుబ్రమణ్యం :- గాంధీ నిర్మాణ కార్యక్రమముల ననుసరించి ప్రజాసేవకు పూనుకున్నారు దండి సత్యాగ్రహయోధుడు. అసలు పేరు యర్నేని సుబ్రమణ్యంగారు. కొమరవోలు ఆశ్రమ నిర్మాత-నిర్వాహకులు. వినొభాభావే అనుచరులు. భూదానోద్యమంలో బాగా పాల్గొన్నారు.

17. శ్రీ వెన్నం రామయ్యచౌదరి :- రావి అనంతపురంలో గొప్ప భూస్వామి. రేపల్లె తాలూకా బోర్డు అధ్యక్షులుగా ప్రజాసేవ చేశారు. వేణు గోపాల యాలయమొకటి కట్టించారు. దానికి 30 ఎకరాల మాన్యం ఇచ్చారు. రేపల్లె మిడిల్‌స్కూలు నిర్మాణానికి సాయంచేశారు.

18. శ్రీ వెనిగళ్ళ హనుమంతరావుచౌదరి :- తెనాలి తాలూకా దుగ్గిరాల కాపురస్తుబు. డిప్యూటి కలెక్టరుగా, జాయింట్ హోం సెక్రెటరీగా రిటైరయ్యి మద్రాసులో నివాసం ఏర్పరచుకున్నారు. భూస్వామి. కుమారుడు రాజేశ్వర ప్రసాదు దత్తాత్రేయ స్మృత్యార్థం హాస్పటల్‌కు లక్షరూపాయలు విరాళంఇచ్చారు.

19. శ్రీ మాగంటి సీతయ్య, లక్షణదాసులు :- మాగంటి రామదాసు కుమారులు. సీతయ్య శాసన సభా సభ్యునిగా, ఏలూరు తాలూకా బోర్డు అధ్యక్షులుగా ప్రజాసేవ చేశారు. వీరి పేరిట గండికోటభవనము (కమ్మవిద్యార్థి వసతి గృహం) విజయవాడలో ఒక గది నిర్మింపబడినది. లక్ష్మణదాసుగారు బందరు జాతీయ కళాశాలకు రెండు ఎకరముల భూమిని దానం చేశారు.

## ప్రముఖులు – ప్రసిద్ధులు

1. ఆచార్య **N. G.** రంగా :- నిడుబ్రోలులో 1900 లో జన్మిం చారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో **P.hd.** పొంది- మద్రాసు పచ్చాయప్ప కాలే జీలో ఆర్థికశాస్త్రప్రధానాచార్యులుగా పనిచేశారు. స్వాతంత్ర్యోద్యమంలోపాల్గొని- జైలుశిక్ష పొందారు. కేంద్ర శాసనసభా సభ్యులుగా స్వాతంత్రానికి పూర్వం రెండు సార్లు, అనంతరం నాలుగుసార్లు ఎన్నికైయ్యారు. ఆంధ్ర కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా, కృషికార్‌లోక్ పార్టీ, స్వతంత్ర పార్టీ వ్యవస్థాపకులుగా పని చేశారు. అఖిల భారతకిసాన్ కాంగ్రెస్ అధ్యక్షులుగా, రైతు ఉద్యమనిర్మాతగా- రైతురంగా, చేనేతరంగా, కూలిరంగాగా ప్రసిద్ధి పొందారు. పలుదేశాలలో రైతు ప్రతినిధిగా పాల్గొన్నారు. అంతర్జాతీయ రైతు ఉద్యమంలో సంబంధమున్న

వారు. బహుగ్రంథ రచయిత. సీనియర్ పార్లమెంటేరియను ప్రస్తుతం లోక్ సభలో కాంగ్రెస్ పార్లమెంటరీ ఉపనాయకులుగా పనిచేస్తున్నారు,

2. కీ॥ శే. శ్రీ క్రొత్త రఘురామయ్య :- 1912 లో సంగం జాగర్లమూడిలో జన్మించారు. బారిస్టరు 1947 నుండి ప్రభుత్వ న్యాయశాఖకు డిప్యూటి సెక్రటరీగా పనిచేస్తూ - దానికి రాజీనామాఇచ్చి 1949లో రాజకీయాల లోకి వచ్చారు. తెనాలి, గుంటూరు నియోజకవర్గాలనుండి లోక్‌సభకు ఎన్నికయ్యారు. కేంద్రంలో రక్షణశాఖ డిప్యూటి మంత్రి, రక్షణ సామాగ్రి ఉత్పత్తిశాఖ, సప్లయ్‌శాఖ, పెట్రోలియం కెమికల్స్ శాఖ, పార్లమెంటరీ వ్యవహారాల శాఖా- మొ॥ పలు శాఖలలో మంత్రిగా పదవులను సమర్థవంతంగా నిర్వహించారు. వీరిపేరిట నరసరావుపేట, దుగ్గిరాలలో కళాశాలలు స్థాపించబడ్డాయి.

3. శ్రీ చంద్ర రాజేశ్వరరావు :- 1915 లో కృష్ణాజిల్లా దివితాలూకా-మంగళాపురంలో జన్మించారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగానే మార్క్సిస్టు అధ్యయన మండలులను ఏర్పాటు చేశారు. తరువాత విశాఖపట్నంలో మెడిసిన్ చదువుతూ- దానికి స్వస్తిపలికి రాజకీయాలలోకి అరుదెంచారు. భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపక సభ్యులులలో ఒకరు. పార్టీలో రాష్ట్ర కార్యదర్శి, సెంట్రల్‌కమిటి సభ్యుడు, పొలిట్ బ్యూరో సభ్యుడు, ప్రధాన కార్యదర్శి తదితర బాధ్యతలను నిర్వహించారు. తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. 1964 నుండి ప్రధానకార్యదర్శిగా కొనసాగుతున్నారు. 1974 లో అర్డర్ ఆఫ్ లెనిన్' రష్యానుండి అవార్డు పొందారు.

4. శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు :- 1907 లో గుంటూరుతాలూకా వెంట్రప్రగడలో జన్మించారు. మెకానికల్ ఇంజనీరు కోర్సు చదివారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. విదేశీ వస్త్ర బహిష్కరణ, సైమన్ కమీషన్ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నారు. జిల్లా కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలలో ఒకరు. 'నవశక్తి, స్వతంత్ర భారత్, ప్రజాశక్తి' పత్రికలకు సంపాదకులు. మంచి విమర్శకారులు. కీర్తిశేషులు.

5. శ్రీ సంజీవదేవ్ :- తుమ్మపూడి ప్రముఖ రష్యన్ చిత్రకారుడు-ఆచార్య నికోలస్ రోరిక్‌తో 'భారతరత్న'గా ప్రశంస పొందారు. ఆంధ్ర లలిత కళా లకాడమీ, సాహిత్య అకాడమీసభ్యులు. తెలుగు భాషాసమితి విజ్ఞాన సర్వస్వ సంపాదక సభ్యులు.

6. శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ :- ఏలూరు కోపరేటివ్ మార్కె. టింగ్ ఫెడరేషన్ అధ్యక్షులుగా, భీమడోలు పంచదార ఫ్యాక్టరీ వ్యవస్థాపకులుగా రాజ్యసభ సభ్యునిగా, లోక్‌సభకు మూడుసార్లు సభ్యునిగాఎన్నికైయ్యారు. ప్రజాసేవలో రాటుదేలారు.

7. శ్రీ K. L. N. ప్రసాద్ :- 1928 లో కృష్ణాజిల్లా కేతవరంలో జన్మించారు. రాజ్యసభ సభ్యులుగా 17 సం॥ ఆంధ్రులకు ప్రాతినిధ్యం వహించారు. సాధారణ చదువుతో అసాధారణ స్థాయికి ఎదిగారు. 'ఆంధ్రజ్యోతి' ఆంధ్రాబ్యాంక్, లక్ష్మీఫిలింస్ - పెక్కు వాణిజ్యపరిశ్రమలు వీరికే ఋణపడి ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ వాణిజ్యమండలి ప్రెసిడెంట్, ప్రభుత్వ ఆర్థిక సంఘం ఛైర్మన్, మెరిస్టెల్లా కాలేజి కమిటి అధ్యక్షులు - పెక్కు బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించినవారు- కీర్తిశేషులు.

8. శ్రీ కొడాలి వెంకటనారాయణరావు :- కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా యలమర్రులో జన్మించారు. సిరిపూర్ సర్‌సిల్క్ ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో కార్యదర్శిగా, అధ్యక్షునిగా పనిచేశారు. సిరిపూర్ L.M.D.బ్యాంక్ అధ్యక్షునిగా, ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సమాఖ్య తెలుగునాడు ట్రేడ్ యూనియన్ అధ్యక్షునిగా పనిచేశారు. ప్రస్తుతం శాసనసభలో చీఫ్ విప్‌గా వ్యవహరిస్తున్నారు.

9. శ్రీ యలమంచి శోభనాద్రి :- కృష్ణాజిల్లా మేడూరులో 1830 లో జన్మించారు. సంపన్న రైతు అయినా పూరిపాకలో ఉంటూ- పాలేర్లకు పెంకుటిల్లు కట్టించి ఇచ్చిన వితరణశీలి. వీరి నాయకత్వంలో బంజరు శాశ్వత హక్కుకై రెండు వేలమందిరైతులు- జమిందార్లకు వ్యతిరేకంగా సంఘటితమయ్యారు. బ్రిటిష్ ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా- నాగలిమేడిని భూమిలో తిరగవేసి తమ నిరసనను తెలిపారు. అందుకు వీరికున్న 150 ఎకరాలను ప్రభుత్వం స్వాధీనంచేసుకుంది. కోర్టుకెక్కిన శోభనాద్రి-భార్య, తమ్ముళ్లుఇద్దరు, అల్లుడు ఆసమయంలో చనిపోయినా కృంగిపోకుండా, రాజీ లేని పోరాటాన్ని సాగించారు. జమీందార్లు శిస్తుపెంచినందుకు 80 గ్రామాలలోని భూముల్ని రైతులచేత బీడుపెట్టించి నిరసన పోరాటంలో గెలుపు సాధించిన కార్యశీలి. రైతు ప్రతినిధిగా తాలూకా- డిస్ట్రిక్టు బోర్డు. మద్రాసు హైకోర్టు అఫీసరుగా.

ప్రభుత్వమిచ్చే ప్రయాణ భత్యాన్ని రాయలసీమలో చెరువుల మరామత్తుకు, బావుల తవ్వకానికి ఇచ్చారు. పోరాటమే ఊపిరిగా, తొలి సత్యాగ్రాహిగా బ్రతికిన వీరు 1931 లో మరణించారు. 1850 ప్రాంతంలో అప్పటికి ఎవ్వరూ చేపట్టని నిరసన ఉద్యమాన్ని చేపట్టి- ఆంగ్ల ప్రభుత్వంపై తొలి సత్యాగ్రహ అస్త్రాన్ని సంధించిన అమరమూర్తి మన శోభనాద్రిగారు.

శ్రీ అన్నాబత్తుని సత్యనారాయణ :- మాజీ మంత్రి, శాసన సభ్యులు, రైస్‌మిల్లర్ తెనాలి మాజీ మున్సిపల్ చైర్మనుగా విఖ్యాతిపొందారు. తమ పేరిట అన్నాబత్తుని సత్యనారాయణ జూనియర్ కళాశాలను తెనాలిలో స్థాపించారు.

శ్రీ కాజా కృష్ణమూర్తి **M.B B.S** :- కృష్ణాజిల్లా యలమర్రులో పుట్టినా గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో డాక్టరుగా స్థిరనివాసమేర్పచుకున్నారు. రాజకీయ అనుభవజ్ఞులు. మాజీ శాసనసభ్యులు. చిలకలూరిపేట విద్యాసంఘం అధ్యక్షులు. ఈ సంఘం **R.V.S.** & **C.V.S.** హైస్కూలు, ఒక జూనియర్ కళాశాల, **D.R.N.** & **S.C.V.S.** డిగ్రీ కళాశాలలను నిర్వహిస్తున్నది.

శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు :- (1914–86). కృష్ణాజిల్లా పామర్రువద్ద కొండెపర్రులో 'విద్యావనం' పాఠశాలను నెలకొల్పారు. రవీంద్రుని శాంతినికేతన్‌ను స్ఫురింపజేసే విద్యావనమది. హిందీ భాషోద్యమం-వడ్రంగం, కమ్మరం,అద్దకం, తేనె,పాదరక్షల, పాడిపరిశ్రమ-కోళ్లపరిశ్రమ, ప్రకృతివైద్యం, గోబర్‌గ్యాస్ వంటి కుటీర పరిశ్రమలలో పూర్తి శిక్షణ ఏర్పాట్లు ఉన్నాయి 4 దశాబ్దాలుగా వేలాది యువకులకు విద్యతోపాటు బ్రతుకుతెరువుకు అందించిన మహనీయుడు శ్రీ వెంకటేశ్వరరావు నిగర్వి. నిరాడంబరుడు. నిస్వార్థజీవిగా జీవితాన్ని గడిపి—దానికొక పరమార్థాన్ని కల్పించారు.

శ్రీ చలసాని ప్రసాదరావు :- పిన్నవయస్సులో పక్షవాతం వచ్చి-అది తగ్గినా చెవుడు వచ్చింది. ప్రపంచమంతా నిశ్శబ్దమైనా, స్వయంబోధినుల ద్వారా ఆంగ్లాన్ని, నిరంతర పఠనం ద్వారా విజ్ఞానాన్ని స్వయంకృషితో సాధించారు. ఆంధ్రా మెట్రిక్, ఉస్మానియా **B. A.**, లండన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి డిప్లోమా — శంకర్స్ వీక్లీ యునెస్కో సంయుక్తంగా నిర్వహించిన చిత్రలేఖనం రిఫ్రెషర్ కోర్సులో సర్టిఫికెట్ (దేశంలో మొత్తంమీద

తీసుకున్న 20 మందిలో ఒకరిగా) పొందారు. చిత్రకళలో 5 సం డిప్లొమా పొందారు. ప్రభుత్వ సమాచారశాఖలో ఆర్టిస్టుగా పనిచేశారు. ప్రస్తుతం 'ఈనాడు'లో పనిచేస్తున్నారు. ఈనాడు, ఆదివారం, విపుల, చతుర మాస పత్రికలకు తొలినుండి సంపాదకులు. స్వయంగా 'కళ' పత్రికను నడుపుతున్నారు. ఇప్పటికి 16 గ్రంధాలు వ్రాశారు. వారి రచనలు ఇతర భాషల లోకి అనువదించబడ్డాయి. బధిరత్వంతో కృంగిన జీవితంతో రాజీపడక స్వయంకృషితో ఎదిగిన వారి జీవితం మనకు స్ఫూర్తినిస్తుంది కదా!

శ్రీ గోగినేని కనకయ్య :- 1917 లో గుంటూరు జిల్లా తాడికొండలో జన్మించారు. భాషాప్రవీణ. గ్రామ పంచాయితీ, కోపరేటివ్ రూరల్ బ్యాంకు, తాడికొండ పంచాయితి సమితి అధ్యక్షులుగా ప్రజోపయోగ కార్యక్రమాలనేకం నెరవేర్చారు. నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ, గుంటూరు, స్థాపనలో ప్రముఖ భాగస్వాములు. ఈ సొసైటీ క్రింద జె. కె. సి కళాశాల, ఆర్. వి. ఆర్. ఆర్ కాలేజి ఆఫ్ఎడ్యుకేషన్, ఆర్. వి. ఆర్ అండ్ జె. సి. ఇ. పి. కాలేజి ఆఫ్ ఇంజనీరింగు మొ॥ నిర్వహించబడుతున్నాయి.

శ్రీ సత్యసాయి ఎడ్యుకేషనల్ సొసైటీ—కార్యదర్శిగా పలు విద్యాసంస్థలను, గ్రంధాలయములను, వైద్యశాలలను నెలకొల్పి, నిర్వహిస్తున్నారు విద్యాప్రియులు. సంఘసేవకులు. సేవాతత్పరులు.

శ్రీ జాగర్లమూడి శివరామప్రసాద్ M.A., :- శ్రీ యార్లగడ్డ రామనాధ బాబు బావమరిది. చీరాల వి. ఆర్. యస్. & వై. ఆర్. ఎన్. కళాశాల, పెదనందిపాడు ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల, పర్చూరు యార్లగడ్డ నాయోన్నత పాఠశాలల కార్యదర్శిగా పనిచేసి వాటి అభివృద్ధికి పక్కాని దాటవేశారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రైవేట్ యాజమాన్య కళాశాలల పాలకవర్గ సంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు. మంచి వక్త. కార్యనిర్వహణలో మంచి పేరు ప్రఖ్యాతులు పొందినవారు.

శ్రీ ముప్పలనేని శేషగిరిరావు :- మాజీ ఎమ్.ఎల్.సి. బాపట్ల కాలేజి ఆఫ్ ఆర్ట్సు అండ్ సైన్సు, సెక్రెటరిగా- బాపట్ల ఇంజనీరింగు కళాశాల అధ్యక్షులుగా పనిచేస్తున్నారు. బలిపీఠం, రాజారమేష్ వంటి సినిమాల నిర్మాత. గొప్ప వ్యాపారస్థులు, వ్యవహారదక్షులు, నరసాయపాలెం వాస్తవ్యులు.

శ్రీ ఉండవల్లి సూర్యనారాయణమూర్తి :- పశ్చిమగోదావరి, రాయవరం ముఖ్యముగా ప్రసిద్ధి పొందారు. రాజకీయాలలో 'కింగ్ మేకరు'గా పిలవబడ్డారు. రామచంద్రాపురంలో వి. యస్. ఎమ్ కళాశాల స్థాపకులు. అనేక ధర్మ కార్యములను నిర్వహించారు.

శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ :- గోదావరి జిల్లాలో ప్రముఖులు. కాంగ్రెస్‌లో గొప్పనాయకులు. పి. సి. సి. ప్రెసిడెంట్‌గా పదవీబాధ్యతలను చక్కగా నిర్వహించారు.

శ్రీ కొలసాని వెంకటసుబ్బయ్య:- ఉపాధ్యాయునిగా ఒకవైపు పనిచేస్తూనే ఉత్తమ విద్యావిధానాలను విద్యార్థులకు అందించాలనే తలంపుతో- దీక్షగా తెనాలి తాలూకా చిలుమూరులో శ్రీరామా గురుకుల పాఠశాలను స్థాపించారు. క్రమంగా దానిని కళాశాల స్థాయికి పెంచారు. అది ఈనాడు కంప్యూటర్ ట్రైనింగుతో సహా సర్వహంగులతో విరాజిల్లుతున్నది. రెసిడెన్సియల్ కాలేజీలలో ప్రముఖమైనదిగా కొనసాగుతున్నది.

శ్రీ కొత్తరాజ బాపయ్య :- ఉత్తమ ఉపాధ్యాయులుగా ప్రజల మనో ఫలకంపై నేటికీ నిలిచిన ఆదర్శమూర్తి. విద్యారంగంలో అనేక ప్రయోగాలు చేశారు. క్రమశిక్షణ, ఆదర్శం విద్యార్థులలో స్వయంగా రావలసినవనినమ్మి- వాటిని అభివృద్ధిచేయడానికి ఉపాధ్యాయుని నేర్పునై పుణ్యం ముఖ్యమనిభావించి- ఆచరించిన గురుదేవులు జాతీయ అవార్డుగ్రహీత.

శ్రీ వెలివోలు సీతారామయ్య :- తెనాలి వి. యస్. ఆర్. కళాశాల మాజీ కార్యదర్శి, స్వాతంత్ర్య సమరయోధుల సంఘాధ్యక్షులు.

శ్రీ తుమ్మల జగన్మోహనరావు :- కూచిపూడి వాస్తవ్యులు- దుగ్గిరాల పసుపువ్యాపారంలో పేరున్నవారు. మంచి స్థితిపరులు. వి. యస్. ఆర్. కళాశాల తెనాలి, కార్యదర్శి.

శ్రీ కంభంపాటి నారాయణమూర్తి :- మంచి స్థితిపరులు. వితరణశాలి. తనపేరిట కళాశాలను దుగ్గిరాలలో నిర్మించారు.

శ్రీ చలసాని ఆంజనేయులు:- ఏలూరు జిల్లా గోపన్నపాలెం వాస్తవ్యులు. పెద్ద భూస్వామి. పూర్వం మొఖాసాదారు. గ్రంథాలయాలు, సత్రాలు, దేవాలయా

లను నిర్మించారు, వారి కుమారుడు శ్రీరామ లింగేశ్వరరావు నవభారత్ టుబాకో కంపెనీ డైరెక్టరు, తిరుపతి దేవస్థాన కమిటి సభ్యులుగా ఉన్నారు.

శ్రీ యలవర్తి రోశయ్య- జె.కె.సి. మాజీ ప్రిన్సిపాల్‌గా (గుంటూరు), శ్రీ ఈదర భాస్కరరావు ప్రస్తుత ప్రిన్సిపాల్‌గా, శ్రీ పోలవరపు జగదీశ్వర రావు చీరాల వి. ఆర్. యన్. అండ్ వై. ఆర్. ఎన్. కళాశాల ప్రిన్సిపాల్స్‌గా సమర్థవంతులుగా పేరు ప్రఖ్యాతులు పొందారు.

శ్రీ సాదినేని చౌదరయ్య :- కేంద్ర ప్రభుత్వం నెలకొల్పిన నవోదయ స్కూలుకు మద్దిరాలలో 30 ఎకరాలను దానంచేశారు. ప్రకాశం జిల్లా యద్దన పూడి వాస్తవ్యులు. చిలకలూరిపేట ధనలక్ష్మి కాటన్ మరియు రైస్‌మిల్స్ ఛైర్మన్.

డాక్టరు యలమంచి వెంకటేశ్వరరావు : వై. వి. రావుగా ప్రసిద్ధులు. సిద్ధార్థ ఎకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ కార్యదర్శి.

శ్రీ కోనేరు లక్ష్మయ్య :- ఎనికేపాడు గొప్ప పారిశ్రామికవేత్త. కోనేరు లక్ష్మయ్య ఇంజనీరింగ్ కళాశాల వ్యవస్థాపకులు.

శ్రీ కొల్లి వెంగళనీడు - ఈనాడు దినపత్రిక మేనేజరు, శ్రీ నల్లూరి వెంకటేశ్వర్లు M.A; L L.B. ఆంధ్రజ్యోతి బిజినెస్ మేనేజరు.

శ్రీ అనుమోలు శేషగిరిరావు- విజయవాడ, గొప్ప లాండ్ లార్డు, తారక రామా ఫిలింస్ అధినేత; శ్రీ బోయపాటి అప్పారావు- సిద్ధార్థకళాశాలకు భూరిగా విరాళం ఇచ్చారు. పారిశ్రామికవేత్త— మంచి స్థితి గలవారు.

కీ॥ శే॥ శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య :- జగద్విఖ్యాత ఆడిటర్. వారిపై ఉన్న ప్రేమకారణంగా సిద్ధార్థ ఆర్ట్స్ కళాశాలకు వీరిపేరుపెట్టటమైనది.

శ్రీ A. సత్యనారాయణ, వరంగల్, శ్రీ దేవినేని సీతారామయ్య, విజయ వాడ; శ్రీ ముమ్మనేని సుబ్బారావు, విజయవాడ— గొప్ప పేరున్న ఆడిటర్లుగా వెలుగొందుతున్నారు.

శ్రీ మునునూరి జగన్నాధరావు M. A L L.B: - మచిలీపట్నంలో అనేక వాణిజ్య, సాంస్కృతిక, సాహితా సంఘాల కధ్యక్షులు.

శ్రీ కోగంటి రాజ బాపయ్య - గుడివాడ మాజీ ఛైర్మన్. కాంగ్రెస్‌వాది. ప్రముఖులు.

డా॥ గద్దే పూర్ణచంద్రరావు :- వైద్యులుగా- విజయవాడ మున్సిపల్ ఛైర్మనుగా ప్రజాసేవ చేశారు.

శ్రీ మోటూరు సత్యనారాయణ :- హిందీ భాషోద్యమానికై తీవ్రంగా కృషి చేశారు.

శ్రీ కాటూరి నారాయణస్వామి :— ప్రకాశం జిల్లా, పొదిలి తాలూకా- కాటూరివారి పాలెంలో జన్మించారు. 1957 నుండి 78 దాకా, అనంతరం 1983 నుండి 85 వరకు రాష్ట్ర శాసనసభా సభ్యులు 1984 లో చిన్నతరహా, మధ్య తరహా నీటివనరుల మంత్రిగా స్వల్పకాలంపనిచేశారు. అనంతరం నరసరావుపేట లోక్‌సభ నియోజకవర్గం నుండి ఎన్నికై, ప్రస్తుతం పార్లమెంటు సభ్యునిగా కొనసాగుతున్నారు.

శ్రీ ఉప్పల సుందరరామయ్య :- తెనాలి వాస్తవ్యులు. గొప్ప భూస్వామి. పేరున్న డాక్టరు, తన ఆదాయంలో కొంతభాగం ఉన్నత విద్య చదివే పేద విద్యార్థుల సహాయానికై వినియోగించారు. తను జీవించినంతకాలం ఈ నియమాన్ని మరవలేదు.

## కారణ జన్ములు

శ్రీ ముద్దన చెంచయ్య :— బాపట్ల తాలూకా పాలపర్రు గ్రామస్థులు. తన యావదాస్తిని ధర్మకార్యములకు వినియోగించారు. తన తండ్రిపేర 'నరసింహ సంస్కృత పాఠశాలను లక్షరూపాయలతో స్థాపించారు. దానికి తనకున్న 40 ఎకరములను దానం చేశారు. రైతుబిడ్డలు సంస్కృతం చదవడం ఎక్కువ ఇష్టపడరని శ్రీ తేళ్ళ కృష్ణమ్మగారి సలహాపై దానిని ఉన్నత పాఠశాలగా మార్చడం జరిగింది.

శ్రీ గోరంట్ల వెంకన్న చౌదరి :— ప్రకాశం జిల్లా తిమ్మసముద్రం వాస్తవ్యులు. తమ యావదాస్థిని సంస్కృతాభివృద్ధికై వెంకన్న ట్రస్టు పేరిట ధర్మ కార్యాలకు వినియోగించారు. గోరంట్ల వెంకన్న ట్రస్టు క్రింద 300 ఎకరాలు

మాగాణి భూమి, మేడలు, అనేక ఇళ్ళస్థలాలు ఉన్నాయి. దాదాపు కోటిరూపా యల విలువగలిగిన ఆస్తిని వదిలి- సర్వసంగ పరిత్యాగిగా, నిరాడంబరతతో ఋషిపుంగవులుగా జీవించారాయన. ఆ ట్రస్టుక్రింద తిమ్మసముద్రంలో ఒక హైస్కూలు ఓరియంటల్ కాలేజి, ఒంగోలులో ఓరియంటల్ స్కూలు నిర్వ హింపబడుతున్నాయి. వేటపాలెం సారస్వత నికేతనమ్- గ్రంథాలయానికి ఎంతో విరాళమివ్వడం జరిగింది. ఆంధ్రదేశంలో గొప్ప పేరున్న గ్రంథాలయమది. ఆ విద్యాసంస్థలలో చదువుకునే విద్యార్థులకు భోజన, నివాస సౌకర్యములన్నీ ఉచితంగా సమకూర్చడమౌతున్నది.

శ్రీ యార్లగడ్డ రామనాధబాబు :— ప్రకాశం జిల్లా కారంచేడు వాస్త వ్యులు. వీరు తను తండ్రి పేర పర్చూరులో శ్రీ యార్లగడ్డ రామాన్నత పాఠ శాలను నిర్మించారు. ఆ రోజులలోనే శైలాకాలేజికి 25 వేలు, తెనాలి, నిడు ప్రోలు కాలేజీలకు పదివేల వంతున విరాళమిచ్చారు. చీరాల V.R S & Y.R.N. కళాశాలలో సగభాగస్వామి. వీరి ధర్మపత్ని పేరిట శ్రీ యార్లగడ్డ అన్న పూర్ణాంబ ప్రభుత్వ మహిళా కళాశాల, చీరాలలో నిర్మించబడినది. తూర్పురేపు హైస్కూలు, బాపట్ల వ్యవసాయకళాశాల, బాలికల హైస్కూలుకు భారీగా విరాళాలిచ్చారు. తిరుపతి, శ్రీశైలం, హృషీకేశ్ లలో సత్రవుగదులు నిర్మించారు. భద్రాద్రి రామాలయానికి 50 వేలు, కవుల గ్రంథ ప్రచురణకు కొన్ని, నూట పదార్లు, సాల్వేషన్ ఆర్మీ వైద్యశాల. చీరాల దంత వైద్యశాలలు, చీరాల, మంగళగిరిలో ఇతర వైద్యశాలలకు విరాళాలు ఇచ్చారు. 1911 లో జనించిన వీరు 1961 లో మరణించారు.

శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి :— ప్రకాశం జిల్లా కారంచేడు వాస్త వ్యులు. స్వాతంత్ర సమరయోధులు. మద్రాసులో వ్యాపారం చేసి, పారిశ్రామిక వేత్తగా పరిణమించారు. తన కుమారుడు శంభుప్రసాద్ పేర- శంభూ ఫిలింస్ ద్వారా నమ్మినబంటు, పూజాఫలం వంటి ఉత్తమ చిత్రాలు తీశారు. తన తండ్రి పేరిట యార్లగడ్డ నాయుడమ్మ ఓరియంటల్ కం హైస్కూలు, ఒక జూనియర్ కళాశాలను స్వగ్రామంలో నిర్మించారు. గుంటూరు J.K.C, పెదనందిపాడు కాలేజీలకు 10 వేల వంతున విరాళమిచ్చారు. మద్రాస్ మైలాపూర్ కేసరి హైస్కూలుకు 10 వేలు, సత్తెనపల్లిలో హరిజన హాస్టలుగది. శ్రీశైలం, తిరుపతి,

తిరుత్తనిలో కాలేజీల నిర్మాణం, అప్పికట్ల బుద్ధవిగ్రహ ప్రతిష్ఠాపనకు విరాళా లిచ్చారు. యార్లగడ్డ వెంకన్న ఛారిటీస్ క్రింద వీరిధర్మపత్ని రాజ్యలక్ష్మి పేరిట- 1980 లో రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరి కళాపీఠం తరపున ప్రతి సం॥ తెలుగు వారిలో విశిష్టులైన వివిధ రంగాలకు చెందిన పదిమందిని ఒక్కొక్కరికి పదివేల రూపాయల చొప్పున నగదు అవార్డుతో సన్మానిస్తున్నారు ఎందరో మహాను భావులు ప్రతియేటా ఈ అవార్డులను పొందుతున్నారు. మంగళగిరివద్ద ఏర్పాటు చేసిన శ్రీయార్లగడ్డ వెంకన్న చౌదరి కాన్సర్ ఇన్‌స్టిట్యూట్‌కు 30 లక్షల రూపాయల విరాళం సమర్పించారు. ఈ కార్యక్రమాల కన్నింటికీ వీరి సోదరులు శ్రీరంగనాయకులుగారి తోడ్పాటు ఎంతో ఉంది. వారు కవిపండితులు గీతాంజలి అనువాదకులు 'గీతాభిజ్ఞానము' అను ఉద్గ్రంధాన్ని రచించారు.

వినయాశ్రమము, కావూరు :— శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిగారు ఈ ఆశ్రమానికి 100 ఎకరాలు స్వంతభూమి నిచ్చారు. శ్రీ తుమ్మల దుర్గాంబా బస పయ్య దంపతులు 20 ఎకరాలు భూమి ఇచ్చారు. గాంధీజీ నిర్మాణాత్మక కార్య క్రమాలలో నిమగ్నమై- జైలుశిక్షలకు సైతం వెలువక వీరు దేశసేవ చేశారు. ఆయుర్వేద వైద్యంతోపాటు- ఋగ్వేదాదులను ఈ ఆశ్రమం ప్రచురించినది.

శ్రీ చుండి రంగనాయకులు :- సందెపూడి గ్రామస్థులు. సాధారణ కుటుం బంలో పుట్టి, స్వయం కృషితో అసమానమైన స్థాయికి ఎదిగారు. వ్యాపార రంగంలో బాగా ఆర్జించారు. తనకులేని ఉన్నత విద్యావకాశాలు తమ ప్రాంతం వారికి కల్పించాలనే సదుద్దేశంతో శ్రీ చుండి రంగనాయకులు కళాశాలను చిలకలూరిపేటలో నిర్మించారు. ఆకళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కుర్రా బాలకృష్ణ రావుగారు 1988 లో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డును, ప్రశంసాపత్రాన్ని రాష్ట్ర ప్రభుత్వం నుండి పొందారు. శ్రీ రంగనాయకులుగారు తమతల్లి హనుమాయమ్మ పేరిట స్వగ్రామంలో హనుమాయమ్మ జిల్లా పరిషత్ హైస్కూలును నిర్మిం చారు. చుండి రంగనాయకులు పాలిటెక్నిక్ కళాశాలను స్వయంగా చిలక లూరిపేటలో నిర్మించారు. గుంటూరు ప్రభుత్వ హాస్పటల్‌కు కాన్సరు నివార ణార్థం 9లక్షల రూపాయలు విరాళంఇచ్చారు. కార్డియాలజీ స్పెషల్ యూనిట్‌కు 30లక్షలు వాగ్దానం చేశారు.

శ్రీ బండ్లమూడి సుబ్బయ్య :— గుంటూరు జిల్లా- మోతడక గ్రామస్తులు స్వగ్రామంలో శ్రీ రామా హైస్కూలు నిర్మించారు.

శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు కళాశాల, అమరావతిలో నిర్మించారు. తను స్వయంగా లక్షరూపాయలిచ్చి- అనేక గ్రామాలలో విరాళాలు పోగుచేసి కళాశాలను అభివృద్ధి చేశారు. స్వంత పేరుకూడా పెట్టుకోకుండా కులాభిమానంతో వెంకటాద్రి నాయుని పేరిట కళాశాల నిర్మించిన దాత. స్వగ్రామంలో ఏకగ్రీవంగా 15సం॥ పంచాయితీ ప్రెసిడెంట్‌గా ఎన్నుకోబడి-గ్రామాభివృద్ధికి సేవచేశారు. గ్రంధాలయము, హాస్పిటల్ నిర్మించారు. వీరి అల్లుడు డాక్టరు సి.జగన్నాధరావు, న్యూరోసర్జనుగా విదేశాలలో అనుభవం సంపాదించి- ప్రస్తుతం గుంటూరులో ప్రాక్టిస్ చేస్తున్నారు.

శ్రీ యార్లగడ్డ దుర్గాప్రసాద్ :— కారంచేడు నివాసి. నిరాడంబరులు సాధుసత్తములు. 'దుర్గయ్యగారిగా' ప్రసిద్ధులు. తన ఆస్తిమొత్తం స్వచ్ఛంధంగా పేదలకు పంచియిచ్చారు. వ్యాయామ కేంద్రాన్ని స్థాపించి యువకులకు శిక్షణ ఇచ్చారు. గ్రామాభివృద్ధి పనులను స్వంతపనులుగా భావించి నిర్వహిస్తారు. చెరువు బాగుచేయడం, వంతెనకట్టడం వంటి అనేక పనులు చేశారు.

## విద్యాసంస్థల నిర్మాణం — విద్యాభివృద్ధి

మద్రాసు, ఆంధ్ర విశ్వవిదాలయముల స్థాపనతో విద్యావశ్యత గుర్తించబడినది. క్రమంగా మనరాష్ట్రంలో ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర, కాకతీయ, నాగార్జున, కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. సంస్కృతాంధ్రాంగ్ల విద్యాధికులు వేనకువేలుగా కమ్మవారిలో పెరుగుతున్నారు.

తొలుత విజయవాడ, గుంటూరు, మచిలీపట్నం, కంభంమెట్టులలో కమ్మ విద్యార్థి సహాయసంఘాలు, వసతిగృహాలు ఏర్పడ్డాయి. శాశ్వతభవనాలను సమకూర్చడం జరిగింది. 1911 లో కమ్మ మహాజన రిజష్టరు సంఘమేర్పడి, 40 వేల మూలధనాన్ని సంపాదించి- దానిపై వచ్చే వడ్డీతో పేదవిద్యార్థులకు సహాయాన్ని కల్పిస్తున్నది. ఈ సంఘ ఆధ్వర్యంలో 13 కమ్మ మహాసభలు జరిగి విద్యాభివృద్ధికై చర్చలు సాగించింది.

విజయవాడ కమ్మవిద్యార్థుల వసతిగృహం :— శ్రీ యార్లగడ్డ పేరయ్య చౌదరి స్థలాన్ని సమకూర్చారు. శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్య ఆధ్వర్యంలో దాతలచే చాల గదులు నిర్మింపబడ్డాయి.

గుంటూరు కమ్మవిద్యార్థుల వసతిగృహం :— శ్రీమతి శాఖమూరి లక్ష్మీదేవమ్మగారు నిర్మించారు. శ్రీ జంపాల వెంకటేశం, శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణగార్లు ప్రోత్సహించారు. శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి ఆధ్వర్యంలో మేడమీదిగదులను దాతలు నిర్మించారు.

1936 లో గుత్తి తాలూకాలోను, కర్నూలు జిల్లాలోను కమ్మ సంఘము లేర్పడ్డాయి.

శ్రీ పాములపాటి వేంకటకృష్ణయ్య, శ్రీ నల్లపాటి వెంకటేశ్వర్లు, శ్రీకాకాని వెంకటరత్నం తదితరులు జిల్లా బోర్డు అధ్యక్షులుగా ఉన్నప్పుడు విద్యాసంస్థల నిర్మాణాన్ని విరివిగా ప్రోత్సహించారు. కమ్మవారిలో దాతలు, విద్యావదాన్యులు అనేక స్కూళ్ళు, కళాశాలల నిర్మాణానికి ఎంతోదోహదపడ్డారు.

శ్రీ కొడాలి ఉమామహేశ్వరరావు (జవర్లపూడి), మాగంటి లక్ష్మణ దాసులు మచిలీపట్నం జాతీయకళాశాలకు కొంత భూదానమిచ్చారు. తణుకులో శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు, శ్రీ పెండ్యాల శ్రీ రామచంద్ర వెంకటకృష్ణ రంగా రావు, శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గార్లు- శ్రీ ముళ్లపూడి వెంకటరాయుడు ఎడ్యుకేష నల్ ట్రస్ట్ ద్వారా, తణుకులో శ్రీ ముళ్ళపూడి వెంకటరాయ మెమోరియల్ పాలి టెక్నిక్, శ్రీరంగరాయ మెడికల్ కాలేజి (కాకినాడ) కి భూరివిరాళాలిచ్చారు.

శ్రీ బొల్లిని మునుస్వామి నాయుడు పేరిట గూడవల్లిలో హైస్కూలు, గవర్నరు శ్రీ రాఘవేంద్రరావు పేరిట గుడ్లవల్లేరులో ఒక హైస్కూలు వేల్పూరి వారు ఏర్పరచారు. పెదపులివర్రులో నాదెండ్ల సుబ్బయ్య హైస్కూలు, చల్లపల్లి లో చల్లపల్లి రాజా హైస్కూల్, కాకుమానులో నన్నపనేనివారి హైస్కూలు, ఇంటూరులో కాట్రగడ్డ వారి హైస్కూలు, మురికిపూడిలో శ్రీ కందిమళ్ళ బుచ్చయ్య గారి తండ్రి వెంకటప్పయ్యగారు కట్టించిన కందిమళ్ళ శారదాంబా హైస్కూలు, కాటూరులో కె. ఆర్. బోర్డు హైస్కూలు, విజయవాడలో కోనేరు బసవయ్య హైస్కూలు, చేబ్రోలులో సూర్యదేవర నరసయ్య హైస్కూలు,

కూచిపూడిలో కోగంటివారి హైస్కూలు, పెదపాలెంలో వాసిరెడ్డి వెంకటప్పయ్య హైస్కూలు, పామర్రులోను— మేడూరులో యలమంచి వెంకటరత్నం, రామమోహనరావు హైస్కూలు, మల్లెల రత్నమాంబ లక్షరూపాయల విరాళంతో తాడికొండలో వెల్లంకి వెంకటప్పయ్య హైస్కూలు, మానికొండలో గోగినేని పిచ్చయ్య హైస్కూలు, పునాదిపాడులో మద్దాలి వేణుగోపాల హైస్కూలు, ఉంగుటూరు, సంగం జాగర్లమూడి కొత్త వెంకయ్యచౌదరి హైస్కూలు, దెందులూరులో గారపాటి హైమావతి హైస్కూలు, పాలపర్రులో నారసింహ హైస్కూలు శ్రీ ముద్దన చెంచయ్యగారు నిర్మించారు. ఈ స్కూలుకు శ్రీమతి పోపూరు అనంతమ్మ 50వేల విలువగల భూమినిచ్చారు. కౌతవరంలో సల్లబోతు రామనాధం హైస్కూలు, గుడివాడలో కుల్లు పాపయ్య హైస్కూలు, కపుతారంలో కానూరి దామోదరయ్య హైస్కూలు, తెనాలిలో వెలగపూడి రామకృష్ణ హైస్కూలు, తణుకులో శ్రీ జాస్తి సీతామహలక్ష్మమ్మ బాలికోన్నత పాఠశాల, శ్రీ నల్లూరి రాజయ్య, కాకాని వెంకటరత్నం గౌరవార్థం కృష్ణా జిల్లాలో రెండు హైస్కూళ్ళు- మొదలగు అనేక స్కూళ్ళను కమ్మవారు నిర్మించారు. శ్రీమతి అడుసుమల్లి యశోదమ్మ 30 ఎకరాలు తాడికొండ స్కూలుకు. కపుతరం హైస్కూలుకు శ్రీమతి కొల్లి మంగమ్మ, శ్రీ దామోదరయ్య భూమి, డబ్బు విరాళంగా ఇచ్చారు. పెదపాలెం స్కూలుకు శ్రీవాసిరెడ్డి వెంకటప్పయ్య, సంగంజాగర్లమూడి స్కూలుకు శ్రీ కొత్త రఘురామయ్య గార్లు విరాళాలిచ్చారు. జాగర్లమూడి(పర్చూరు)లో శ్రీమతి అడ్డగడ చెంచమ్మ తన కుమారుని స్మృత్యర్థం అడ్డగడసుబ్బారావు హైస్కూలు నిర్మించారు. యార్లగడ్డ రామోన్నత పాఠశాల, పర్చూరు మొ॥ కమ్మవారు అసంఖ్యాకంగా హైస్కూళ్ళు నిర్మించారు.

పాములపాటి బుచ్చినాయుని కళాశాల, నిడుబ్రోలు; వి యస్.ఆర్. అండ్ వై. ఆర్. ఎన్. కళాశాల, చీరాల; వేములపల్లి కోదండరామయ్య కళాశాల, బుద్ధవరం; పెదనందిపాడు ఆర్ట్సు అండ్ సైన్సుకళాశాల, పెదనందిపాడు, బాపట్ల ఆర్ట్సు అండ్ సైన్సుకళాశాల, బాపట్ల; యర్నేని చలమయ్య జూనియర్ కళాశాల, గుడివాడ; వి. యస్. ఎమ్ కళాశాల, రామచంద్రాపురం; వి.ఆర్.యస్. కళాశాల, తెనాలి; వెలగపూడి రామకృష్ణా మెమోరియల్ కళాశాల, నగరం; చుండిరంగనాయకులు కళాశాల, చిలకలూరిపేట, రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కళాశాల, అమరావతి, జాగర్లమూడి కుప్పుస్వామి కళాశాల,

గుంటూరు: యస్. ఆర్. వై. యస్. పి. జూనియర్ కళాశాల, చల్లపల్లి, కాకాని వెంకటరత్నం కళాశాల, నందిగామ; వల్లూరు బసవయ్య కళాశాల, విజయవాడ; కొత్తరఘురామయ్య జూనియర్ కళాశాల, నందమూరి బసవతారకం డిగ్రీ కళాశాల, నరసరావుపేట; జి.వి.యస్.ఆర్. అండ్ యస్.ఆర్. కళాశాల, కొల్లూరు; డి. ఆర్. యన్. అండ్ యస్. సి. వి. యస్. కళాశాల, చిలకలూరిపేట, కంభంపాటి నారాయణ కళాశాల, దుగ్గిరాల, వెల్ది వెంకటేశ్వర్లు, మంగమ్మ కళాశాల, ఒంగోలు; ఆంధ్రకేసరి విద్యాకేంద్రం జూనియర్ కళాశాల, ఒంగోలు; అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ; సర్.కె.ఆర్.ఆర్. కళాశాల, ఏలూరు; మొదలగు అనేక కళాశాలలను కమ్మవారు నిర్మించారు.

సిద్ధార్థ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ విజయవాడ ఆధ్వర్యంలో పబ్లిక్‌స్కూల్, కళాశాల, సిద్ధార్థ మెడికల్ కళాశాల, ఇంజనీరింగ్ కళాశాలలు; కోనేరు లక్ష్మయ్య ఇంజనీరింగు కళాశాల, విజయవాడ; నాగార్జున ఎడ్యుకేషనల్ ట్రస్టు క్రింద ఆర్. వి. ఆర్. ఆర్. కాలేజి ఆఫ్ ఎడ్యుకేషన్, ఆర్. వి, ఆర్. అండ్ జె. సి. వి. ఒ. కాలేజి ఆఫ్ ఇంజనీరింగు- గుంటూరులో నిర్మింపబడ్డాయి. అడుసుమల్లి అశ్వర్థనారాయణమూర్తి అండ్ వల్లూరు పల్లి వెంకటరామ శేషాద్రి రావు పాలిటెక్నిక్ కళాశాల, గుడ్లవల్లేరు; చుండి రంగనాయకులు పాలిటెక్నిక్ కళాశాల, చిలకలూరిపేట- మొదలగు అసంఖ్యాకంగా స్కూళ్లు, హైస్కూళ్ళు కళాశాలలు కమ్మవారిచే స్థాపించబడ్డాయి. అనేక వేలు, లక్షలమంది విద్యార్థుల జ్ఞానదాహాన్ని తీరుస్తున్నాయి.

శ్రీ లావు రత్తయ్య విజ్ఞాన్ రెసిడెన్సియల్ కళాశాలను స్థాపించడంలో, నేడు తామరతంపరగా రెసిడెన్సియల్ కళాశాలలు ఆంధ్రప్రదేశ్‌లో కమ్మవారు స్థాపించి, నిర్వహిస్తున్నారు.

విద్యాభివృద్ధికి ధార్మిక చింతనకు ఇంకా అనేకమంది దాతలు తమ దాతృత్వాన్ని ప్రదర్శించారు. వారిలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఆయన బంధువులు గుడివాడ **A.N.R.** కళాశాలకు లక్షరూపాయలు, నిడుబ్రోలు కాలేజికి శ్రీ పాములపాటి బుచ్చిరాయుడు 1½ లక్షల రూపాయలు, శ్రీ మాగంటి అంకినీడుతన ధర్మపత్ని అన్నపూర్ణాదేవి స్మారక సదనానికి శ్రీ కలగర

పిచ్చమ్మ, రామస్వామిగార్లు 68 ఎకరాల భూమినిచ్చారు. జంపాలవారు- వారి బంధువులు దుగ్గిరాలలో శ్రీ జంపాల సుబ్బారాయుని ఆధ్వర్యంలో గొప్ప సత్రమును- అదేపూరిలో శ్రీ యార్లగడ్డ పేర్నిటిగారు భాషాభిలాషిణి గ్రంథాలయ భవనమును నిర్మించెను.

శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బదాసు తుమ్మపూడిలో, శ్రీ గోళ్ళమూడి చంద్రయ్య వడ్లమూడిలో, శ్రీ వెన్నం రామయ్య రావి అనంతవరంలో, శ్రీ వాసిరెడ్డి కోటయ్య పెదపాలెంలో దేవాలయాలను కట్టించి పోషించుచున్నారు. శ్రీ కారుమంచి వెంకటసుబ్బయ్య మంగళగిరిలో పశువైద్యశాలను కట్టించారు.

సెంట్‌జోసఫ్ ట్రైనింగ్ కళాశాల, గుంటూరునకు శ్రీ పాములపాటి వేంకటకృష్ణయ్యగారు 10 వేలు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యార్థి సహాయార్థం శ్రీ యార్లగడ్డ శివరామప్రసాద్ ఎనిమిదివేలు, పరిశోధనలో ఉత్తమ విద్యార్థికి ఉపయోగపడే నిమిత్తం శ్రీ జి. డి. నాయుడు 10 వేలు, పెదపాలెం శ్రీ వాసిరెడ్డి వెంకటప్పయ్య 10 వేలు, మాగంటి బాపినీడు తమ భార్య అన్నపూర్ణ స్మృత్యార్థం ఒక బహుమతిని ప్రతియేటా కల్పించారు.

శ్రీ కొత్త భావయ్యచౌదరి రెండువేలు, శ్రీ యార్లగడ్డ రంగనాయకులు జూబిలీ మహోత్సవమున 25 వేలు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు 25 వేలు విరాళాలు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఇచ్చారు.

తెనాలి, వరంగల్లు కళాశాలలకు శ్రీ కొంగర జగ్గయ్య, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు తమ బృందంతో వినోద కార్యక్రమము లిచ్చి లక్షరూపాయలు పోగుచేసి ఇచ్చారు.

ఏలూరులోని కట్టమంచి కళాశాలకు 26 వేల రూపాయలు శ్రీ వంకినేని చినవెంకటసుబ్బయ్యగారు ఇచ్చారు.

యేర్పేడు వ్యాసాశ్రమానికి కమ్మవారు సాయంచేశారు. గుంటూరులోని సీతారామ సంకీర్తన సంఘమునకు శ్రీ వాసిరెడ్డి శశ్రీశ్వరుడు సహాయము చేసెను.

అంగలకుదురు శ్రీమతి మునునూరి అనంతమ్మగారు సంగంజాగర్లమూడి హైస్కూలుకు శ్రీ కొత్త అప్పయ్య చౌదరిగారు సంగంజాగర్లమూడి వైద్య శాలలో భవన నిర్మాణానికి కన్నాపురంలో శ్రీ కానుమిల్లి జగ్గారాయుడు సతీ మణి దాదాపు లక్షరూపాయలు ధర్మకార్యాలకు వినియోగించింది. పామర్రులో శ్రీచిట్టూరి సత్యనారాయణ **M.B.B.S**,గారి ప్రోత్సాహంతో ఒక ఉన్నతపాఠశాల నిర్మితమైనది.

శ్రీ అడుసుమల్లి ధర్మారావు స్మృత్యార్థంవారి సోదరులు శ్రీ అడుసుమిల్లి కృష్ణారావు కుమారుడు శ్రీ శ్రీనివాసచక్రవర్తి గుంటూరు ఆర్. వి. ఆర్.అండ్ జె. సి. ఒ. పి. ఇంజనీరింగ్ కళాశాలకు ఎలక్ట్రానిక్స్ బ్లాక్ నిర్మాణార్థం రెండు లక్షల యాభైవేల రూపాయలు విరాళం ఇచ్చారు.

## మతాభివృద్ధి కార్యములు

అనేక దేవాలయ నిర్మాణంలో సహాయపడిన కమ్మవారిని ఇంతకు మునుపే పేర్కొన్నాము. ఆధ్యాత్మికసారాన్ని బోధించే ఆశ్రమాల నిర్మాణానికి సైతం కమ్మవారు పాటుపడ్డారు. బ్రాహ్మణులు ఇతరులను న్యూనతపరచడాన్ని గమనించి- స్వయంగా గాయత్రిని నేర్చి వైదిక కర్మలను వేదోక్తంగా నిర్వ హించాలనే తలంపు కమ్మవారిలో పెరిగింది. అందుకు ప్రతిబంధకంగా సంస్కృత అధ్యయనలేమి వారిని బాధించింది.

బ్రాహ్మణులలో అభ్యుదయ భావాలున్నవారు అందుకు సహాయపడిరి. సంఘసంస్కరణాభిలాషులైన శ్రీమాన్ వరదాచార్యులు శ్రీ నారసింహ సంస్కృత విద్యాలయాన్ని చిట్టి గూడూరు, మచిలీపట్నం సమీపంలో స్థాపిం చారు. బ్రాహ్మణేతరులు అక్కడ సంస్కృతాన్ని అభ్యసించారు. ఆ భాషా జ్ఞానంతో శ్రీ వీరమాచనేని ఆంజనేయులు, శ్రీ పాలడుగు శేషాచార్యులు, శ్రీ సూర్యదేవర రాఘవయ్య మున్నగువారు స్వసంఘ పౌరోహిత్యాన్ని చేపట్టారు. అందుకు శ్రీ జి. యన్. బి. సరస్వతీ స్వాముల తోడ్పాటు లభించింది. శ్రీ పరమహంస బ్రహ్మానందగిరి స్వాములు ఏలూరులో ఆశ్రమాన్ని నిర్మించు కొని వేదాంత బోధలు గావించుచున్నారు. వారి బాటలో అనేకమంది పయని స్తున్నారు.

## నాటి ఉన్నతోద్యోగులు

బ్రిటిష్ ప్రభుత్వకాలంలో, 20 శతాబ్ది ప్రారంభంలో అనేకమంది కమ్మ వారు ఉన్నతోద్యోగులుగా వాసిపొందారు. వారిలో కొంగరిని ఇక్కడ ప్రస్తావిద్దాం.

శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణ B.A - డిప్యూటి కలెక్టరు

శ్రీ కానుమిల్లి రుద్రయ్యనాయుడు B.A - రిజిష్ట్రారు

శ్రీ కొత్త వెంకయ్య చౌదరి B.Sc. - డివిజనల్ ఇంజనీరు

శ్రీ పర్వతనేని శివలింగయ్య B.Sc. - రైల్వే ఇంజనీరు

శ్రీ వెల్లంకి అక్కయ్య చౌదరి - మెకానికల్ ఇంజనీరు

శ్రీ కానుమిల్లి జగ్గారావు - జిల్లా మున్సబ్

శ్రీ బాచిన రామయ్య B.Sc. - అగ్రికల్చరల్ డైరెక్టరు

డాక్టరు పల్లంపాటి గోపాలకృష్ణ చౌదరి M.Sc., Ph.D.- నైజాం వ్యవసాయశాఖ డైరెక్టరు

శ్రీ జంపాల సాంబయ్య - పెద్దాపురం మున్సిపల్ కమీషనరు

శ్రీ నారిన వీరాస్వామినాయుడు - డిప్యూటి కలెక్టరు

శ్రీ కానుమిల్లి పట్టాభిరామారావు - ఇన్‌కంటాక్స్ అసిస్టెంట్ కమీషనర్

శ్రీ సూర్యదేవర రామచంద్రరావు - రిటైర్డు, రైల్వేపోలీస్ సూపరిండెంటు

శ్రీ వి. సత్యనారాయణ చౌదరి - జిల్లా విద్యాశాఖాధికారి

శ్రీ కానుమిల్లి సూర్యనారాయణ M.B.B.S., మిలటరి మెడికల్ ఆఫీసర్

శ్రీ జంపాల అప్పారావు M.A. - రీజినల్ ట్రాన్స్‌పోర్టు ఆఫీసరు

శ్రీ కానుమిల్లి సుబ్బారావు I A.S. - ఛీఫ్ ఎలెక్ట్రికల్ ఆఫీసరు

శ్రీ పాములపాటి లలితేంద్రప్రసాద్- శ్రీ పి.వి. కృష్ణయ్యగారికుమారుడు లెఫ్టినెంట్

శ్రీ చింతమనేని రామలింగేశ్వరరావు - డిప్యూటికలెక్టరు

డాక్టరు కొంగర సత్యనారాయణ - వెటర్నరీ కాలేజీలో లెక్చరరు

శ్రీ కొంగర నరసింహారావు - డైరెక్టరు ఆఫ్ డిస్పోజల్స్ ఉద్యోగి, ఎలెక్ట్రికల్ ఇంజనీరు

డాక్టరు యద్దనపూడి - లయోలా కళాశాలలో కెమిస్ట్రీ ప్రొఫెసరు మద్రాసు

శ్రీ వల్లభనేని వెంకట్రామయ్య దాకరం - రైల్వే ఇంజనీరు

శ్రీ త్రిపురనేని గోపిచంద్ - పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు

శ్రీ కరుటూరి సత్యనారాయణ, పామర్రు - అసిస్టెంట్ కమర్షియల్ టాక్స్ ఆఫీసరు

శ్రీ యన్. శ్రీనివాసన్ - ఆంధ్రా యూనివర్సిటీ పొలిటిక్స్ ప్రొఫెసరు హార్వర్డు విజిటింగ్ ప్రొఫెసరు

శ్రీ పర్వతనేని శివయ్య - మద్రాసు తోళ్ళ పరిశ్రమ కాలేజి ప్రిన్సిపాల్ (తురుమెళ్ళ)

శ్రీ కాట్రగడ్డ శేషాచలం- మద్రాసు తోళ్ల పరిశ్రమ కాలేజీ ప్రిన్సిపాల్‌గా మరణించారు.

శ్రీ సుంకవల్లి సత్యనారాయణ **I.F.C.S.** - విజయవాడ గొప్ప సర్జను డాక్టరు పరుచూరి వీరయ్య చౌదరి, పి. లక్షణరావు **M.D**; కె. సదా శివరావు **M.S.** తదితరులెందరో గుంటూరులో డాక్టర్లుగా పేరు ప్రఖ్యాతులలో ఉన్నారు.

డాక్టరు మూలుపూరి రంగయ్య, ఏలూరు - డాక్టరు కవి. కవి పోషకులు.

## నేటి ఉన్నతోద్యోగులు

శ్రీ వి. రామచంద్రన్ — లెక్చరర్‌గా, **D.E.O.** గా, రేజినల్ డైరెక్టరు, డిప్యూటీ జాయింట్ డైరెక్టరుగా- విద్యాశాఖా ఉన్నత విద్యాశాఖా డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం కాలేజి సర్వీస్ కమీషన్ ఛైర్మన్‌గా ఉన్నారు.

శ్రీ ఘట్టమనేని గోపాలకృష్ణన్ — గణితశాస్త్ర ఆచార్యులుగా పచ్చయప్ప (మద్రాసు) కాలేజిలో, ఆఫ్ఘనిస్థాన్‌లో యూనెస్కో తరపున 3 సం॥ గణితశాస్త్ర అధ్యాపకునిగా, శిక్షణ కళాశాలలో పనిచేశారు. విద్యావేత్తగా పలుపదవులు అలంకరించి - విద్యావ్యవహారాలలో నిపుణునిగా వినుతి

కెక్కారు. ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యా డైరెక్టరుగా పదవీవిరమణ చేశారు. శ్రీ బొల్లిన నారాయణ స్వామి అల్లుడు.

శ్రీ వాసిరెడ్డి నారాయణరావు — యానిమల్ హజ్బెండ్రి డైరెక్టరుగా పదవీ విరమణ చేసి 'ఈనాడు' దినపత్రికలో 'రైతులోకం' శీర్షిక నిర్వహిస్తున్నారు.

శ్రీ వి. సైదులు — ఉపాధ్యాయునిగా ప్రారంభమై, తంతితపాలాశాఖా అధికారిగా, పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా - సమాచారశాఖ డైరెక్టరుగా 'తెలుగు వెలుగు' సంపాదకులుగా పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర ప్రేక్షక సమితి ప్రత్యేక అవార్డుపొందారు కీర్తిశేషులు.

శ్రీ పోలవరం వనమాలి I.A.S — శ్రీ పి. రంగయ్యనాయుడు గారి కుమారులు. బెంగాల్‌లో ఉద్యోగబాధ్యతలు నిర్వహించి, పరిశ్రమల అదనపు డైరెక్టరుగా, భారత ప్రభుత్వం తరపున ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ పేమెంట్ కమీషనర్‌గా పనిచేస్తున్నారు.

శ్రీ ఎ. వనజాక్షి I.A.S. — డైరెక్టరు, ఉన్నత విద్యాపరిషత్.

శ్రీ సి. నరసింహం I A.S. — సెక్రెటరీ - పంచాయితీరాజ కమిషన్. పంచాయితీరాజ్ కమిటీ రిపోర్టు వీరు రూపొందించారు. పదవీ విరమణ చేశారు.

శ్రీమతి రాజ్యం సిన్హా — సమాచార శాఖా డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు.

శ్రీ కె. రామమోహనరావు I.P.S. — మాజీ డి. జి. పి. ప్రస్తుతం, ఆల్విన్ ఛైర్మన్‌గా పని చేస్తున్నారు.

శ్రీ కొత్త వెంకటసత్యనారాయణ (K.V.S. బాబు) — ప్రిన్సిపల్ కన్జర్వేటివ్ ఆఫ్ ఫారెస్ట్స్.

శ్రీ త్రిపురనేని హనుమాన్ ప్రసాద్ — రిటైర్డ్ టెలికాం డైరెక్టరు. ప్రస్తుతం ఓవర్సీస్ టెలికమ్యూనికేషన్స్‌లో పనిచేస్తున్నారు.

శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు — రాష్ట్ర విద్యుత్ బోర్డు ఛీఫ్ ఇంజనీరు

కుమారి వాసిరెడ్డి సీతాదేవి — బాలల అకాడమీ డైరెక్టరు

శ్రీ తేళ్ళ సుబ్బారావు - రిటైర్డ్ చీఫ్ కన్జర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్

శ్రీ జంపాల పార్ధసారధి - ఆంధ్రప్రదేశ్ విద్యుత్ బోర్డు చీఫ్ ఇంజనీరు

శ్రీ కుడితిపూడి శ్రీరామకృష్ణయ్య - తెనాలి తాలూకా బేతపూడి గ్రామస్తులు ప్రఖ్యాత ఇంజనీరు. తెలుగుగంగా ప్రాజెక్ట్, కాకతీయ యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ ఇటీవల పొందారు.

శ్రీ సూరపనేని హరి రాధాకృష్ణమూర్తి — చీఫ్ ఇంజనీరు, సౌత్ సెంట్రల్ రైల్వే (ట్రాక్ సెక్షన్)

శ్రీ పాములపాటి సదాశివరావు - భారత అల్యూమినియం లిమిటెడ్ కార్బో ప్రాజెక్ట్ డైరెక్టరు

శ్రీ యుగంధర్ I A.S. - ఫారిన్ సర్వీస్‌లో ఉన్నారు

శ్రీ సి. యన్. రావు I.F.S. - ఇండియన్ ఫారిన్ సర్వీస్

శ్రీ నాగభైరవుని జయప్రకాశ్ I.A S. - ఒంగోలు జిల్లా కలెక్టరు

శ్రీ మిక్కిలినేని వినాయక్‌రావు I.A.S. - సచివాలయంలో పనిచేస్తున్నారు.

శ్రీ తుమ్మల రామ్మోహనరావు I.A.S. - సింగరేణికాలరీస్‌లో పనిచేస్తున్నారు.

శ్రీ ముద్దన సాంబశివరావు I.A.S - డి.ఆర్.డి యల్ ఇన్‌ఛార్జీ

శ్రీ కాజా రత్నకిషోర్ I.A.S. - ఏలూరు కలెక్టరు

శ్రీ బి.యస్.ఆర్. క్రిష్ణా - యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా సమాచార శాఖలో పనిచేసి పదవీవిరమణ చేశారు

శ్రీ కె. వి. సుబ్బయ్య - అమెరికా సమాచారశాఖలో పనిచేసి రిటైరయ్యారు

శ్రీ పి.డి. కోటేశ్వరరావు I.P.S. - ముఖ్యమంత్రి సెక్యూరిటి ఆఫీసరు

శ్రీ సి. వెంకటనరసయ్య I.P.S. -

శ్రీ కె. వి. అప్పారావు I.P.S. - CBCID లో I.G.

శ్రీ సి. సత్యనారాయణ I.R.S. - ఇండియన్ రైల్వేస్‌లో పనిచేస్తున్నారు.

శ్రీ హనుమంతు రామకృష్ణ ప్రసాద్ - బొంబాయి డంకన్ బ్రదర్స్‌లో చీఫ్ ఇంజనీరు కంపెనీ డైరెక్టర్లలో ఒకరిగా పనిచేస్తున్నారు.

శ్రీ గుత్తా వెంకటరత్నం - సౌత్ సెంట్రల్ రైల్వేలో ఛీఫ్ ఇంజనీరు (కన్‌స్ట్రక్షన్ శాఖ)

శ్రీ జె. వి. రాముడు - వరంగల్లులో యస్.పి.గా పనిచేస్తున్నారు.

శ్రీ సుంకర రాధాకృష్ణమూర్తి - డి.యస్.పి.గా రిటైర్డ్ (రాష్ట్రపతి అవార్డు గ్రహీత)

శ్రీ చక్కపల్లి వెంకటేశ్వరరావు - డి.యస్.పి.గా రిటైర్డ్ (రాష్ట్రపతి అవార్డు గ్రహీత)

శ్రీ తేళ్ళ రామయ్య చౌదరి - రిటైర్డ్ యస్.పి.

శ్రీ పీరగంధం కామేశ్వరరావు I.P. & T.S. - జాంబియా ప్రభుత్వానికి టెలి కమ్యూనికేషన్స్ సలహాదారుడు, మాజీ ఆంధ్రప్రదేశ్, టెలి కమ్యూని కేషన్స్ డైరెక్టరు

డా॥ కామనేని దయానంద చౌదరి- సైంటిస్టు, జియలాజికల్ సర్వే ఆఫ కెనడా, కెనడా.

డా॥ కోనేరు శ్రీనివాసరావు, డైరెక్టరు, జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, హైదరాబాద్.

శ్రీ యండ్లూరి అనీల్ కుమార్ I.P.S.

శ్రీ జె. జె. రావు మాజీ జనరల్ మానేజర్, సరిహద్దు రైల్వే విభాగం, భారత రైల్వే సంస్థ విభాగం, భారత రైల్వే సంస్థ.

శ్రీ పోటూరి భాస్కరరావు - ఛీఫ్ ఆపరేటింగ్ సూపరింటెంట్, సౌత్ సెంట్రల్ రైల్వే, హైదరాబాద్.

డా॥ యం. రాఘవేంద్రరావు - మాజీ ఛీఫ్ మెడికల్ ఆఫీసర్, సౌత్ సెంట్రల్ రైల్వే.

శ్రీ ధూళిపాళ యం. వి. ప్రసాదరావు, రీసెర్చి అసోసియేట్ డైరెక్టరు, వ్యవసాయ విశ్వవిద్యాలయం - జాగిత్యాల (A.P.).

శ్రీ కంచర్ల చంద్రశేఖరవరప్రసాదరావు - గొప్ప న్యూక్లియర్ ఫిజిక్స్ సైంటిస్టు- వాషింగ్‌టన్ (అమెరికా)

శ్రీ నీరుకొండ చలపతిరావు, డిప్యూటి ఛీఫ్ ఎగ్జిక్యూటివ్, ఖాదీ, విలేజి ఇండ స్ట్రీస్ కమీషన్, బొంబాయి.

డా॥ వి. లక్ష్మీనారాయణ, డైరెక్టరు,బ్యూరో ఆఫ్ ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, హైదరాబాద్.

ఆచార్య శ్రీ పి యస్. కృష్ణారావు, పారా సైకాలజీ ప్రొఫెసరు, ఆంధ్రా యూనివర్సిటీ.

ఆచార్య కొడాలి లక్ష్మీనారాయణరావు, జియాలజి ప్రొఫెసరు మరియు హెడ్, శ్రీవెంకటేశ్వర యూనివర్సిటి.

ఆచార్య యం. యస్. మూర్తి, జియాలజి ప్రొఫెసరు అండ్ హెడ్, శ్రీ వెంక టేశ్వర యూనివర్సిటి.

ఆచార్య దాసరి మాధవరావు, జియాలజి ప్రొఫెసరు, లూస్‌విల్లో యూనివర్సిటీ, అమెరికా.

ఆచార్య శ్రీ పి. ధర్మారావు, జియాలజి ప్రొఫెసరు, అలస్కా యూనివర్సిటీ, అమెరికా.

ఆచార్య అట్లూరి చక్రధరరావు, మాజీ మధ్యప్రదేశ్ ఇంజనీరింగ్ కాలేజి ప్రొఫెసరు, ప్రస్తుతం సిద్ధార్థ ఇంజనీరింగ్ కళాశాల ప్రిన్సిపాల్, విజయవాడ.

ఆచార్య పరిమి శ్రీరంగనాయకులు, మాజీ, బాపట్ల, సిద్ధార్థ ఇంజనీరింగ్ కళా శాల ప్రిన్సిపాల్, ప్రస్తుతం నాగార్జున యూనివర్సిటి డీన్.

ఆచార్య జి. ఆర్. లక్ష్మణరావు, మీటరాలజీ ప్రొఫెసరు, ఆంధ్రా యూనివర్సిటీ.

ఆచార్య కె.పి.ఆర్. చౌదరి, ఫార్మాసూటికల్ ప్రొఫెసరు, ఆంధ్రాయూనివర్సిటీ.

డాక్టరు క్రొత్తపల్లి రాధాకృష్ణ, అమెరికాలో గొప్ప యూరాలజిస్టు. పుట్టిపెరిగిన అమృతలూరు డ్రైనేజి సిస్టమ్ బాగుచేయించారు.

డాక్టరు కె. రాజేంద్రబాబు, అనాటమీ ప్రొఫెసరు, గుంటూరు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్.

డాక్టరు కె. కోదండరామయ్య, ప్రొఫెసరు, మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పని చేశారు.

ఆచార్య యన్. యస్. దాస్, బయోకెమిస్ట్రీ ప్రొఫెసరు, వైద్య విశ్వవిద్యాలయం.

ఆచార్య యన్. వి. సుబ్బారావు చౌదరి, సర్జరీ ప్రొఫెసరు, గుంటూరు ప్రభుత్వ హాస్పటల్ సూపరిండెంట్.

ఆచార్య నూతక్కి వెంకటేశ్వరరావు, సర్జరీలో ప్రొఫెసరు, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ (గుంటూరు బ్రాంచ్) ప్రెసిడెంట్.

ఆచార్య కె. వాసుదేవరావు, ప్రొఫెసరు, బయోకెమిస్ట్రీలో సలహాదారుడు సాల్మానియా మెడికల్ సెంటర్, బహరైన్, (గల్ఫ్ కంట్రి).

ఆచార్య టి. సరోజిని - గైనకాలజీ ప్రొఫెసరు, గుంటూరు ప్రభుత్వ హాస్పటల్ సూపరిండెంట్.

ఆచార్య వై. నాయుడమ్మ - పీడియాట్రిక్ సర్జరీ ప్రొఫెసరు, గుంటూరుప్రభుత్వ హాస్పటల్.

డాక్టరు సి.హెచ్. వెంకటేశ్వరరావు, ప్లాస్టిక్ సర్జరీ ప్రొఫెసరు, వైజాగ్ ప్రభుత్వ హాస్పిటల్.

ఆచార్య వి. నాగరాజనాయుడు, రిజిష్ట్రారు, ఓపెన్ యూనివర్సిటి, ప్రొఫెసరు లండ్ డీన్ కామర్స్ డిపార్టుమెంట్.

ఆచార్య పి. మురళి, కామర్స్ ప్రొఫెసరు, శ్రీవెంకటేశ్వర యూనివర్సిటి.

ఆచార్య డి. యల్. నారాయణ, ఎకనామిక్స్ ప్రొఫెసరు అండ్ హెడ్, శ్రీవెంకటేశ్వర యూనివర్సిటి.

ఆచార్య యల్. కోదండరామనాయుడు, ఎకనామిక్స్ ప్రొఫెసరు, శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటి.

ఆచార్య ఇ. మునిరత్నంనాయుడు, ఎకనామిక్స్ ప్రొఫెసరు, శ్రీవెంకటేశ్వరా యూనివర్సిటి.

ఆచార్య ఆర్. రాఘవులునాయుడు, కెమిస్ట్రీ ప్రొఫెసరు , శ్రీవెంకటేశ్వర యూనివర్సిటి.

ఆచార్య బి. వెంకయ్య, కామర్స్ ప్రొఫెసరు, ఓపెన్ యూనివర్సిటి, హైదరాబాద్.

ఆచార్య టి. వి. సుబ్బారావు, ఇంగ్లీష్ ప్రొఫెసరు, ఓపెన్ యూనివర్సిటి.

ఆచార్య సి. సుబ్బారావు, ఇంగ్లీషు ప్రొఫెసరు, ఓపెన్ యూనివర్సిటి.

ఆచార్య ఎ. రామమోహనరావు, పి. జి. స్టడీస్ డీన్, వెటర్నరీ గైనకాలజీ ప్రొఫెసరు, వ్యవసాయ విశ్వవిద్యాలయం - హైదరాబాద్.

ఆచార్య పి. సి. చౌదరి, వెటర్నరీ మెడిసిన్ ప్రొఫెసరు, వ్యవసాయ విశ్వవిద్యాలయం - తిరుపతి.

ఆచార్య పల్లపోతు నరసింహం - ఆర్థోపెడిక్స్ ప్రొఫెసరు, మెడికల్ కాలేజి గుంటూరు.

ఆచార్య యన్. నారాయణ, మాజీ రిజిష్ట్రారు కాకతీయ యూనివర్సిటి, ఎకనామిక్స్ ప్రొఫెసర్.

ఆచార్య కె. లీలాకృష్ణ, ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ ప్రొఫెసరు, ఢిల్లీ యూనివర్సిటి.

ఆచార్య వి. రంగారావు, ప్రాజెక్ట్ డైరెక్టరు (ఆయిల్ సీడ్స్) డైరెక్టరేట్ ఆఫ్ ఆయిల్ సీడ్ రీసెర్చి, హైదరాబాద్.

ఆచార్య శ్రీ మండవ నారాయణరావు - జియాలజి ప్రొఫెసరు, గౌహతి యూనివర్సిటి, అస్సాం.

ఆచార్య శ్రీ మాలెపాటి వెంకట్రామానాయుడు - బోటనీ ప్రొఫెసరు, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటి.

ఆచార్య శ్రీ ఆలపాటి కృష్ణకుమారన్, బయాలజీ ప్రొఫెసరు, మార్క్వెట్ యూనివర్సిటి, అమెరికా.

ఆచార్య క్రొత్తపల్లి రంగారావు, ప్రొఫెసర్ అండ్ బయాలజి యూనివర్సిటి ఆఫ్ వెస్ట్ఫ్లోరిడా, అమెరికా.

ఆచార్య ధూరిసాల దేశయ్య, న్యూరాలజి ప్రొఫెసరు, మిసిసిపి యూనివర్సిటి మెడికల్ సెంటర్, అమెరికా.

ఆచార్య యన్. ఆర్. సత్యనారాయణ, ప్రొఫెసర్ లైబ్రరీ సైన్సు, లక్నో యూనివర్సిటి, ఉత్తరప్రదేశ్.

ఆచార్య బి. పద్మనాభనాయుడు, జువాలజీ ప్రొఫెసరు, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ.

ఆచార్య పి. రామచంద్రనాయుడు, కెమిస్ట్రీ ప్రొఫెసరు, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ.

డాక్టరు తేళ్ళ సుభాష్, రిసెర్చి సైంటిస్టు, జియలాజికల్ సర్వే ఆఫ్ కెనడా, కెనడా.

ఆచార్య శ్రీ బి. వెంకయ్య, ప్రొఫెసరు మరియు హెడ్ ఆఫ్ బయోకెమిస్ట్రీ, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి.

ఆచార్య శ్రీ కొత్తాలి బాబూరావు, కంప్యూటర్ సైన్సు అండ్ సిస్టం ఇంజనీర్ ప్రొఫెసరు ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

ఆచార్య వల్లమూటి రాజారామోహనబాబు, జియోఇంజనీరింగ్ ప్రొఫెసరు, ఆంధ్రా యూనివర్సిటి

ఆచార్య శ్రీ యం. గంగాధరరావు, కామర్సు ప్రొఫెసరు, ఆంధ్రా యూనివర్సిటీ.

ఆచార్య శ్రీ రావి మురళీమోహనరావు, ఎకనామిక్సు ప్రొఫెసరు, ఆంధ్రా యూనివర్సిటీ.

ఆచార్య లంకసాని చక్రధరరావు, ప్రొఫెసర్ అండ్ హెడ్ ఆఫ్ తెలుగు, ఆంధ్రా యూనివర్సిటీ.

ఆచార్య కె. రామశేషయ్య, అగ్రోనమీ సీనియర్ సైంటిస్టు, వ్యవసాయవిశ్వవిద్యాలయం (లాం).

డా॥ కె. గోపాలకృష్ణ, కార్డియాలజి ప్రొఫెసరు, గాంధీ మెడికల్ కాలేజి, హైదరాబాద్.

ఆచార్య యన్. సత్యనారాయణ, న్యూరాలజీ ప్రొఫెసరు, ఆంధ్ర మెడికల్ కాలేజి, వైజాగ్.

ఆచార్య దొడ్డపనేనిప్రసాద్, ప్లాస్టిక్ సర్జరి గొప్ప శస్త్రచికిత్సకులు, ఉస్మానియా మెడికల్ కాలేజి, హైదరాబాద్.

డా॥ కె. రాఘవేంద్ర చౌదరి, గొప్ప వెటర్నరీ సర్జన్, న్యూజెర్సీ, అమెరికా.

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

ఆచార్య కె. శ్రీ రామచంద్రరావు జియాలజి

ఆచార్య ఎ. సీతారామస్వామి ,,

ఆచార్య డి. వి. కృష్ణారావు - ఫిజిక్సు.

డాక్టరు సి. వి. రాఘవయ్య - సెంట్ ఫర్ న్యూక్లియర్ టెక్నిక్స్ హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు.

డాక్టరు పి. రాజేంద్రప్రసాద్ - జియోఫిజిక్సు

ఆచార్య జి. లక్ష్మణరావు - మీటరాలజి.

ఆచార్య తుమ్మల వేణుగోపాలరావు - సిద్ధార్థ ఇంజనీరింగ్ కళాశాల, ఆంధ్రా యూనివర్సిటి ఇంజనీరింగు కాలేజి ప్రిన్సిపాల్.

ఆచార్య త్రిపురనేని శివాజీరావు - వాటర్, & ఎయిర్ పొల్యూషన్‌లో నిపుణులు· సివిల్ ఇంజనీరింగ్‌శాఖ.

ఆచార్య టి. వెంకటేశ్వర్లు - సివిల్ ఇంజనీరింగ్ శాఖ.

ఆచార్య వి.ఆర్.ఆర్.యమ్. బాబు - జియో ఇంజనీరింగ్ హెడ్.

డాక్టరు కె. హరిబాబు - ఎలక్ట్రానిక్స్ డిపార్ట్‌మెంట్, టీచర్స్ సెక్రటరీ.

ఆచార్య కె. రాములు - డెంటల్ ప్రొఫెసరు మరియు శాఖాధిపతి.

ఆచార్య సి. పిచ్చయ్య - సూపరెండెంట్

డాక్టరు నందకుమార్ - ఇ. ఎన్. టి. స్పెషలిస్టు

డాక్టరు ప్రకాశరావు - ఇ. ఎన్. టి. స్పెషలిస్టు

ఆచార్య కె. వెంకటేశ్వర్లు - రాజనీతిశాస్త్ర శాఖాధిపతి, మాజీ విశ్వవిద్యాలయ ఆర్ట్ కళాశాల ప్రిన్సిపాల్.

ఆచార్య బి. ప్రసాదరావు - అర్థశాస్త్రం, డీన్ ఆఫ్ ఎకడమిక్ ఎఫైర్స్, ప్రస్తుతం గండిపేట రాజకీయ శిక్షణ శిబర డైరెక్టరు.

ఆచార్య బి. వి. కిషన్ - ఆర్థికశాఖ ప్రొఫెసరు, ప్రిన్సిపాల్ ఆర్ట్స్ కళాశాల

డాక్టరు కె. హరినారాయణ - కరెస్పాండెన్స్ కోర్సు డిపార్ట్‌మెంట్ - డిప్యూటి డైరెక్టర్

డాక్టరు వై. కృష్ణప్రసాద్ - కరెస్పాండెన్స్ కోర్సు - అసిస్టెంట్ డైరెక్టరు
డాక్టరు కె. మస్తాన్‌నాయుడు - కరెస్పాండెన్స్‌కోర్సు - అసిస్టెంట్ ప్రిన్సిపాల్

## నాగార్జున విశ్వవిద్యాలయము

ఆచార్య యలమంచి రాధాకృష్ణ - మాజీ జువాలజీ ప్రొఫెసరు. ప్రస్తుతం ఏక్వికల్చర్ రీసెర్చి అండ్ ఎడ్యుకేషన్ ప్రొఫెసరు మరియు డైరెక్టరు. నెచురల్ సైన్సు డీన్. కాకతీయ, నాగార్జున, శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయ ప్రణాళికా బోర్డు సభ్యులు. యు.జి.సి. సెలక్షన్ బోర్డు సభ్యులు. కొల్లేరు అభివృద్ధి విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సలహాదారులు. చేప పిల్లల పెంపకం అభివృద్ధి అంశాలలో దేశంలోనే గొప్ప పేరు ప్రఖ్యాతులున్నవారు.

ఆచార్య అన్నమనేని శేషగిరిరావు - బోటనీ ప్రొఫెసరు శాఖాధిపతి విశ్వవిద్యాలయ కాలేజీ ప్రిన్సిపాల్, సిండికేట్ మెంబరు.

ఆచార్య చిట్టూరి రాఘవులు - రాజనీతిశాస్త్రం, ప్రభుత్వపాలనా శాస్త్ర ప్రొఫెసరు మరియు శాఖాధిపతి. పయోజన విద్యాపథకం డైరెక్టరు. సెంటర్ ఫర్ డిసాస్టర్ మేనేజిమెంట్ స్టడీస్ డైరెక్టరు.

ఆచార్య గుంటుపల్లి కోటేశ్వరరావు - మేథమేటిక్స్ ప్రొఫెసరు & శాఖాధిపతి.

ఆచార్య పాలడుగు రామమోహనరావు - ప్రొఫెసరు బోటనీ డిపార్టుమెంట్

ఆచార్య సూర్యదేవర వెంకటకృష్ణారావు - ఫిజిక్స్ ప్రొఫెసరు మరియు విశ్వవిద్యాలయ ప్రస్తుత రిజిష్ట్రారు.

శ్రీ కిలారు శ్రీమన్నారాయణ - నాగార్జున యూనివర్శిటీ ప్రథమ రిజిష్ట్రారు ప్రఖ్యాత ఇంజనీరు.

ఆచార్య అట్లూరి త్రివిక్రమరావు - ప్రొఫెసరు మరియు హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ జియాలజిలో రెండు సంవత్సరాలు పనిచేశారు. ప్రస్తుతం ఆంధ్రా యూనివర్సిటీలో పనిచేస్తున్నారు.

ఆచార్య కొత్తపల్లి శశిరబాబు - జువాలజీ ప్రొఫెసరు మరియు హెచ్, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ పి. జి. సెంటరు, కావలి.

ఆచార్య పనుపోతు త్రిమూర్తి - కంప్యూటర్ సైన్సు డైరెక్టరు, ప్రొఫెసరు. సర్దార్ వల్లభాయ్ పటేల్ యూనివర్సిటి, గుజరాత్.

ఆచార్య వంకాయలపాటి రామచంద్ర - తెలుగు ప్రొఫెసరు, మద్రాస యూనివర్సిటి.

ఆచార్య ఐ. ఏ. సుబ్బారావు - వ్యవసాయశాస్త్ర ప్రొఫెసరు, రీసెర్చి డైరెక్టరు, అగ్రికల్చరల్ యూనివర్సిటి, హైదరాబాద్.

ఆచార్య మొవ్వా రామారావు - లామ్ స్టేషన్ అసోసియేట్ డైరెక్టరు, తిరుపతి అగ్రికల్చరల్ కాలేజి మాజీ ప్రిన్సిపాల్ మరియు ప్రొఫెసరు.

ఆచార్య ఆలపాటి సత్యనారాయణ - ప్లాంట్ బ్రీడింగ్ ప్రొఫెసరు. ప్రస్తుతం రీజినల్ అగ్రికల్చరల్ రీసెర్చి స్టేషన్‌లో సీనియర్ సైంటిస్టుగా పని చేస్తున్నారు.

ఆచార్య వజ్జా సాంబశివరావు - కెమిస్ట్రి ప్రొఫెసరు. బిట్స్‌పిలాని, రాజస్థాన్.

ఆచార్య జమ్ముల సత్యనారాయణ - కామర్స్ ప్రొఫెసరు, ఉస్మానియా యూనివర్సిటి - ప్రస్తుతం ఉన్నత విద్యామండలి వైస్ ప్రెసిడెంట్‌గా పని చేస్తున్నారు. గతంలో వీరు రూపొందించిన R.T.C. నివేదిక దాని నిర్వహణ, కార్యకలాపాలకు ఎంతో దోహదకారయినది.

ఆచార్య జమ్ముల తిరుమలరావు - కెమిస్ట్రి ప్రొఫెసరు, సాగర్ యూనివర్సిటి సాగర్ (**M.P.**)

ఆచార్య కూకట్ల కోటేశ్వరరావు - బయో కెమిస్ట్రీ ప్రొఫెసరు మరియు హెడ్, యమ్.యస్. యూనివర్సిటి ఆఫ్ బరోడా, గుజరాత్ రాష్ట్రం.

ఆచార్య నున్నా రమణరావు - జియాలజి ప్రొఫెసరు, ఉస్మానియా యూనివర్సిటి.

ఆచార్య యం. కృష్ణయ్య - పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ ప్రొఫెసరు సోషల్ సైన్సు డీన్, కాకతీయ యూనివర్సిటి, వరంగల్.

ఆచార్య జి. రవీంద్రప్రసాద్ - సెంటర్ ఫర్ అర్బన్ అండ్ ఎన్విరాన్మెంటల్ స్టడీస్ డైరెక్టరు, ఉస్మానియా యూనివర్సిటి.

ఆచార్య వాసిరెడ్డి శివలింగప్రసాద్ - డైరెక్టరు (ఎకడమిక్) ఓపెన్ యూనివర్సిటి హైదరాబాద్.

డాక్టరు కొడాలి ప్రసాద్ - డిఫెన్స్ రీసెర్చి లాబొరేటరీ, డైరెక్టరు, భారత ప్రభుత్వం

ఆచార్య ఆర్. కృష్ణారావు - రిజిష్ట్రారు, జవహర్లాల్ సాంకేతిక విశ్వవిద్యాలయము, హైదరాబాద్.

ఆచార్య కె. వి. సత్యనారాయణ - రాష్ట్ర సర్వీస్ కమీషన్ సభ్యులు.

ఆచార్య వల్లభనేని సీతారామదాసు - శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో బోటనీ ప్రొఫెసరుగా పనిచేశారు. ప్రస్తుతం సెంట్రల్ యూనివర్సిటీలో పనిచేస్తున్నారు. వృక్ష శాస్త్రంలో అంతర్జాతీయ ఖ్యాతినార్జించారు.

ఆచార్య ఆట్లూరి రామదాసు - ఆంధ్రా యూనివర్సిటీ జియాలజి ప్రొఫెసరుగా పదవీ విరమణ చేశారు.

ఆచార్య బలుసు రామకృష్ణారావు (B.R K రావు) శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటిలో ఆర్థికశాస్త్ర ప్రొఫెసర్‌గా పదవీ విరమణ చేశారు. ఆర్థిక శాస్త్రంలో ఘటికుడు.

శ్రీ సి. రంగయ్యనాయుడు - శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయ రిజిష్ట్రారు.

ఆచార్య టి.తిరువెంగన్నరావు - ఫిజిక్స్ ప్రొఫెసరు. ఆంధ్రయూనివర్సిటి పదవీ విరమణ చేశారు.

ఆచార్య బి. రామయ్య - ఫిలాసఫీ ప్రొఫెసరు, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం.

డా॥ కె. చిరంజీవి- ప్రిన్సిపాల్, డెంటల్ కళాశాల, ఉస్మానియా యూనివర్సిటి

డా॥ జాస్తి సూర్యనారాయణ - తెలుగు రీడర్, శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటి

ఆచార్య అబ్బినేని అల్లూరయ్య - ఫిజిక్స్ ప్రొపెసరు, వరంగల్ రీజనల్ ఇంజనీరింగ్ కళాశాల.

ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు - పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ అండ్ రాజనీతి శాస్త్ర ప్రొఫెసరు. కాకతీయ యూనివర్సిటి కాలేజీ ప్రిన్సిపాల్. ఆఫీస్ మేనేజ్‌మెంట్ పర్సనల్ మేనేజ్‌మెంట్ అండ్ ఇండస్ట్రియల్ రిలేషన్స్,రూరల్ డెవలప్‌మెంట్ పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిప్లమో ఇన్‌ఛార్జి. రీసెర్చి ప్రాజెక్ట్

ఆఫీసర్. దాదాపు 40 పేపర్లు ప్రకటించారు. 12 పుస్తకాలు ప్రచురించబడ్డాయి.

ఆచార్య తుమ్మల కృష్ణకుమార్ - రాజనీతి శాస్త్ర ప్రొఫెసర్, కాన్సస్ యూనివర్సిటీ- అమెరికా.

ఆచార్య కొత్త కోటేశ్వరరావు - ప్రిన్సిపాల్, రీజినల్ ఇంజనీరింగ్ కళాశాల వరంగల్.

ఆచార్య వి. వెంకటేశ్వరరావు - ఫిజిక్స్ ప్రొఫెసరు, రీజినల్ ఇంజనీరింగ్ కళాశాల.

ఆచార్య జి. కృష్ణారావు - ఫిజిక్స్ ప్రొఫెసరు, కాకతీయ విశ్వవిద్యాలయం.

ఆచార్య యస్. వెంకటేశ్వరరావు - సివిల్ ఇంజనీరింగ్ డిపార్టుమెంట్, రిజినల్ ఇంజనీరింగ్ కళాశాల, వరంగల్.

ఆచార్య రామయ్య - కెమిస్ట్రీ ప్రొఫెసరు, J.N.T.U., హైదరాబాద్.

శ్రీ గుత్తా అరవింద్ ఘోష్ - ప్రిన్సిపాల్, J.N.T.U, హైదరాబాద్.

శ్రీ కలగర వెంకటరత్నం - ఆంధ్ర విశ్వవిద్యాలయ లైబ్రేరియను.

ఆచార్య పర్వతనేని గంగాధరరావు - మద్రాసు యూనివర్సిటి, లైబ్రరి అండ్ ఇన్ఫర్మేషన్ సర్వీస్.

శ్రీ సుంకర కోటేశ్వరరావు - నాగార్జున విశ్వవిద్యాలయ లైబ్రేరియను.

ఆచార్య యన్. గురుస్వామినాయుడు - శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ లైబ్రరీ అండ్ ఇన్ఫర్మేషన్ సర్వీస్.

శ్రీ యల్.యస్. రామయ్య - లైబ్రేరియను, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ అండ్ ఫారిన్ లాంగ్వేజెస్ - హైదరాబాద్.

## వైద్య రంగం

కమ్మవారు ప్రముఖంగా ఎదిగిన రంగమిది. వేలసంఖ్యలో డాక్టర్లు ఇంజనీర్లు విదేశాలలో సైతం రాణిస్తున్నారు. ప్రస్తుతం కొంతమంది ప్రఖ్యాతి పొందిన వారిని ఇచ్చట పేర్కొనడమౌతుంది.

శ్రీ పి. లక్ష్మణరావు, శ్రీ పిన్నమనేని నరసింహారావు, శ్రీ పిన్నమనేని వెంకటేశ్వరరావు, శ్రీ కాసరనేని సదాశివరావు, శ్రీకొత్త శివరామకృష్ణప్రసాద్, (తెనాలి) శ్రీ కాజా కృష్ణామూర్తి, శ్రీ చదలవాడ కృష్ణయ్య చౌదరి, కీ॥ శే॥ శ్రీఉప్పల సుందరరామయ్య, శ్రీలక్ష్మీభవాని, వారిభర్త కరంచంద్ (గుడివాడ) శ్రీ తాళ్ళూరి శివరామకృష్ణ (గుడివాడ హోమియో ఆచార్యులు), శ్రీ పావులూరి కృష్ణచౌదరి (హోమియో హైద్రాబాద్), శ్రీ కోడెల శివప్రసాద్ (నరసరావుపేట), ప్రొఫెసరు ఉయ్యూరు సత్యనారాయణ(గాంధీ హాస్పిటల్ హైదరాబాద్), శ్రీచేపరాల శోభనాద్రి (గుంటూరు). శ్రీకొత్త రవీంద్రబాబు తెనాలి) శ్రీవెనిగళ్ళ విశ్వమోహనరావు, తెనాలి శ్రీ వల్లపల్లి కామప్రసాద్, సాంబశివరావు గారి కుమారుడు (గుంటూరు), శ్రీ చదలవాడ సుధ, శ్రీ చదలవాడ నాగేశ్వరరావు(పిన్నమనేని పాలిక్లినిక్, విజయవాడ) శ్రీ వడ్లమూడి నాగేశ్వరరావు, సుమతి (తెనాలి), వేములపల్లి రాధాకృష్ణమూర్తి (రేపల్లె).

వాషింగ్టన్ ఆంధ్రా అసోసియేషన్ కార్యదర్శిగా శ్రీ రావెళ్ళ రమేష్ ప్రసాద్, (ఐ.బి.ఎమ్. కంప్యూటరు ఇంజనీరు) ప్రెసిడెంట్‌గా శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణ(అమెరికాలో పారిశ్రామిక వేత్త, ఇంజనీరు)గారులు పనిచేస్తున్నారు.

## న్యాయశాఖలో కమ్మవారు

జస్టిస్ దావులూరి ముని కన్నయ్యనాయుడు :- న్యాయవాదిగా, పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా ఎదిగారు. కీ॥ శే॥ శ్రీ బొల్లిన మునుస్వామి బంధువులు వీరు.

శ్రీ కలగర సుబ్రమణ్యం చౌదరి : గుడివాడలో న్యాయవాదిగా పేరు ఆర్జించి జిల్లామునసబుగా, సబ్ జడ్జిగా, అడిషనల్ జిల్లాజడ్జిగా చివరకు ప్రిన్సిపల్ జిల్లా జడ్జిగా పనిచేశారు. చాటపర్రు వాస్తవ్యులు ఏలూరు అనేక ధర్మకార్యములకు విరాళాలిచ్చారు.

శ్రీ తేళ్ళ కృష్ణమ్మ చౌదరి : జిల్లా జడ్జిగా పనిచేశారు. స్వతంత్రపార్టీతో అనుబంధమున్నది. పెదనందిపాడు కళాశాల నిర్మాణానికి ఎంతో పాటుపడ్డారు.

శ్రీ గుంటుపల్లి రామయ్య (బండారుపల్లి), శ్రీ జాస్తి సాంబశివరావు శ్రీ లావు జగదేశ్వరరావు : జిల్లాజడ్జీలుగా పేరు ప్రఖ్యాతులు పొందారు.

స్వాతంత్ర్యానికి పూర్వం నాటినుండే న్యాయవాదులలో కమ్మవారు అసంఖ్యాకంగా ఉన్నారు. వారిలో జిల్లాకోర్టు జడ్జీల వరకు అనేకులు ఎదిగారు. క్రమంగా ప్రతిభా ఉత్పత్తులనుబట్టి ఉన్నతశిఖరాలను అధిరోహించారు. అందరిని పేర్కొనడం కుదరదు గనుక కొందరినిచ్చట పేర్కొనడమైనది.

హైకోర్టు న్యాయమూర్తులుగా శ్రీ ఆవుల సాంబశివరావు, శ్రీ పత్తిపాటి అంకమ్మ చౌదరి, శ్రీ చల్లాకొండయ్య చౌదరి, శ్రీమతి అమరేశ్వరి, శ్రీగోగినేని రాధాకృష్ణమూర్తిగార్లు పనిచేశారు.

ఇందులో శ్రీ పత్తిపాటి అంకమ్మ చౌదరి రాజ్యాంగంలో నిష్ణాతుడు. అభ్యుదయ భావాలు గలవారు. నరసాయ పాలెంలో పుట్టి ఉన్నత శిఖరాలను దర్శించినవారు.

శ్రీ చల్లా కొండయ్యగారు మాజీమంత్రి శ్రీచల్లా సుబ్బారాయుని సోదరులు మద్రాస్ బార్‌లో న్యాయవాదిగా పనిచేశారు. గుంటూరు హైకోర్టులో (కర్నూలు రాజధానిగా ఉన్నప్పుడు) రాణకెక్కారు. క్రమంగా హైకోర్టు న్యాయమూర్తిగా ఎదిగారు. పదవీ విరమణ అనంతరం దేవాలయాల భూములపైవేసిన కమీషన్, అధ్యక్షులుగా పనిచేశారు. మిగిలిన వారి ప్రస్తావన వేరు వేరు సందర్భాలలో పేర్కొనడమైనది.

అనేక జిల్లాకోర్టులలో న్యాయమూర్తులుగా కమ్మవారు చాలమంది పనిచేస్తున్నారు. ఉదాహరణకు శ్రీ మండవ శ్రీనివాసరావు రంగారెడ్డి జిల్లా, శ్రీచింతమనేని రామప్రసాద్ చిత్తూరు జిల్లాలలో ఉన్నారు. వారందరిని ఉదహరించడం స్థలాభావం వల్ల కుదరడంలేదు.

## తేజోమూర్తులు

"పద్మవిభూషణ్" కొత్త సచ్చిదానందమూర్తి :- సర్వేపల్లి రాధాకృష్ణన్ తరువాత ఆంధ్రులకు అంతర్జాతీయ ఖ్యాతి ఆర్జించిపెట్టిన వారీయన. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ వైస్ ఛాన్స్‌లర్‌గా ఆంధ్రాయూనివర్సిటి తత్త్వశాస్త్ర శాఖలో ప్రొఫెసరుగా పనిచేశారు. ప్రస్తుతం యూనివర్సిటీ గ్రాంట్స్ వైస్ ఛైర్మన్‌గా పనిచేస్తున్నారు. ఇండియన్ ఫిలసాఫికల్ కాంగ్రెస్ ఛైర్మన్.

1988అక్టోబరులో చైనీస్ యూనివర్సిటీ ఆఫ్ బీజింగ్ తత్త్వశాస్త్రంలో అత్యున్నతమైన పట్టా.

1989లో రష్యా అకాడమీ ఆఫ్ సైన్సెస్ అత్యున్నత గౌరవపట్టా 'డాక్టర్ ఫిలసాఫియె ఆనరీస్‌కాసా' స్వీకరించారు. చైనా, రష్యా దేశాలనుండి ఈ విధంగా అవార్డులు పొందిన తొలి భారతీయుడు, ఆంధ్రుడూ వీరేనేమో! ప్రతిష్టాత్మకమైన **B. C.** రాయ్ అవార్డు పొందారు. కేంద్ర ప్రభుత్వం పద్మవిభూషణ్ (1984) అవార్డు ఇచ్చి వీరిని సత్కరించింది.

స్వర్గీయ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణ : తెనాలి తాలుకా పెదపాలెంలో జన్మించారు. ఇంగ్లాండ్‌లో **M. A;** వియన్నాలో **P.hd;** డిగ్రీలు పొందారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరరుగా, పిన్సిపాల్‌గా, రిజిష్టారుగా తనపదవీ బాధ్యతలను సమర్ధవంతంగా నిర్వహించారు. ఫలితంగా వీరిని విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరుగా సెనెట్ ఎన్నుకున్నది. ఆంధ్రాయూనివర్సిటీ వీరి హయాంలో బహుముఖాలుగా అభివృద్ధిని గాంచినది. ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తగా గుర్తింపు పొందారు. మంచి పాలనా దక్షులు, మేధావిగా కీర్తి పొందారు. '**V.S.** కృష్ణాగారు రాజకీయాలలో, ఆచార్య రంగాగారు ప్రొఫెసరుగా ఉంటే ఇంకా ఎంతో రాణించేవారని - శాఖలు పొరపాటున మార్పుకు గురయ్యాయనే'- నానుడి నాడు బహుళ ప్రచారంలో ఉండేది.

శ్రీ ఆవుల సాంబశివరావు :- బహుముఖ ప్రజ్ఞాశీలి. స్వేచ్ఛా పిపాసి. హైకోర్టు న్యాయమూర్తిగా, అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘం, జనతంత్ర సమాజ్ కార్యనిర్వహణా బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా - విశ్వవిద్యాలయ ప్రగతికి సోపానా లేశారు. స్వర్గీయ, త్రిపురనేని గోపిచంద్, కందుకూరి వీరేశలింగం స్మారక సంచికలకు సంపాదకులు. అసంఖ్యాకంగా ఉపన్యాసాలు, వ్యాసాలు, రేడియో ప్రసంగాలు చేశారు. 'త్రిపురనేని రామస్వామి (తెలుగుయూనివర్సిటీ ప్రచురణ), ప్రజలు-రాజ్యాంగం' తదితర గ్రంధ రచయిత. ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త అధ్యక్షునిగా సమర్థవంతమైన సేవలను అందించారు. ప్రగతిశీలి, మేధావి.

డాక్టరు కె. రాజారామమోహనరావు :- మద్రాసు మెడికల్ కళాశాల జనరల్ హాస్పటల్; వైజాగ్ మెడికల్ కళాశాల - కింగ్ జార్జి హాస్పటల్; గుంటూరు మెడికల్ కళాశాల ప్రభుత్వ హాస్పిటల్, ఉస్మానియా, రంగ రాయ మెడికల్ కళాశాలలో అనెస్తేషియా శస్త్ర చికిత్సలలో అసిస్టెంట్ ప్రొఫెసరుగా, సర్జరీలో క్లినికల్ ప్రొఫెసరుగా 22 సం॥పైగా పనిచేసి సుదీర్ఘమైన అనుభవాన్ని పొందారు. కొత్తగూడెం సింగరేణి కాలరీస్ హాస్పటల్సు ఛీఫ్‌సర్జన్ మెడికల్ ఆఫీసరుగా (5 సం॥లు), ఆంధ్రప్రదేశ్ శాఖకు - భారతీయ సర్జన్ల తరపున ఏక గ్రీవంగా ఎన్నుకోబడిన ప్రెసిడెంట్‌గా, సిద్ధార్థమెడికల్ కళాశాల ప్రిన్సిపాల్‌గా కడు అనుభవాన్ని సంపాదించారు. 1982 నుండి నాగార్జున విశ్వవిద్యాలయ వైస్ ఛాన్స్‌లర్‌గా పదవీబాధ్యతలు నిర్వహించారు. వీరి హయాంలోనే భూటాన్ రాజు ఇచ్చిన భూరి విరాళంతో 'మహాయాన విద్యాపీఠాన్ని' విశ్వవిద్యాలయంలో నెలకొల్పటమైనది.

శ్రీ కోనేరు రామకృష్ణారావు :— ప్రపంచ ప్రసిద్ధి పొందిన పారా సైకాలజిస్టు. ఆంధ్రవిశ్వవిద్యాలయ విద్యార్థిగా M A., (Hon's)Ph.D, మొదలగు ఉన్నత డిగ్రీలు పొందారు. అదే యూనివర్శిటీలో లైబ్రేరియను, లెక్చ రరుగా, ప్రొఫెసరుగా పనిచేశారు. ఆరోజులలో ప్రతిష్టాత్మకమైన రాక్ ఫెల్లర్ ఫెలోషిప్ పొందారు. చికాగోలో సైకాలజీలో ఉన్నత పరిశోధనలు చేశారు.

అతీంద్రియ మనో విజ్ఞానశాస్త్రంలో వీరి కృషిని ప్రపంచ దేశాలు ప్రశం సించాయి. వీరు-తన 34 వ యేటనే ఇంటర్నేషనల్ పారా సైకాలజిస్టుల సంఘ అధ్యక్షులైనారు. ఆసియాఖండంలోనే ఇంత పిన్నవయస్సులో అంత పెద్దపదవి పొందినవారు లేరు. తిరిగి 1978 లో ఆ పదవిని మళ్ళా అధిష్టించారు. శాస్త్ర, సాంకేతిక, విద్యాంశాలపై షుమారు 200 వరకు వారి రిపోర్టులు అంతర్జాతీయ జర్నల్సులో ప్రచురింపబడి-ఎనలేని ఖ్యాతిని ఆర్జించాయి. అమెరికా ఆహ్వానంపై 30 సం॥ సర్వీస్ వదులుకొని - ఆదేశంలో సైకాలజీ సంస్థకు డైరెక్టరుగా వెళ్ళారు. తిరిగి 1984లో తను చదివిన విశ్వవిద్యాలయానికే వైస్ ఛాన్సలర్‌గా వచ్చారు. తరువాత ఉన్నత విద్యాపరిషత్ అధ్యక్షులుగా ప్రభుత్వంచే నియ మింపబడ్డారు. ఉన్నత విద్యావ్యవస్థ తీరుతెన్నులను పరిశీలించే నిపుణుల సంఘ

అధ్యక్షునిగా పనిచేశారు. విశేష అనుభవం, అంతర్జాతీయ ఖ్యాతికలిగిన వీరు ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నారు.

డాక్టరు ఆలపాటి అప్పారావు :— ప్రస్తుత వ్యవసాయ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉన్న వీరు గుంటూరు జిల్లా - తెనాలి తాలూకా ఎడ్లపల్లిలో జన్మించారు. విద్యార్థి దశనుంచి మొదటిశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. అమెరికా కన్సస్ స్టేట్ యూనివర్సిటీలో ప్లాంట్ పాథాలజీలో పోస్ట్ డాక్టోరల్ పరిశోధనలు నిర్వహించారు. నాలుగుసార్లు యూనివర్సిటి బంగారుపతకాలు పొందారు. ఆయన ప్రతిభకు మురిసిన కన్సస్ యూనివర్సిటి - అప్పారావుగారికి కొన్ని సొసైటీలలో పూర్తి సభ్యత్వమిచ్చి గౌరవించింది.

'కాటన్ రీసెర్చి అసిస్టెంట్ మైకోలజీలో అసిస్టెంట్ లెక్చరరు, ప్లాంట్ పాథాలజీ లెక్చరరుగా, ప్రొఫెసరుగా, రీసెర్చి డైరెక్టరుగా. బేసిక్ సైన్సు కళాశాలకు ప్రిన్సిపాల్‌గా, 1981 లో మూడు మాసాలపాటు తాత్కాలిక విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షునిగా పలు బాధ్యతలను వీరు నిర్వహించారు. ప్రపంచ బ్యాంక్ (1982 - 1985) న్యూఢిల్లీ శాఖ - అగ్రికల్చరిస్టుగా కూడా వీరు పని చేశారు. అగ్రో సైన్సులో వీరు రచించిన 30 పత్రాలు ఆయా శాస్త్ర ప్రగతికి సహాయపడుతున్నాయి. పలుసార్లు ప్రపంచ వ్యవసాయ సమాఖ్యలలో పాల్గొన్న శాస్త్ర విజ్ఞానఖని ఆయన !

ఆచార్య తూమాటి దొణప్ప :— తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన శ్రీ దొణప్ప కళాసాహిత్య, సంస్కృతి విద్యారంగాలలో గొప్ప కృషీవలుడు. అనంతపురం జిల్లా రాకట్లలో జన్మించిన వీరు- వారి తాతగారి వద్ద చిన్ననాటనే సంస్కృతానభ్యసించారు. విద్యార్థి దశలో అనేక బంగారు పతకాలను ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి M.A; Ph.D, D.Litt, డిగ్రీలు పొందారు. పరిశోధనా ప్రియులు. భాషా విజ్ఞానం, శబ్దశాస్త్రం, సాహిత్యంలో అమోఘమైన కృషి చేశారు. ఆంధ్ర, నాగార్జున విశ్వవిద్యాలయాలలో లెక్చరరుగా, ప్రొఫెసరుగా - నాగార్జున విశ్వవిద్యాలయ ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్‌గా, రిజిష్ట్రారుగా పలు బాధ్యతలను నిర్వహించారు. కార్యనిర్వహణానుభవం నుండి తెలుగు విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులుగా సమర్థవంతంగా పనిచేస్తున్నారు. ప్రభుత్వం నుండి

ఉత్తమ ఆంధ్ర భాషాచార్యులుగా ప్రశంసా పత్రం - గౌరవాన్ని పొందినవీరు- 'భాషా చారిత్రిక వ్యాసావళి, ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణం, తెలుగులో కొత్త వెలుగులు, జానపద కళాసంపద, తెలుగు హరికథా సర్వస్వం' వంటి పరిశోధనా గ్రంథాలను వ్రాశారు. సాహిత్య - సంగీత అకాడమీలు,ఆంధ్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో అనేక పాఠ్యగ్రంథాలు వ్రాశారు. తెలుగు భాషా చరిత్ర, మాండలిక వృత్తి పదకోశం, తెలుగు జానపదాలు అందులో ముఖ్యమైన గ్రంథాలు.

ఆచార్య దావులూరి రామకోటయ్య :— అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన గణిత శాస్త్రజ్ఞులు. బీజ గణితంలో వీరి పరిశోధనలు - 'సమీపమయా'లపై ప్రత్యేక అధ్యయనం వీరి కీర్తిబావుటాను పండితలోకంలో ఎగురవేసింది. వీరు రచించిన పెక్కుగ్రంథాలు పలు విశ్వవిద్యాలయాలలో అధ్యయన గ్రంథాలు.

గుంటూరు జిల్లా పల్నాడులోని ఒప్పిచర్ల గ్రామంలో జన్మించిన వీరు విద్యార్థిదశనుంచి ఎన్నో స్వర్ణపతకాలను పొందారు. ఆంధ్రా యూనివర్సిటీలో గణితశాస్త్రాచార్యులుగా 16 సం॥ పనిచేసి నాగార్జున విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా ఆ శాస్త్ర వికాసానికి ఎంతో శ్రమించారు. ఉత్తమ ఆచార్య అవార్డు వీరికి ప్రభుత్వం ఇచ్చి సత్కరించింది. నాలుగు సం॥ ఇరాక్‌లో బస్రా విశ్వ విద్యాలయంలో పనిచేశారు. అంతర్జాతీయ సెమినార్లలో ఎన్నో పత్రాలను చదివారు. ముఖ్యంగా పశ్చిమజర్మనీలో వైజ్ఞానిక గోష్ఠులలో అనేక నూతనాంశాలను రూపొందించి, చర్చకు తెచ్చిన ఖ్యాతి వీరికున్నది. ప్రస్తుతం శైశవావస్థనుండి ఇంకా పూర్తిగా ఎదగని నాగార్జునా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవిలో వారు ఎంతో బరువు బాధ్యతలను వహించవలసిన స్థితిలో ఉన్నారు.

డాక్టరు లింగం సూర్యనారాయణ :— ఆంధ్రప్రదేశ్ వైద్య విశ్వవిద్యాలయం. భారత దేశంలోనే ప్రథమం. దానికి ఛాన్సలర్‌గా ముఖ్యమంత్రి **N.T.** రామారావును ఇటీవలనే యూనివర్సిటీ గ్రాంట్స్‌కమీషన్ ఆమోదించింది. దానికి ప్రస్తుతం ఉపాధ్యక్షులుగా ఉన్న డాక్టరు సూర్యనారాయణ 1926 లో గుంటూరులో జన్మించారు. అసిస్టెంట్ ప్రొఫెసరుగా, ప్రొఫెసరుగా, గుంటూరు కళాశాల ప్రిన్సిపాల్‌గా, వైద్య, ఆరోగ్యశాఖ అదనపు డైరెక్టరుగా, ఎంతో

అనుభవమున్న వీరు- కొంతకాలం వైద్య విశ్వవిద్యాలయ డైరెక్టరుగా కూడా పనిచేశారు. ప్రస్తుతం ఉపాధ్యక్షులుగా వైద్య విశ్వవిద్యాలయ పురోభివృద్ధికి పాటుపడుతున్నారు.

డాక్టరు పిన్నమనేని నరసింహారావు :— గుంటూరు మెడికల్ కళాశాల ప్రొఫెసరుగా, ప్రిన్సిపాల్‌గా విశేష అనుభం ఉన్న శ్రీ నరసింహారావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా కొంతకాలం పనిచేశారు.

డాక్టరు పి. లక్ష్మణరావు :— గుంటూరు ప్రభుత్వ హాస్పటల్ సూపరింటెంట్‌గా, వైద్య, ఆరోగ్య శాఖ సేవలలో అత్యున్నతమైన బాధ్యతలను నిర్వహించారు.

డాక్టరు యడ్లపల్లి వెంకటసుబ్బారావు :— ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో 1944 నుండి కడలూరు మదనపల్లి, మధుర మొదలగు ప్రదేశములలో గవర్నమెంట్ సర్జన్‌గా చేసి 1946లో గుంటూరుకు **A.D.M.O.**గా వచ్చినారు. పెద్దల సలహామేరకు రిజైన్ చేసి ప్రవేటు ప్రాక్టీస్ పెట్టినారు. అప్పటి బిషప్‌గారి సలహామేరకు గుంటూరు జిల్లా మిషనరీ హాస్పటల్స్‌కు ముఖ్య సలహాదారునిగా Kuglar Hospital, St Joseph హాస్పిటల్స్‌కు ఆనరరీ డాక్టరుగా పనిచేస్తూ ప్రాక్టీస్‌లో మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నారు. 1955 లో ఇటలీ వెళ్ళి ప్లాస్టిక్ సర్జరీలో ఉన్నత విద్య అభ్యసించి లక్ష్మీపురములో సంజీవి క్లినిక్ అను పేరిట స్వంత హాస్పిటల్ నిర్మించుకొన్నారు. 1967 లో జర్మనీ వెళ్ళి ప్లాస్టిక్ సర్జరీలో కొత్తగా వచ్చిన మెళుకువలు నేర్చుకొనివచ్చి వేల సంఖ్యలో ప్లాస్టిక్ సర్జరీ ఆపరేషన్‌లు చేసి ఆంధ్రదేశములో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నారు. 1967 నుండి మద్రాసు Cancer Institute Adiyar, V.H.S. మెడికల్‌సెంటర్ హాస్పిటల్స్‌కు ఆనరరీ ప్లాస్టిక్ సర్జన్‌గా వ్యవహరించారు. అమెరికానుండి వెలువడు International Plastic Surgery, Reconstructive Plastic Surgeory అనుమాగ్జన్స్‌లో అనేక వ్యాసాలు వ్రాసి అనేక విదేశీయుల చేత మన్ననలు పొందినారు. 1975 నుండి క్లినిక్ బాధ్యతలు క్రమేణా తన రెండవ కుమారుడు లక్ష్మణస్వామి **M.S. (Orth)** కు అప్పచెప్పి సాహిత్యముమీద అభిమానములో పట్టుదలతో సంస్కృతము పాళీ, తమిళము నేర్చుకొని మూల

గ్రంథములు చదివి ప్రస్తుతము వేదాంత గ్రంథములు, స్వీయ చరిత్ర రచించు చున్నారు. వీరి పెద్ద కుమారుడు Dr. Y. V. కృష్ణారావు M. S. (Gen) గవర్నమెంట్ సర్వీస్‌లో ఉన్నారు. ప్రొఫెసర్ చుండూరు వెంకటేశ్వరరావు M.S, Mch. (Plastic) వీరి అల్లుడు.

శ్రీ వెలగపూడి రామకృష్ణ :— రేపల్లె తాలూకా, బెల్లంవారి పాలెంలో 1896లో జన్మించారు. ఎడింబరు, ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీలనుండి M.A; B.Sc. పట్టాలు పొందారు. ఇండియన్ సివిల్ సర్వీస్ (1912) లో ఉత్తీర్ణులై - సబ్ కలెక్టరు, కలెక్టరు, పరిశ్రమల శాఖ డైరెక్టరు, లేబరు కమీషనరు, లేబరు ట్రిబ్యునల్ ఛైర్మన్, రీసెటిల్‌మెంట్ అండ్ ఎంప్లాయిమెంట్ శాఖ డైరెక్టరుగా మద్రాస్ ప్రభుత్వ డెవలప్‌మెంట్ కమీషనర్‌గా పలు బాధ్యతలను సమర్థవంతగా నిర్వహించి పదవీ విరమణ చేశారు.

గొప్ప పారిశ్రామికవేత్త. పార్లమెంట్ మాజీ సభ్యులు. (నియమించబడిన సభ్యుడు). కావేరి షుగర్స్ అండ్ కెమికల్స్ కంపెనీ, జయపూర్ ష్రైనింగ్ సిండికేట్, కె.సి.పి. లిమిటెడ్ - మేనేజింగు డైరెక్టరుగా, ఎ.సి.సి- ఛైర్మన్‌గా పనిచేశారు. ప్రపంచ దేశాల్ని పలుమార్లు పర్యటించారు. అనేక సంస్థల స్థాపనతో - పరిశ్రమల నిర్వహణతో వేలాదిమందికి ఉపాధిని సమకూర్చిన ప్రతిభా మూర్తి.

పద్మశ్రీ నూతక్కి భానుప్రసాద్ :— సుప్రసిద్ధ ఇంజనీరు. మెకానికల్, ఇండస్ట్రియల్ కెమికల్ ఇంజనీరింగులలో పెక్కు ఉన్నతమైన డిగ్రీలు ఉన్నవారు. ట్రాంబేలోని అణుశక్తి సంస్థలో C.I R U.S. రియాక్టరు ఇంజనీరింగ్ ఆపరేషన్స్ విభాగం, ప్రాజెక్ట్ మేనేజరుగా వున్నారు. పెట్రోలు, సహజవాయువు కమీషన్ (O.N.G.C.) డైరెక్టరుగా. వైజ్ఞానిక పారిశ్రామిక మండలి సభ్యులుగా, పెక్కు సంస్థలకు గౌరవ డైరెక్టరుగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మనుగా పనిచేస్తున్నారు. ప్రభుత్వం వీరిని 'పద్మశ్రీ'తో - జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం "డాక్టర్ అఫ్ సైన్సు హనోరిస్‌కేసా" ఇచ్చి సన్మానించాయి.

శ్రీ నార్ల తాతారావు :— కృష్ణా జిల్లా, కౌతారంలో జన్మించిన శ్రీ తాతారావు జాతీయ అంతర్జాతీయ కీర్తిని ప్రతిష్టను ఆర్జించారు. అమెరికా, ఇల్లినాయిస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ **M.S.** డిగ్రీ పొందినవీరు టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీలో ఉద్యోగిగా జీవితం ప్రారంభించారు. మధ్యప్రదేశ్ విద్యుత్ శాఖలో డివిజనల్ ఇంజనీరుగా, కంట్రోలర్‌గా, విద్యుత్ బోర్డు సెక్రెటరీగా, డిప్యూటి అనంతరం ఛీప్ ఇంజనీరుగా, చివరికి చైర్మన్‌గా పని చేశారు. కేంద్రప్రభుత్వ జలవిద్యుత్ కమీషన్ సభ్యులుగా, 1974 నుండి ఆంధ్ర ప్రదేశ్ విద్యుత్ బోర్డు చైర్మనుగా వ్యవహరిస్తున్నారు. సూపర్ ధర్మల్ స్టేషన్స్ కమిటీకి చైర్మను, భారత సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చి పరిషత్తులోని ఎనర్జీ రీసెర్చి శాఖకు చైర్మను. భారత హెవీ ఎలెక్ట్రికల్స్, ఆంధ్రాబ్యాంక్, ఆల్విన్ మెటల్ వర్క్స్, భారత అల్యూమినియం కంపెనీ తదితర సంస్థలకు డైరెక్టరు. కేంద్రీయ జలవిద్యుత్ సమితికి ప్రెసిడెంటు. బంగ్లాదేశ్ పవర్ డెవలప్‌మెంట్ బోర్డుకు అడ్వైజరు. అమెరికాలోని ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు సంస్థలలో, జనరల్ సైన్సు అసోసియేషన్ (SIGMAXI) లో గౌరవ సభ్యులు. శ్రీశైలం, నాగార్జున జలవిద్యుత్ కేంద్రాలు, విజయవాడ ధర్మల్ స్టేషన్ సాధించిన అభివృద్ధి అంతర్జాతీయ పరిగణనను పొందింది. భారత ప్రభుత్వం 1983 లో పద్మశ్రీ ఇచ్చి వీరిని సన్మానించింది. 1987 లో "ఓం ప్రకాశ్ భాసెస్ అవార్డు" 50 వేల రూపాయల నగదు ప్రశంసాపత్రం వీరికి ఇవ్వబడ్డాయి.

శ్రీ యలమంచిలి కృష్ణారావు :— కృష్ణా జిల్లా గొడవర్రులో సాధారణ రైతు ఇంట్లో జన్మించారు. అమెరికా సియోటెక్‌లోని వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో మెటలార్జికల్ ఇంజనీరింగు శాఖలో ప్రొఫెసరు. అనేక ఫెలోషిప్స్ పొందారు విద్యార్థిగానే. ఇన్‌లాండ్ స్టీల్ కంపెనీ – షికాగోలో పరిశోధనా శాలలో చేరారు. 'కాస్టింగ్ ఆఫ్ స్టీల్', 'స్లాగ్ ల్యూబ్రికెంట్స్' రెండు పేటెంట్లు ఆయన పేరుతో ఉన్నాయి. పశ్చిమ ఐరోపాలో అనేక విశ్వవిద్యాలయాలలో ప్రసంగాలు చేశారు. 80 కి పైగా పరిశోధనా వ్యాసాలు శాస్త్ర విజ్ఞాన సదస్సుల్లో చదివారు. 'న్యూకొలంబియా ఎన్ సైక్లోపెడియా' సంపాదకునిగా, కేంబ్రిడ్జి యూనివర్సిటి ప్రెస్ ప్రచురించిన 'స్టాయీ క్రిమో మిక్రేటే శీ థెర్మో డైనమిక్స్

ఆఫ్ మెటలర్జికల్ ప్రాసెసెస్' వెయ్యి పేజీల ఉద్గ్రంథ రచయితగా ప్రఖ్యాతి పొందారు.

అమెరికన్ కెమికల్ సొసైటీ, జపాన్ ఐరన్ అండ్ స్టీల్ ఇన్‌స్టిట్యూట్ సొసైటీ ఆఫ్ సిగ్మా XI లో సభ్యులు. కెనడా, పశ్చిమ జర్మనీల విజిటింగ్ ప్రొఫెసరు. ప్రతిష్ఠగాంచిన 'జర్నల్ ఆఫ్ మెటల్స్' కు ఎడిటోరియల్ ఎడ్వైజరు. వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో 'ప్రొమోషన్స్ అండ్ టెన్యూర్ కమిటీ' ఛైర్మన్. ఫిజికల్ కెమిస్ట్రి కమిటి ఆఫ్ ఎక్‌స్ట్రాక్టివ్ మెటలర్జీ సెక్షన్ ఆఫ్ ది మెటలర్జీ సొసైటీ— A.I.M E కి ఛైర్మన్. ఆ మేధావి మన తెలుగు బిడ్డ కావడం మన కెంతో గర్వకారణం.

డాక్టర్ యలవర్తి నాయుడమ్మ :— గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా యలవర్రులో జన్మించారు (1922). చర్మానికి చెందిన సాంకేతిక శాస్త్రంలో ఇంగ్లాండ్‌లో ఒక సం॥ ఉన్నత శిక్షణ పొందారు. అమెరికాలో ఉన్నత చదువులు పూర్తిచేశారు. M Sc Ph.D. మద్రాసు కేంద్ర చర్మ పరిశోధనా సంస్థలో పనిచేస్తూ, ఆ సంస్థ అధ్యక్షునిగా ఎదిగారు. వీరి కృషివల్ల ఆ పరిశోధనామండలి 48 శాఖలుగా మన దేశంలో విస్తరించినది. చర్మ సాంకేతిక శాస్త్రంపై అనేక గ్రంథాలు వ్రాశారు. బరోడా విశ్వవిద్యాలయ సన్మానం, రాజ్యలక్ష్మీ ఫౌండేషన్ అవార్డు, బారత ప్రభుత్వంచే 'పద్మశ్రీ' మొ॥ అనేక ప్రశంసలు, అవార్డులు పొందారు. C.S.I.R ఛైర్మన్‌గా కొంతకాలం పనిచేశారు. ప్రపంచ మొత్తం 40, 50 సార్లు పర్యటించారు. ఈ ప్రతిభాశాలి విమాన ప్రమాదంలో అకాల మరణానికి గురికావడం మన దురదృష్టం. సిరామిక్‌డైల్స్ ఉత్పత్తి చేస్తున్న "స్పార్టెక్స్" సంస్థ - Dr. నాయుడమ్మ సంస్మరణార్థం ప్రతియేటా ఒక ఉపన్యాసాన్ని ఏర్పరచే నిమిత్తం హైదబాద్ అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీకి ఒక లక్షరూపాయలు గ్రాంటు యివ్వడానికి నిర్ణయించింది. భారత్ జపాన్ మైత్రీ సంఘం తెనాలిశాఖ నాయుడమ్మ పేర ఏర్పాటుచేసిన అవార్డు ఈ సం॥ డా॥ U. V. వర్లు పొందారు.

శ్రీ దేవభక్తుని రామస్వామి :— పెదపూడి, తెనాలి తాలూకాలో జన్మించారు. ప్రస్తుతం 'ఆరో నేషనల్ లాబొరేటరీ' - అమెరికాలో పనిచేస్తున్నారు.

'ఉప్పునీటిని మంచినీటిగా మార్చే ప్రక్రియ, చెత్తాచెదారంతో ఉత్పత్తి' విధానాలను కనుగొన్న గొప్ప ఇంజనీరు. అమెరికా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమికల్ ఇంజనీర్స్' ఫెలోషిప్ గౌరవాన్ని పొందారు. అమెరికన్ బయోగ్రాఫికల్ ఇన్‌స్టిట్యూట్ - అత్యంత ప్రతిష్ఠాత్మకమైన 'ఇంటర్నేషనల్ డైరెక్టరీ ఆఫ్ డిస్టింగ్విష్డ్ లీడర్‌షిఫ్ హాల్ ఆఫ్ ఫేమ్' జాబితాలో వీరి పేరును నమోదు చేశారు. ప్రతిభాశాలిగా పేరు ప్రఖ్యాతులను ఆర్జించారు.

శ్రీ మైనేని హరిప్రసాదరావు :— అణుశక్తి విభాగంలో విఖ్యాతి గాంచారు. వీరిసేవలను పురస్కరించుకొని భారత ప్రభుత్వం 'పద్మవిభూషణ్' తో గౌరవించింది.

శ్రీ వెలగపూడి ప్రబాకర చౌదరి :— అమెరికా, మేరిలాండ్‌లోని జెనెటికల్ ఇంజనీరింగ్ డివిజన్, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్‌హెల్త్‌లో హెడ్‌గా పనిచేశారు. వీరు కనుగొన్న ఎంజైమ్స్ వీరి కీర్తి బావుటాను ఎగరేసింది. యావత్ అమెరికా ఆసక్తిని చూపింది. ప్రస్తుతం ఢిల్లీలో జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటి - బయోకెమిస్ట్రి ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు.

## వనితారత్నాలు

1922 పన్నుల నిరాకరణోద్యమం ముమ్మరంగా ఉన్నది. ఒంగోలు సబ్‌కలెక్టరు శ్రీ అక్బర్‌హైదర్ మద్దిరాల, ముప్పాళ్ళ (గుంటూరు జిల్లా) గ్రామాల కొచ్చారు. పన్ను చెల్లించని వారి ఆస్తులను జప్తుచేస్తున్నారు. అందులో భాగంగా ఒకరైతు ఇంటినుండి ఒక పెట్టె తీసుకొని బండిలోపెట్టుకొని వెళ్తున్నారు. అప్పుడు ఆరైతు భార్య శ్రీ చిగురుపాటి చిన్నమ్మి బండినాపి, కలెక్టరు ఉన్న బండిని కదలనీయలేదు. గత్యంతరం లేక పెట్టె ఇచ్చి వెళ్ళాడు కలెక్టరు. ఇదంతా పోలీసులు, మిలటరీ సమక్షంలోనే జరిగింది. ఆమె చదువుసంధ్యలులేని సామాన్య గృహిణి. ఆమెను గుర్తు చేసుకొంటూ మిగిలిన విదుషీమణుల పరిచయాన్ని సాగిద్దాం.

శ్రీమతి మాగంటి అన్నపూర్ణ :— 'అచంచల విశ్వాసమూ, పౌగడ్త, ప్రతిఫలము కోరని సేవాతత్పరతా గల నాప్రియ పుత్రిక మరణించింది.

లక్షలాదిస్త్రీలు ఆమెచూపిన మార్గాన నడుస్తారు'-అని బాపూజీ ప్రశంసలనుపొందిన మాగంటి అన్నపూర్ణ. అంకినీడు గారి భార్య. కలకత్తా బెథూన్ కాలేజీలో చదువుకున్న మహిళ. స్వరాజ్య నిదికి వంటినున్న నగలన్నింటిని ఇచ్చిన త్యాగశీలి ఆమె.

శ్రీమతి భారతీ దేవిరంగా :— ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో - ఆర్ట్స్ కళాశాలలో చదివారు. అఖిలభారత కిసాన్ సమ్మేళన్ సభ్యురాలు. స్వాతంత్రోద్యమ కాలంలో జైలు కెళ్ళారు. కాకినాడ ఆంధ్ర రాష్ట్ర రాజకీయ మహిళాసభల ప్రారంభకులు ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం, అఖిల భారత రైతుసంఘం అధ్యక్షురాలు ఆంధ్ర రాష్ట్ర మహిళా సభ అధ్యక్షురాలు.

శ్రీమతి కొత్త లక్ష్మీ రఘురాం B.A. :— అఖిల భారత మహిళా సభ (ఢిల్లీ శాఖ) అధ్యక్షురాలు, ఆంధ్ర వనితామండలి కోశాధికారి. అఖిలభారత గ్రామీణ మహిళాసంస్థకు ఉపాధ్యక్షురాలు. ప్రపంచ మహిళా సంస్థ వ్యవహారాలతో అవినాభావ సంబంధంగల విదుషీమణి. 'ఆంధ్ర మహిళాపత్రిక' సంపాదకురాలు. 'సింగినాదం, మనతోమనమాట, మొగలిపొట్లం' మొదలగు గ్రంథాలను రచించారు.

శ్రీమతి యెర్నేని సీతాదేవి :— ఢిల్లీ యూనివర్శిటి పొలిటిక్స్ ప్రొఫెసర్ యన్. శ్రీనివాసన్ కుమార్తె. కాన్వెంట్ చదువు, B.A. ప్రైవేట్‌గా చదివి ఉస్మానియా నుండి పట్టాపొందారు. ముదినేపల్లి నియోజకవర్గం నుండి 1985లో శాసనసభ్యురాలయింది. 1989లో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామంత్రిగా ఎదిగింది. వీరి హయాంలో ఇంకా ఎక్కువగా విద్యాభివృద్ధి జరుగుతుందని ఆశిద్దాం.

శ్రీమతి తేళ్ళ లక్ష్మీకాంతమ్మ :— మాజీమంత్రి. కమ్యూనిస్టుగా - సోషలిస్టుగా - కాంగ్రెస్ - జనతా - ఇందిరా కాంగ్రెస్ పార్టీలలో పనిచేశారు. రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించారు.

శ్రీమతి నన్నపనేని రాజకుమారి :— తెలుగుదేశం శాసన సభ్యురాలిగా ఎన్నికై - ఆ పార్టీకి రాజీనామా ఇచ్చి ప్రజాస్వామ్య తెలుగుదేశం నాదెండ్ల భాస్కరరావు మంత్రివర్గంలో మంత్రిణిగా నెలరోజులు పనిచేశారు. ప్రస్తుతం ఇందిరా కాంగ్రెసులో ప్రముఖురాలు.

శ్రీమతి డి. ఇందిర :— ఆలపాటి వెంకట్రామయ్యగారి అమ్మాయిగా రాజకీయాలలో ప్రవేశించి, అనతికాలంలోనే దొడ్డపనేని ఇందిరగా వ్యక్తిత్వాన్ని సాధించింది. శాసనసభ్యురాలిగా, గుంటూరు జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా ప్రజా సమస్యల పరిష్కారానికై పాటుపడ్డారు. భారతదేశం తరపున నలుగురు సభ్యుల బృందంలో ప్రతినిధిగా ఐక్యరాజ్యసమితిని దర్శించింది. ఒక జిల్లాపరిషత్ సభ్యురాలిగా, ఆ అవకాశం పొందిన భారతదేశంలోనే తొలి మహిళామణి ఈమె. ఆమె ఆకస్మిక మరణంతో ఒక సౌజన్యమూర్తిని కోల్పోయాం.

శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మమ్మ, B.A, L.L B. :— మద్రాసులో లాయరుగా, అఖిలభారత మహిళా సంమ సభ్యురాలిగా, ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్ తొలి సభ్యుల బృందంలో ఒక్కర్తెగా విధి నిర్వహణ చేశారు.

శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి :— వీరులపాడులో జన్మించారు. చాల కాలం నుండి 'తెలుగుదేశం' వారపత్రిక సంపాదకురాలై హైద్రాబాద్ నుండి నడుపుతున్నారు.

శ్రీమతి రాజ్యం సిన్హా :— శ్రీ అన్నె అంజయగారి కుమార్తె. 'మాతృభూమి' పత్రిక సంపాదకురాలు. ప్రగతిశీల దృక్పథం కలవారు. పబ్లిక్ రిలేషన్స్ డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు.

శ్రీమతి చంద్ర సావిత్రి :— చంద్ర రాజేశ్వరరావుగారి సహధర్మచారిణి 1948 ప్రాంతంలో రాజకీయంగా అజ్ఞాతవాసాన్ని చేశారు. క్రియాశీల రాజకీయాలలో పాల్గొన్నారు. మహిళా ఉద్యమాలతో అనుబంధమున్న మూర్తి.

శ్రీమతి మానికొండ సూర్యావతి :— ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం, అధ్యక్షురాలు.

శ్రీమతి మోటూరి ఉదయం :— ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం కార్యదర్శిగా పనిచేస్తున్నారు. శ్రీమతి ద్రోణవల్లి అనసూయ, శ్రీమతి చంద్ర రాజకుమారి. (చంద్ర రామలింగయ్యగారి అమ్మాయి) మహిళా ఉద్యమాలలో క్రియాశీలకమైన పాత్ర వహిస్తున్నారు.

శ్రీమతి కొత్త రంగమ్మ (సుగుణ) **M.A; K.** సుబ్రమణ్యేశ్వరి- విద్యా శాఖాధికారిణులుగా పనిచేశారు. శ్రీమతి మూల్పూరు చుక్కమ్మ, శ్రీమతి కలగర పిచ్చమ (మాగంటి అన్నపూర్ణగారి తల్లి) దేశసేవికలుగా పేరు తెచ్చుకున్నారు.

విద్వాన్ అట్లూరి సీతమ్మ జాతీయోద్యమంలో బాగా ప్రచారం చేశారు. మహిళాసమాజాల ద్వారా శ్రీమతి ఆవుల జయప్రద, జాగర్లమూడి గంగాదేవి, శ్రీమతి జంపాల రత్నమాణిక్యమ్మ, కొత్త బుచ్చెమ్మ జంపాల పద్మావతీదేవి, శరణు కరుణాదేవి, శ్రీమతి ఈడ్పుగంటి బాపమ్మ (గుడివాడ), శ్రీమతి త్రిపురనేని సాధువమ్మ (సత్తెనపల్లి) పరుచూరి లలితకుమారి మొదలగువారు వృత్తివిద్యలు, హిందీభాషా వ్యాప్తికి ఎంతో సేవ చేశారు. శ్రీమతి పాటిబండ్ల కోటమ్మ, వాసిరెడ్డి రాజ్యలక్ష్మి స్వరాజ్యనిధికి తమ నగలను సమర్పించారు. శ్రీమతి నూతేటి పద్మావతి, కొత్త సత్యవతి, ఝాన్సీబాబు, జాన్సీ లక్ష్మీబాయి, ఝాన్సీ వాణిబాబు, తదితరులు డాక్టర్లుగా తొలి తరంలో బాగా పేరు ప్రఖ్యాతులు పొందారు.

నేడు డాక్టర్లుగా, లెక్చరర్లుగా, ఉన్నత ఉద్యోగినులుగా పలుశాఖలలో అసంఖ్యాకంగా కమ్మ మహిళామణులు పనిచేస్తున్నారు.

శ్రీమతి అమరేశ్వరి :— అప్పికట్లలో జన్మించారు. లాయరు వృత్తిలో ప్రఖ్యాతిపొంది నేడు హైకోర్టు న్యాయమూర్తిగా వెలుగుతున్నారు.

శ్రీమతి ఎ. వనజాక్షి :— ఉన్నత విద్యాశాఖ డైరెక్టరుగా పనిచేస్తున్నారు. ప్రిన్సిపాల్‌గా ప్రారంభమై అనేక పదవులను సమర్థవంతంగా నిర్వహించిన విదుషీమణి. స్త్రీ సంక్షేమ డైరెక్టరుగా, సమాచారశాఖా డైరెక్టరుగా కూడా వీరు పనిచేశారు. శ్రీమతి హేమలతగారు విద్యాశాఖలో ఉన్నత బాధ్యతలను నిర్వహిస్తున్నారు.

కుమారి వాసిరెడ్డి సీతాదేవి :— గొప్ప నవలా రచయిత్రి. వీరు వ్రాసిన 'మరీచిక' ఆంధ్రప్రభుత్వంచే నిషేధానికిగురై, మేధావుల విమర్శవల్ల ప్రభుత్వం తిరిగి ఆ పుస్తకాన్ని అనుమతించడం జరిగింది. ఆంధ్ర ప్రభుత్వంలో బాలల అకాడమీకి డైరెక్టరుగా పనిచేస్తున్నారు.

**Prof.** తమ్మారెడ్డి నిర్మల: నాగార్జున యూనివర్సిటీలో తెలుగు శాఖాధిపత్యం వహిస్తున్నారు. శ్రీమతి కె. శారద, ఆంధ్రా యూనివర్సిటీ గ్రంథాలయంలో పని చేస్తున్నారు. డాక్టర్ తేళ్ళ సత్యవతి, యూనివర్సిటీలో తెలుగు శాఖలో లెక్చరరుగా పనిచేస్తున్నారు.

శ్రీమతి యస్.పి. ఝాన్సీరాణి, శ్రీమతి టి. కల్పనాదేవి శ్రీమతి రేణుకా చౌదరి, కాట్రగడ్డ ప్రసూన, మొదలగువారు పార్లమెంట్‌లో శ్రీమతి నీరుకొండ వెంకటరత్నమ్మ, మానుకొండ సూర్యావతి, గోగినేని భారతీదేవి, డి. ఇందిర తదితరులు రాష్ట్ర శాసనసభలలో సభ్యులుగా- రాజకీయరంగంలో పన్నె కెక్కారు.

రచనా వ్యాసంగాలలో స్త్రీలు ముందంజ వహిస్తున్నారు. వారిలో కొంతమందిని ఇచ్చట పేర్కొనటమౌతున్నది.

శ్రీమతి అరిగెపూడి కౌసల్యాదేవి :— శంఖుతీర్థం, చక్రభ్రమణం, చక్రనేమి, చక్రవాకం తదితర నవలలను రచించి - తెలుగు పాఠకలోకాన్ని ఉర్రూతలూగించారు.

శ్రీమతి పి. లలితకూమారి (వోల్గా) :— మంచి అభ్యుదయ కవయిత్రి, 'స్వేచ్ఛ'వంటి ఆలోచనాత్మక నవలలను రచించారు

శ్రీమతి బొప్పలపూడి అనసూయాదేవి :— బాపట్ల తాలూకా, రేటూరుకు చెందిన వీరు మంచి కవయిత్రి.

శ్రీమతి జంపాల నాగశిరోమణి, శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం, శ్రీమతి యార్లగడ్డ సరోజినీదేవి తదితర నారీమణులు నవలా రచయిత్రులుగా, పేరు ప్రఖ్యాతులను పొందుతున్నారు.

డాక్టరు॥ వేగ కోటేశ్వరమ్మ **M.A, Ph.D.** విజయవాడ మాంటిస్సోరి సంస్థాపన దగ్గరనుండి ఆ స్కూల్‌ను డిగ్రీ స్థాయి, పోస్ట్ గ్రాడ్యుయషన్, టీచర్స్ ట్రైనింగ్ (**B.Ed**) స్థాయివరకు అభివృద్ధి చేశారు. 'ఇల్లూ-ఇల్లాలు' పత్రికా సంపాదకురాలు. మంచి రచయిత్రి, సంఘసేవకురాలు.

డాక్టరు॥ నన్నపనేని మంగాదేవి M.A; Ph.D. గుంటూరు శ్రీ వెంక టేశ్వర బాలకుటీర్ వంటి విద్యా సంస్థల స్థాపన- అద్భుత నిర్వహణ చేస్తున్న వారు మాస్కోలో విద్యాభ్యాసం చేశారు. ఎన్నో ప్రభుత్వ పురస్కారాలను, ప్రశంసలను పొందారు. 'వేగుచుక్క' లెనిన్ కథ, హెలెన్‌కీలర్, ఆటలు- పాటలు వంటి అనేక పుస్తకాలు వ్రాసిన బాలల రచయిత్రి- సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత.

శ్రీమతి బొందలపాటి శకుంతలాదేవి- శరత్ సాహిత్యాన్ని తెలుగువారికి అందించడంలో దేశికవితా డిస్ట్రిబ్యూటర్స్ ద్వారా కృషిచేసినవారు. శ్రీమతి వాసిరెడ్డి కనకదుర్గ వంటివారు భరతనాట్యంలో జాతీయస్థాయి గుర్తింపు పొందారు.

శ్రీమతి పత్తిపాటి వెంకాయమ్మ B.A;B.L. పెదనందిపాడు ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల కార్యదర్శిగా, శ్రీమతి రాజేశ్వరీ రామకృష్ణన్, జయపూర్ సుగర్ కంపెనీ లిమిటెడ్, చాగల్లు, మేనేజింగ్ డైరెక్టరుగా కార్యనిర్వహణా భాగాన్ని చక్కగా నిర్వహిస్తున్నారు. అనకాపల్లి ప్రాంతీయ వ్యవసాయ పరిశో ధనా కేంద్రం ప్లాటినమ్ జుబ్లి సందర్భంగా— ప్రముఖ పారిశ్రామికవేత్తగా 'శర్కరకళాపూర్ణ' బిరుదు పురస్కారాన్ని శ్రీమతి రాజేశ్వరిగారు ఇటీవల పొందారు. వీరు తమ తండ్రి పేరిట నిర్మించిన శ్రీ వెలగపూడి రామకృష్ణ స్మారక కళాశాల, (నగరం)- కార్యదర్శిగా కూడా వ్యవహరిస్తున్నారు.

విభిన్న రంగాలలో, భిన్న బాధ్యతలతో- నేటి మహిళాలోకం పురోభి వృద్ధి దిశగా పయనిస్తుంది. యశచ్చంద్రికల వెలుగులో ప్రకాశిస్తున్నది.

## కమ్మవారి వ్యాపారసంస్థలు

పలువ్యాపారాలలో కమ్మవారు వాసికెక్కారు. కొయంబత్తూరు ప్రాంతంలో ఇండస్ట్రీస్,-బట్టల మిల్లుల వివరాలు తమిళనాడులో కమ్మవారు అన్న అంశంలో వివరించడమైనది.

19వ శతాబ్దంలో శ్రీ గద్దె కోటయ్యనాయుడు, శ్రీ వేములపల్లి వీరయ్య

నాయుడు నీలిమందు వ్యాపారం చేశారు. కృత్రిమరంగులు వినియోగంలోకి రావడంతో ఈ వ్యాపారము, వ్యవసాయము రద్దయ్యాయి.

జమ్ములపాలెం వాస్తవ్యులు శ్రీ పంగులూరి సుబ్బారావు బారిస్టరు, ఆంగ్ల వనితను వివాహమాడి ఆదేశంలోనే పొగాకువ్యాపారం చేశారు. అక్కడే మరణించారు. ప్రస్తుతం పొగాకు వ్యాపారంలో నవభారత్ కంపెనీ శ్రీ అల్లూరి సత్యనారాయణ చౌదరి, బెస్ట్ ఇండియా టుబాకోకంపెనీ శ్రీ వెంపరాల వెంకటేశ్వర్లు, ఈస్ట్ఇండియా టుబాకోస్ శ్రీ తాడి కొండప్రకాశరావు, జయలక్ష్మి టుబాకోస్ శ్రీ రాయపాటి సాంబశివరావు, కందిమళ్ళ కంపెనీ, శ్రీ కందిమళ్ళ రాఘవయ్య - రామమూర్తి, శ్రీ చేబ్రోలు హనుమయ్య, శ్రీ ఘంటా గోపాలకృష్ణ గార్లు ప్రముఖులుగా రాణిస్తున్నారు. దుగ్గిరాలలో నిమ్మకడ్డ వంశీకులు పసుపు విక్రయ సంస్థలలో పేరొందారు. శ్రీ తుమ్మల జగన్మోహనరావు పసుపు వ్యాపారంలో ప్రసిద్ధులైయ్యారు.

కాటన్ జిన్నింగ్ మిల్స్ శ్రీ ధనలక్ష్మి, శ్రీ గోరంట్ల పరంధామయ్య, పేరేచర్ల జయలక్ష్మి కాటన్ మిల్స్ పేరుబడ్డ సంస్థలు.

ఆయిల్, బాయిల్డ్ రైస్ మిల్స్‌లో ధనలక్ష్మి, గోరంట్ల పరంధామయ్య, జయలక్ష్మి మిల్లులు పేరొందాయి.

సినిమా స్టూడియోలు, సినిమా నిర్మాణం, డిస్ట్రిబ్యూటర్స్‌లో నేటికి కమ్మవారిదే పెత్తనం. ఆంధ్రప్రదేశ్‌లో సినిమాహాళ్ళ నిర్మాణంలో కూడా వీరిచే పైచెయ్యిగా ఉన్నది.

బొగ్గు, ఎరువులు, కలప, వెండి, బంగారు టోకువర్తకంలో అనేకమంది ప్రసిద్ధిపొందారు. హోటల్స్, కాంట్రాక్టర్లు, రంగాలలో కమ్మవారు అగ్రశ్రేణిలోనే నిలిచారు. పాపులర్ షూమార్టు ద్వారా ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధిచెందారు. శ్రీ చుక్కపల్లి పిచ్చయ్యగారు ఇంజనీరింగు వస్తువిక్రయశాలలలో శ్రీ చోడే నారాయణరావు, అప్పారావు(కాకినాడ) శ్రీ యార్లగడ్డ వెంకన్నచౌదరి(మద్రాసు) ప్రసిద్ధులైనారు. ఓడలు వ్యాపారంలో ఎగుమతి - దిగుమతి వ్యాపారంలో శ్రీ యార్లగడ్డ రంగనాయకులు (కారంచేడు) ప్రఖ్యాతి పొందారు.

శ్రీ అంచూరి సుబ్బారాయుడు, శ్రీ గోగినేని పిచ్చయ్య, శ్రీ వెంకట సుబ్బయ్య శ్రీ వెంకటేశ్వర్లు మైకా వ్యాపారంలో నెల్లూరు జిల్లాలో బాగా ఆర్జించారు.

రాయగడ, ఉయ్యూరు, చాగల్లు, తణుకులలో పంచదార మిల్లులు, విజయవాడ మాచర్లలో సిమ్మెంటు ఫ్యాక్టరీలు కమ్మవారు నిర్మించారు. శ్రీ వెలగపూడి రామకృష్ణ, చల్లపల్లి రాజా, ముళ్ళపూడి తిమ్మరాజు, హరిశ్చంద్ర ప్రసాద్‌లు వీటి నిర్మాణంలో నిర్వహణలో పేరొందారు. తణుకులో రాకెట్ ఇంధన తయారిని భారతదేశంలోనే మొదటిసారిగా శ్రీ హరిశ్చంద్రప్రసాద్ ప్రారంభించారు. శ్రీ అక్కామాంబ టెక్స్టయిల్స్, రసాయన మిల్లులను శ్రీ తిమ్మరాజుగారు స్థాపించారు. రైస్‌మిల్లుల స్థాపనలో శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య ప్రత్యేకంగా కృషి చేశారు.

కీ॥ శే॥ శ్రీ తుమ్మల వల్లభయ్య కూచిపూడి ఇతర రాష్ట్రాలకు బియ్యం ఎగుమతి వ్యాపారాన్ని మొట్టమొదట చేపట్టారు. రైస్‌మిల్లర్స్ అసోసియేషన్స్ ప్రెసిడెంట్‌గా వారికి చాల అనుభవమున్నది.

శ్రీ కె.బి.అర్. చౌదరి రామదాస్ మోటార్స్ లిమిటెడ్ ద్వారా పార్శిల్ సర్వీస్‌లో గణనీయులైనారు. ఆటోమోబైలు రంగంలో కమ్మవారు బాగా స్థిరపడ్డారు.

శ్రీ ఈదుపుగంటి సత్యనారాయణ - కోరమండల్ పెయింట్స్ మరియు కెమికల్స్, శ్రీ ఎ.వి.రావు (వెంకటేశ్వరరావు)కు చెందిన మెస్సెర్స్ ఏ.వి.ఆర్. అండ్‌కో (మొలసిన్‌ను ఎగుమతి చేస్తున్నది). ఇవి రెండు విశాఖపట్నంలో నెలకొల్పబడ్డాయి.

విజయవాడ సిరామిక్ టైల్స్- స్పాట్రెక్స్‌ను శ్రీ త్రిపురనేని కృష్ణప్రసాద్ నిర్వహిస్తున్నారు.

వైజాగ్ ఉడా ఛైర్మన్ శ్రీ యం.వి.యస్. మూర్తి- గోల్డ్ స్పాట్ మూర్తిగా వ్యాపారంలో ప్రసిద్ధులు. కోటిన్నరతో నిర్మించబడిన డాల్ఫిన్ హోటల్‌ను శ్రీ యం. అప్పారావు నిర్వహిస్తున్నారు.

దిన వారపత్రికలరంగంలో శ్రీ కె.యల్.యన్. ప్రసాద్, శ్రీ చెరుకూరి రామోజీరావులుప్రఖ్యాతివహించారు. ప్రియాపచ్చళ్ళు, సోమాడ్రింక్స్, మార్గదర్శి చిట్ ఫండ్స్ ద్వారా శ్రీ రామోజీరావు విపరీతంగా వ్యాపారంలో ఎదిగారు.

ఇంజనీర్లు శ్రీ మాగంటి వెంకటరమణరావు(M.I.C. ఎలెక్ట్రానిక్స్‌సిస్టమ్స్ ప్రైవేట్ లిమిటెడ్), శ్రీ దాసరి రామకృష్ణ (ఎలెక్ట్రానిక్స్ ప్రైవేట్ లిమిటెడ్) విజయవాడలో కంప్యూటర్స్, ఎలెక్ట్రానిక్ డిస్ప్లేలు తయారుచేస్తున్నారు.

శ్రీ మాగంటి రవీంద్రనాధ్ చౌదరి ఆరక్ వ్యాపారంలో బాగా ఆర్జించారు. సినీ నిర్మాతగాకూడా విజయాలను చవిచూచారు.

పుస్తక ప్రచురణ రంగంలో నవోదయా, స్టూడెంట్స్ బుక్ సెంటర్, దేశికవితామండలి, ఆదర్శ గ్రంథమండలి ఎంతో పురోగమించాయి. ఫైనాన్స్ కంపెనీలు, రెసిడెన్షియల్ కాలేజీలు, హాస్పటల్స్, అనేక గృహోపకరణముల విక్రయశాలలు, మందులషాపులు- ఎరువులు- క్రిమిసంహారక మందులు తదితర వ్యాపారాలలో కమ్మవారు ఎక్కువగా పాల్గొంటున్నారు.

## సమాజచాలకులు - సంపాదకులు

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు :— తెలుగునాడులో 'సంపాదకీయాని'కొక ప్రాముఖ్యతను సంతరించి పెట్టినవ్యక్తి. ఈ విషయంపై నార్లవారి స్పందన ఏ విధంగా ఉంటుందో ? అని సమస్య ఎదురైనప్పుడల్లా నార్ల సంపాదకీయానికై ప్రజ ఎదురుచూసేటట్లు విశిష్టతను సమకూర్చుకున్న ధన్యమూర్తి వీరు. ఆంధ్రప్రభ ముఖ్యసంపాదకులుగా, ఆంధ్రజ్యోతి స్థాపనా సంపాదకులుగా పని చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్‌తో వీరిని సన్మానించింది. రెండుసార్లు రాజ్యసభ సభ్యునిగా కొనసాగారు. పదునైన వ్యాఖ్యకు, విమర్శకు వినూత్న శీర్షికలకు ఆయనకాయనేసాటి. ప్రతిభామూర్తులను గుర్తించి ప్రోత్సహించిన ఘనులు. జాతీయవాది రాయలసీమ కరువు, గోదావరి వరదబాధితుల నిధికి లక్షరూపాయలు పోగుచేసిఇచ్చిన కార్యశీలి. మంచివక్త, బహుగ్రంథకర్త, సాహిత్య అకాడమీ సభ్యులు, పురాతత్వశాఖ సలహా సభ్యులు, నిష్కర్షకు, విజ్ఞానానికి మారుపేరు, స్వేచ్ఛా పిపాసి, హేతువాది, అన్నింటికీమించి మానవతావాది,

శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు, శ్రీ మోటూరి హనుమంతరావు, శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు:— విశాలాంధ్ర, జనశక్తి పత్రికా సంపాదకులు, కమ్యూనిస్టు, అభ్యుదయ సాహిత్యం- భావాలను యువతరంలో విశేషంగా కల్పించిన సంపాదకులు.

శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ :— తీసుకున్న విషయంమీద అసాధారణ పరిజ్ఞానం, తెలుగు నుడికారంతో మిళితమై పరిమళించే సాహిత్య సంస్కారం శ్రీప్రసాద్ సొత్తు. మంచిఫాలోయింగ్ ఎడిటర్. నిబద్ధమైనవ్యక్తి. నిర్మొహమాటి. పట్టుమని పదికాలాలు ఒక్కచోట పనిచేయలేకపోయారు. ఆంధ్రజ్యోతి,ఈనాడు, ఉదయం, ఆంధ్రభూమి ఈ విధంగా చెప్పుకుంటే వారు పనిచేయని పత్రికలు తెల్పటం తేలిక. విపరీతంగా అధ్యయనం చేస్తారు. వ్యక్తిత్వాన్ని పరిరక్షించుకుంటారు. రాజీలేని వ్యక్తి. అందుచే వీరి సంపాదకీయాలు కొరడాదెబ్బలని- ఆచార్య దొణప్పగారు తెల్పారు.

శ్రీ చక్రపాణి (ఆలూరి వెంకటసుబ్బారావు) :— చందమామ, యువ పత్రికా సంపాదకులు, చమత్కారి, కళాప్రియులు వీరు. ప్రస్తుతం 'యువ' మాసపత్రికను వీరి కుమారుడు శ్రీ ఆలూరి సుధాకరరావుగారు నడుపుతున్నారు.

శ్రీ చెరుకూరి రామోజీరావు :— 'ఈనాడు' దినపత్రిక ఛీఫ్ ఎడిటరు. శ్రీ రామోజీరావు తెలుగు జర్నలిజాన్ని కొత్త మలుపు తిప్పిన సాహసి, ట్రెండ్ సెట్టరుగా పేరు తెచ్చుకున్నారు. ఆల్ ఇండియా ఎడిటర్స్ గిల్డ్-ప్రెసిడెంట్‌గా వ్యాపారరంగంలో అందెవేసిన వ్యక్తిగా, విపుల, చతుర, అన్నదాత- అనే మాసపత్రికలను- న్యూస్‌టైమ్స్ ఇంగ్లీష్ దినపత్రికను విశిష్టంగా నడుపుతున్న వారుగా బహుముఖ బాధ్యతలతో అనుక్షణం అమూల్యమైనదిగా జీవితాన్ని గడుపుతున్న "బిజీ బీ"వీరు.

శ్రీ నెల్లూరి వెంకట రామానాయుడు :— 60 సంవత్సరాల నుండి అవిచ్ఛిన్నంగా సాహిత్య రాజకీయ సాంఘిక రంగాలలో తనదైన బాణిని పఠితలకు అందించి- ఆలోచింపచేసిన "జమీన్ రైతు"పత్రికా సంపాదకులు వ్యవస్థాపకులు వీరు.

శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు :— S.S.L.C. స్టూడెంట్‌గా ఉన్నప్పుడే మచిలీపట్నంలో 'తెలుగు విద్యార్థి' మాసపత్రికను స్థాపించారు. 1953 నుండి విద్యారంగం విద్యార్థి సేవలో అవిఘ్నంగా పాలుపంచుకుంటున్న తెలుగు విద్యార్థి సంపాదకులుగా, 1968 నుండి 1985 లో విధానపరిషత్ రద్దయ్యేంత వరకు దాని సభ్యులుగా, ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యునిగా, "మన కట్టమంచి, భరద్వాజ భారతం" వంటి గ్రంథ రచయితగా- శ్రీ కొల్లూరు కోటేశ్వరరావు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రతినిధిగా కామన్‌వెల్త్ విశ్వవిద్యాలయాల మహాసభలలో పాల్గొన్నారు. ఇంగ్లాండ్-అమెరికా సందర్శించారు.

శ్రీ దరువూరి వీరయ్య :— యువ కర్షక మాసపత్రిక సంపాదకులు 'గుంటూరు సర్వస్వము' ప్రకటించెను. రాజకీయాలలో బాగా అనుభవమున్న వారు- ప్రస్తుతం టొబాకో బోర్డు, గుంటూరు - వైస్ ఛైర్మన్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

శ్రీ పాతూరి నాగభూషణం :— గ్రంథాలయ సర్వస్వం- సంపాదకులు. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా పనిచేశారు, మంచి రచయిత.

శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి:-'తెనాలి సమీక్ష'మాసపత్రికసంపాదకులు.

శ్రీ సూర్యదేవర సంజీవదేవ్, తుమ్మలపూడి :- 'ప్రబుద్ధ భారతి' సహాయ సంపాదకులు, చిత్రకళా విమర్శకులు.

శ్రీ చలసాని ప్రసాదరావు, వరంగల్లు :— 'కళ' సాహిత్య పత్రికా సంపాదకులు. చిత్రకళ, శిల్పకళా విమర్శకులు.

శ్రీ రావిపూడి వెంకటాద్రి, చీరాల :— 'హేతువాది' మాసపత్రిక సంపాదకులు. హేతువాదంపై పెక్కు పుస్తకాలను రచించారు.

శ్రీ బండి బుచ్చయ్య చౌదరి విజయవాడ :— 'ములుకోట' పత్రికను, శ్రీ గోగినేని ఉమామహేశ్వరరావు- "వాహినీ' పత్రికను: శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య- 'మహతి' సాహిత్య మాసపత్రికను ; శ్రీ గారపాటి ఆంజనేయులు-'చౌదరి' మాసపత్రికను, శ్రీ ధనెంకుల నరసింహం మాజీM.L.C.

'విజయభేరి' వారపత్రికను, శ్రీ యన్. విజయకుమార్- 'ఆంధ్రమిత్ర' పత్రికను, శ్రీ జాగర్లమూడి సాంబశివరావు ఒంగోలు - 'కాలమేఘం' వారపత్రికను, శ్రీ పి. వి. సుబ్బారావు - 'విహారి' మాసపత్రికను; శ్రీ పత్తిపాటి రంగప్ప నాయుడు అనంతపురం-'క్రమమహారాజు' మాసపత్రికను; శ్రీ కొల్లా వెంకటరావు హైదరాబాద్ - 'కమ్మమిత్ర' మాసపత్రికను, శ్రీ గద్దె లింగయ్య - 'ప్రభ' మాసపత్రికను నిర్వహించారు. శ్రీ వేమూరి బలరామ్ విజయవాడ - 'స్వాతి' మాసపత్రిక, స్వాతి వారపత్రికలను దిగ్విజయంగా నడుపుతున్నారు.

ఇంకా ఎందరో కమ్మవారు పత్రికా రచయితలుగా, పత్రికాస్థాపకులు–సంపాదకులుగా వ్యవహరించారు. వ్యవహరిస్తున్నారు. అందర్ని పేర్కొనడం సాధ్యం కానందుకు మన్నింపులు కోరుకోక తప్పడం లేదు.

## కవితా కాంతులు - రచనా రససిద్ధులు

'కవిరాజు' త్రిపురనేని రామస్వామిచౌదరి :- కృష్ణా జిల్లా, అంగలూరులో 1887 లో జన్మించారు. లండన్‌లో బారెట్లా పట్టాపొంది, న్యాయ వాదిగా తెనాలిలో కొంతకాలం పనిచేశారు. తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా ప్రజాసేవ చేశారు. వారిల్లు సూతాశ్రమం - ఒక సమాలోచనా కేంద్రం. మేధావులకు చర్చావేదికగా ఉపయోగపడినది. వారు వ్రాసిన 'సూతపురాణం', ఖూనీ కురుక్షేత్ర సంగ్రామము, 'భగవద్గీత' సంచలనాన్ని రేపాయి. హేతువాదదృష్టిని ప్రజలలో పెంచడానికి కృషి చేశాయి. 'వీరగంధము తెచ్చినారము వీరు లెవ్వరో తెల్పుడీ' - అనే గేయం జాతీయోద్యమానికి స్ఫూర్తి నిచ్చింది. వారి కవితకు మెచ్చి ఆంధ్ర మహాసభ 'కవిరాజ' బిరుదునిచ్చింది. గుడివాడ పౌరులు గజారోహణాది సన్మానాలు చేశారు. 'ఆంధ్రా బెర్నార్డుషా'గా పేరొందిన వీరి గ్రంథాలు, పీఠికలు మూఢవిశ్వాసాలను చెనుమాడాయి. మనోహరమైన గొప్ప కవిగా కీర్తి పొందారు. 1942 లో వీరి మరణం సంఘసంస్కరణ, అభ్యుదయ భావకులందర్ని కృంగదీసింది.

'బౌద్ధ వాఙ్మయబ్రహ్మ' దుగ్గిరాల బలరామకృష్ణయ్య :— మాజీ పార్లమెంట్ సభ్యులు. గొప్ప వక్తగా పేరొందారు. ఆంధ్ర మహాసభ 'బౌద్ధవాఙ్మయ

బ్రహ్మ' బిరుదునిచ్చింది. 'బుద్ధపురాణం, మానవజీవితం, నిష్కామయోగము' వంటి ధార్మిక ప్రధానమైన గ్రంధాలను రచించారు.

'సచ్ఛాస్త్రి' దుగ్గిరాల రాఘవచంద్రయ్య :— హైస్కూల్లో నాలుగో ఫాం చదివే రోజులలోనే 'విజయనగర సామ్రాజ్యం', నవలనువ్రాసి, విజ్ఞానచంద్రిక గ్రంధమండలి వారి బహుమతి పొందారు. 'సచ్ఛాస్త్రి' బిరుదాంకితులైన వీరు- ప్రజారాజ్యం, దేశనాయకుల చరిత్రలు'- 'అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని తో సహాయ నిరాకరణ మొనర్చుము' అను గ్రంధములు రచించెను.

'కవిబ్రహ్మ' యేటుకూరి వేంకటనరసయ్య :— కైతసింగార మెరిగిన కవి ఈయన. కర్షక జీవితాన్ని కొనియాడిన "క్షేత్రలక్ష్మి" 'మగువమాంచాల' 'అలుగురాజు'- అను రెండు భాగాలు పలనాటి వీర భారతంలో పూర్తి చేశారు. వీరరసపోషణతో 'రుద్రమదేవి'- శాంత శృంగార రసాలు జాలువారిన 'ప్రేమా లోకం, సిద్ధాశ్రమము, త్రివేణి'- 'రైతు' హరికద రచించారు. కవిత్వ మర్మ మెరిగిన వ్యక్తి. మధురకవి-

'అభినవ తిక్కన' తుమ్మల సీతారామమూర్తి :— బాపూజీ 'ఆత్మకథ'ను పద్యకావ్యంగా వ్రాసి 'మహాత్ముని ఆస్థానకవి'గా ప్రశంసపొందారు. హలాన్ని పట్టిన చేత్తో కలాన్ని పట్టి, కవితా పంట పండించిన కవి ఈయన. 'రాష్ట్రి గానము, పరిగపంట, ధర్మజ్యోతి, ఆత్మార్పణము' మొ॥ కావ్యాలను రచిం చారు. కవిత వెలార్చారు. 'తెలుగు లెంక'గా బిరుదు పొందిన అచ్చతెలుగుకవి. పలుచోట్ల ఘనసన్మానాలు, కనకాభిషేక, గండపెండేరాలు తొడిగించుకున్న కమ్మనికవి.

శ్రీ సూర్యదేవర రాఘవయ్య చౌదరి (కొల్లూరు) - స్వసంఘ పౌరోహిత్య నిర్మాత. బ్రాహ్మణేతర విజయము, విప్రకుల చరిత్ర, పంచముల చరిత్ర మొ॥ విమర్శనాత్మకమైన గ్రంధాలను రచించారు. 'కమ్మవారి చరిత్రను' కూడా రచించారు.

త్రిపురనేని గోపాలకృష్ణయ్య :- సంయుక్త, ప్రభాకర నాటకకర్త.

విద్వాన్ వడ్లమూడి వెంకటరత్నం:-కులలక్ష్మి, సఫలత మొ॥గ్రంథకర్త.

చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మీనారాయణ - నాగార్జున చరిత్ర విస్మృతాంధ్రనాయక చరిత్ర, ప్రాచీన భారతీయ ప్రజాస్వామికము, రామాయణ విమర్శనము, భారత విదుషీరత్నములు, ప్రాచీనయోగులు, భారతీయ సంస్కృతి, వివాహముల చరిత్ర - వివాహవిధి మొ॥ గ్రంథములను రచించెను.

శ్రీ పాలడుగు శేషాచార్యులు - స్వసంఘ పౌరోహిత్య నిర్మాత. వైదిక వాఙ్మయ వేత్త, వైదిక వివాహతత్వ ప్రకాశికాది గ్రంథకర్త.

శ్రీ కొత్త జగ్గయ్య - పాపవినాశ శతకము, సంగమేశ్వర తారవళి గ్రంథకర్త.

శ్రీ కొత్త సంగయ్య - సిద్ధార్థశతకము, పరమార్థ తత్వప్రకాశము.

శ్రీ జంగా హనుమయ్య - సత్య వివాహ గ్రంథకర్త. అచ్చతెలుగు కావ్యమిది.

శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బదాసు, తుమ్మపూడి - వాసిరెడ్డి వంశ చరిత్ర గ్రంథకర్త.

'ఉభయ భాషాప్రవీణ' శ్రీ జంపాల వెంకటనృసింహం; దుగ్గిరాల - ఆమనిపూలు, విభీషణుడు మొదలగు గ్రంథములు రచించెను.

శ్రీ దేవరపల్లి చంద్రయ్య, వడ్లమూడి - భక్తవిజయము, చంద్రమౌళీశ్వరాది శతకములు రచించెను.

శ్రీ మాగ్వంటి బాపినీడు - ఆంధ్ర సర్వస్వము సంపాదకులు.

శ్రీ యడ్లపల్లి దేవయ్య - కాశ్మీరు, శ్రమజీవి మున్నగు గ్రంథకర్త.

శ్రీ ముక్కామల రాఘవయ్య - కవితా విశారద మణిహారము, కొమ్మన, భక్త, విజయము మొదలగు గ్రంథములు రచించిన విద్వాన్ వీరు.

'కవికోకిల, మధురకవి, కవితావిశారద' - చిన్నము హనుమయ్య - సౌరధ్యశ్రీ రత్నపేటిక, వీరపల్నాడు మొదలగు ఖండకావ్యాల రచయిత.

శ్రీ కొత్త సూర్యనారాయణ, సంగంజాగర్లమూడి - ప్రేమచంద్ కథలు, **K. A.** అబ్బాస్ కథలు, నాటకములు అనువదించారు. రేడియో నాటకములు కొన్నింటిని రచించెను.

'ఉభయ భాషాప్రవీణ, విద్వాన్' కోగంటి దుర్గామల్లిఖార్జునరావు, పామర్రు - మంగిపూడి వెంకటశర్మ చరిత్ర, పుష్పవల్లి, రత్నమాల, ఆంధ్రపుత్ర తారావళి, వయోజన విద్యాగీతాలు, ఆశ్చర్యచూడామణి మొదలగు 80 గ్రంధముల రచయిత. 'కవికోకిల, కవిమిత్ర' బిరుదాంకితులు, భారతీ సమితి, లలిత కళాసమితులకు కార్యదర్శి. కవిపుంగవుల పక్షపాతి-ఎందరో్ని సన్మానించిన మధురమూర్తి.

శ్రీ కొమ్మా శీతారామయ్య, పటమట - ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రచురణ ట్రస్టు మేనేజరు- శ్రీ గోటేటి భోగిరాజుగారి వ్యవసాయ శాస్త్రగ్రంధములు, శ్రీ వీరేశలింగ కృత గ్రంధములను ప్రచురించారు.

'సాహిత్య విద్యాప్రవీణ' శ్రీ మిక్కిలినేని భగవంతరావు - రైతు బుర్రకథ గేయాలు రచించిన కవి. 'అభినవ పతంజలి' బిరుదు - తన రచనకు మొదటి బహుమతిపొందిన కాంగ్రెస్ కార్యకర్త, వక్త. క్విట్ ఇండియా ఉద్యమంలో జైలుపాలయ్యారు. తెనాలిలో 1959 లో వీరిని ఘనంగా సన్మానించి ఒక సంచికను ప్రచురించారు.

శ్రీ కొమ్మినేని వెంకటసుబ్బయ్య - నవభారత సందర్శనం గ్రంధకర్త.

విద్వాన్ శ్రీ సుంకర శివరామయ్య - అమృత ఫలం గ్రంధకర్త.

శ్రీ ముమ్మలనేని శివలింగకవి - శివధ్యాన సుధానిధి గ్రంధకర్త. (సంగంజాగర్లమూడి).

శ్రీ ముమ్మలనేని లక్ష్మీనారాయణ; అమృతలూరు - ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు మొ॥ వాటిని తెలుగులోకి అనువదించారు.

శ్రీ కల్లూరి చంద్రమౌళి - మాజీమంత్రి, సనాతన వేద ధర్మభిలాషి. "వేదామృతము, రామాయణసారము, భారతీయ ప్రతిభ మున్నగు గ్రంధకర్త.

'ఉభయ భాషాప్రవీణ' శ్రీ చిన్నం రామయ్యచౌదరి - కాదంబరి, యుత్తర ఖండ కావ్యముల రచయిత.

శ్రీ బల్లాస్వామి కవి, మండపేట - భగవద్గీతను వచనములో రచించెను.

శ్రీ అరిగెపూడి రమేష్ చౌధరి - ప్రసిద్ధ హిందీపండితుడు, గొప్ప నవలా

రచయిత, ఖడేభోటే, దూర్ కెదోల్' నవలలకు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ బహుమతులు లంభించాయి. అకాడమీ బహుమతి గ్రహీత.

విద్వాన్ కొసరాజు బసవయ్య - బుక్కను వేదకాలపుస్త్రీ రుగ్వేదమును మొదట రచించెనని వాదిస్తూ గ్రంథము వ్రాసెను. 'ఈగ, గాలి' ఖండకావ్యములను (శ్రీ జాషువాగారి గబ్బిలము లాగా) వ్రాసెను. 'కర్షకవేదనము' కావ్యకర్త. చక్కని కవిత్వమును, మధురభావాలను వెదజల్లిన కవి, పండితులు.

డాక్టరు అడుసుమిల్లి నారాయణరావు, M.B.B.S; గుడివాడ-గీతానారాయణీయము (భగవద్గీత పద్యకావ్యము), పెనుమచ్చ యోగిని' కావ్యాలను, కొన్ని నాటకాలను రచించినవారు. కవి పోషకులు. ఆంధ్ర నలందా సాంస్కృతిక సంఘాధ్యక్షులు.

శ్రీ మిక్కిలినేని రాఘవయ్య చౌదరి M.A. M.Sc, దుగ్గిరాల : మెకానికల్ ఇంజనీరు. "మెయింటెన్స్ ఆఫ్ స్టీమ్ టర్బయిన్స్, మెయింటెనెన్స్ ఆఫ్ వాటర్ టర్బయిన్స్"అనే సాంకేతిక గ్రంధములనురచించెను. ఆల్ ఇండియా మెకానికల్ ఇంజనీర్ల సంఘం నగదు బహుమతితో, గోల్డు మెడల్‌తో 1947, 1955 సం॥లలో వరుసగా వీరిని గౌరవించినది.

పండితగోపదేవ్ : వైదిక విద్యావిశారదుడు. కాశీలో షడ్దర్శనాలను అభ్యసించి తెలుగులో అనువదించారు. శాస్త్రీయ వాఖ్యాలను సమకూర్చారు. ముక్తి రామోపాధ్యాయ భగవద్గీతను అనువదించారు. ఆస్తికవాదం వంటి అనేక ఆధ్యాత్మిక గ్రంథములను రచించారు.

శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య, వడ్లమూడి : ప్రేమాంజలి, సేవాంజలి, వైశాలిని, విషాద దుర్యోధన మొ॥ గ్రంథకర్త. గాధా సప్తశతి, భామినీ విలాసము అనువాదకులు. 'మహతి' సాహిత్య మాసపత్రికను కొంతకాలం నడిపారు. గ్రామాధ్యక్షులుగా - గ్రామాభివృద్ధికి సేవచేశారు.

వాఙ్మయాధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య : వ్యావహారిక భాషా వ్యాకరణము, పూర్వకవుల వ్యావహారిక భాషాప్రయోగాలు, మానవుడు, మానవతి మొదలగు గ్రంధాలను రచించెను, ఆరాధన, ఆంధ్రప్రదేశ్

పత్రికల సంపాదకులుగా పనిచేశారు. స్వర్ణాభిషేక, గండపెండేరాది సత్కారములను పొందారు. ఆంధ్రదేశమంతటా గుడివాడవారు వీరినిగొప్పగా సన్మానించారు.

శ్రీ జాస్తి వెంకట నరసయ్య : జాతీయ కథలు, కాంగ్రెసు విజయము, జయభేరి, వైతాళికులు, ఆంధ్రసేవకులు, కవిత, వ్యాసవాణి, వయోజనవిద్య, ప్రజారాజ్యం, ఛలోఢిల్లీ, ఆచార్యరంగా తదితర జాతీయ ప్రబోధగ్రంధాలనేకం రచించారు. శ్రీ తుమ్మల సీతారామమూర్తి మేనల్లుడు వారినుండి శబలను, శ్రీ కొత్త భావయ్య చౌదరినుండి కాకతీయ రాజ్యచరిత్రనుకృతి నొందెను. భారత సన్మాన సంఘాధ్యక్షులై చాలమంది కవులను సత్కరించారు.

పరమహంస పరివ్రాజక బ్రహ్మానందగిరి స్వాములు : బ్రహ్మవిద్య - 'కేసరి' పత్రికా సంపాదకులు. బ్రహ్మానందస్మృతి, సాంఘిక సూత్రములు, దేహత్రయ.- వివరణలు, భగవద్గీత - భాష్యం, ఈశావాస్యోపనిషత్తు, కఠోపనిషత్తు-లవ్యాఖ్యానం, వేదాంత బాలబోధ మొదలగు గ్రంధములను రచించెను.

శ్రీ రావెళ్ళ రామయ్య: 'మానవ విజయము, గాంధీమహాత్ముడు' తదితరగ్రంధములను రచించెను. తెలుగు పండితులు. సత్యాగ్రాహి. ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా ఒక సంవత్సరం-శాసనోల్లంఘన సందర్భంగా ఆరు మాసాలు జైలుశిక్ష పొందినజాతీయవాది. శ్రీకోగంటి రాధాకృష్ణమూర్తితో కలసి శతావధానాలుచేసి చౌదరీరామకృష్ణులుగా జంటకవులు పేరిటప్రసిద్ధి కెక్కారు.

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి, నిడుబ్రోలు : కవిపురాణం, నవభారతం, మనుధర్మ శాస్త్రం, కామశాస్త్రం, బృహత్కథ, రామాయణ రహస్యాలు, సాహితి, కల్పవృక్ష విమర్శ, తదితర 80 గ్రంధాలను వీరు రచించారు. వచనంలో అందె వేసిన చెయ్యి. సాహిత్యంలో నిధి. 'భాషాపోషక గ్రంధమండలి' వ్యవస్థాపకులు.

శ్రీ కొత్త భావయ్య చౌదరి : కమ్మవారి చరిత్ర, దేవరహస్యాలు, కాశ్మీరు, నేపాలు దేశ చరిత్రలు, కాకతీయ, రెడ్డి, వేంగీచాళుక్య, పశ్చిమచాళుక్య

చరిత్రలు వ్రాసెను. భారతీ సమితిచే విమర్శకాగ్రేశ్వర బిరుదుపొందెను పెక్కు సన్మానాలు, ప్రశంసలను పొందారు.

శ్రీ పర్వతనేని వెంకటేశ్వరరావు : తెలుగు తోటగ్రంథమండలి, విజయవాడ వ్యవస్థాపకులు. తెలుగురాణి, స్వాతంత్ర్యగీతాలు, రత్నాలవీధి, వజ్రపు తునకలు, చిట్టి ముత్యాలు, రైతుజ్వాల, భారతీయ కర్షక చరిత్ర తదితర బహుగ్రంథ కర్త.

'పద్మ విభూషణ్' కొత్త సచ్చిదానందమూర్తి : భగవద్గీత వ్యాఖ్యానము, నవ్వులు పువ్వులు, కారుమబ్బులు, థాట్ అండ్ ది డివైన్, దిరిథమ్ ఆఫ్ ది రియల్, ఎవల్యూషన్ ఆఫ్ ఫిలాసఫి, పొలిటికల్ ఫిలాసఫివంటి అనేక గ్రంథరచన చేశారు.

'అభినవ సహదేవ' యేజళ్ళ శ్రీరాములు తెనాలి : పశువైద్యంపై పెక్కుగ్రంథ ములు వ్రాసెను.

వెనిగళ్ళ వెంకటప్పయ్య చౌదరి, ఇంచుపల్లి : 'పుష్కపశువైద్యత మోభాస్కరం' వంటి పశువైద్య గ్రంథాలను వ్రాశారు. సంస్కృత పండితులు. ఆదర్శ భావములు గలవారు. కీర్తి శేషులు.

శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య : 'ఆచార్యంగా, సరోజినీదేవి, కవిరాజు జీవితం-సాహిత్యం'శరత్ జీవితం,శరత్ దర్శనం, సి.ఆర్.రెడ్డి వంటి జీవిత కథలను-అక్షరాభిషేకం, పిలుపువంటి గొప్ప గ్రంథములనేకం వ్రాశారు.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు : 'నేటి రష్యా'వంటి గ్రంథాలతో యువకులలో సోషలిస్టు భావాలను రగిలించారు. కొత్తగడ్డ (నాటికల సంపుటి) లో సమాజ వాస్తవికతను కళ్ళకు కట్టే విధంగా నాటికలను రచించారు. 'మాటామంతీ' పిచ్చాపాటి, జీబీబి, సీతజోస్యం, మూడు దశాబ్దాలు (సంపాదకీయాలు) వంటి అనేక ఆలోచనాత్మక గ్రంథాలను తెలుగువారికి అందించారు. వీరేశలింగం వేదన వంటి గ్రంథాలను ఆంధ్రేతరులకు ఇంగ్లీషులో అందించారు.

'కవిరాజు' శ్రీ కొండవీటి వెంకటకవి : నెహ్రూ చరిత్ర, మేలుకొలుపు, దివ్య స్మృతులు, త్రిశతి వంటి గ్రంథాలు వ్రాశారు. 'దాన వీర శూర కర్ణ' వంటి సినిమాలకు మాటలు కూర్చారు. 'ఈనాడు' దినపత్రికలో పరదేశి పాఠాలద్వారా తత్త్వశాస్త్ర శీర్షికను సుబోధకంగా నిర్వహిస్తున్నారు.

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు : భారత తత్త్వశాస్త్రం (ఆదిశంకరులనుండి ఇప్పటిదాకా); 'విశ్వదాభిరామవినురవేమ' గ్రంథరచయిత విజయవాడలో వేమన అధ్యయన పీఠాన్ని నిర్వహిస్తున్నారు.

డాక్టరు త్రిపురనేని వెంకటేశ్వరరావు, గుడివాడ - కవిరాజ విహార్ పేరిట వైద్యశాలను నడుపుతున్నారు. పెక్కునాటకములను రచించెను.

శ్రీ చలసాని వాసుదేవరావు - పరిణామవాదం వ్రాసెను.

శ్రీ గవిని వెంకటకృష్ణారావు - విగ్రహ వ్యావర్తిని, జేగంటలు, కావ్యజగత్తు, కీలుబొమ్మలు, ఆదర్శశిఖరాలు, పాపికొండలు మొదలగు గ్రంథములు వ్రాసెను. తెనాలి కేంద్రంగా యం.యన్. రాయ్ భావవికాసానికై కృషి చేశారు.

శ్రీ త్రిపురనేని గోపిచంద్ - ప్రాక్పశ్చిమ 'తత్త్వవేత్తల'ను గురించి వ్రాశారు. సరేకానివ్వండి, మాకు ఉన్నాయి స్వగతాలూ, గీతాపారాయణం, పోస్ట్ చేయని ఉత్తరాలు, మొదలగు కధాసంపుటాలు వెలువరించారు. 'యమ పాశం', అసమర్థుని జీవయాత్ర, పండిత పరమే శ్వరశాస్త్రి వీలునామా, చీకటిగదులు (అసంపూర్తి) నవలలు వ్రాశారు. అందులో అసమర్థుని జీవ యాత్రలోని సీతారామారావు పాత్ర తెలుగు సాహిత్యంలో ఎన్నటికీ మసి బారని పాత్ర. తన పండిత ప్రకర్ష పాఠకులపై ప్రసరింపనీయక, సుల భంగా రచనలుచేసి అందులోనే మానవ మనస్తత్త్వాన్ని, తాత్విక విలువ లను తమ గేయంగా చిత్రించారు శ్రీ గోపిచంద్. పబ్లిక్ రిలేషన్స్ డైరెక్టరుగా, కొన్ని సినిమాలకు డైరెక్టరుగాకూడాపనిచేశారు. నవ్యమాన వతావాది. చివరిదశలో ఆధ్యాత్మికవాది.

శ్రీ గొట్టిపాటి కొండపనాయుడు - మనం-మనదేశం వంటి గ్రంథాలు వ్రాశారు.

శ్రీ వాసిరెడ్డి కురంగేశ్వరరావు - 'నాదొంగ' రచించారు.

శ్రీ కొత్తపల్లి రంగారావు - అరుణోదయ గ్రంథమాలలో 'పాలపుంత' వంటి గ్రంథములు రచించారు.

శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, కొల్లూరు - మాతృహృదయం, లెనిన్, కమ్యూ నిస్టువాళ్ళ చరిత్ర మొదలగు రచనలు చేశారు.

శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాద్ - గీతామృతము, నీతి నీరాజనము గ్రంథకర్త.

శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ, బేతపూడి - 'చెయ్యెత్తిజై కొట్టు తెలుగోడా' వంటి గేయాలను, మంచి సాహిత్య వ్యాసాలను రచించారు.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి :- ఆంధ్ర నాటకరంగచరిత్ర, నటరత్నాలు వంటి ఉద్గ్రంధాలను రచించారు. ఆంధ్రా యూనివర్సిటీ 'కళాప్రపూర్ణ' ఇచ్చి గౌరవించింది వీరిని.

శ్రీ అట్లూరి పిచ్చేశ్వరరావు :- ప్రేమచంద్ 'గోదాన్' తెలుగులో అనువదించారు. కన్నవి-విన్నవి, ఇల్లరికం వంటి గ్రంధాలు- అనేక కథలు వ్రాశారు.

శ్రీ చదలవాడ పిచ్చయ్య :- ప్రతీక్ష వంటి గ్రంథములు వ్రాశారు. 'నవభారతి' పత్రికను నిర్వహిస్తున్నారు. దాని తరపున అనేక గ్రంథాలను ప్రచురిస్తున్నారు.

శ్రీ త్రిపురనేని గోకులచంద్ :- అపశ్రుతులు, ఆదర్శశిఖరము- గ్రంథకర్త.

శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి :- యం. యన్. రాయ్ జీవితం - సిద్ధాంతం, రాయ్ వ్యాసాలు, గాంధీతత్వం వంటి గ్రంథాలను రచించారు. సరళా పబ్లికేషన్, తెనాలి ద్వారా కవిరాజు గ్రంథాలను, హేతువాద గ్రంధాలను ప్రచురించారు.

శ్రీ రావిపూడి వెంకటాద్రి :- యం యన్. రాయ్- 'భారత కమ్యూనిజం' ఉద్గ్రంధాన్ని రచించారు. రాడికల్ హ్యూమనిజం, మార్క్సిస్టు వాస్తవికత, భావవిప్లవం - వర్గచైతన్యం, హేతువాదం,నాస్తికత్వం-నాస్తివాదం, శాస్త్రం - పురాణం, విశ్వాన్వేషణ, జీవమంటే ఏమిటి ? ఇస్లాం - ఒక అంచనా, విశ్వతత్వం వంటి శాస్త్రీయ గ్రంధాలను విరివిగా వ్రాశారు. ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ఛైర్మన్‌గా వ్యవహరించారు. 'హేతువాది' మాసపత్రికను చీరాల నుండి నడుపుతున్నారు మంచివక్త- విజ్ఞాని 'స్టడీక్యాంప్'ల ఆచార్యులు.

శ్రీ పి.వి. సుబ్బారావు :- 'విహారి' పత్రికను తెనాలినుంచి నడిపారు. అపశ్రుతులు వంటి రచనలను వెలువరించారు.

శ్రీ ఆలూరి వెంకటసుబ్బారావు (చక్రపాణి) :- బెంగాలీ సాహిత్యాన్ని తెలుగు వారికి విరివిగా అందించారు.

శ్రీ త్రిపురనేని సుబ్బారావు :- కవిరాజు, గోపిచంద్ జీవితగ్రంధాలను వ్రాశారు. వ్యాసకర్త-మంచివక్త. విద్యాశాఖలో సహాయక కార్యదర్శిగా పనిచేస్తూ పదవీవిరమణ చేశారు.

శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి :- నా అమెరికా పర్యటన, సాహిత్యంలో ఔచిత్యం, మనలోమాట - గ్రంధకర్త. ఆంధ్రాజాన్సన్‌గా ప్రఖ్యాతి పొందిన వక్త. కీర్తిశేషులు.

శ్రీ సూర్యదేవర సంజీవదేవ్ :- కవులు, చిత్రకారులు- గొప్ప వచన రచయిత. తేజోరేఖలు, రూపారూపాలు, దీప్తిధార, తెగినజ్ఞాపకాలు, **Biosymphony** (జీవన స్వరమేళన) మొదలగు గ్రంధములను రచించెను.

శ్రీ కొత్త రవీంద్రబాబు :- వృత్తిరీత్యా డాక్టరు - ప్రవృత్తి రీత్యా నవలా రచయిచత, 'మామంచి మాష్టారు' వంటి రచనలు వ్రాశారు.

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు :- 'రంగాజమ్మ' కన్నీటిగాధ - గేయకావ్యాలు, 'ఒయాసిస్' వెలుతురు స్నానం, తూర్పువాకిళ్ళు, నా ఉదయం - కవితా సంపుటాలు. 'కవనవిజయం'- ప్రదర్శిస్తారు. అనేక పురస్కారాలను పొందారు. 'విశ్వామిత్ర' సంచలన చిత్రానికి మాటలు వ్రాశారు. శ్రీ యన్.టి. రామారావు నిర్మిస్తున్న చిత్రమిది.

శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు :- మంచి విమర్శకారులు. వ్యాసకర్త - సాహిత్య లోతులు తెలిసినవారు.

శ్రీ ఆలూరి భైరాగి చౌదరి :- అసలుపేరు సుబ్బారావు, 'నూతిలో గొంతుకలు, చీకటినీడలు, ఆగమగీతి ' కవితాగ్రంధాలు వెలువరించారు. 'పాపపోయింది' నవల వ్రాశారు. 'అన్నీ ఉన్నాయి - నాకొంచెం నమ్మకమివ్వు ?' అని మానవాళిలో తరిగిపోయిన అంశాన్ని హృద్యంగా చిత్రించారు. 'ఆగమగీతి'కి - ఆయన మరణానంతరం సాహిత్య అకాడమీ బహుమతి ప్రకటించింది. తెలుగులో తొలి అరాచక కవిగా - శ్రీశ్రీ యుగంలో ఆయన ఛాయలు లేకుండా ఎదిగిన ఏకైక కవి.

శ్రీ వాసిరెడ్డి నాగేశ్వరరావు :- 'కూలోడ' తదితర అభ్యుదయ గేయాలను వ్రాశారు.

శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు :- తెలుగువిద్వాన్, ఆంగ్ల, హిందీ సాహిత్యంలో బాగా పరిచయమున్నవ్యక్తి. స్వయంగా 'పోతుగడ్డ' నాటకాన్ని - పుట్టిల్లు, పల్లెటూరు, కన్నతల్లి సినిమాలకు పాటలు, మాటలు వ్రాశారు.

శ్రీ సుంకర సత్యనారాయణ :— వాసిరెడ్డితో కలసి 'మాభూమి, ముందడుగు, అపనింద' నాటకాలను వ్రాశారు. 128 దళాలు 'మాభూమి' నాటకాన్ని ఆంధ్రదేశం నలుమూలలా ప్రదర్శించాయి. ఇది ప్రపంచ రికార్డని కె.ఎ. అబ్బాస్ అన్నారు.'ముందడుగు'ను 1946లో-'మాభూమిని'1948లో ప్రభుత్వం నిషేధించింది. వీరు స్వయంగా కష్టజీవి, రైతువిజయం, సీతారామరాజు బుర్రకథలను, భూమికోసం, జీతగాడు, వీరకుంకుమ, ప్రతిఫలం నాటికలను వ్రాశారు.

శ్రీ కొడాలి గోపాలరావు :— పేదరైతు, తిరుగుబాటు, కూలి, లంకెబిందెలు, దొంగవీరడు, ఛైర్మన్ మొ॥ రసవత్తరమైన, ప్రయోగాత్మకమైన నాటకాలను రచించారు.

శ్రీ గంగినేని వెంకటేశ్వరరావు :— తెలంగాణా అమరవీరుల కథల ఆధారంగా 'ఎర్రజండాలు' మూడు భాగాలు వ్రాశారు. దీనిని ప్రభుత్వం కొంతకాలం నిషేధించింది.

శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావు :— సులోచన కలం పేరుతో కథలు వ్రాశారు. తన పేరిట కొత్తయిల్లు వంటి నవలలు అనేకం వ్రాశారు.

శ్రీ వేగుంట మోహనప్రసాద్ :— మంచికవి. 'చితి-చింత'' వంటి కవితా సంకలనాలను ప్రచురించారు.

శ్రీ బ్నాందిలపాటి శివరామకృష్ణ :— దేశకవితా మండలి ద్వారా - శరత్ సాహిత్యాన్ని అనువదించి ఆంధ్రులకు అందించారు. శరత్ తెలుగువాడే అన్నంతగా చక్కని వీరు అనువాదాలను తెలుగువారికి అందించారు.

శ్రీ కల్లూరి బసవేశ్వరరావు :— చరిత్ర రచనలో శిద్ధహస్తులు. మంచి వ్యాసాలు వ్రాశారు. 'చరిత్రంటే ఏమిటి ?' వ్యాస సంపుటిని ప్రకటించారు.

శ్రీ యన్. ఇన్నయ్య :— గొప్ప పేరున్న పాత్రికేయులు, ఉగ్రవాదులు, 'పార్టీ లెన్ని మారిస్తే నేం? పైన ఖద్దరేగదా' ఆంధ్రప్రదేశ్ రాజకీయ పరిణామ చరిత్ర గ్రంథాలు రచించారు. యం. యన్. రాయ్ రష్యా విప్లవం, చైనాలో విప్లవం - ప్రతివిప్లవం; పార్టీలు, ఉద్వేగం, విప్లవం వంటి ఉన్నత గ్రంథాలను అనువదించారు. అనేక ఆంగ్ల పుస్తకాలను కూడా ప్రచురించారు.

శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య :— 'వేదాలంటే ఇవేనా ?, శ్రాద్ధకర్మలు ఈ ఎవరికోసం ?, బాపూజీ జీవిత పరిశీలన' వంటి గ్రంథాలను రచించారు.

శ్రీ ముక్కామల నాగభూషణం :— 'శతవతారాలు' వంటి గ్రంథాలు వ్రాశారు. మంచి వ్యాసకర్త.

శ్రీ అక్కినేని కుటుంబరావు :— 'కార్మికగీతం' వంటి నవలలను రచించారు.

శ్రీ మేడసాని మోహన్ :— ఆంధ్రదేశంలో మంచి పేరుప్రఖ్యాతులు పొందిన అష్టావధాని, శతావధాని, యువకులు.

గాంధీ :— నిశిత పరిశీలనా ? దగాకోరు పరిశీలనా' గ్రంధాన్ని రంగనాయకమ్మ గారితో కలసి రచించారు.

డాక్టరు చలసాని సుబ్బారావు :— సాహిత్యభూషణ, సాహిత్య రత్న, సాహిత్యాలంకార బిరుదాంకితులు, షుమారు 9 వందల వ్యాసాలు, 80 రేడియో ప్రసంగాలు, హిందీ, తెలుగులలో 25 గ్రంధాలు వ్రాశారు. మంచి వక్త. విద్యాంశాలపై గొప్ప పట్టుగలవారు. మహర్షి వాల్మీకి, వ్యాసుడు, చాణక్యుడు, వేమన, బంగ్లాదేశ్ భారత కథ, పరిణిత ప్రజాస్వామ్యం తదితర ఎన్నో గ్రంధాలు వ్రాశారు. అనేక బహుమతులు, అవార్డులు ప్రశంసలు పొందారు.

డాక్టరు చిట్టూరి సత్యనారాయణ :— వైద్యులు. మంచి రచయితలు 'భారతీయ కళ' కళాకారులకు, శిల్పకారులకు ఆదర్శప్రాయమైనది. 'జీవితమధురిమ' ఏకాంకికలలో పేరుమోసి, శ్రీశ్రీ మన్ననలందిన గ్రంధం.

శ్రీ దోనెపూడి రాజారావు :— తెలుగులో అనేక నవలలు వ్రాశారు. అభ్యుదయవాది అకాడమీ అవార్డు గ్రహీత తెనాలిలో హిందీలెక్చరరు,

శ్రీ రావి రంగారావు :— మంచికవి. మినీ కవితలో పేరున్నవారు.

డాక్టరు పరుచూరి రాజారాం :— అభ్యుదయవాది, నవలలు అనేకం వ్రాశారు.

శ్రీ కడియాల రాజారామ్మోహనరాయ్ :— మంచి విమర్శకులు. 'తెలుగు కవితా వికాసం' గ్రంథకర్త.

శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య :— 'హిట్లరు పరాభవం' వీధి భాగవతాన్ని రచించారు. చిటికలకవిగా, అర్జంటు కవిగా పేరుపొందారు.

శ్రీ మద్దుకూరి చంద్రశేఖరావు :— చంద్రం వ్యాసావళి, గ్రంథకర్త.

శ్రీ కంఠనేని నారాయణరావు :— అమరవీర చల్లపల్లి నారాయణరావు బుర్రకథ.

శ్రీ వేల్చేరు నారాయణరావు :— తెలుగులో కవితావిప్లవాల స్వరూపం.

శ్రీ మిక్కిలినేని భగవంతరావు :— విద్యార్థుల వీరగేయాలు.

శ్రీ వై.వి. కృష్ణారావు :— ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యానికి ముందు రైతు పోరాటాలు - రైతు సంఘాలు.

శ్రీ యన్.కె. చౌదరి :— కాశీం రజ్వీ బుర్రకథ.

శ్రీ చేకూరి రామారావు :- 'వచనపద్యం-లక్షణచర్చ, తెలుగువాక్యం' వంటి గ్రంథ రచయిత. హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ గౌరవసంపాదకులు. చేరాతలు శీర్షిక ద్వారా (ఆంధ్రజ్యోతిలో) భాషాసాహిత్య విషయాలపై ఆసక్తిని పెంచారు. ఉస్మానియా యూనివర్సిటీలో లింగ్విస్టిక్స్ ప్రొఫెసరు.

శ్రీ చలపాని ప్రసాదరావు :— 'కథలు-కాకరగాయలు', ఆధునిక చిత్రకళ, రష్యన్ చిత్రకళ' గ్రంథ రచయిత.

శ్రీ చలసాని ప్రసాద్ - విప్లవ రచయితల సంఘం మాజీ కార్యదర్శి, మంచి వ్యాసకర్త.

శ్రీ కొత్తపల్లి రవిబాబు :— ప్రజాసాహితి- సంపాదకులు జనసాహితి సాంస్కృతిక మండలి.

శ్రీ త్రిపురనేని మధుసూధనరావు :— కవి, విమర్శకులు, వ్యాసకర్త. అనేక పుస్తకాలను రచించారు. విప్లవ రచయితల సంఘం, మాజీకార్యదర్శి.

శ్రీ వాసిరెడ్డి నవీన్ :— 'అంపశయ్య' వంటి చైతన్య స్రవంతి నవలను రచించారు. మంచికథలు-నవలలు వ్రాశారు.

శ్రీ కన్నెగంటి జగ్గయ్య :— ఆర్యుల కుతంత్రాలు, నేను నా జీవితం వంటి గ్రంథాలను వ్రాశారు. ద్రావిడ ఉద్యమాభిమాని, నాస్తికులు.

శ్రీ బోడెపాటి వెంకట్రావు :— ఆంధ్రరాజము.

శ్రీ జాస్తి శ్రీరాములు :— కథామంజరి, అజయుడు తదితర గ్రంథకర్త.

శ్రీ కొల్లా సుబ్బారావు **M.A.** :— 'మహామనిషి - యం.యన్. రాయ్, హ్యూమనిస్టు విద్యావిధానం, శుక్రనీతి గ్రంధకర్త.

శ్రీ కొల్లా కృష్ణారావు :— రారాజు రచయిత.

శ్రీ పరుచూరి కోటేశ్వరరావు :— మద్యపాన సమీక్ష, క్విట్ గోవా.

శ్రీ కోగంటి గోపాలకృష్ణ :— ఇంద్రజాలం.

శ్రీ గద్దె లింగయ్య :— ఆదర్శగ్రంథమండలి స్థాపకులు.

శ్రీ నార్ల చిరంజీవి:— తెలుగుపూలు, ఎర్రగులాబి, భాగ్యనగరం, బడిపంతులు, మందారాలు - బాల సాహిత్యాన్ని రచించారు.

శ్రీ అడుసుమల్లి :— దాగని సత్యం.

శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి :— జానపద కవిబ్రహ్మ, కవిరత్న బిరుదాంకితులు, సినీపాటలకవిగా విఖ్యాతిపొందారు. 'గండికోట యుద్ధం' గొప్ప గ్రంథాన్ని రచించారు.

శ్రీ వెలగా వెంకటప్పయ్య :— బాలసాహిత్యంపై ప్రత్యేకంగా కృషిచేశారు. లైబ్రరీ సైన్సుపై కొన్ని పుస్తకాలు తెలుగులో రచించారు. 'రాయలసీమ జానపదాలు' మొ॥ పుస్తకాలు వ్రాశారు.

డాక్టరు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ :— తెలుగులో 10 గ్రంథాలు, హిందీలో 5 గ్రంథాలు వ్రాశారు. భీష్మ సాహనీ 'తమస్'ను అనువదించారు. సాహిత్యఅకాడమీ అవార్డు గ్రహీత.

డాక్టరు నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు :- చలం స్మశాన సాహిత్యం' వంటి గ్రంథాలు వ్రాశారు. తత్వశాస్త్రంపై విమర్శక వ్యాసాలు వ్రాశారు.

ఇంకా తిపిర్నేని వెంకటసుబ్బయ్య, ఇనగంటి పున్నయ్య, సూరపనేని కాకుళయ్య, మెడబలిమి సూరయ్య, వెలగపూడి దానయ్య, కొడాలి ఆంజనేయులు జంపని చంద్రశేఖరరావు, వడ్లపట్ల రామచంద్రయ్య తదితర గ్రంధకర్తలు కవులు, పండితులు అనేకమంది ఉన్నారు.

ఈ తరంలో ఊదర గోపీచంద్, అట్లూరి పురుషోత్తం, సూర్యదేవర రామమోహనరావు మెరికలవంటి రచయితలు తమ ప్రతిభావ్యుత్పత్తులను చాటుతున్నారు. బహువిస్తారంగా పెరిగిన ఈ రంగాన్ని - ఇందులోని అందర్ని పలుకరించడం అసాధ్యాంశంగా ఎదురైనందుకు క్షమించగలరని ఆశిస్తాను.

## కళామతల్లి ముద్దుబిడ్డలు

కళారాధకులుగా జీవితాలనే త్యాగంచేసిన ప్రముఖులనేకమంది ఉన్నారు. ఎన్ని కష్టనష్టాలొచ్చినా కళామతల్లి సేవలో పునీతులై, ప్రేక్షకలోకానికి వినో దాన్ని, విజ్ఞానాన్ని- విచక్షణను అందిచారెందరో మహానుభావులు. కొత్తకొత్త ప్రయోగాలలో నూత్నపుంతలు త్రొక్కి కళారంగాన్ని తీర్చిదిద్దారు. నాగరిక- సభ్యసమాజంలో పరివర్తనకు కృషి చేశారు. పూర్తి ఏకాగ్రతతో, తపస్సుతో ఉన్నత శిఖరాలను అధిరోహించారు. అందర్నీ సమీక్షించడం సాధ్యంకాని పని. అందులో మచ్చుకు కొందర్ని పలుకరించుకోవటం మన కర్తవ్యం.

## నా ట క రం గం

శ్రీ కోడూరి అచ్చయ్యచౌదరి :- 'ఒక మహానటుణ్ణి చూశాను. బళ్ళారి రాఘవాచార్యను గుర్తుకు తెచ్చారాయన' అని ఒక మహాసభలో అధ్యక్షస్థానం నుండి పద్మశ్రీస్థానం నరసింహారావుగారిచే ప్రస్తుతింపబడినవారు వీరు. అప్పటికి చౌదరిగారికి నరసింహారావుకు పరిచయమే లేదు. నటుడు దర్శకునిగా కీర్తిప్రతిష్టలను ఆర్జించారు. ముదినేపల్లి ఎక్సెల్షియర్ థియేటరులో ప్రముఖులు. (ఈ సంస్థనుండే అక్కినేని నాగేశ్వరరావు, నిర్మాత దుక్కిపాటి మధుసూధన రావు, సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావులు ఎదిగారు). చౌదరిగారు ప్రజా నాట్యమండలి ద్వారా విస్తృతంగా నాటకాలను ప్రదర్శించి నాటకరంగా నికే ఎనలేని కీర్తిప్రతిష్టలను ఆర్జించిపెట్టారు.

శ్రీ కొడాలి కేశవరాయుడు చౌదరి :— హరిశ్చంద్రలో 'విశ్వామిత్ర' పాత్రకు వీరిని మించినవారు నాటికీ నేటికి లేరనిపించుకున్నారు. కృష్ణా జిల్లా అంగలూరులో జన్మించారు. 1922 నుండి 32 వరకు రాయలసీమ జిల్లాలలో గ్రామగ్రామాన 10 సం॥పాటు ఏకధాటిగా నాటకాలను ప్రదర్శించారు. కృష్ణుడు, ధర్మరాజు, తిమ్మరుసు, వెంగళరాయుడు వంటి బహుముఖ పాత్రలను పోషించారు.

శ్రీ ఈడ్పుగంటి శేషయ్య చౌదరి :- 'ప్రతాపరుద్రీయం'లో యుగంధర్ పాత్ర ద్వారా- బళ్ళారి రాఘవా, గోవిందరాజుల, ముంజులూరి కృష్ణారావువంటి నిష్ణాతుల వరుసలో పెద్దపేట వేయించు కున్నారు. పాపారాయుడు, భీముడు వంటి పాత్రలతోబాటు, వసంతకుడు (కృష్ణతులాభారం) సుబ్బిశెట్టి(చింతామణి) వంటి హాస్య పాత్రలలో సైతం విశేషమైన ప్రతిభను ప్రదర్శించారు. రైతుబిడ్డ, మాలపిల్ల చిత్రాలలో ప్రముఖ పాత్రలు ధరించారు.

శ్రీ అరికెపూడి లక్ష్మిపెరుమాళ్ళు :— తన 14 వ యేటనే బాలపాత్రల ద్వారా రంగస్థలంపై కాలుపెట్టినవీరు- జీవితాంతం వరకూ నాటకరంగానికే సేవ చేశారు. రాయలసీమ, తెలంగాణా జిల్లాలలో విరివిగా ప్రదర్శనలిచ్చారు. సహజ నటులు, దర్శకులు అనేక సమాజాల స్థాపకులు.

శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య :— అఖిలభారత ప్రజా నాట్యమండలి 1943 బొంబాయి సమావేశంలో తన కోయవేషం ద్వారా- పృధ్వీరాజ్‌కపూర్, కె.ఎ. అబ్బాస్, యస్.ఎ. డాంగే, పి.సి. జోషివంటి ప్రముఖులచే మన్ననలంది-ప్రముఖపత్రికలన్నింటా ప్రశంసాజల్లులో తడిచిన తెలుగువారి ముద్దుబిడ్డడీయన. జానపద కళారూపాలైన బుర్రకధ భజన, కోలటం, డప్పులపాట, కోయ, చెంచు, ఫకీరు, పిట్టలదొర వంటి వాటిని పునరుద్ధరించారు. నాటకాలలో వివిధ వేషాలు ధరించారు. కొంతకాలం చిత్రసీమలో అసోసియేట్‌గా పనిచేశారు.

శ్రీ సూరపనేని లక్ష్మిపెరుమాళ్ళు :— బుర్రకధకునిగా ప్రారంభమై, సుప్రసిద్ధ రంగస్థల- సినీనటులుగా జీవితాన్ని కళారాధనకే అంకితం చేశారు. ప్రజా నాట్యమండలిద్వారా విశేషకీర్తిని ఆర్జించారు. అనేక అవార్డులు, పథకాలను పొందారు.

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య :— తెలుగు నాటకరంగంలో మూడు దశాబ్దాలు జానపద కళారూపాలను దర్శించారు, ప్రదర్శించారు. కారెక్టర్ యాక్టరుగా అసంఖ్యాక పాత్రల ద్వారా చిరకీర్తిని ఆర్జించారు. ఆంధ్ర నాటక కళా సమితిని స్థాపించి- దాని అభివృద్ధికి అహర్నిశలు కృషిచేశారు.

శ్రీ వల్లూరు వెంకట్రామయ్య చౌదరి : మాయలఫకీరు, రావణాబ్రహ్మ, భస్మాసురుడు వంటి పాత్రలద్వారా ప్రజాహృదయాలలో శాశ్వత స్థానం ఆక్రమించారు. ఆంధ్ర డ్రమెటిక్ అమెచ్యుర్స్, వెంకటేశ్వర నాట్యమండలి సంస్థలను స్థాపించి బాలనాగమ్మ (1826 సార్లు), త్రిపురనేని రామస్వామి విరచితమైన సూతపురాణం, ప్రేరణతో వ్రాయించిన 'రామరావణ యుద్ధం' (600 సార్లు) 'మోహిని భస్మాసుర' నాటకాలను విశేషంగా, విశిష్టంగా ప్రదర్శించారు.

శ్రీ జాస్తిరామమోహనరావు : బ్రాహ్మణ కోడూరుకు చెందిన రావుగారు, రాముడు, కృష్ణుడు తదితర పౌరాణిక పాత్రలలో గొప్పపేరు తెచ్చుకున్నారు. ఆంజనేయుని పాత్ర ఆయనకు ఎనలేని పేరు ప్రతిష్టలను ఆర్జించి పెట్టింది.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి : ప్రజానాట్యమండలి సర్మాతలలో ఒకరు ప్రసిద్ధ నాటకాలలో పాల్గొని రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలలో పెక్కుమన్ననలను పొందారు. జానపద కళారూపాలను వందలసార్లు ప్రదర్శించారు. సినీ రంగంలో క్యారెక్టరు యాక్టరుగా ప్రజాహృదయాలలో చెరగని ముద్ర వేశారు. మంచివక్త నాటకరంగంపై అధారిటీ ఉన్నవారు. ఎంతో శ్రమించి, పరిశోధనతో ఆయన వ్రాసిన గ్రంధాలు ఆంధ్ర నాటక రంగ చరిత్ర' 'నటరత్నాలు' ఆంధ్రులకు అపూర్వ నిధులు. ఆంధ్ర విశ్వపరిషత్ వీరిని 'కళా ప్రపూర్ణ'తో గౌరవించింది.

పెద్ది అంకమ్మ చౌదరిగారు : వీరు ఎక్కువగా భీముని పాత్ర ధరించేవారు. ఒకానొక నాటకము కీచకవధలో సెట్టింగ్ కోసము పెట్టిన బండలలో అట్టబండను వదలి పాత్రలో లీనమై పెద్దబండను ఎత్తి కీచక పాత్ర దారునిమీద వేయబోయారు అప్పటినుండి బండ అంకమ్మ, గుండు అంకమ్మ అనిపిలిచేవారు. గుంటూరు ప్రాంతములో 'గుండు'అంకమ్మ అంటే తెలియనివారు వుండరు అనేది అతిశయోక్తిగాదు.

